# సంపాదకీయ భూమిక

శ్రీ రామమూర్తిపంతులుగారు వ్యావహారికభాషను పునఃప్రతిష్ఠితము చేయడానికి సుమారు పాతికసంవత్సరములనుంచి చేస్తూ ఉన్న వాదములో ప్రధానముగా నాలుగుమార్గములు గోచరిస్తున్నవి.

భాషాతత్త్వప్రదర్శనపూర్వకముగా ప్రపంచములోని ఇతరభాషా వాఙ్మయములచరిత్రములున్ను వాటితో పోల్చి ఆంధ్రభాషావాఙ్మయముల చరిత్రములున్ను బోధించి తక్కినభాషలవలెనే తెలుగుకూడా నానాటికి మారుతూవచ్చినదనీ, ఆయాకాలములకవులు తమనాడు శిష్టవ్యవహారసిద్ధమయినభాషను కావ్యాలలో ప్రయోగిస్తూవచ్చినారనీ, నేటికవులుకూడా ఆ శిష్టాచారమే పాటించి వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాస్తే భాషా ప్రయోజనము చక్కగా నెరవేరుతుందనీ, నోటిమాటకూ చేతివ్రాతకూ సామరస్యము కుదిరి ఒకదానికొకటి పోషకముగా ఉన్నప్పుడే వాఙ్మయములోని భాష సహజముగానూ, సరళముగానూ, సుబోధకముగానూ పరమప్రయోజనకారిగానూ ఉంటుందనీ నిరూపించడము ఒకమార్గము.

వ్యావహారికభాషను బహిష్కరించి గ్రాంథికాంధ్రమును దానిస్థానములో నెలకొల్పడానికి ప్రయత్నిస్తూ ఉన్నవారు ప్రాచీనతాళపత్రగ్రంథములలో ఉన్న లౌకికభాషను ఎట్లు గ్రాంథికీకరణము చేసి వ్యాకరణదోషమునకు పాల్పడి భాషకు అపాయమయిన అవస్థను కలుగజేసినారో ఋజువు చేసి పూర్వులు వ్రాసిన పురాణ (వచన) ములూ, లక్షణగ్రంథములూ, వ్యాఖ్యానములూ, టీకలూ, వివిధశాస్త్రగ్రంథములూ, దేశచరిత్రములూ, జీవన వృత్తాంతములూ, వార్తాపత్రికలూ, శాసనములూ, కథలూ, బడిపుస్తకములూ మొదలయిన అన్నివిధములరచనలలోనూ వచనము వ్యావహారికభాషలోనే

ఉన్నదని నిదర్శనపూర్వకముగా సిద్ధాంతీకరించి, ఏభాషలోనయినా ఇదే నిజమయినవచనరచనాసంప్రదాయమని నిరూపించడము రెండోది.

'గ్రాంథికభాష' అని మనపండితులు వ్యవహరించేదాని స్వరూపము ఇదమిత్థమని నిర్ణయించడానికి వల్లపడదనీ, మనవ్యాకరణములు పరస్పరవిరుద్ధములుగానూ, అసమగ్రములుగానూ ఉండడమువల్ల ఏది తప్పో ఏది ఒప్పో నిర్ధారణచేయడము దుష్కరమనీ, ఒకపండితుడికి గ్రామ్యమయినప్రయోగము ఇంకొకరిమతములో అగ్రామ్యమనీ, ఒక మహామహోపాధ్యాయులగ్రంథాలలో ఇంకో మహామహోపాధ్యాయులవారికి వేనవేలు తప్పులు కానవస్తూ ఉన్నవనీ, గ్రాంథికభాషలో నిర్దుష్టముగా వ్రాసినగ్రంథము మచ్చుకి ఒక్కటి అయినా లేదనీ, గ్రాంథికభాష పండితప్రకాండులకయినా సాధ్యపడక ఇంత అవ్యవస్థముగా ఉన్నదనీ ప్రాచీనభాషలో శబ్దస్వరూపమూ శబ్దార్థమూ నిర్ణయించడమే బహుకష్టముగా ఉన్నందువల్ల ఆభాషలో స్వతంత్రరచన సాగించడము అసంభవమనీ నిరూపించడము మూడోమార్గము.

ప్రాచీనకవులకావ్యములన్నీ సమగ్రముగా పరిశీలించకపోవడమువల్ల వ్యాకరణకర్తలూ, కోశకారులూ, పండితులూ తప్పులుగా భావించి లక్షణవిరుద్ధములనీ గ్రామ్యములనీ నిందించినరూపములు వందలకొలదిగా కవులకావ్యములలో ప్రయుక్తములై ఉన్నవనీ, వ్యాకరణము ప్రయోగమూలము కావడమువల్ల కవిప్రయోగము లక్షణముకంటె బలవత్తరమైనదనీ, కవులు ప్రయోగించినరూపములు లక్షణములో చెప్పకపోతే లక్షణమే అసమగ్రమూ దుష్టమూ అవుతుందికాని ప్రయోగములు నింద్యములు కావనీ నిరూపించి, అట్టిరూపములకు—ప్రతిపక్షులు ఎదురాడుటకు వీలులేనట్టుగా—కవుల కావ్యములనుంచి వందలకొద్దీ ప్రయోగములు చూపి నిర్దుష్టత్వ మాపాదించడము నాలుగోమార్గము.

ఈనాలుగుమార్గములూ వ్యక్తపరిచేగ్రంథములు వరుసగా శ్రీపంతులుగారి సప్తతితమజన్మదినోత్సవప్రచురణములలోని వ్యాసావళి, గద్యచింతామణి, ఆంధ్రపండితభిషక్కులభాషాభేషజము, బాలకవిశరణ్యమున్ను.

ప్రకృతగ్రంథము పరవస్తుచిన్నయసూరిప్రభృతులు కృతకమైనవచనశైలి (Manufactured diction) ప్రవేశపెట్టేవరకూ అనాదిసిద్ధముగా వస్తూఉన్న వచనరచనాసంప్రదాయ మెట్టిదో తెలియజేస్తూ ఉన్నది. చిన్నయసూరి ఆవలంబించిన గద్యశైలి అసహజమయినదనీ, వచనరచన కావ్యభాషలో చేస్తే విషయము సుబోధముగా ఉండదనీ వారి సమకాలికులే కొందరు ఆపద్ధతి నిరాకరించి శిష్టాచారముప్రకారము వ్యావహారికభాషలో తాము గ్రంథములు రచించినట్లు తమగ్రంథముల పీఠికలలో విస్పష్టముగా చెప్పినారు. పూర్వులు వ్యావహారికభాషలో రచించినగ్రంథాలు ముద్రించేటప్పుడు గ్రాంథికాంధ్రభాషాప్రవర్తకులు వాటిలోనిభాష దిద్ది తారుమారు చేయడమువల్ల ప్రజలు మోసపోయి చిన్నయసూరి ప్రవేశపెట్టిన అపమార్గమే సత్సంప్రదాయమని నమ్మి వాడుకభాషను పునరుద్ధరించడానికి ప్రయత్నము చేస్తూ ఉన్నవారే సంప్రదాయవిరుద్ధమైన గ్రామ్యభాషను నెలకొల్పి వాఙ్మయము పాడు చేస్తున్నారని భ్రమపడుతున్నారు. ఈగ్రంథము చూచినమీదట అట్లు భావించేవారు తమతప్పు దిద్దుకొంటారని రూఢిగా చెప్పగలను.

శ్రీ పంతులుగారు ప్రాచీనతాళపత్రగ్రంథములూ, 18 వ శతాబ్దములోనూ, 19 వ శతాబ్దపూర్వార్ధములోనూ అచ్చుపడ్డ తెలుగుపుస్తకమూ అతిప్రయత్నముమీద సేకరించి వాటిలోని కొన్నిభాగములు ఎత్తి వ్రాసి ఈగ్రంథములో చేర్చినారు. మిగతాభాగములు తంజావూరు సరస్వతీమహాలులోని లిఖితపుస్తకములనుంచీ, ప్రాచ్యలిఖితపుస్తకభాండారము, ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకాలయము, గౌతమీగ్రంథాలయము, పరవస్తువారిలైబ్రరీ, వావిళ్లవారిలైబ్రరీ మొదలయినతావులలో ఉన్నపుస్తకాలలో నుంచి ఎత్తి వ్రాసినవి. పూర్వులు ఉచ్చారణను అనుసరించి ఉండేటట్లు ఏవిధముగా వ్రాసేవారో తెలియడానికిగాను ఇప్పటి వర్ణక్రమానికి భిన్నముగా ఉన్నచోట్లకూడా సవరణచేయక గ్రంథము యథామాతృకముగా ముద్రించినాము.

జన్మదినోత్సవనిర్వాహకసంఘమువారికోరికపైని భాషాపోషకులూ, ఉదారహృదయులూ శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులుగారు ఈ గ్రంథము ఉచితముగా ముద్రించి ఇచ్చి గొప్పసహాయము చేసినందుకు వారికి కృతజ్ఞతతో వందనములర్పిస్తున్నాను. ఈ గ్రంథము ప్రూఫులు ఓపికతో దిద్ది నాకత్యంతసాహాయ్యము చేసినవారు శ్రీ పంతులుగారి శిష్యకోటిలో ప్రధానులూ సహృదయులూ నాకు గురుతుల్యులూ అయిన మ-రా-శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణపంతులుగారు. వారికి హృదయపూర్వక ప్రణామములు.

జన్మదినోత్సవసంఘమువారికి శ్రీ పంతులుగారు తమరచనలం ప్రకటనార్థము ఇచ్చినందుకు వారికి ఈసంఘముతరఫున కృతజ్ఞతాపూర్వకవందనములు సమర్పిస్తున్నాను.

గుంటూరు<br>
డిసెంబరు, ౧౯౩౩.

కైలికిచెర్ల వెంకటరత్నం,<br>
సంపాదకుడు.

# ముందుగా నామనవి చిత్తగించండి

ఈగ్రంథము కేవలము గద్యసంచయము. నేను సంగ్రహించిన గద్యఖండములు చూచిన వెంటనే నామిత్రులు బ్రహ్మశ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు గద్యచింతామణి అని నామకరణము చేసినారు.

1907-వ సం. మొదలుగా బడులలో తెలుగుపిల్లలకు విద్యనేర్పడమునకు చేసిన ప్రయత్నములు, లోకవ్యవహారములో ఎక్కడా, ఎప్పుడూ, ఎవ్వరూ (పండితులయినా) వాడని ప్రాచీనాంధ్రభాష విద్యాబోధకు సాధనముగా అంగీకరించడముచేత, నిష్ఫలమయినందున, శిష్టవ్యవహారమందున్న తెలుగుభాషనే లౌకికవ్యవహారములలో పెద్దలందరూ వాడుతూఉన్నట్టి, బడిపిల్లలచేత గద్యరచనాభ్యాసము చేయించవలసినదని ఇంచుమించుగా ఇరవైయేళ్లక్రిందట విద్యాధికారులు విధించినారు. ఆవిధానము పూర్వసంప్రదాయవిరుద్ధమనిన్ని, పూర్వులు ఎవ్వరూ వాడుకభాషలో గ్రంథాలు రచించి ఉండలేదనిన్ని, సంభాషణలో శిష్టులు వాడేవయినా దేశభాష గ్రామ్యమనిన్ని, గ్రామ్యభాష ప్రయోగార్హము కాదనిన్ని ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ఆక్షేపించినారు. వారి ప్రతిష్ఠాగౌరవమూ పలుకుబడీ ఆకాలమందు అధికముగా

ఉండినందున, వారి అభిప్రాయముచొప్పున తెలుగుదేశము లోని పెద్దలందరూ "తీర్మానాలు" చేసి, గవర్నమెంటువారికి మహజర్ నామాలు పంపి, చాలాఒత్తిడి కలుగజేసి, "మాతృభాష" బడిపిల్లలు అభ్యసించకుండా ఆటంకపర్చి కృతకృత్యులయినారు. [1]మరుచటిసంవత్సరము "నిజమైనసంప్రదాయము" అనే పేరుగల చిన్న వ్యాస మొకటి రచించినాను; అది శ్రీ హావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు అచ్చువేయించి ప్రకటించినారు. పూర్వులు వ్యావహారికభాషలోనే విద్యార్థులు చదువుకొనే గ్రంథాలు రచించేవారని కొన్నినిదర్శనములు చూపించినాను. [2]ఆతర్వాత వ్రాతపుస్తకములుగల గ్రంథాలయములకు

---

1 "ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్యా" పత్రిక—"పుష్కరసంచిక"లో విద్వాన్ శ్రీ గరిమెళ్ల సోమన్నపంతులుగారు ప్రకటించిన "భాషాజ్ఞానము" అనే పేరుగల వ్యాసములో, 'ఎలిమెంటరీస్కూళ్ల'లోను, 'మాధ్యమోత్తమ పాఠశాలల'లోను, ఉన్న ఉపాధ్యాయులనుగాని, 'పరీక్షాధికారులలో పెక్కుండ్రను'గాని, 'కచేరీలలో గుమస్తాలను'గాని, 'పెద్దయుద్యోగులను'గాని గ్రాంథికాంధ్రభాష రాదని స్పష్టముగా తెలియజేసినారు. ఉపాధ్యాయులు తమకే రానిగ్రాంథికాంధ్రము పిల్లలకు ఏలాగున నేర్పుతున్నారో ఈ అరవైయేళ్లయి? తెలుగుదేశములోని పెద్దలు ఆలోచింతురుగాక. కచేరీలలో ఉన్నతోద్యోగులకు అక్కరలేనిగ్రాంథికాంధ్రము బడిపిల్లల కెందుకు? న్యాయస్థానమందు ప్లీడర్లు వాడుకభాషలో వాదాలు రచిస్తూఉండగా బడులలో పిల్లలు కథలు ఆభాషలో రచించకూడదేమి?

2 మీదను 1 లో ఉదాహరించినసంచికలోనే, "విద్యార్థులు చదువు

నేను స్వయంగా వెళ్లి వాటిలో ఉన్న పుస్తకాలు పరిశీలించి చూచినాను. నానావిధ గద్యగ్రంథములలో వ్యావహారిక భాషారచన ప్రచురముగా కనబడినది. నేను చూచిన పుస్తకములలోనుంచి మాదిరికిగాను కొన్నిభాగములు ఎత్తి వ్రాసినాను; మరికొన్ని ఇతరులచేత వ్రాయించినాను. వ్యావహారిక భాషారచన పూర్వసంప్రదాయమునకు విరుద్ధము కాదనిన్ని అట్టిరచన పూర్వులు వ్రాసినపుస్తకాలలో కనబడుతున్నదనిన్ని 'ప్రమాణపత్రములు' వ్రాసి గ్రంథాలయములందున్న పండితులు నాకిచ్చినారు. అవి అన్నీ, యథాతథంగా నా తెలుగు పత్రికలో 1919-వ సంవత్సరమందు ప్రకటించినాను. నేను చూచినగ్రంథాలయాలు(1) గవర్నమెంటువారి 'ఓరియంటల్ లైబ్రరీ', (2) తంజావూరిలోని సరస్వతీమహాలు, (3) విశాఖపట్నంలోని (పవవస్తువారి) ఆర్యగ్రంథాలయము, (4) శ్రీ లచ్చారావుగారి "పరిశోధకమండలి" తాళపత్రగ్రంథసంచయము, (5) శ్రీమండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి పుస్తకసంచయము, (6) ఆంధ్రసాహిత్యపరిషత్తువారి తాళపత్రగ్రంథసంచయము. పరిషదధికార్లు మ. జయంతి రామయ్యపంతులు

---

ఉనే పుస్తకములు: మునుపటివి, ఇప్పటివి" అనే పేరుగల నావ్యాసము ప్రకటితమై ఉన్నది. మన తాతముత్తాతలు బడులలో చదువుకొన్న పుస్తకాలు వాడుక భాషలోనే రచించేవారని, వ్యవహారోపయుక్తమయిన భాషారచన బడులలో వారు అభ్యసించేవారని, దానిలో రుజువుచేసినాను.

గారు మాత్రము ప్రమాణపత్రము ఇవ్వమన్నారు. గవర్న మెంటువారి లైబ్రరీలోని పండితులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి లేఖల్లోనుంచి మాత్రము రెండుమూడు వాక్యము లుదాహరిస్తాను.

"వాడుకభాషలో గ్రంథాలు వందలు వంద లున్నవి. అచ్చు వచ్చినతర్వాతనే యీ అన్యాయం. పూజాపురస్కా-రాలు లేకుండా బూజుపట్టిస్తున్నారు. వ్యాఖ్యానాలకు వాడుక భాషతప్ప వేరేభాష లేనే లేదు.... తెలుగు వ్యాఖ్యానా లన్నీ, అదేమిటి ఇదేమిటి, సర్వం వాడుకభాషలోనే ఉన్నవి. ప్రాచీనవచనగ్రంథాలు, వందలు వందలు పరిశీలించగా, కావ్యభాషవి వేళ్లలెక్కకైనా రాలేదు; అన్నీ వాడుక భాషలోనే ఉన్నవి. రామాయణాలు, భాగవతాలు, కథలు అన్నీని. ఎరిగి అంటారో ఎరగక అంటారో, కొందరు భాష రానివారు వ్రాసినారని. పుష్పగిరి తిమ్మన వ్యాకరణం రాని వాడా? వ్యాఖ్యానాలు లక్షణగ్రంథాలు రచించినవారు భాష రానివారా? లక్షణగ్రంథాలలోని వచనభాగమంతా వాడుక భాషే... లక్షణదీపికలో పాటలు, పదాలు, షట్పదులు, ధవళాలు, అర్ధచంద్రికలు వగైరాలు మధురకవిత అన్నారు. వఠెం వాసుదేవపరబ్రహ్మశాస్త్రులు, జూలూరి అప్పయ్యపండితుడు, గురుమూర్తిశాస్త్రులు మొదలగు గొప్పపండితులు బ్రౌనుదొర గారికి విద్యావిషయమై వ్రాసిన ఉత్తరము లున్నవి. అన్నీ

వాడుకభాషే...చిన్నయసూరివరకూ వుండే వచనగ్రంథాలలో, యేవో కొద్దిసంఖ్యవి తప్ప అన్నీ వాడుకభాషవే." వ్యావహారికభాషలో రచించిన వ్రాతపుస్తకాలు కొన్ని, మొట్టమొదట అచ్చుపడ్డపుస్తకాలు కొన్ని సంపాదించి అవి పట్టుకొని, తెలుగుజిల్లాలలో ఉన్న కాలేజీలకు వెళ్లి అక్కడ ఉన్న పండితులకున్ను తక్కిన ఉపాధ్యాయులకున్ను చూపించినాను; వారుకూడా "ప్రమాణపత్రములు" దయచేసినారు. అవి అన్నీ నా తెలుగుపత్రికలో ప్రకటించినాను. * వాడుకభాషలో, పూర్వసంప్రదాయము చొప్పున, తిరిగీ రచనాభ్యాసము బడులలో చేయించడము యుక్తమని ఉపాధ్యాయులు అనేకులు అంగీకరించినారు కూడాను.

ఆతర్వాత, 1916-వ సం॥ నవంబరు తే 19 దిని కొవ్వూరిలో జరిగిన ఆంధ్రసారస్వతమహాసభలో నందలకొలదిగా తెలుగుపండితులూ కవులూ ఐకమత్యముగా నావాదము అంగీకరించినారు.

1919-వ సం॥ ఫిబ్రవరి తే 28 దిని రాజమహేంద్రవరమునందు శ్రీ॥ శ్రీ॥ రా॥ బ॥ కందుకూరి వీరేశలింగంపంతులు

---

* బందరు కాలేజివారిలేఖలోని వాక్యమొక్కటిమాత్రము ఉదాహరిస్తే చాలును.

**"We have compared some of these with manuscripts and printed books shown us and verified them. All these books are written in the spoken language of the authors..."**

గారు అధ్యక్షులుగా, "వర్తమానాంధ్రభాషాప్రవర్తకసమాజము" స్థాపించుటకు ఏర్పాట్లు జరిగినవి; గాని పంతులుగారు మరి మూడుమాసములలోగానే పరమపదముపొందుటచేత, సమాజము ఉద్దేశించిన కార్యములు నెరవేరలేదు. తణుకులో ఆంధ్రసాహిత్యపరిషత్ సాంవత్సరికోత్సవము జరిగినప్పుడు సభలోనివారు అనేకులు వ్యావహారికభాష దేశభాషగా అంగీకరించినారు.

ఈపుస్తకములో చేర్చినవి అనేకవిధములయిన గ్రంథములలోనుంచి మాదిరిగా ఎత్తి వ్రాసినఖండములు; వ్యావహారికభాషలో ఆయాగ్రంథములు రచితమయినవని రుజువు చేయడముకోసము మాత్రమే అవి ప్రకటించినాను; వాటిలోనివిషయము ఇందులో ప్రస్తుతము కాదు; (కొన్నిఖండములలోని కడపటివాక్యములు అసంపూర్ణముగానే ఉన్నవి; విమర్శకులు అది తప్పుగా ఎన్నకుందురుగాక అని కోరుతున్నాను) చిన్నయసూరి తెచ్చిపెట్టిన "గ్రాంథికాంధ్రభాషా రచన" వ్యవహారమునకున్ను ప్రజలలో విద్య వ్యాపించడమునకున్ను అనుకూలించదని సమకాలికులు చేసిన ప్రత్యాఖ్యానము పాటించదగినది. (చూ. భారతవచనము పు. 11, హితసూచని పు. 182, వ్యవహారదర్పణము పు. 285). కీ॥ శే॥ వేంకటగిరి మహారాజ శ్రీసర్వజ్ఞయాచేంద్రభూపాలవిరచితమయిన తత్త్వగ్రంథాలు, వాడుకభాషలో అట్టివి రచించ

డము యుక్తమని చెప్పి, బుద్ధిపూర్వకముగా, ప్రతిజ్ఞచొప్పున అట్లే రచించినారు. (చూ. పు. 31) సంస్కృతగ్రంథములవలెనే ప్రాచీనాంధ్రప్రబంధములు సుబోధములు కావుగనుక వ్యావహారికభాషలో వ్యాఖ్యానాలు పండితులు రచించినారు. నిఘంటువులు రచించినవారు(యాస్కునివలెనే) తెలియనిభాషలోని శబ్దముల అర్థము అందరికీ తెలిసిన లౌకికభాషలో తెలియజేసేవారు. ఈసంప్రదాయమునకు నిదర్శనము లుదాహరించినాను.

బ్రిటిష్‌గవర్నమెంటువారు ఏర్పర్చిన విద్యాశాఖవారు ఉపేక్షించుటవల్ల దేశభాషారచనాభ్యాసము పూర్వసంప్రదాయముప్రకారము బడులలో జరగలేదు. దానికి మారుగా "కృతకగ్రాంథికాంధ్రభాష" పెద్దల ఆదరణకు పాత్రమైనది; శిష్టవ్యవహారమందున్న వాస్తవమైన దేశభాష "గ్రామ్య"మైనది. పూర్వసంప్రదాయము మరల నెలకొల్పుటకు వ్యావహారికభాషాభిమానులు చేసినప్రయత్నము ఆంధ్రసాహిత్యపరిషత్తువారి అసత్యప్రకటనలవల్ల నిష్ఫలమైనది. విశ్వవిద్యాలయాలవారూ, విద్యాధికారులూ, పండితులూ నిజమైనదేశభాషను తృణీకరించినారు. అయితే, దేశభాష అపరిహార్యమయినది గనుక లౌకికవ్యవహారమందు గత యిరవైసంవత్సరములయి కొంచెము వికసిస్తూ ఉన్నది దానిని ఆదరించేవారు నేడు వందలకొలదిగా దేశంలో ఉన్నారు. ఉదారబుద్ధిగల పత్రికాధిపతులు అందరూ తమ పత్రికలలో దానికి కొంచెము

'జాగా' ఇచ్చినారు. దాని ప్రయోజనమును బట్టి, యోగ్యతను బట్టి దానియెడల గౌరవమూ అభిమానమూ, అనురాగమూ లోకులకు కలుగుతున్నది. వ్యావహారిక భాష అపరిమిత ప్రయోజనమని దేశములోని పెద్దలకు అంతకంతకు బోధపడుతుంది. ప్రజాస్వామికపరిపాలనము చక్కగా నెరవేరడమునకు సర్వజనసామాన్యమైన దేశభాష అన్నివ్యవహారములకూ ఆవశ్యక సాధనము గదా. పూర్వసంప్రదాయము వ్యావహారిక భాషాభ్యాసమునకు, అనుకూలముగాని ప్రతికూలము కాదు అని, ఈపుస్తకములో ఉదాహరించిన పూర్వగ్రంథములనుబట్టి అంగీకరించక తప్పదుగదా ఇకనయినా, విశ్వవిద్యాలయాధికారులున్ను గవర్నమెంటువారు నియమించినవిద్యాధికారులున్ను శిష్టవ్యవహారమందున్నభాష విద్యాబోధకు ఆవశ్యకమయిన సాధనముగా అంగీకరించక, చిన్నయసూరి తెచ్చిపెట్టిన కృతక గ్రాంథికాంధ్రభాషే దేశభాషగా స్వీకరిస్తే, వారి ప్రయత్నములు ఇదివరకయినట్టే నిష్ఫలము కాక తప్పదు. ప్రజలలో విద్య వ్యాపించడమునకు అనుకూలమయినవిధానము ఏర్పర్చకపోతే, ఈవిద్యాసంస్థలవల్ల కలుగవలసిన మేలు ప్రజలు ఏలాగున పొందగలరు? ఇరవైయేళ్లక్రిందట ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన అభిప్రాయము నిరాధారమైనదని, నమ్మదగనిదని ఇప్పుడు అందరికీ తెలిసినది; వారిమాట నమ్మి అప్పుడు పెద్దలందరూ నిజమయిన మాతృభాష బడు

లలో ప్రవేశించకుండా ఆటంకపర్చినారు; అందువల్ల దేశమునకు ఎంత కీడు కలుగుతున్నదో, లెస్సగా ఆలోచిస్తే తెలుస్తుంది. సత్యము తెలియనప్పుడు భ్రమప్రమాదములు ఎవరికైనా కలుగతవి; సత్యము తెలిసినతర్వాత తప్పు దిద్దుకోవడము ఔదార్యమనిపించుకొంటుంది; దిద్దుకోకపోవడము?

ఇప్పుడు ప్రకటించిన పుస్తకము 'గద్యచింతామణి' మొదటిభాగము. రెండోభాగములో, ఇప్పటివారు అభ్యసిస్తూ ఉన్న అభినవాంధ్రగద్యరచన ఏవిధముగా విజృంభిస్తూ ఉన్నదో, మాతృభాషాభిమానముగల స్త్రీలూ పురుషులూ వ్రాసినగ్రంథములలోనుంచీ, వ్యాసములలోనుంచీ, జాబులలోనుంచీ, చిన్నచిన్న భాగములు ఎత్తి మాదిరిగా ఉదాహరిస్తాను. ఆయురారోగ్యములకు భంగం కలుగకుంటే మరి ఆరుమాసములలో అభినవాంధ్రభారతికి అది సమర్పిస్తాను.

గి. వెం. రామమూర్తి.

# విషయసూచిక



పుట.

## ౧. వచనకావ్యములు:—

### రామాయణవచనము.



### భారతవచనము.



### భాగవతము.

పుట.

## ౨. ప్రాచీనలిఖితగ్రంథములు:—

### క్షేత్రమాహాత్మ్యములు.



## 3. తత్త్వగ్రంథాలు:—

### శ్రీవెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్ర భూపాలవిరచితములైన తత్త్వగ్రంథాలు.

## b. తెలుగుగ్రంథములు.

పుట.

## ౧౧ లక్షణగ్రంథములు:—



## ౧౨. బడిపుస్తకములు:—

## b. జ్యోతిషము.



## c. సిద్ధాంతము.



## d. వైద్యము.

పుట.

## e. భరతశాస్త్రము.



**అనుబంధము:—**

### లక్షణగ్రంథాలు.



### నిఘంటువులు, కోశములు.



### దినచర్యలు.

పుట.

## శాసనములు.



## ధర్మశాస్త్రం.





ఆ 3397

# గద్యచింతామణి

౧

## వచనకావ్యములు



### రామాయణము వచనము.

బుద్ధభూవిభుడు ద్విపదకావ్య మొనరించిన ప్రకారమునకు ఈయొక్క రామాయణం వచనకావ్యముగా రచియింపుమని మహారాజరాజశ్రీ సాంద్రీసు దొరవారు పైడిపాటి కొండలయ్య కొమారుడు పాపయ్యను పిలిపించి వస్త్రభూషణగంధమాల్యములచేత పరితృప్తిపొందించగా అంతట సంతోషచిత్తుడై బాలకాండము మొదలుకొని యీయొక్క యుద్ధకాండముమట్టుకు షట్కాండములున్ను రచియించెను.

3397.

రామాయణము పుట 599-606 b. రెండవప్రతి.

అంతట శ్రీరామచంద్రుడు సుగ్రీవుని హనుమంత్తుని అంగ్గదుని జాంబ్బవంత్తుని గజుని గవాక్షుని గంధమాధనుని నలుని నీలుని పనసుని సుషేణుని దధిముఖుని శతబలిని జ్యోతిర్ముఖుని మొదలైన వానరవీరులనంద్దరిని జూచి వోవనచరోత్తములారా మీరు మానిమిత్యమై మిక్కిలి శ్రమపడితిరి మీరు చేసినటువంటిఉపకృతి దేవతులచాతనుకూడదు కాబట్టి మీరు రాక్షసులతోపోరి చాలాఅలశిపున్నారు గనక మీరంద్దరున్ను మీ మీ నివాసములకు పొండ్మని పలుకరించ్చగా వనచరులు శ్రీరాములకు మ్రొక్కి పలుకరించ్చినవారై రి

వోరామచంద్రా మేముఅంద్దరమున్నూ మీయొక్కసేవచేసుకుని మిమ్మున గెలిచి అయోధ్యకువచ్చి మీయొక్కపట్టాభిషేకమహోత్సవం కంన్నులజూచి పుణ్యాత్ములైన మీతమ్ములగు భరతశత్రుఘ్నులును మీతల్లులైనకౌసల్యా సుమిత్ర లను తక్కినవారలంద్దరిని నేత్రోత్సవంగాసేవించుకుని అటుతరువాత మీపాద పద్మములకు మేముపొయ్యేదమని పలుకరించ్చగా అంతట రామచంద్రుడు సంతో షించి త్రిజట సరమ మొదలైనటువంటి రాక్షసస్త్రీలనంద్దరినిన్ని లంకాపుర మునకుపొమ్మని కపులనంద్దరిన్ని విమానమందుఎక్కుమని శ్రీరాములు పలుక రించ్చగా కపివీరులున్నూ జాంబ్బవంతునిసేనలున్ను విభీషణుడున్ను విభీష ణుని మంత్రులున్ను పుష్పకంయెక్కినవారై కడను డబ్బైరెండు పదివేరు లున్ను శ్రీరాముని అనుమతివడసి ఆయొక్కపుష్పకమందు యెక్కినవారైరి అంత్తయు పకములాల లెక్కువగానేవుండెను. ఆపుష్పకంయొక్క ప్రభావాన్ని విభీషణునిచాతవిన్నవారై శ్రీరాములు మిక్కిలి సంతోషించెను. అంతట ఆయొక్కపుష్పకము ఆకసమునకెగసి దక్షిణదిక్కునుంచ్చి వుత్తరదిక్కునకు చనగా సూర్యుడు తూర్పుకొనవుదయించ్చి పశ్చిమదిక్కునకు పో[illegible] తుని దక్షిణదిక్కునుంచ్చి వుత్తరదిక్కునకు పోయెట్టులనుకె విమానము [illegible] సించ్చెను. అంతట శ్రీరాములు సీతనుజూచి వోజనకతనయా లంకాపురి చూస్తివా యంత్తవేడుకగావున్నది అమరావతికె మించ్చివున్నది [illegible] త్రికూ టాచలపర్వతమంద్దు యిటువంటిలంకను యేలేటంద్దుకు అదృష్టంల్యాక రావ ణుడు అన్యాయముగా సమసెను పలుకరించ్చి వోఅబలా యుద్ధరంగము చూస్తివా రథములయొక్క తునుకలున్ను అశ్వంబుయొక్క శిరములున్ను ఏనుగులయొక్క తొండ్డములున్ను రాక్షసకోటులయొక్క తలలున్ను మొండ్డెంలున్ను మాంసఖండ్డంలున్ను తెగినచేతులున్ను విరిగినకాళ్లున్ను తెగిపడిన మొండ్డెంలున్ను కొట్టబడిన తలలున్ను శూలములతో పొడిచిన డొంక ములున్ను ముసలములతో కొట్టిన భుజములున్ను కత్తులతో నరికిన పదములున్ను కుప్పలుగలై వున్నటువంట్టి రక్తంమున్ను చూడగా మహాభయంకరమని రావ

జెండుకూలిన చోటుచూస్తివా మనయెదట అగబడుతున్నది కుంభకన్నుణ్ణు సమశినచోటుచూస్తివా వోఅంగ్గనామణి యింద్రజిత్తు నాగపాశములతో బంద్ధించ్చినచోటు కనుగొంట్టివా లక్ష్మణుంచాత యింద్రజిత్తుమడిశినచోటు మనయొక్క పుష్పకయినకు పక్క పాశ్వ్యాంచూడుమా వోకాంత్తామణి నీలు నితోపోరి ప్రహస్తుడు యిచటనెమడిశెను హనుమంతునితోపోరి ధూమ్రా క్షుండు మడిశినచోటు అదిగో చూడుమా మనకు ఎదురుగా కనుపడుతున్నది మహోదరమహాపాశ్వ్యాండు దేవాంత్తకుడు నరాంత్తకుడు సమశినచోటు మనకసముద్ద్రగా కనుపడుతున్నది చూడుము అగ్నివర్ణుండు కూలినచోటు యిచ్చటను కనుగొనుమా వోతరుణీమణి కప్పులు కొండ్డలున్ను వృక్షంబులున్ను శిఖరంబులున్ను తెచ్చియియ్యగా నళుడు కట్టినటువంట్టివారధి యంత్తవేడుకగా వున్నదో చూడుమా వోలలనా యీయొక్క గంధ్ధమాదనపర్వతాంన్ని కను గొంట్టివా హనుమంత్తుడు లంకకుపోయ్యేటప్పుడు హనుమంత్తునకు ఆ తిథ్యం తెచ్చేటంద్దుకు రెమడుగావచ్చినటువంట్టి హిమవత్పర్వతం యిదిగో చూడుము. కాంచ్చనపర్వతాన్ని కనుగొంట్టివా వోభూపుత్రీ హిరణ్యా నాభాన్ని చూడుము యంత్త వేడుకగావున్నదో అనిపలకరించ్చగా శ్రీ రామచంద్రుడు కనుపరచినటువంట్టి పుణ్యస్థళములు మోహనమైన వేడుకలు కనుగొన్నదై సంతోషమనస్సుయయిందె సంత్తోషపుమావుండ్డెను అంతట విభీషణుండు శ్రీరాములనుజూచి వోరామచంద్రా యీవారధికట్టివున్నందున లంకకు అందరుపొయ్యేటట్టుగావున్నదే యీలంకలోవుండేరాక్షసులు వారధి మీదుగానడిచి రాకుండ్డానూ జనులు లంకకువచ్చేటంద్దుకు వైపు కనుపడకుం డ్డాను మీరునాయెండ్దుదయచేసి యీప్రకారంశాయవలయునని పలుక రించగా అంత్తట శ్రీరాములు లక్ష్మణునిచేతివిల్లందుకుని వనచరులు కట్టినటువంట్టిశేతువను మనుజులుపోకుండ్డా రాక్షసులురాకుండ్డా తెగ కొట్టినవాడయును అంత్తట శ్రీరాములు శీతనుజూచిపలుకరించ్చెను వోటనకజా తేనుయీవనముద్ధ్రుని మిక్కిలిప్రార్థించ్చి ధర్భశయ్యనుయెందు పవళించ్చి

మూడుదినములు వుపవాసములతో వుంట్టిని యీసముద్రుడు నంన్నులక్ష్య పెట్టక మరిమరి ప్రచండ్డమైన అలలో మహాశబ్దంబులు మ్రోయుచు నే నుపవళించ్చివున్నచోటికె రాసాగెను అంత్తట నేను యీసముద్రుని లక్ష్యపెట్టి వుపవాసంలు చేశి ప్రార్థించినందువల్లగదా యీసముద్రునికి యింత్తహంకారంగలిగి మరిమరివుప్పొంగసాగెనని అంత్తట లక్ష్మణుని చేతి విల్లందుకుని విల్లెక్కుబెట్టి బ్రహ్మాస్త్రం వింట్టసంధ్ధించ్చి బ్రంహ్మామంత్రంవుచ్చరింపగా దేవతులు అంద్దరున్ను వెరచిపరుగెత్తసాగిరి భూమికంపించెను కులగిరులువణకెను దిక్కులు విదిక్కులయ్యెను దిగ్గజములువణకెను తారలుడుల్లెను సముద్రంలు గలంగెను అంతట సముద్రుడువెరచి గడగడవణకుచు తనస్త్రీలతో గూడుకుని వచ్చి మొక్కినవాడై అనేకస్తోత్రంలుగావించ్చి అస్త్రశస్త్రంలుంన్ను కవచమున్ను అనేకరత్నంలున్ను తెచ్చియిచ్చి బతిమాలి నేను చేశినటువంట్టి స్వాపరంలు మన్నించ్చుమని వేడుకొనగా అంత్తట శరణుజొచ్చినవాని విడనాడరాదని సముద్రునిమన్నించ్చి సముద్రునిమీద ప్రయోగించ్చిన బ్రంహ్మాస్త్రం సముద్రునికి శత్రువులుగావుండ్డె రాక్షసులమీద ప్రయోగించి ఆరాక్షసులంద్దరిని సంహారంచేస్తిని వోశీతా నేను పవళించ్చివున్న ధర్భశయనం యిక్కడనేను వాలిని సంహారంచేశినటువంట్టి స్థళంబచటనె కనుగొంటివా యీయరణ్యమందువుండ్డె వృక్షములు చిగుళ్లచేతను పుష్పంలచాతను ఫలములచాతను యంత్త వేడుకలుగావున్నవో యీవృక్షంలనుచూస్తివా అని శీతతో శ్రీరాములు పలుకరించ్చగా అంతట ఆయొక్క చిత్రవిచిత్రలన్నియుం చూచినదై వోశ్రీరామచంద్రా సుగ్రీవుడు మోదలైన వానరశేనలతో గూడుకొని మనము అయోధ్యకుపోవలెనని నామనస్సుయొంద్దు మిక్కిలిభ్రాంతిగా వుంన్నదని శీతపలుకరించ్చగా అంత్తట కిష్కింధ్ధలోవుండ్డె కపులనంద్దరిని పిలిపించ్చినవాడై వానలతో కూడా పుష్పకంబెక్కి అంత్తట రుష్యమూకపర్వతాంన్ని కనుగొని వోజనకజా యీరుష్యమూకపర్వతమంద్దు సుగ్రీవునికి నాకుంన్ను సఖ్యమైనది నింన్ను రావణుడు లంకకు యెత్తుకపొయ్యెటప్పుడు

నీవంట్టిసొమ్ములన్నియుం తీశి యీఋష్యమూకపర్వతమందు పడవేశిపోగా యీ
సుగ్రీవుడు నీయొక్కసొంమ్ములంన్నియుం పదిలంచేశివుంచ్చి నాచేతికితీసుక
వచ్చి యిచ్చినచోటు కనుగొంట్టివా యీయొక్కసరోవరం చూస్తివా
వోసుదతీ కమలములచాతనున్ను నల్లకలువలచాతను మంచినిర్మలోదకంల
చాతను వొప్పుచున్నది తుంమ్మెదలు ఝుంకాంరంలుచేస్తుంన్ను తామరకమల
మంద్దువ్రాలి మధుపానంచేసున్తూ రెక్కలువిసరుచు యెగుస్తూవుంన్నవి
చూడుము వోభామిని నిన్నుయడబాశి మిక్కిలిశోకముజెందివుండ్డగా యీ
హనుమంత్తుడు యిక్కడికివచ్చి నిన్నుగనుగొని సుగ్రీవునియొక్క వృత్తాంతం
పలికినచోటు యిది కబంధ్ధునివధియించ్చినచోటు పాపాత్ముడైన రావణుండు
నింన్నుయెత్తుకపొయ్యేటపుడు మహాపుణ్యాత్ముడైన జటాయుంవు మననిమిత్తమై
రావణునితోపోరి సమశినచోటు యిచటనె కనుగొనుమా ఖరదూషణత్రిశరులు
పధ్నాలుగువేల కంచ్చురథములవారు సమశినస్థలము కనుగొంట్టివా వోగజ
గామిని యిక్కడ మనలక్ష్మణుడు శూర్పణానఖిని ముక్కుచెవులుకోశినచోటు
యీస్థలమంద్దె మారీచుడు మాయామృగమై నాచాతమడిశినచోటు చూ
స్తివా పంచవటితీరముచూస్తివా అయిదుమఱ్ఱివృక్షంలచాత యంత వేడుకగా
వుంన్నదో చూడుమా పర్ణశాలలో నీవు వంట్టిగావుండ్డిటప్పుడు మేములేని
సమయంచూచి రావణుడు వృచ్చిలించి నింన్నుయెత్తుకపోయినచోటు కను
పడుచుంన్నది చూడుమా వోతరుణీమణీ యిదిసుతీక్ష్ణాశ్రమము యిది
అగస్త్యమహాముని ఆశ్రమము యిది అత్రిమహాముని ఆశ్రమము యిచటనె
అనసూయఅనె మహాపుణ్యాత్మురాలు నీకు సొంమ్ములు అలంకరించ్చి నింన్ను
దీవించ్చినచోటు వోమగువా చిత్రకూటపర్వతమునకు సమీపమందువుండగా
భరతుడువచ్చి నన్నుప్రార్ధించి పాదుకలుగైకొనిపోయె యెమునానది కను
పడుచుంన్నది చూడుమా వోఅంగ్గనా మంచిపుణ్యోదకంలుకలిగి చక్రవాకలు
మొదలైనపక్షులుంన్ను కలవలుమొదలైన పుష్పంలుంన్ను తుమ్మెదల
యొక్క ఝుంకారంలున్నుగలిగి యీయొక్క గంగ్గానది యంత్తవేడు

కగావుంన్నదో చూస్తివా గుహుడువుండ్డే శృంగుబేరము మనకు సమీపమునసైవున్నది గోపురప్రాకారంబులు ధ్వజములు రథములు మిద్దెలు మేడలు దేవాలయములు గోపురములమీద నవరత్నంలచాత చెక్కినటువంటి కుంద్దనపు కలశంబులు మెరుస్తూవున్నటువంట్టి అయోధ్యాపురి యిచటికి అగుపడుతుంన్నది కపులు చూచి అచ్చెరువంద్దెదరు అని శీతతో శ్రీరాములుపలుకరించ్చి వోశీతా నీవు అయోధ్యానగరమునకు దండ్డము బెట్టుము అమరావతివలెనె వొప్పుచున్నది. పలుకరించ్చి పధ్నాలుగుసంవ్వత్సరములలో శుభకృతుసంవ్వత్సరం మాఘశుద్ధ పంచమినాడు భరద్వాజాశ్రమంచేరి అచ్చట పుష్పకవిమానందిగి భరద్వాజమహామునివద్దకివచ్చి ప్రదక్షణంగావించ్చి ఆమహాత్ముని పాదముమీద తనయొక్కశిరస్సు తగిలేట్టుగా మ్రొక్కినవాడై చేతులుమోగిచి వినయవిధేయుడై వోమునినాధచంద్రా మీకు క్షేమమె మీశిష్యగణములంద్దరు సుఖంగా వుంన్నారె కంద్దమూలఫలములు మంచిపుణ్యోదకంలు కలిగివున్నవె యన్నింటికి కొరతలు లేకుండ్డా యని భరద్వాజమునిని కుశలప్రశ్నశాయగా రామచెంద్రుడు తనయొంద్దుగలభక్తిన్ని కుశలప్రశ్న చేశిన వాక్యములున్ను మిక్కిలి సంతోషించి వో శ్రీరామా నా దివ్యద్రిష్టిచేచూచితిని నీవు పురాణపురుషుడవు ఆదిమూర్తివి యీమునుల దేవతలనిమిత్యమై అవుతరించ్చి అడవులయొందుతిరిగి సకలపుణ్యస్థళములు గనుగొని రాక్షససంహారంచేశి మీయొక్క వుపద్రవంలన్నియు తీశెట్టుగా రావణాసురునివధియించ్చి విజయంచేశితిరే యిఖమీదు యజ్ఞయాగాది కృతువులున్ను సాయంప్రాతరాహుతులుంన్ను సకలధర్మంలుంన్ను చక్కగా నడుచును. మీరు అవుతరించ్చివుండ్డేటప్పుడు ఎక్కటెన్ని తక్కువశానేరదని పలుకరించ్చగా రామచంద్రుడు మిక్కిలి సంతోషచిత్తుడైవుండ్డగా మరిన్ని భరద్వాజమహాముని పలుకరించ్చెను. వోరామచంద్రా మీరు అరణ్యంములకు విజయంచేశినది మొదలుకొని భరతుడు జటావల్కలంలు ధరించ్చి మీయొంద్దు భక్తిగలిగి మీయొక్కపాదుకలకు పూజలుశేయుంచు యీరాజ్యభారం చేశి

ష్వంట్టి వర్తమానంలన్నియును మీపాదుకలకు నానాటివర్తమానంలు విన్న
వింపుచు పధ్నాలుగుసంవ్వత్సరములు యెపుడుగడచునో అని అహోరాత్రంలు
చింత్తింపుచు మీరాకలకు యెదురుచూస్తూవున్నాడు. కాబట్టి మీరు
శీఘ్రంగా అయోధ్యకు విజంయం చాయవలశినపని అని పలుకరించ్చి అయితే
పదునాలుగుసంవ్వత్సరములు అరణ్యాంలయెందు వాసంచేశి మిక్కిలి డస్సి
వున్నారుగనక నేటిరాత్రి యిక్కడ శయనించ్చి మేము యిచ్చేష్వంటి
ఆతిథ్యాంలు గైకొని రేపుతెల్లవారి మీరు ఆవల తల్లికాపోవలశినదని భరద్వాజ
మహాముని పలుకరించగా శ్రీరాములు విని సంతోషించ్చి నిలిచినవాడాయను
అంత్తట భరద్వాజమహాముని కామధేనువును స్మరించినవాడాయను అంతట
ఆయొక్క కామదేనువ వచ్చినదై మృదుతరమైనటువంట్టి అన్నంలుంన్ను
అనేకవిధఫలములు నెయ్యి పప్పు పాయసం భక్ష్యంలు కూరగాయలు శక్కర
పెరుగు నానబాలు జుంటితేనియలు తియ్యాచారులు పానకంలు జుంన్ను
అనేకవిధములై వూరగాయలు వరుగులు వరియంలు వాసనగల చల్లని
వుదకంలు వారివారియిష్టప్రకారం రామలక్ష్మణు మొదలైనవారలుంన్ను
డెబ్బైరెండుకోటిల వనచరులుంన్ను భుజియించ్చివారై పరితృప్తిబొంద్దివుండ్గా
శ్రీరాములనుజూచి భరద్వాజులు పలుకరించ్చెను. వోయి రామా నీవు కావల
శిన వరములు వేడుము అని భరద్వాజులు పలుకరించ్చగా అంతట రామ
చంద్రుడు వోమునిచంద్రా మీయొక్క కృపచాత సకలమున్ను కలిగి
వున్నవి. వక్కటిన్ని కొరతలేదు. అయితే మిమ్మునవక వరం వేడుకొనియద
అయోధ్యాపురంచుట్టు మూడుయోజనంల పరిమంత్తరమున్ను వృక్షంలుకలిగి
చిగుళ్లచాతను పుష్పంలచాతను కాయలచాతను ఫలములచాతను మంచి నిర్మ
లోదకంలచాతను యన్నంటికిన్ని యీప్రకారమె వుండవలెనని రాముడు వర
ములు అడుగగా భరద్వాజమహాముని ఆదేశప్రకారం కలిగివుండునని వరము
లిచ్చి రామచెంద్రుని దీవించినవాడాయను. అంతట శ్రీరాములు హనుమంత్తుని
పిలిచి వోయి హనుమంత్తా నాయొక్కరాకలు పుణ్యాత్ముడగు శృంగ్గబేరపుర

మందు వుండెప్పంటిది గుహునితో పలుకరించ్చి ఆటుతరువాత నంది గ్రామంలో వున్నటువంటి సాత్మ్యుడైన భరతునకు తెలియపరచి తిరిగిరంమ్మని పలుకరించ్చగా అంతట హానుమంతుడు మనుజవేషంధరించ్చి శృంగ్గబేరపుర మునకు చనుదెంచ్చినవాడాయను.

రామాయణము సుందరకాండవచనము (152-ప. నం).

గ్రంథకర్త తుపాకుల అనంతభూపాలుడు.

పరునోకండ సర్గార్థము ఆరంభము. పేజీ 78-79.

అంత సాతలంపునిలిపి స్వస్థచిత్తుండగుచు సావానరవర్యుండు సీతా నిమిత్యంబున వేరొకచింత్తదలంచ్చె. యాసీతావరోహ రాముసెడబాసి నిదు రింప్పంజాలుసె భోజనంబు సేయుంటకును తంన్నలంకరించుటకును మధుపానంబు సేయుంటకును నొడంబడుసే సురేంద్రునివంట్టివాండైన వేరొక్కపురుషుని చెంత్త నుండ్డతలంచుసె రామునకు సమానుడగువాండు త్రిదశలలోనైన కలంగంజాలుసె కావున నిది వేరొక్కవని తెయని నిశ్చయించ్చి యుచ్చోటు బాళి పానభూమియంద్దు సంచరించుటయుం అంద్దు కొంద్దరుమగువలు క్రీడ సలిపియుం గానంబుచేశియుం సాట్యంబులాచరించ్చుటయుం పరిశ్రాంత్తులగుచు మధుపానంబులవలన మయిమరిచి నిద్రింపుచునుండ్డ కొంద్దరు చెలువులం మృదంగంబులయందును మురవంబులయందును పీఠికలయందును తమదేహాం బులు మోపుగ నిదురింప్పచుంన్నుండ్డ మరియునుం గొంద్దరుత్తమాంగనలు...

నె. 2944.

రామాయణము-పేజీ 73.

సింగరాజుదత్తాత్రేయులు.

సుషేణునింబిలచి యిదిగో సంజీవిపర్వతం యిందులో ఔషధంబులు వెతికి లక్ష్మణుని బ్రతికించుమన్నిన మంచిదని ఆపర్వతానవున్న అవుషధాలు వెతికి లక్ష్మణుని గ్యాయములుమాన్పి సంజీవితీశి లక్ష్మణుని బ్రతికించిన శ్రీరామ చంద్రుండు సంతోషంబున తమ్మునికంగళించుకొని సుఖానవుండిరి. అంతట

వానరులు ఆపర్వతానవున్న పండ్లు... తెరలుభక్షించి వుదకపానంబులుచేసి తృప్తులయిరి. అంతట శ్రీరామచంద్రుండు హనుమంతునిబిలచి యీపర్వతం యప్పటితావున వుంచిరమ్మనిన హనుమంతుండు ఆపర్వతం యెత్తుకపోయిన రావణాసురుండువిని మహానాభుని శంఖకర్ణుని జంఘుని మొదలయినరాక్షసుల బిలచి మీరు మీపరివారంబులతోబోయి ఆపర్వతంబుతోకూడా హనుమంతుని పట్టి తీసుకురండు.

నె. 185.

రామాయణము. పేజి 20

పైడిపాటి పాపయ్య.

ఇష్టావుండగా ఒఖానొకనాడు విశ్వామిత్రమహర్షివచ్చి నగరివాకట వుండుకొని ద్వారాధ్యక్షులనెజూచి గాధికుమారుడు విశ్వామిత్రుడువచ్చినాడని మీరాజుకు యెరగశాయండా అని చెప్పంగా ఆవాక్యాన్నివిని ద్వారాధ్యక్షులు దిగులుపడుకొని అతిసంభ్రముతోకూడా అంతఃపురములో ప్రవేశించి మహారాజు సమక్షమందు విశ్వామిత్రమహాముని వచ్చినారని యెరగశాయగా రాజు విని అతిత్వరగా ఆతిథ్యసంభారములు యెత్తుకొనిపోయి అర్ఘ్యపాద్యాచమనాలు ఇచ్చి ఉపచారంచేసి సదస్సుకు బిలుచుకొవచ్చి ఉన్నతస్థానమిచ్చి కూర్చుండుమను......

నె. 341.

రామాయణము. బాలకాండము పేజీ 181

శ్యామరాయకవి.

పోల్ఖత్రుసంహారక రాజకుమారక ధర్మాత్ముండగుచు ధర్మంబుకుండెలిశి సకలవిద్యలనభ్యసించి భూప్రజల హితంబునందు నిరతుండగుచు కుశనాముడసి మహీపతియు భూమికిరాజగుచు బహుకాలంబు పాలనంబుగావింప నాకుశుడనెడి రాజువకు బలవంతుండగుచు ధార్మికుండై కుశనాభుండనెడి కుమారుండుదయించె నాకుశనాభ మహీవల్లభునికి గాధిరాజాని ప్రసిధి

ప్రసిద్ధుండగు కొడుకు కలిగె. నాగాధిభూపాలునికి మహాపరాక్రమశాలి యను విశ్వామిత్రుండనెడి మహానుభావుడావిర్భవించె. మహాపరాక్రమంబునుం బూన్చి బహువర్గసహస్రములు భూమినిపరిపాలనంబునుం గావించుచు రాజనీతి ఖ్యాతినింగాంచి

నెం. 225

రామాయణము యుద్ధకాండము. పేజీలు 3-4

వెంకటసుబ్బయ్య

విని రాఘవశార్దూలుండు హనుమంతునిజూచి యిట్లనియె. పవననందనావినుము యీసముద్రంబునన్ వేడుకొనియెద కాదేని మద్బాణంబుల వేడిమిజూపి యింకించెద యొండేని బంధించెద. యది యట్లుండనిమ్ము సముద్రలంఘనం బంతపెద్దగాదు: నీవు పదితలలవాని పట్టణంబునకుబోయి జూచి వచ్చితివి గావున వానిపెరంగు నీవలనన్ వినవలతు నప్పట్టణంబునకు కోటలును గవనులును కావలియుండు రాక్షసులును గృహాపంక్తులను బలంబులసంఖ్యయు నెంతమాత్రంబుగలవు నిశ్చయంబుగా జెప్పుమనిన యాంజనేయుం డంజలిబంధనంబుగావించి రామదేవునకిట్లనియె. దశరథనందనా వినుము నేజూచిన కొలంది నెరింగించెద యొఱుడుగని మదధారలన్ గలిగి రౌద్రంబులై పర్వతాకారంబులైన భద్రదంతావళతండంబు లమేయంబులుగలవు.

పరిషత్తు నంబరు. 3155.

రామాయణము-వచనము

గ్రంథకర్త. శింగరాజు దత్తాత్రేయులు.

అరణ్యకాండము పేజీ 11

హోరాజశేఖరావినుము. శ్రీరామచంద్రుండు దండకారణ్యంబు జేరినందున విరాదుండను రాక్షసుండు సీతాదేవిని యెత్తుకపరిగెత్తె. రామచంద్రుండు వానింజూచి వధియించి సీతాదేవినిం లక్ష్మణునిం దోడ్కొని

శరభంగాశ్రమంబునకుం జేరి యతనిచాత పూజితులై అక్కడినుంచ్చి సుతీక్ష్ణా
శ్రమంబునకుంబోయి వారిచే నర్ఘ్యపాద్యాదులు గైకొని అందుండి
అగస్త్యాశ్రమంబు జేరి యతనిదర్శనంబు జేశి దేవతాసంబంధంబగు నాయుధం
బులును అక్షయతూణీరంబులును ఖడ్గంబును యివి అన్నియుం ఆమునీశ్వరుచే
నందుకొని ఆదండకారణ్యంబుననున్న ఋషులకు రాక్షసబాధలేకుండా అభయం
యిచ్చి

27-వ పేజీ.

యీహనుమంతుండు లేచి నిలువంబడి-స్వామీ ఆరాక్షసుండు రావణా
సురునితమ్ముడు నాకు ఉపకారంబుచేశి విడిపించ్చె మనకు హితవరి. దయచేశి
రక్షింపుమనిన నవ్వి వనచరులం అంపించ్చిన వారుబోయి స్వామి అభయంబ్బు
యిచ్చినారు విభీషణా సమ్మిరమ్మనిన వారితోకూడావచ్చి స్వామికి నమ
స్కారంబుచేశి హస్తంబులు మోడ్చి శ్రీరామచంద్రాయుని బహువిధంబుల
స్తోత్రంబులుచేశి నీపాదసేవకువచ్చి శరణంబు వేడితి దయచేశి చెతుసముద్రోద
కంబులు తెప్పించి లంకాపురంబునకు పట్టాభిషేకంబు చేయించ్చె

## భారతవచనము

1847

ఆదిపర్వము-తృతీయాశ్వాసము Page 101-105.

(ఇది కాంచీపురము పచ్చయప్పమొదలారిగారి విద్యాశాలయందాం
ధ్రగీర్వాణ ప్రధానోపాధ్యాయులైన వైయాకరణ రామానుజాచార్యుల
వారున్ను పరవస్తు చిన్నయగారున్ను పరిష్కరించిన ఆదిపర్వముతోకూడా
ఆచార్యులవారురచించి ప్రకటించిన వచనగ్రంథము.)

ఇంద్రుఁడు ఆయయాతిని బూజించి యిట్లు చెప్పెను. నీవు కొడుకు
యొక్క యవ్వనమునుతీసుకొని వాన్నిరాజ్యమందు ప్రతిష్టాపించునపుడు

వానికి యేమి ఉపదేశించితివి అని అడిగిన యింద్రునకు యయాతి యిట్లు
చెప్పెను. జ్ఞానముగలవారిచరిత్రలను నేర్చుకొనుచున్ను సత్పురుషులసభనువిడు
వక ధర్మమును తెలుసుకొనుచున్ను తెలిసినధర్మమును మరచిపోక మంచిబుద్ధి
చేత అనుష్ఠింపవలయును. యోగ్యులయినవారలకు ధనమును యివ్వవలయును.
ఒకరిని యాచింపకుండవలయును. యెదురైవచ్చిన యాచకులయాశను వృథ
పుచ్చక యివ్వవలయును. తత్కాలమందున్ను ఉత్తరకాలమందున్ను మనస్సు
నకు రమ్యముగానున్ను న్యాయమును విడువనిదిగానున్ను సత్యముగానున్ను
వ్యర్థముకానిదిగానున్ను మనోహరముగానున్ను ధర్మముతో కూడుకొనినదిగా
నున్న మాటను సభలందు బాగుగా జెప్పవలయును. నోరనియెడు ధనస్సునుంచి
విడువబడిన దుర్వాక్యములనియెడు తీక్ష్ణబాణములచేత పెఱవారలమర్మము
లనియెడు లక్ష్యములనువిడువక భేదించునట్టి దుర్జనులనియెడు యుద్ధముచేయుం
వారల సమీపమందుండకుము. దయయున్ను మంచితనమున్ను బహిరింద్రియ
ములని గ్రహించుటయున్ను సత్యమున్ను అంతరింద్రియ నిగ్రహమున్ను
పారిశుద్ధ్యమున్ను అను వీనిని అంతటను నిల్పవలయును. కామక్రోధలోభ
మోహమదమాత్సర్యంబు లనియెడు శత్రుషడ్వర్గంబులను జయింపవలెను.
తనలోపలపుట్టిన యీయాఱుశత్రువులను జయించినవాడే వెలుపలనున్న
శత్రువులనుజయించును. అని పూరువునకు నేర్పితిని ఆమహాపురుషుడు ఒకరికి
నేర్పునట్టివాడేగాని ఒకరు నేర్పవలసినవాడు కాడు. అనగావిని ఆయయాతికి
ఇంద్రుడు యిట్లుచెప్పెను. ఓయయాతిమహారాజా నూరువేలయేండ్లు తేజో
మహాత్మ్యముచే పుణ్యలోకానుభవముల ననుభవించితే ఇది సామాన్యమా-దీనికి
గాను యేమితపస్సుచేసితివోయి అనగా విని ఇంద్రునకు ఆయయాతి యిట్లు
చెప్పెను, దేవతలు-దైత్యులు-యక్షులు-రాక్షసులు-మనుష్యులు-వియచ్చరులు-
సిద్ధులు-మహర్షులు అనియెడు వీరలతపస్సులు నాతపస్సునకు సరికావు. అని
తన తపోమదముచేత పెద్దలైనదేవతలు మొదలైనవారలతపస్సును అవమానిం

చిన యాయయాతిగర్వమును సహింపక యింద్రుండు కోపగించుకొని నీకు దేవలోకసుఖంబు లనుభవించునట్టిపుణ్యంబులు సమాప్తిబొందెను. నీగర్వము నిన్నింతజేసెను. ఇంక క్రిందిలోకమునకు పొమ్మనగా యయాతి నేను మనుష్యలోకమునకు పోవజాలను. అంతరిక్షమందు సత్పురుషులుండునట్టి లోకమందు ఆసత్పురుషులతో కూడియుండినట్లు అనుగ్రహింపుమని వేడుకొని ఇంద్రుని సమ్మతినిబొంది ఆకాశమున్ను సకలములైన దిక్కులున్ను ప్రకాశించునట్లు వచ్చునటి యాయయాతియొక్క నిర్మలమయిన కాంతినిచూచి సత్పురుషులు గొప్పదైన యీకాంతి యిదియేమి అనుకొనుచున్ను మిక్కిలిఆశ్చర్యముపొందిరి. పిమ్మట ఆసత్పురుషులలోకములో వాసముచేయుచు తనకూతురికొడుకులైన అష్టకుడున్ను అసిధరుడున్ను ఔశీనరుడున్ను విస్తారమయిన తపస్సుచేత బహుళమయిన పుణ్యముగలవాడైన యయాతి తమదగ్గిరరాగాచూచి స్వాభావికమయిన స్నేహముపుట్టి ఆయయాతికి అభ్యాగతపూజలుచేసి మీరెక్కడినుండి యేమికారణముచేత నిక్కడికివచ్చితిరి అని యడుగగా వారికి యయాతి ఇట్లు చెప్పెను. దోషంబులులేని చరిత్రలచేత గొప్పవాడైన హుషచక్రవర్తికి పుత్రుడున్ను యిప్పుడు భూలోకమునకు రాజయినట్టిపూరుడను వానికి తండ్రియున్ను అయి యయాతి యను పేరుగలవాడను నేను. అపారమైన తపోమహాత్మ్యముచేత బ్రహ్మలోకము మొదలుగాగల దేవలోకములన్నింటియందున్ను పుణ్యఫలములను క్రమక్రమముగా అనుభవించి ఇంద్రుని సమీపమునకు నేనుపోగా ఆయింద్రుడు నాతపస్సునకు ఆశ్చర్యపడి నీతపస్సుయొక్క గౌరవమును చెప్పుమనగా—దేవతలు, సిద్ధులు, మహర్షులు మొదలయినవారి తపస్సులు నాతపస్సుతో సరిగావని చెప్పితిని. ఇంద్రు డామాటను విని కోపించుకొని మదముచేత ఉత్తములైనవారిని అవమానముచేయవచ్చునా అని నన్ను అధోలోకమందు పడవేసెను. అది న్యాయమే గర్వము కొంచమైనా బహుకాలమునుంచి సంపాదించిన తపస్సును చెఱుపకుండునా. ఈ

ప్రకారముగా కోపగించుకొన్న దేవేంద్రునిమాటచేత వెడలినవాడనై వాని యాజ్ఞచేత నీసత్పురుషుల లోకమునకు వచ్చితిని. అని చెప్పగా ఆయయాతిని తమను తల్లినిగన్న తాతయగుటయున్ను వాని గొప్పతనమునున్ను సర్వజ్ఞ సంపూర్ణత్వమునున్ను తెలిసికొని అష్టకాదులు సకలధర్మశాస్త్రములున్ను దుర్మార్గ సన్మార్గ స్వరూపములనున్ను జీవులగర్భములోనుంచి పుట్టునట్టి రీతుల నున్ను వర్ణాశ్రమధర్మములనున్ను అడుగగా వారికి ఆయయాతి యిట్లు చెప్పెను. సకలప్రాణులయందు దయకలిగియుండుటకంటెనున్ను సత్యముగా పలుకుటకంటెనున్ను శ్రేష్ఠమైనధర్మము ఒక్కటైనా లోకమందు లేదు. ప్రాణు లను కష్టపెట్టుటకై వెరవక బాధనుచేయుట మిక్కిలి యధర్మమని చెప్ప బడును. వేదమందు చెప్పబడ్డవిధుల నాచరించుట స్వర్గము మొదలయిన యూర్ధ్వలోకమునకు పోవుటకుమార్గము. అట్టి వేదశాస్త్రములచేత వాని యందు కూడదని నిషేధింపబడిన కార్యములను ఆచరించుట అధోలోకము లందు పడుటకు మార్గమని మునులు పలికిరి. మరి గర్భయోనిసంభవులు ఋతు కాలము రాగానే జనియించిన రక్తముతో కూడినదై వాయువుచేత ప్రేరేపింప బడిన రేతస్సు పాంచభౌతికస్వరూపముగలదై క్రమముగా అవయవము లేర్పడి జీవముగలవారై త్వక్ శ్రోత్రములచేత శబ్దమునున్ను నేత్రములచేత రూపమునున్ను ముక్కుచేత వాసనయున్ను నాలుకచేత రసమునున్ను చర్మము చేత స్పర్శమునున్ను మనస్సుచేత సమస్తమునున్ను తెలియుచు జన్మాంతర మందు తగిలిన పుణ్యపాపములలో పాప మధికమైయున్నపక్షమందు పుణ్యము తలయెత్తక జ్ఞానములేని పశుపక్షులు మొదలైన తిర్యగ్యోనులందు బుట్టుదురు. పుణ్య మధికమయినపక్షమందు పాపము తలయెత్తక జ్ఞానముగల మనుష్య యోనులందు బుట్టి యుక్తము లయిన కార్యంబుల నాచరించునట్టివారై వేదాం తములచేత బ్రహ్మస్వరూపము తెలిసినవారై దేవత్వముపొంది నిర్మలజ్ఞానము గలవారై ముక్తిని బొందుదురు. యుక్తంబులయిన కార్యంబుల నాచరించు వారు ఎట్టివారంటే గురుశుశ్రూష చేయుచు కొండెతెగక వేదములను చదువుట

యందున్ను అన్ని కార్యములందున్ను యెచ్చరికగలవారై అంతర్బహిరింద్రి
యంబులను నిగ్రహించి పరిశుద్ధులై బ్రహ్మచర్యమునొందిన బ్రహ్మచారులున్ను
పాపమునకున్ను పరులబాధకున్ను భయపడి ధర్మకార్యంబులందు ప్రవర్తించి
అతిథులను పూజించుచు యజ్ఞములను చేయుచు పరులధనము అపహరింపక
నిత్యానుష్ఠానంబుల నాచరించుచున్న గృహస్థులున్ను మితమయిన ఆహారము
గలవారై సమస్తసంబంధములను విడిచి కన్నులు మొదలయిన యింద్రియము
లను విచ్చలవిడిగా విడువనివారైన గ్రామమందు కలిగిన వస్తువులను అనుభవింపక
వనమందు వాసము చేయువారైన వానప్రస్థులున్ను గ్రామములనువిడిచి శరీరమును
ధరించుటకుగాను కొంచముభోజనము చేయుచు పట్టణప్రవేశములనుపరిహరిం
చుచు కామక్రోధాదులయిన దుర్గుణములనుబొందక పరిశుద్ధాచారములయందు
ఆసక్తిగలవారై పుణ్యపాపములను పోగొట్టుకొని సర్వసంగపరిత్యాగము చేసి
ఒక్కరుడుగానే యనేకస్థలములందు సంచరించుచున్న సన్యాసులున్ను అనియెడు
వీరలు తమతమపుణ్యాచారములచేత తమతమవంశములో క్రిందపదితరము వారిని
మీదిపదితరము వారిన్ని వుద్ధరించి తామున్ను ముక్తిని బొందుదురు. ప్రమాణ
పూర్వకముగా చేసిన యజ్ఞహోత్రమున్ను మౌనవ్రతమున్ను వేదాధ్యయన
మున్ను యజ్ఞమున్ను అనియెడు నీనాలుగున్ను ఈభూలోకమందు తప్పక
ఫలములనిచ్చునట్టివి. ఈప్రకారముగా యయాతి అష్టకాదులనడిగినవాని
నన్నింటిని సంక్షేపరూపముగా జెప్పగా వారలిట్లనిరి. ఓయయాతి మహారాజా
నీవు సకలధర్మార్థకాముల నెఱింగినవాడవు. నీవు సమస్తమైన లోకులవ్యాపార
ముల నెఱిగినవాడవు. గనుక మాకు పుణ్యలోకము లేమయినాగలవా చెప్పు
మన్నా, [illegible] మీకుపుణ్యలోకములుగలవని చెప్పిన యయాతిమాటలు
విని వారునల్గురున్ను సంతోషించి మేము నీకూతురిబిడ్డలైన మనుమలమని తమ్ము
తెలియగించి పుణ్యలోకములనిచ్చిరి. ఆయయాతి ఆసత్పురుషుల సాంగత్యము
వలన తానున్ను తనమనుమలున్ను ఊర్ధ్వలోకమునకుపోయిరి అని సామ్యము
లేని పుణ్యముకలిగి అసూయలేనివాడై పరీక్షిన్మహారాజునకు జేష్ఠకొమారుడైన

జనమేజయమహారాజునకు వంశంపాయునుడు మిక్కిలి పుణ్యముగలుగునట్టు మిక్కిలి భక్తితోడ జెప్పెను.

## స 138.

### పాండవుల యశ్వమేధవృత్తాంతము. పేజి 29

విమకేతనుడు విల్లుగుణధ్వనిజేసి దివ్యాస్త్రములుసంధించి బాణవర్షములు గురియించగా ఉభయపార్శ్వములున్ను పీనుగుపెంటలుగాపడగా నాలుగు పార్శ్వములున్ను తిరిగిజూచి బాణములచాత నొప్పించగా నలభైవేల రధికులున్ను యెనభైవేల గజములున్ను లక్షఅశ్వములున్ను రెండులక్షల కాల్బలమున్ను ఒక్కొక్కసారి తెగవెయ్యగా తిరుగా బాణములు సంధించగా గుంపులు గుంపులుగా గొంతులు నడుములున్ను తెగిపడగా నాలుగుపార్శ్వములున్ను పర్వతంవలె పీనుగలున్నుపడగ నెత్తురుప్రవాహ మయ్యేటప్పుడు అందున గజములు రధములు హయములు ఛత్రచామరములున్ను గొడుగులు ఆయుధములు శూలములు పాశములు భల్యములు.

138 అశ్వమేధవృత్తాంతము P. 146. Academy. వరాహదేశం కథ:—అటుపెంమ్మట అశ్వం సంరక్షణకాయవచ్చిన అర్జునుడు అనృశధ్వజ రాజును చుట్టంచేసుకొని సకలమైన రథగజతురగపదాతులతోకూడా రథారూఢుడై అశ్వం వెనకపార్శ్వముగానడిచి దేశందాటి అవతలపొయ్యేటప్పుడు అనేకమైనసాలుజా వచ్చినారు తెరచుకొనిచూచి అష్టాదశవాద్యఘోషముల శబ్దములువిని భయపడి కిరీటిదండునుజూచి భ్రమశిపరుగెత్తిరి. దండు రెండామడదూరంఅవతల నడిచిపొయ్యేటప్పుడు వరాహదేశమని వకదేశం - ఆదేశం యొక్కవర్తమానం యేలాగంటేను. అందులోవుండే మొగవాండ్లు ఆడవాండ్లు నిమాణాణముగా వృక్షాలలో గబ్బిలములవలె వేలాడుకొని వుండేదిన్ని పగలు (ముట్టింన్ని) వృక్షములమీద తొత్తుకొని వుండేదిన్ని అస్తమానమునకు సంచారములు చేసేదిన్ని యీ వేడుకలంతా దండులోవుండే జనులంద

రుంన్ను జూచి నవ్వుదురు. యీ ప్రకారముగావుండే దేశములున్ను సంచా
రముయొక్క (అరిశ్యము) లున్ను అజ్ఞానుడుచూచి చిరునవ్వుచాతను
అమృతధ్వజునిజూచి యిదియేమిదేశమని అడుగగా వరాహాదేశమని పేరు
కల్గినదని పల్కరించగా, అజ్ఞానుడువిని అవతలనడవగా వకఘుడియదూరమున
కోటగోపురములు కనిపించెను. అదిచూచి అజ్ఞానుడు అమృతధ్వజరాజును
అడుగగా వినవయ్యా కిరీటిమహారాజా తెలుస్తుంనదే. ఆపట్నం సింహ్మాదేశం
ఆదేశములో నాల్గువిధములుగల్గిన సింహ్మాములువుండెను. మనుష్యులుంవుందురు.
అని పల్కరించగా అశ్వం పట్నంసమీపమున పొయ్యేటప్పుడు రణభేరి శబ్దం
విని అందులోవుండేజనులు బయలుదేరి వార్లకు వొకరికి వొకకొంమ్ము వొకరికి
రెండుకొమ్ములు వొకరికి మూడుకొమ్ములు వొకరికి నాలుగుకొంమ్ములు యీ
ప్రకారముగావుండేటటువంట్టి మనుష్యులు. వాళ్లభుజములలో సింహ్మాము
నందుండిన కోరమీసముతో వుండెవాలుగా వేయి రెండువేలు మూడువేలు యీ
ప్రకారముగావచ్చి దూరముగానిల్చి చేతులుకట్టికొని కొంమ్ములుచాతపొడిచే
భావముగా కొంమ్ములుఆడించుకొని నిల్చివుండగా అజ్ఞానునివంపుచూచి
భయపడి వడకగా వాలకాందరుంన్ను భ్రమచాతను చెడివిరిగి పారిపోయిరి.
యిది అంతా అజ్ఞానుడుచూచి వుత్తరకురుక్షేత్రంభూమిలో బ్రంహ్మాదేవుడు
ఇట్లావుండే పుట్టుకలను పుట్టించిరో అని అతిశయముగాజూచి ఆపట్నఁదాటి
నాలుగుదేశములుంన్ను దాటిపొయ్యేటందుకు మూడుదినాలుచెల్లెను.

నెం. 244.

## భా గ వ త ము.

రాక్షసేశ్వరుడు కొడుకునుజూచి పలుకరిస్తున్నాడు కొడుకా దుష్ట
మైనవిష్ణుకథలు నీకెవరు పలుకరించ్చిరి వారిని నాముందర దెలుపుమనగా

ప్రహ్లాదుడు తండ్రి నిజూచి అయ్యా సంసారాంధకారమగ్నులై విషయాది భోగముల ఆసక్తులై చచ్చుచు పుట్టుచుండే మూఢజనులకు హరిబోధనములు స్వేచ్ఛగాగలుగునా పరులుజెప్పినా తెలుసునా అడవులకుబోయినా తెలుసునా తెలియకూడదు గ్రుడ్డివాణ్ణి చెట్టబట్టుకొని గ్రుడ్డివాడు దోవనడిస్తే ముందట పొంచగట్టినపదార్థము యేరీతున కనజాలకపోవునో ఆరీతున కర్మవశాలన్ని అతిక్రమించ్చినవాడు కర్మమమునమణిని హరిని పొందగనజాలడు మంచివానిదోవనడిచినవాడు ముందటవుండేపదార్థాలను పొందగలినచందముగున విష్ణుభక్తుల సహవాసము చేసినవాడు నిత్యమైనహరిపదమును బొందును. హరిభక్తిరహితుని సంసారము అడవినిగాచే వెన్నెలచందాన చెవుడువానివద్దవూదిన శంఖముచందాన మూగవానికిచెప్పిన చదువు చందాన నపుంసకునికి స్త్రీకాంత చందాన కృతఘ్నుని పట్టముచందాన బూడిదలో హోమము చేసినచందాన లోభిసంపద్ద ద్రవ్యముచందాన వ్యర్థమనగాను హిరణ్యకశ్యపుడు చాలా ఆగ్రహించి తొడలమీదవున్నకొడుకున బోటికలక్రిందదొబ్బి రాక్షసులను జూచి యీమహాపాపాత్ముడు పుత్రరూపమై తనపినతండ్రిని చంపెనని ప్రేమము లేక భట్టుచందాన హరినికొనియాడుచున్నాడు నాకు రోగమునురూపముగను వ్యాధిజన్మించ్చెను వీణ్ణిమీ సేవకుల సంహారించ్చండా యనగాను వాడికోరలు గలిగిన రాక్షసులు భయంకరాకారులై కరాళవదనులై శూలప్రాసతోమరహస్తులై బాలుడు రాచబిడ్డడు సాధుడు లోకమాన్యుడైన ప్రహ్లాదుని శూలములచాత గదలచాత రాక్షసులు సంహారించగా హిరణ్యకశ్యపుడు వద్దనక నిదాక్షిణ్యముగా చూస్తున్నుండెను. మహాత్ముడైన ప్రహ్లాదుడున్ను నిర్భయుండై చిత్తము వాసుదేవునియందు చేర్చిబాహ్యముమరచి తన్ను రాక్షసులు బాధించ్చేటప్పుడు మాటిమాటికిన్ని హోపన్నగశయనా హోదనుజభంజనా హోయాపన్నశరణ్యా హోజగదీశ్వరా హోనిఖిలకారణ యనినుతించ్చునుగాని కన్నుల నీరు విడడు భయకంపమునుబొందడు దిక్కులకు తెలిచిపారడు చేతులు జోడించకొనడు బంధుసమూహములదూరడు తండ్రి ఘోరకృత్యము చేస్తున్నా

డని దూరడు కోపముకాయడు యనడు. చక్రధరుపక్షము మానితిననడు దాహముబొందడు యీరీతున దానవులువిహరించ్చగా బాలకదేహము లేశ మాత్రమైనానలియదు లోపలనెత్తురుకంద్దదు కుంద్దదు శల్యములు పొడిపొడి గాదు అదిజూచి రాక్షసేంద్రుడు క్రోధుడై వొఖవేళ యేనుగలకాళ్ల తొక్కిం చ్చును వొఖవ్యాళ భయంకరమైన కృష్ణసర్పములచాత కరిపించ్చును వొఖ వ్యాళ వెను గాలిలోవుంచ్చును. వొకవ్యాళ యెండ్డలోనిలుపును. వొఖవ్యాళ వానలో తడియబెట్టును వొఖవ్యాళ రాళ్లదువ్వించ్చును వొకవ్యాళ కశాఘాత ముల ప్రహరించును వొకవాళ కలుగానిగలాడించ్చును వొకవ్యాళమాయలు గావించ్చి బెదరించ్చును వొకవ్యాళ నపరంధ్రములున్ను బిగియబెట్టును వొక వ్యాళ నీరున్ను అన్నమున్ను యియక నిగ్రహించును వొకవ్యాళ అభిచార హోమములు చేయించ్చును. వొకవ్యాళ గదలవేయించును వొఖవ్యాళ శూల ముల పొడిపించును వొఖవ్యాళ

నం. 150_516 to 60 a

సప్తమస్కంధమందు ఏకాదశాధ్యాయములోని భాగము.

అప్పుడు నందాదులైన గోపకులు చెట్లుపడినచప్పుడు పిడుగుచప్పుడు అనిశంకించి వచ్చిచూచి యీచెట్టుపడేటప్పుడు రోలుకట్టివుడిన బాలుండేలా గున బ్రతికెనో, ఏడెంకడిట్టఅనిన్ని, పిడుగుపడలేదు, పెనుగాలిన్ని విసరలేదు. యీబాలుండు పడదోయనున్నలేడు, చెట్లేలపడెనోఅనిన్ని, పెక్కండ్రు పెక్కువగలశంకించంగా అక్కడనున్న చిన్నవాండ్లు వారలంజూచి యీ కృష్ణుండు రెండుచెట్లనడుమదూరి రోలునడ్డముగా నడ్డగా మద్దులు పెకలిపడెను. చెట్లలో ఇద్దరుపురుషులు గన్పట్టిరన్నందులకు ఆచిన్నవాండ్లమాటలు నిజముగా దని కొందరు సందేహపడిరి. నందుడున్ను నవ్వుతో కుమారునికట్లువిడువగా ఆకృష్ణుండు తనపక్షమాన మెవరున్నెరుగకుండా ఉండవలెనని పాటలు పాడును. గోపస్త్రీలు చప్పట్లుచరచగా నాట్లాడును. కీలుప్రతిమలవలెనే కర

వశుండై చేతులుద్రిప్పును. బహువిధాలక్రీడించును. పిడితెండుపాలుతాగితే
చుంచెదుగునని పల్కంగా పాలుద్రాగి యేమీ చుంచెదుగలేదంటే చుంచు
చూపును. చివుకచేతబట్టుకొని నీళ్లకడవలో నీడజూచి అదిగో కలగొలపట్టు
కొని వొకచిన్నవాడు నన్నుగొట్టనుంకించెనని తల్లితో జెప్పును. యేడ్చేవుసుమీ-
జోగివాండ్లువచ్చి జోలెలో వేసికొని పొయ్యేరన్నమాటలువిని వీధిలో జోగులు
వచ్చిరన్నప్పుడెభయపడి తల్లిమరుగునదాంగును. యీలాగున కపటబాలలీలల
కృష్ణుండుసంచరించెను. అప్పుడు బృహద్వనమందున్న నందాదిగోపకులు ఆచట
ననేక ఉత్పాతాలుపుట్టుటను, అన్నిటినిన్ని బాలుండుతీరించుటను, తలంచి
యిందుకు బుద్ధియేంది యని యడుగగాను సనందనుండనే వృద్ధగోపకుండు
వారలంచేకొని మన మిచటనుండరాదు. మనకృష్ణునికి పూతనవచ్చి చన్ని
చ్చెను. సుడిగాలివచ్చి రాళ్లమీదవేసెను. యీచెట్లున్ను పైపడుతావుండెను.
స్వామికృపవల్లతప్పెగదా. చాలాపచ్చికాన్ను కొండలున్ను, యేఱున్ను
వృక్షాలున్ను, తీంగెలుం కల్గి పసులకున్ను మనకున్ను ఉండతగినస్థలము బృందా
వనము. అక్కడికి పోదామన్నందుకు గొల్లలందరున్ను యిదికార్యమౌనని
ఆవులమందలు గ్రక్కునకదలించి వాంటివెంటనే బాలురున్ను వృద్ధులున్ను
స్త్రీలున్నెక్కిన రథాలునడపించి తాము జోళ్లుతొడుక్కొని విండ్లమ్ములుధరి
యించి కంచుకొమ్ములు మ్రోయంగా పెద్దలున్ను పురోహితులున్ను ముందర
నడువంగా మొనలేర్పరుచక వచ్చేటప్పుడు పసుపునీటజలకమాడి స్తనాదు
లందు కుంకుమయులందుకొని సాలువలుగట్టి సంపెంగిపువ్వులసరాలుజుట్టి గట్టి
మాడలపేర్లు కంఠమందు తులకించంగా గోపస్త్రీలందరున్ను రథాలెక్కి కృష్ణ
లీలలు గానంచేస్తూజనిరి. రోహిణీ యశోదలిద్దరున్ను వొకతేరెక్కి రామ
కృష్ణులముందరనుంచుకొని వారల వినోదాదులకు సంతోషపడుతానడచిరి.
యీలాగున గోపకులు బృందావనానకువచ్చి యందు అర్ధచంద్రాకారంగా
బండ్లునిల్పి మందలున్ను విడియించిరి. బలరామకృష్ణులున్ను కాళిందీతీరమందు
ఋషులకెల్లా ఆదరవున్నై పావనమున్నైన బృందావనమందు ప్రవేశించిన

కొన్నాళ్లవెనక తమజోడు గొల్లపిన్నవాండ్లఁ గూడుకొని దూడలఁగాస్తున్నా పిల్లంగోవులూదుచున్న బహువిధాలగంతులువేతురు. కంబళ్లగప్పుకొని వృషభాలం బోట్లాడుదురు. పందేలువేసుకొని ఫలమంజరుల వేట్లాడుదురు. అడవిలోనున్న మృగాలవంచించి పట్టంబోదురు. కొలంకులలో చల్లులాడుదురు. పరుగెత్తుదురు. పొదలందూరుదురు. చరులమీదనుండిజారుదురు. యీలాగున సంచరిస్తు నొకనాడు గొల్లపిన్నవాండ్లున్ను దానున్ను దూడలమేపంగా నొక్కరక్కసుండు క్రేవురూపుదాల్చి తోడిదూడలకుత్తుకలు నాకుచున్న యిది మంచిదూడ అని కన్పట్టుచున్న బలరామకృష్ణులకు కీడుచేయదలంచి వెంటనే తిరుగంగా అది కృష్ణుండెరింగి బలరామునితో జెప్పి యీదూడతెస్సగా వున్నది, చూస్తివాఅని దానికడకాళ్లున్ను తోంకవొడిసిపట్టి చెంతనున్న వెలంగమానుతోగొట్టి మట్టిపెట్టంగా గోపకులందరున్ను కోయనియార్చిరి. యీలాగున వత్సాసురుండు వెలంగచెట్టుతోకూడా నేలంబడెను. అదిచూచి గోపకులు గొంగళ్లెగరవేస్తున్ను కృష్ణున్నిపొగడుచున్న సంతోషపడగా వేల్పులు విరులవాన గురియించిరి. దూడలకాపాడినట్లనే జనులనెల్లా వాత్సల్యంచేత కృష్ణుడు రక్షించె.

నెం. 150.

భాగవతము దశమస్కంధము. పేజీ 181

అమరునాడుదయాననె కృష్ణుండు తనవెంట పైనమైన గోపస్త్రీల ఉద్యోగమెరింగి గ్రక్కునతిరిగి వస్తావస్తావున్నారని దూతికలచేతం జెప్పించి నందాదులైనగోపకులు సకలవస్తువులున్ను బండ్లమీదవుంచుకొని వెంబడించంగా నక్రూరుండుదెచ్చిన తేరెక్కి కదలిపొయ్యేప్పుడు గోపస్త్రీలు అదుగో కృష్ణుండు మధురకుపోతావున్నాడు తేరుజూస్తివా టెక్కెముచూస్తివా తేరు పొయ్యే వూంకువనెగశినధూలిచూస్తివా అని గుంపులుగుంపులై దృష్టిగోచరమైనంతదడవును జూస్తానెవుండిరి. ఆలాగున గదలినస్వామి నిర్మలమైన కరళ్ల బుట్టినగాలిచాతనె జనుల పాపాలుపోజేసె.

నెం. 74.

భాగవతము. పేజీ 240.

ఆసమయంబున కృష్ణార్జునులు సంతోషించి త్తంబున భీముణ్ణి ఆలింగనము చేసుకొని కృష్ణుడు దయాళువుగనుక జరాసంధునికుమారుడు సహదేవుణ్ణి వాని పురమందు పట్టముగట్టించి ముందర జరాసంధునిచాత చరశాలప్రవేశించ్చగల వారైన రాజులును చరవిడిపించి తనపాదములె చింత్తించుకొంచున్న జరా సంధునిచాత ననేకబాధలు పడుకొంచున్నా కృషీభూతశరీరులై రక్తమాంస ములు ల్యాక చర్మాస్తి అవశిష్టులై కేశపాశంబులుమాసి జడజడగల శిరస్సు లున్ను మలినవస్త్రధారులైన రాజవర్యులు పీతాంబరధరుడై శంఖచక్రగదా శార్జ్ఙ్యధరుడైన గోవింద్దునిజూచి ఆయనపాదపద్మములకు తమశిరస్సునొక వందనములు చేసి పలకరిస్తున్నారు.

---

# ప్రాచీనలిఖితగ్రంథములు.



## కావలి వేంకటబోరయ్యగారు కంచిలో పురాణ ఇతిహాస దరిశన ప్రమాణములవల్ల విచారించ్చి వ్రాసినషువంట్టి

## కాంచీపురమహాత్యం.

1802 సం॥ మెయి ది 20 రోజు లగాయతు 27 రో॥ పర్యంత్తరం పూర్వం యీవిశ్వఆద్యంత్తరహితుడైన పరమేశ్వరుడు సృష్టిచేశినప్పుడు కటాహామధ్యమధ్యస్తమయిన యీజంబూద్వీపము యందు స్థావరజంగ్గమ నిర్మాణం అయ్ని వెనుక యిక్కడవున్న ప్రజలకు భూప్రమాణం తెలియవలశి నంద్దుకు యీపృథ్వి యీవత్తూ వర్షఖండ్డసంఖ్యాభూతమై క్లుప్తిచేయబడిన వర్షములలో నరసంచ్చారామయ్ని యీభరతవర్షాములయంద్దు దేవతాసంచార వశాత్తు కొంన్ని కొంన్ని స్తళాలు దివ్యవనములు అనిపించ్చుకోబడినది గనుక యీకాంచ్చిపట్టణం వున్న స్తళం అరణ్యాక్రాంత్తమయి యీశ్వరతేజోయుక్త మయి కాంచీవనం కాంచ్చీతి కశ్చన వృక్షవిశేషః అని పేరుబడి సృష్ట్యాది దిగా బహుకాలగ వున్నంత్లో వొకానొక కాలమంద్దు యీశ్వరుడు రజితగిరి యంద్దు శోగనిచారణలో వున్నంత్లో ఆయన కుళాంగ్గనఅయ్ని అంమ్మవారు సరసస్లాపార్థులై యీశ్వరుని నేత్రద్వంద్దము హాస్యార్థకాంగ్గా నిజహస్త ములుచేశ ఆచ్ఛాదనంచేశేవర్కు అయ్ని నేత్రయుంగళము సూర్యచంద్ర స్వరూపముగనుక అది ముయ్యబడినట్టుగానె జగత్తు యీవత్తూ అంధకార

బంధురమయి వుత్పత్తిస్తితులు లయమై స్వామికండ్లు తిర్గ తెరిచేటంత్త అవకాశం నరమాణాన్ని అనేకయుగాదులు అయినంద్దున యిక్కడికి ప్రాపంచ్చకాభ్యుదయ విఘాతంవల్లను అనేక దోషం వచ్చి ఆ అపయశశ్శువల్ల పార్వతి శ్యామలఅయ్యేవర్కు హేతువతెలిశి తిర్గీ కృతార్థతయే వరసను కావలెను అని ప్రార్థించ్చినంత్తలో స్వామి ప్రసన్నుడై కాంచ్చీవనమధ్య మంద్దు జడీభూతర్హై దేవతులు చూతవృక్షాకృతిగా వుంన్నందున నేను జోతి స్వరూపమై ఆవృక్షంకింద్ద వుంట్టుంన్నాను గనుక అక్కడికి నీవు ప్రవేశించ్చి కారుణ్యావత్తిని రవుద్ర తపస్సు చేసినంత్తల్లో యిష్టార్థసిద్ధి గల్గుతుంది అని అనుజ్ఞలిచ్చెనూ.

అంతట అంమ్మవారు యీకాంచీ వనాన్కు ప్రవేశించ్చి యిక్కడ యీశ్వర తేజోవిశేషం కల్గి వుంన్న చూతవృక్షసామీప్యమందు అంతర్గామి అయ్ని కంపానది తీరమంద్దు పంచ్చాగ్ని మధ్యస్థురాలయి వుగ్ర తపస్సు ఆశ్విజ శు॥ పుబ్బానక్షత్రమంద్దు తపస్సుకు ఆరంభంచేశి ఫాల్గుణ వుత్తరఫల్గుని పరియంత్తరం తపస్సుచేసినంతంలో యీమె తపో మహాత్యంవల్లను శామలత్వం పోయి గౌరీస్వరూపం వహించినవెన్క యీశ్వరుడు ప్రసన్నుడయి తంన్ను పూజచేయమంట్టె జోతిమయాగ్గావున్న లింగ్గమంద్దున అభిషేచనక్రియలు జరిగించకూడదు గనుక యీశ్వరనియామకంవల్లను అంత్తవాహినియయ్ని కంపానదిలో యిసుకతీశి లింగ్గాకృతిగా జోతిమయామందు స్థాపించ్చి పూజించి ధ్యానసమాధిని వుంన్న తరుణమంద్దు హృదయశోధసాధకాం యీశ్వరుడు గంగ్గాది సప్తనదులు యేకముఖంగ్గా బుద్బుదాకృతిగా కంపా నదియందు ఆకర్షించ్చి అమ్మవారికి కటిస్థలపర్యంత్తరం జాలాన్వితయై వుండ్డేటట్టు చేసినంతలో నూతనప్రతిష్ఠితమయ్ని సయికతలింగ్గంబుల స్పర్శ వల్లను గళితమయ్యేనంన్న భయంచాతను స్తనకుంక్కుమ కంక్కణ ముద్రి మణిగా గాఢాలింగ్గనం చేశేవర్కు స్వామి ఆనంద్దించి శివశక్త్యాయుక్తమైన లింగస్వరూపుడైని అమ్మవారికి అపరాధులయ్ని గంగ్గాదిపుణ్యనదులకు సిత్తం

చ్చుమని పరమేశ్వరుడు చెప్పినంతల్లో ఆత్మసఖియయ్ని కీర్ణిమతిని తత్ప్రయోజనార్థం నిర్ణయించ్చెనూ.

అప్పుడు అమ్మవారు భూకటాక్షములయంద్దు ప్రళయకాలశక్తిని అష్టహస్తములచేత పుట్టించేవర్కు ఆమె నిజహస్తములయంద్దు ఖడ్గాద్యాయుధములుతోటి హాడావుంన్న కపాలములయందు ఆకర్షించ్చివున్నంతలో యీ మహానదులు యీశ్వరాజ్ఞానుసరణం చేసినంద్దువల్ల తమకు యీవిపత్తు వచ్చెను అని ఘోషించడం ఆరంభంచేశినంత్తల్లో యీశ్వరయుక్తమై గౌరి ప్రేరేపకత్వమును హేతువవల్ల వుద్భవించ్చి సరస్సులై వస్తూతా పుణ్యోదకములు అయినప్పటిక్కి యీ దేవనదుల సంయోగంవల్లను లోకాలుకు విశేషఫలప్రాప్తి కావలశినది అని విచారించ్చి గంగ్గను కంపానదిలో అంత్తర్వాహినిగా సాగర ప్రవేశం గమ్మనుమని గోదావరి శివగంగలోను యమునను యేకాంబ్రేశ్వర స్వామి ఆలయములో పూర్వభాగం దిడ్డిదగ్గరవున్న కీర్ణమతిలోను సరస్వతిని కచ్ఛపేశ్వరుడిగుడిలో కచ్ఛపేశ్వరుడికి వుత్తరభాగానవుంన్న యిష్టశిద్ధిలో కృష్ణవేణి యేకాంబ్రేశ్వరస్వామి ఆలయానిక్కి ఘడియదూరం పూర్వభాగం విష్ణుకంచ్చి శివకంచ్చి మధ్య సత్యనాథేశ్వరుడి సనిధానంల్లో యింద్రతీర్థములో కావేరి వెగ్గవతీ నదీతీరమంద్దు యేకాంబ్రేస్వరస్వామి ఆలయ దక్షిణభాగం కాయారోహణేశ్వరస్వామి సాంన్నిధ్యమంద్దువున్న కాయారోహణతీర్థంలో తాంబ్రపణి వెగవతిలో ప్రవేశించ్చి సముద్రగామికమ్మ వేగవతిలో యీయేడునదులు యేడు స్తల తీర్థాలలోకూడి సాగరప్రవేశం గమ్మనుని నిరూపించ్చి వీర్కి సద్గతులు కల్పనచేశిరి.

పూర్వం కైలాసగిరియంద్దు శ్యామల యీశ్వరుడు వుద్యానవిహారులై వున్నప్పుడు వినోదప్రసంగములలోను మాలతీలతను తనది అని అమ్మవారు చేశి బాలచూతవృక్షాంన్ని స్వామిచేశి యీవుభయ భూఘుజములుక్కు రుతుకాలప్రాప్తి అయిన వనక వివాహం చెయ్యవలెనని సంకల్పించిన వెనక శ్యామలి ఆత్మకృతదోషంవల్ల వికల్పం వచ్చినందున పునః అప్పుడు చింత్తించి వుభయ

ప్రేరేపకత్వ వృక్షవివాహములు బ్రంహ్మాది దేవతా ప్రార్థనావల్ల తమకి యీ కాంచ్చివనమందు చేసుకోనిశ్చయించ్చి ఫాల్గుణ శు 15 వుత్తరఫల్గుణినక్షత్రమందు చేశిరి గనుక్కా నేటివరుక్కా యీాద్నిం స్వామికి వివాహంచేస్తున్నారూ యిది 64 చెతుర్యుగాలు అయినది అని (త్రే. డీకనూ) యితిహాసం.

అనంత్తరం విశ్వకర్మవచ్చి సయికతలింగానికి గండకశిలతెచ్చి పంచ్చసూత్రవిధానంగా పానపట్టం నిర్మించ్చి అనంత్తరం పంచావరణంగ్గా ఆలయం నిర్మాణంచేశ్ని వెన్క్కా తధారభ్యా యిది పట్నమయి యేయే యుగాలయంద్దు వుండ్డబడిన రాజులు ఆయాయుగములందు విశేషంగ్గా గోపురప్రకారాదులు కట్టించ్చుతూ జీర్ణోద్ధారములు చేస్తూవుండగా కృష్ణరాయలు కాలమందు యిక్కాడను అంన్ని జీర్నాధారంచేశి యవరెవరు కట్టించ్చిన దానిక్కా వారి శాశనాలు వ్రాస్తూవచ్చిరీ యిక్కాడను యేకాంబ్రేశ్వరస్వామి సయికత లింగ్గాకారం వహించ్చి మున్ను తేజోలింగ్గయుక్తమయ్ని కాంచ్చి వనమందు పాలాశ వృక్షంకింద్ద సరస్వతియుక్తంగా బ్రహ్మదేవుడు యీశ్వరుడ్నిగూర్చి తపస్సుచేసి మునుపు విష్ణు కశ్చపావతారం చేశినప్పుడు యీా పుణ్యవనమందు శివప్రతిష్ఠ చేశి యిష్టశిద్ధిని పొంద్దినాడు గనుక్కా "తస్మాత్ కేన బ్రహ్మణా అంచ్చతీతి కాంచ్చి" యీా పూర్వోత్తరం జర్గి 84 చెతుర్యుగాలు అయినది.

బ్రంహ్మదేముడు ఒకానుగ్రహార్ధణం తనయిష్టార్థశిద్ధికొరకు యిది కామకోటిస్థలమందు వకటిచేస్తే కోటి తుల్యం అని సత్యలోకమందు ఆ స్థానమందు వుండగా విని యిక్కాడికివచ్చి అశ్వమేధం చెయ్యవలెను అని బయలుదేర వుద్యుక్తుడయితె ఆస్థానమందు తుంబ్బురు నారదులు చేసే వీణాదిగానలోలురాలయి పత్నిరహితంగ్గా యాగంచెయ్యవ.గదా అని సరస్వతి బయలుదేరి రాక వుంట్టే అప్పుడు ఆమె గర్వభంగ్గార్ధం గ్గాయత్రి సావిత్రీలుకూడా వచ్చి యిక్కాడ యజ్ఞదీక్ష చేసినంత్తల్లో సరస్వతి యిక్కాడికివచ్చి క్షీరనదిలో ప్రవేశించ్చి వేగంగ్గా బయలుదేరి యాగగుండ్డాన్ని ముంచ్చవలెనని రాగా నారదులు యీా పూర్వోత్తరం బ్రహ్మకు చెప్పగా బ్రంహ్మదేముడు ప్రార్ధనావల్ల

యీశ్వరుడు అగ్నచేత్తే విష్ణుపోయి పల్లికొండ్డలో నదికి అడ్డంగ్గా శయనించ్చితే అక్కడినుంచ్చి ఉత్తరగామినియై అక్కడనుంచ్చి యీక్షేత్రానికి వచ్చేది కని అంత్తట ఆమడ పశ్చిమంవున్న తిరుపాల్ కడలిక్షిరసాగరములోవచ్చి పునః శయనించ్చేవరక్కు అక్కడినుంచ్చి దక్షిణగామియై ప్రాగ్గుదిశకు తిర్గి యజ్ఞ శాలసామీప్యముకు వచ్చేవరక్కు బ్రంహ్మాదీక్షలోనె వుండ్డి యీశ్వరుడు చాలా ప్రార్థించ్చేవరక్కు యీశ్వరుడు విష్ణువును సగ్నంగ్గా పండ్డుకొమ్మంట్టే యజ్ఞ శాలదగ్గిర యీవిష్ణు ఆప్రకారమె యథోక్తకారి ప్రతిమ ఇదివరక్కు ఆస్తలంలో వున్నది యథోక్తకారి అనగా చెప్పినట్టు చేశేవాడు యథోక్తకారి. అని శయ నించేవరక్కు సరస్వతి లంబ్బించ్చి అంతర్గామి అయితెను క్షీరనది ప్రవేశిం చ్చిన వెన్క నారదాది ఋషులు సరస్వతి కోపోపశమనం చేశి బ్రంహ్మాతో అప్పుడు యజ్ఞ సంపూర్త్తి అయినంతల్లో అప్పుడు తపో మహిమవల్ల యీశ్వరాలయానిక్కి పశ్చిమంగ్గా సార్థత్రికోటి తీర్థాలను ఆకర్షించ్చి సర్వతీర్థమని పేరుబెట్టి సరస్వతీ యుక్తంగ్గా అవభృతస్నానం చేశినారు గనుక్క నాటినుంచ్చి సర్వతీర్థస్నానం అశ్వమేధావభృతస్నానఫలం అని పురాణశిద్ధం యీ పూర్వోత్తరం జర్గి 2¼ చెతుర్యుగాలు అని యితిహాసం.

యిక్కడ సృష్ట్యాదిగా ప్రకాశమానమైన కాంచ్చివన వనమధ్య యందు బాలచ్యూతంవొద్ద తెజోలింగ్గమయి యీశ్వరుడు యట్లా వుంన్నాడో ఆప్రకారంగ్గానె పంచ్చతీర్థములు సృష్ట్యాదియందు జగత్తుత్తమ స్వరూపం గావలెనని యీశ్వరునిగురించ్చి తపస్సుచేశినప్పుడు నిర్మాణంచేశిన తీర్థాలు పంచ్చతీర్థమని పేరు. పంచతీర్థసమీప్యమందు పరాశక్తిబిలాంత్తరవర్త్తిగా పరాశక్తి వున్నది గనుక్క అక్కడ కామకోటి గలదు అప్పుడు అంమ్మవారు ప్రథమంలో వచ్చి తపస్సుచేశి పరాశక్తి అనుగ్రహం పొంద్ది అనంత్తరం కంపానసరస్సున వచ్చి యీశ్వరకల్యాణం పొంద్దినది. పరాశక్తి స్వరూపమె కామాక్షి కశ్చ అశ్చమశ్చ కామతె యస్యా క్షీణి సంభూతాః కామాక్షి బ్రంహ్మా విష్ణు రుద్రులు త్రినేత్రములవల్ల పుట్టించినది గనుక్క ధ్యానమందు.

బ్రంహ్మావిష్ణుమహేశ్వరాది జననీం అని ధ్యానం చేస్తారు. యీప్రకారంగా
పరాశక్తి స్వరూపం అయ్ని శక్తిబిలమధ్యమంద్దు వుండ్డి రాత్రి సంచ్చారం
చేస్తూ అనేక జనబాధ చేస్తూ రాగా శంకరుడు యిక్కడికి వచ్చి ఆలయ
ప్రాకారములు కట్టించి యంత్రధారం చేసినాడు. యిది శంకరవిజయములో
చూడూ.

## శ్రీజగన్నాథ మాహాత్మ్యమునుండి:—

"కోసలదేశ మనెడి వకదేశం. కాశ్మీరానకు వుత్తరభాగమందు
దూరాన వుంనది. ఆదేశంల్లో యింద్రజుమ్న మహారాజు అనే అతను సూర్య
వంశపురాజు. అతను బహుధర్మాత్ముడు. నూరు అశ్వమేధాలు చేసినాడు.
అనేకగుళ్లు కట్టించినాడు. బహు అంనసత్రాలు పెట్టించినాడు. అనేక అగ్ర
హారాలు దానం చేసినాడు. కానా చెరువులు దవ్వించినాడు. యీభూలోక
మునందు యెంనిధర్మాలు చేసినాడు. తనదేశం న్యాయంగా పాలిస్తూ వుండి
వుంనారు. యిదిగాక, తమదేశంల్లోను అంనంలేదని అంటే తాను భోజనం
మానుకొని వచ్చిన అతనికి ముందుగా అంనపానాదులు జాగ్రతచేసి ఆపరు
వాత తాను భోజనం చేసేవాడు. తనదేశంల్లో యెవరైన అంనంపెట్టలేదు
అంటె తాను ప్రాణత్యాగంచేస్తానని అంనాడు. ఇతడు బహుధర్మాత్ముడు అని
దేవతలు చెప్పుకుంటూ ఉంనారు. ఈరాజు దేశమందు వర్షాలు కావలసినప్పుడు
కురుస్తూ వుండేవి. పూర్వకాలపు పంటలు పండేవి...వకనాడు తన పట్నంలో
వకరి క్షత్రబ్రాంహ్మడు దంపతీసమేతుడై బజారువీధిలో వకచింనయిల్లువుండగా
అందులో దిగి యాయవారం చేస్తూ కాలం గడుపుకుంటూవున్న దినములలో
యీ భూసురునిభార్య గర్భంతో వుండి ప్రసవం అయినది. మొగశిశువు
కలిగినాడు ఆశిశువు బహు సౌందర్యశాలి. యీలాగువుండగా యీశిశువు
తండ్రి చింనవాడికి యజ్ఞంన అని నామకరణం చేసినాడు. ఆచింనవాడికి
అయిదునెలలు కాగానే తల్లి దైవీకం అయిపోయినది. యీచింనవాణ్ణి తండ్రి
పెస్తూవున్న మరినాల్గునెలలకు యీతండ్రి చనిపోయినాడు..."

శోభకృతునామసంవత్సర భాద్రపద బ॥ ౪ శుక్రవారం నాటికి మెట్ట లోకభట్లు కొమారుడు పేరుభట్లు శ్రీజగన్నాథప్రతిమానీ వ్రాయడం. అయినది.

## మాఘమాహాత్మ్యము.

పరిషత్తు నంబరు 327. 14 అధ్యాయం. 119 పేజి

గ్రంథకర్త-విజయరంగ చొక్కనాథ భూపాలుడు.

తదనంతరంబ్బు వసిష్ఠమహామునీంద్రుండ్డు దిలీపమహారాజునుంజూచి మృగశృంగ్గ మహామునీంద్రుండ్డు సలక్షణంబ్బుగా నఖిలవేదంబ్బులుం జ్జదివి బ్రహ్మచర్యవ్రతంబ్బు నెరవేర్చి ఉచిథ్యకన్యకయగు సువృత్తను వివాహంబ్బుగా గోరి వున్నయడ కుత్సమహామునిపుత్రుని యభిప్రాయంబు నెరింగ్గి ఉచిద్యుని యింటికిం జని తనకుమారునకు కన్యాదానంబు సేయుమని ప్రార్థించిన నతండ్డును సంతసంబ్బున ముహూర్త నిశ్చయంబ్బును అంకురార్పణంబ్బునుం జేయించి బాంధవులైన మునీశ్వరులం బ్బిలిపించుటయు జైమిని జమదగ్ని కపిల పైలసు మంత వామదేవ జాబాలి కాశ్యప భృగు పర్వతశరభంగ్గ.

నెం. 141.

## శ్రీరంగమాహాత్మ్యము. పేజి 16

విజయరంగ చొక్కనాధుడు.

చతుర్ముఖుండు ఆదేవదేవునుద్దేశించి స్వామీ నీవునాయందు ప్రసన్నుండవగుట నిక్కంబేని నీనిజరూపంబు నేటివరకు నొక్కనాడేనియుం దివ్యకల్యాణవిగ్రహంబు కనుంగొనకాయనైతివి. మత్స్యరూపంబును కూర్మరూపంబును హంసరూపంబును హయగ్రీవరూపంబునుంజూపితిరి యింతా సనాతనంబును అతిరహస్యంబును అత్యుత్తమంబైన నీనిజరూపంబుకనుంగొన నిరీక్షింపుచు నున్నవాడననిన శ్రీమన్నారాయణుండు బ్రహ్మదేవునింజూచి వోయి చతుర్ముఖా నీవంటివారలు మాయావతారంబులైన మత్స్యకూర్మాది రూపం

బులంజూచినం జూచితిరిగాని అప్రాకృతంబును దివ్యంబును వేదవేద్యంబు నైన మానిజరూపంబులు చూడనరుహులుగారు.

నెం. 137.

## శ్రీరంగమాహాత్మ్యము- పేజీ 40

## విజయరంగ చొక్కనాధుడు.

అనినవిని చతుర్ముఖుడు శ్రీరంగశాయింజూచి పురుషోత్తమా నిమ్ము నారాధించుటకు మంత్రంబేమి ఫలంబేమి ఆనతియ్యవలయునని అడుగగా నప్పుడు కమలనాభుడు కమలగర్భునింజూచి పాంచరాత్రంబున సాత్వంబని పౌష్కరంబని రెండు కల్పంబులుగలవు. ఈకల్పద్వయంబునందును వినోదంబైన విధానంబున దక్షతుడై పాంచరాత్రజ్ఞులైన ఋత్విక్కులతోఁ గూడ ద్వాదశాక్షరీ జపపరాయణుడై నిష్కామంబుగా నన్ను అర్చించినయెడల మదీయ సాయుజ్యంబునొందుటకు సందియంబు లేదు. నవబ్రహ్మలు స్వాయంభువాది మనువులు ఇంద్రాదిదేవతలు సప్తఋషులు ఫలకాంక్షచే నానావిధకర్మంబు లాచరించి బహువిఘ్నంబులతోడ నాయాఫలంబు లనుభవించి పుణ్యక్షయంబున మగుడ జన్మంబునొందెదరు.

నెం. ౧౩౮.

## వైశాఖమాహాత్మ్యము. పేజి. 2.

నారదమునీంద్రుండు అమ్మహీరమణు నుద్దేశించి నరపవరేణ్యా నీవునన్ను డిగిన తెరంగునన్ తొల్లి నేను మదీయ జనకుండైన కమలగర్భునడుగుటయుం నతండు మున్ను పరమాత్ముండైన నారాయణుండు శ్రీదేవికుపదేశించిన తెరంగున సనాతనంబులగు వైశాఖధర్మంబుల నెరింగించె తత్క్రమంబు వినుము శ్రీమన్నారాయణుండు క్షీరాబ్ధినందనయగు యిందిరాదేవినుపలక్షింప మాసంబులందెల్ల విశేషించి కార్తికమాసంబు నీమాఘమాసంబును ప్రశస్తంబులని యును వానియందును వైశాఖమాసంబుత్తమోత్తమంబు.

---

# తత్త్వగ్రంథాలు.

## శ్రీవెలుగోటిసర్వజ్ఞకుమారయాచేంద్రభూపాలవిరచితములైన తత్త్వగ్రంథములు.

గ్రంథకర్త వేంకటగిరిమహారాజావారు వీరు పండితులనిన్ని అనేక పండితులనున్ను కవులనున్ను పోషించినవారనిన్ని ప్రఖ్యాతిపొందినారు. నలభయి రెండేండ్లక్రిందట వీరు రచించిన తత్త్వగ్రంథము లనేకమున్నవి. భారతాదిగ్రంథములలోని ప్రాచీనాంధ్రభాష వీరికి సుపరిచితమైనదే అయినా, ఇట్టి వారి గ్రంథములు వ్యావహారికభాషలోనే బుద్ధిపూర్వకముగా వీరు రచించినారు. అందుకు కారణము మనస్సాక్ష్యమనే గ్రంథమందు (126.వ పుటలో) స్పష్టముగా తెలియజేసినారు. వ్యావహారికభాష గ్రామ్యమని నిషేధించేవారి ఆక్షేపణకు మహారాజావారు ఇచ్చిన ప్రత్యుత్తరముగా ఈసమాధానము కొనియాడదగినది. వారివాక్యములు ఉదాహరిస్తున్నాను. "మరికొందరికి తెలియుటకు తేలికయగు వాడుకమాటలుగాను గ్రామ్యప్రయోగములుగాను వ్రాసినాడను. ఎందువల్లనంటే తెలుగువ్యాకరణము చిన్నగ్రంథమైనను పూర్వీకులు చదివించడములేదు. ఏలనంటే యేభాషయైనను ఆదేశములో నుండువారు విశేషాభ్యాసముచేత నుచ్చారణసౌకర్యార్థము కొన్నియక్షరములు మార్చుచునట్లు క్రమముగా మాటలాడుట యాచారమైనందున అంతగా ఆవశ్యకము లేదని మానివేసినారు. అలాగున చదివినవారే బహుజనులు కుండుట చేతనున్ను వ్యాకరణము చదివినవారైనను మాటలాడునప్పుడు గ్రామ్యముగానే ఉచ్చరించుటవలననున్ను వ్యాకరణశిక్షితముగా వ్రాసితే కొందరికి తాత్పర్యము భిన్నముగనగునని యెంచి, ఈగ్రంథాభిప్రాయము అందరికి చక్కగా తెలియవలెనని వాడుకగానుండుమాటలతో వ్రాసినాడను. విలక్షణశాస్త్ర

మేనియుం లక్ష్యముచూచి పిమ్మట కొన్నిసంకేతములం ఏర్పరచగా లక్షణము పుట్టుచున్నది. ఇందువలన తెనుగుభాష యనాదిగానుండి, నన్నయభట్టు ఈవల లక్షణము చేసినందున, పూర్వపువాడుకప్రకారమే సమస్తజనులు ఉచ్చరించుచు నుండుటవలన, గ్రామ్యప్రయోగములే అందరికి తెలియదగినవి గాన నీలాగు వ్రాసినందుకు అంగీకరింపవలయును.”

వీరిరచనకు మాదిరిగా 1 మనస్సాక్ష్యము, 2 సందిగ్ధతత్త్వరాద్ధాంతము, 3 నాస్తికధ్వాంతభాస్కరము, 4 సర్వమతసారసంగ్రహము, 5 నిర్గుణవాదనిరాకరణము అనే అయిదుగ్రంథములనుంచి కొన్నిఅంశములు ఎత్తి ఉదాహరిస్తున్నాను.

ఈమహారాజావారికాలములో పండితులు తాటాకుపుస్తకాలు చదువుకొనేవారు గనక వ్యవహారికభాషయొక్క ప్రయోజనములు వారికి తెలుసును. పూర్వసంప్రదాయముచొప్పున ఎట్టిరచనకు ఎట్టిభాష ఉచితమో అట్టిరచనకు అట్టిభాషే వారు వాడేవారు.

## మనస్సాక్ష్యము.

### వేదము లనాదులు కావనుట.

మరియును వేదము లనాదులని చెప్పుచున్నారు. అట్లనాదులయ్యెడి పక్షమున దేవునివలన జెప్పబడనట్టును దేవునివలె నిత్యములునుం గావలసి వచ్చును, వాటికిలోబడి దేవుడు నడిపించుటవలన స్వతంత్రుడుగాకపోవును.

మఱియును వానిలో మనువేదిచెప్పెనో యదిపథ్యమని యజుర్వేదమునందు తైత్తిరీయారణ్యకములోను సామవేదములో ఛాందోగ్యబ్రాహ్మణమునందును భూతార్థముగాఁ జెప్పబడియున్నది గాబట్టి అవి స్వాయంభువమనువునకు నీవలి యాధునికులు చెప్పినట్లును అందులో గొన్నిభాగములు మతస్థులు ప్రక్షిప్తములుగా జేర్చినట్లును జెప్పవచ్చును.

ఇట్లుండగా, ఆర్యమతస్థాపకుడైన దయానందసరస్వతి వేదములలో మంత్రభాగము దైవప్రోక్తమనియు, నదియే ప్రమాణమనియు వ్రాసినారు. మంత్రభాగము అనుష్ఠేయార్థప్రకాశమేగాని తత్వప్రకాశముగాదు. పైన వ్రాసిన హేతువులచేత వేదమంతయు దైవప్రణీతముగాదని యేర్పడెను.

మఱియు, మంత్రభాగము, హింసారూపకయజ్ఞాదులను ముఖ్యముగా జెప్పునది. దేవునికి హింస ప్రియమగునా. ఆమంత్రములకు గొందఱు హింసావ్యతిరిక్తముగా నర్థము చెప్పుచున్నారు, అది వారిశిష్యులు వినవలసినదేను. వారు చెప్పునదియే సరియైతే మంత్రములతో జేరినయజ్ఞాదులు ఆర్యులైన ఋష్యాదులు ఏల చేయుదురు. మహాపండితులయినవారు అప్పటినుంచి యిప్పటివరకు యేల చేస్తూవచ్చెదరు.

## సందిగ్ధతత్వరాద్ధాంతము

(దేవుడున్నాడా-లేడా-యను సందిగ్ధమునకు రాద్ధాంతము)

లోకములో ప్రత్యక్షము, అనుమానము-శబ్దము-ఉపమానము అను నాల్గుప్రమాణములు గలవు. ప్రత్యక్షము మొదటిది. అనుమానము-రెండవది. అనుమానము అనగా ప్రత్యక్షకార్యమునుబట్టి కారణము నూహించునది-కడమ రెండు అనగా శబ్దము ఉపమానము. మొదటిరెంటిచేత నిర్ణయించు పదార్థములను వివరించునవేను. అట్లుగాక, శబ్దమే ముఖ్యప్రమాణమగు నెడల, నాస్తికశాస్త్రములున్నూ ప్రమాణములు గావలసివచ్చును. మఱియు, నాస్తికులయిన స్వభావవాదులు ప్రత్యక్షమును బ్రమాణముగా నంగీకరించువారుకూడ స్థూలముగా గొన్నిసంగతులు మనుష్యబుద్ధికి గోచరింపదగినవి తెలుసుకొన్నారుగాని ప్రతివస్తువులోను సూక్ష్మములైన యంశములు కని పెట్టినారా ఎట్లనగా ఒకగడ్డిజాతి యెట్లు పుట్టినది-ఆగడ్డిజాతిలో, పరస్పరము రూపవర్ణగంధగుణాదులు ఎట్లు భిన్నభిన్నములుగా గలిగెనో యవి తెలియ

జాలరు. తెలియనివాట్లకు స్వభావమని చెప్పుచున్నారు. ఇది తెలియనిమాట- కారణములేక కార్యము పుట్టునా, మంచిది రూపవర్ణగుణాదులు అలాగు వివిధవిలక్షణములుగా గలుగుటకు హేతువలేక తమంతట యెట్లు గలుగును. ఇవి జ్ఞానముగలవాను గల్పించవలెను. కాబట్టి అట్టి స్వభావములను భూత ముల యుపయోగములకై వాట్లవాట్లయందు స్వభావగుణములను గల్పించ వలెను.

అట్లుగాక తమంతట కలుగుచున్నవని యంటే, అట్లు తమంతట గలుగునవైతే పరస్పరము పంచభూతపరమాణువుల మార్పులవలన, దైవ నిర్ణయమునకు విలక్షణముగా జేతనాచేతన మిశ్రితములైన పాషాణమను ష్యాది స్థావరజంగమములు తమంతట మార్పులై సగము మనుష్యుడు సగము మృగముగాను సగము గడ్డి సగము వృక్షముగాను జాతినియమమును దప్పి అప్పుడప్పుడు గలుగుచుండవలెను. అట్లు గలుగుచున్నవా కాబట్టి వివిధ విలక్షణమై యపరిమితమైన ప్రపంచమును నిర్మించుటకును జననియమమును నతిక్రమించకుండ పాలించుటకును, అదృష్టాధీనముగా ఫలముల నిచ్చు టకును, గారణమై, సర్వశక్తిగల భగవంతుడు అవశ్యముగ నుండక విధిలేదు. ఇట్లు మనస్సాక్షికి వచ్చుచునే యున్నది. ఐతే స్వభావవాదియైన శాస్త్రి కనికి నిట్లనే దేవుడుండ నక్కరలేదని వాని మనస్సాక్షికి వచ్చెగదా గ్రంథములు వ్రాసియుండుటయును ఆమతములను గొంద అవలంబించి యుండుటయును యుండ లేదా యని సందేహము గలుగును. ఇందుకు యుక్తిచేత బలాబలవిచారపూర్వకముగా ఆస్తికులు, నాస్తికులమీద జెప్పిన యుక్తి యేమనగా "శ్లో. నాస్తిచేన్నాస్తినోహాని రస్తిచేన్నాస్తికోహతః." అని చెప్పియున్నారు. ఇందుకు అర్థము- దేవుడు లేనట్టాయెనా దేవు డున్నాడనువానికి, హానిలేదు. దేవుడున్న యెడల లేడనువాడు శిక్షింపబడు చున్నాడు.

## నాస్తికధ్వాంతభాస్కరము

మనుష్యాదులలోని చైతన్యమే మనకు తెలియనపుడు తదంతర్యామియై సర్వవ్యాప్తుడైన దేవుని నెరుంగగలమా యనుట.

### (౧) ఆశంక

జగత్కర్త యదృశ్యుడనునది పిచ్చిమాట - కర్తయున్నాడని ఋజువుపరచిన వెనుక యాయనయొక్క యదృశ్యత్వమును మనము ఆయనను జూచునందాక ఒప్పుకోవచ్చును. మనచుట్టూ గ్రహనక్షత్రములు-నహోరాత్రవిభాగములు-పెనుగాలి, నెమ్మదిగాలి, గ్రీష్మవర్షఋతువులు, మొదలగునవి కనపడుచున్నవి. దానికర్త యొకప్పుడు కనుపడడని నాస్తికుడు వ్రాయుచున్నాడు.—

### ఉత్తరము

పైనవ్రాసిన హేతువులవలన మనుష్యాదిశరీరములలో చైతన్య మెక్కడ నున్నది దానిరూపమేమి-ఇదియే, తెలియనప్పుడు దానికి విలక్షణుడై సర్వవ్యాప్తముగా నుండువాడు యెట్లు కనపడును అని వ్రాసియె యున్నాము గనుక యెప్పటికి, కనుపడేవాడు కాడు, మనచుట్టూ గ్రహములసంచారము గాలి, నెమ్మది, సముద్రములు మేరమీరకుండుట, ఋతుధర్మములు జరుగుట, యివి యెవరియేర్పాటుమీద తప్పక నడుచుచున్నవో దేవుడున్నాడనుటకు నిదే దృష్టాంతము. యేలనంటే-పొగబండి యచేతనము గనుక నడిపే కర్త లేక జరుగునా-యిట్లు పైనచెప్పినపదార్థములు అనేకములు అచేతనములుగా నుండునపుడు తన్నియమనాదులు-కర్తలేక జరుగునా-అయితే నాస్తికుడు దీనికి నేచర్ అని చెప్పును అందుకు అర్థము అతనికి తెలియదు నేచర్ అనేది స్వభావమని చెప్పును అది జడమా, జ్ఞానవంతమైనదా-సూర్యచంద్రగ్రహాదులేమి, సముద్రము ఋతువులు మొదలయినవేమి, తమతమ నియత

గతులు తప్పక సంచరించుటవలన వాటిని జ్ఞానముగలపదార్థములైనవని అయినా, చెప్పవలెను, లేదా జడపదార్థములనినైనా చెప్పవలెను, జ్ఞానవంతములగు పదార్థములని చెప్పితిరా, జ్ఞానవంతులైన మనుష్యాదులకు పాలించువాడు లేనిదే వారిచర్యలు క్రమముగా జరుగునా అట్లనే సూర్య చంద్రాదులకు పాలించువా డుండవలెను. అవి జడపదార్థములని చెప్పు తారా-ఆసూర్యచంద్రాదులు నియతగతితప్పకుండా సంచరించుటకు ఆయింజన్ నడిపేవాని నొకని యొప్పుకొనవలెను. యెట్లనగా పొగయోడ-పొగబండి నడిపించువానిని ఒప్పుకొనవలసినట్టు దేవుణ్ని ఒప్పవలసియున్నది.

## సర్వమతసారసంగ్రహము.

### మహమ్మదీయమతము.

జబ్బూరు, తౌరైత్, ఇంజీలు, ఖురాను ఈవేదములను భగవంతుడు అప్పుడప్పుడు నొకటివెనుక నొకటిగా పంపించినాడని మహమ్మదీయులు చెప్పు చున్నారు. ముందొకటిపంపి తత్వములను ఖరాను మొదలైనవి మార్చి వేఱు పుస్తకములను బంపుట పూర్వము తాను బాగా తెలియక చెప్పినట్టుగాగాని పరస్పరమతవిరోధములచేత జనులు చావవలెనని గాని. అవివేకమువలన గాని వెనుక వెనుక పుస్తకములను బంపి యుండవలెను. ప్రతిదానియందును కాఫర్‌ను చంపుమని యున్నది. కాఫర్ అనగా తమమతములో జేరనివాడు. ఇట్లున్నందు వలననె దావూద్ పైగంబరీలో వచ్చినజబ్బూరు పుస్తకమునకు వ్యతిరేకముగ నడచిన యేసుక్రీస్తును అనగా యీసాపైగంబరును దావూదుపైగంబరు మత స్థులు అనగా యహూదులు చంపిరి.

ఇట్లు తండ్రియైన దేవుడు ఒకరినొకరు చంపుకొనుటకు నిట్టి పుస్తకము లంపునా మరియును ఖురానులో కియామత్ అనగా మహాప్రళయము అప్పుడు గోరీలలో పూడ్చిపెట్టబడిన మనుష్యులను లేపి పుణ్యపాపములు

విచారించుసమయమునందు మహమ్మదు సిఫారస్ చేసినవారి పాపములను మన్నింపు చేస్తాడనియు, తక్కినవారికి లేదనియు వ్రాయబడియున్నది.

దేవుడు సర్వజ్ఞుడుగా నుండునపుడు ఎవరు పుణ్యాత్ములైనది ఆయనకు తెలియనట్టేగదా యితరమతస్థులు ఎంతపుణ్యాత్ములైనను రక్షించకపోతే దేవుడు పక్షపాతికదా.

మరియు నొకలక్షా యెనబదివేల పయిగంబర్లు అయినారని యున్నది. భూమిని పుట్టించి షుమారు అయిదువేలసంవత్సరములైనట్లు అందులోనే యున్నది. యిందలి కాలసంఖ్యావిరోధము చూచుడు. యిందరు పైగంబరీలలో "లాయిలాయిల్లిల్లా" అని యొకటేకల్మా చెప్పినట్టు ఖురానులో నున్నది.

యిందుకు అర్థము "లేదు అల్లా శివాయు అల్లాకంటే" అని చెప్పబడి యున్నది. మరియు నేది యారంభించునపుడును "బిస్మిల్లా యిర్రహామా నిర్రహీమ్" అనిచెప్పి ఆరంభించుమని చెప్పబడియున్నది. దేవునిపేరు చెప్పి ఆరంభించుమని యర్థము. ఈరెండు వాక్యములలో దేవుని ప్రథమపురుష ముగా చెప్పబడియున్నది. ఖురాను దేవుడు చెప్పి పంపించితే తన్ను ఉత్తమ పురుషముగా చెప్పవలెగాని ప్రథమపురుషముగా దేవుడెట్లు చెప్పును. ఇందు వలన ఖురాను దేవుడు పంపించినది కాదు. అయితే యిట్లనే అందలి వేదముల లోను ప్రథమపురుషముగా జెప్పబడియుండలేదా అని వారు చెప్పుచున్నారు. అవసి వేదములు అతూమతస్థులు కల్పించినవేగాని దేవుడు చెప్పిపంపించినవి గావని చెప్పే మామీద యీయాక్షేపమురాదు. ఈవిషయము దయానంద సరస్వతీవిరచిత సత్యార్థప్రకాశికలో, ౧౪ వ, యుల్లాసము మొదలఖురాను ఖండనములో జూచుడు. ఇందులోనుండు వ్యత్యయములవలన అర్థములు వేరువేరు చేసి యీవలివారు అనేకమతములు కల్పించిరి. అట్లుండినను, ఇందలి సారాంశము లెవ్వియనగా.

## మహమ్మదీయమతసారము.

అన్నిటికి ముఖ్యకారణమగు దేవుడే నమస్కారయోగ్యుడు కాబట్టి యితరులకు సిజ్దా చేయగూడదనుట అనగా దండము పెట్టకూడదని యర్థము. సర్వకర్తయు సర్వసాక్షియు సర్వఫలప్రదాతయు భగవంతుండే కాబట్టి భగవంతునికంటె నపకృష్టులగువారు నమస్కారయోగ్యులుగారు. అట్లు నమస్కారయోగ్యులయితే భగవంతునికి సమానులుగ జేయబడినవారగుదురు. ఇట్లు భగవంతుడే నమస్కరణీయుండనుటకు నిదర్శనముగా అథర్వశిఖోపనిషత్తులో "కారణం తు ధ్యేయః" అని యున్నది. మనుష్యులకు జేయు వందనాదుల విషయమైకూడ మరియు భాగవతమునందు సాంబశివుడు పార్వతికి జెప్పుచోట, శ్లో. ప్రత్యుద్గమప్రశ్రయణాభివాదనం విధీయతే సాధుమిథస్సుమధ్యమే, ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా గుహాశయాయైవ న దేహమానినే. అని యున్నది. అనగా వందనాదులు గుహాశయుడైన అంతర్యామికి జేయవలసినదేగాని దేహాభిమానియైన జీవునికి జేయగూడదనుట.

మరియు బ్రతికినవారినిగురించి యిహపరములందు మేలుగలుగవలెనని గాని చచ్చినవారికి పరములో మేలుగలుగవలెననిగాని అభిప్రాయముంటే భగవత్ప్రీత్యర్థముగ మనుష్యులకు అన్నవస్త్రాదిదానముచే తృప్తిచేసి దానివలన గలుగు సవాబు అనగా పుణ్యము దానివలనగలుగు భగవత్ప్రీతికి ఫలంబై చెప్పినవారికి తానుద్దేశించిన మేలును గలుగజేయుమని దేవునిం బ్రార్థింపవలయునని యున్నది. యిది సరియైనది. ఎట్లనగా చచ్చినవారికి ప్రీతిగా శ్రాద్ధాదులు చేయుటగాని యితరదేవతల నుద్దేశించి నైవేద్యాదులు చేయుటగాని ప్రయోజనకరముగాదు. చచ్చినవారు పిండప్రదానములు గ్రహించుట యబద్ధము. కాబట్టి యిందుకు పైతృకకర్మాంతమునందు "సర్వం శ్రీజనార్దనః ప్రీయతాం" అని చెప్పబడుచున్నది. మరియు ననేకదేశములలో

ననేకులు తమతమయిచ్ఛకొలది తలచి పేరుపెట్టబడిన పరిచ్ఛిన్న దేవత లుండుయెడల అనంతదేవత లుండవలసివచ్చును. అట్లుండినను దేవునివలె పరిపూర్ణులుగారు గనుక అనేకదేశములలో నేకకాలమందు వారువారు నిచ్చు నైవేద్యము నెట్లు భక్షింతురు. వారివారియుద్దేశ్యములు తెలుసుకొని ఫలము లెట్లిత్తురు, ఆదేవతలు పరిపూర్ణులే యంటే జగత్తుకు అనేక ఈశ్వరులుగా నేర్పడవలసివచ్చును. అనేక ఈశ్వరులైతే సముద్ర, ఋతుకాలాది నిర్ణయములును, స్థావరజంగమాదిసృష్టిధర్మములు ఏకరీతిగ నడుపక పోవలసివచ్చును. ఎట్లనగా ఒక రాజ్యములో ననేకరాజులుంటే భిన్నభిన్నాభిప్రాయములచేత వ్యత్యస్థములు గలిగినట్లు వ్యత్యాసము గలుగును. ఆదేవతలు నైవేద్యపదార్థములు వారు భక్షించితే ఆ నైవేద్యపదార్థము లక్కడనే యున్నవే వారెట్లు భక్షించిరి, లేక అందలిసారము గ్రహించిరంటే నివేదించక మునుపున్నరుచి నివేదనానంతరంబును గలిగియున్నది. కాబట్టి దేవతలుండుటయే యబద్ధము. దీనివలన జగత్కారణంబును జనకుండునైన దేవునికి బిడ్డలగు మనుష్యులకు దృష్టిసేసి దానసం గలుగు భగవత్ప్రీతినిబట్టి పైచెప్పినవారికిగాని తనకుగాని మేలుగలుగవలెనని దేవునిని ప్రార్థించుట న్యాయమైనదిగా నున్నది. మఱియు ననేకమతములలో మధ్యసేవనాదులు కొన్నికొన్ని సమయములయందును గొన్నికొన్ని కార్యములయందును కొన్నికొన్ని జేయవచ్చునని చెప్పబడియున్నది. యీలాటివి అనగా సేవితములగు మైపుపదార్థములు ఎప్పుడును సేవింపగూడదని నిషేధింపబడియున్నది. ఎందుచేతనంటే కామక్రోధాదులవలన ననర్థములు గలుగునంత చక్కచేసికొనుటయును యిహలోకపరలోకములకు గావలసిన మంచి కార్యములజేయుటయును, దుష్కార్యముల మానుటయును సిట్టివాట్లకు బుద్ధి ప్రధానసాధనము. నిషా యనునది బుద్ధిని ముందుగా జెఱచునదియు, మరిగిన బుద్ధిని గష్టతరముగానైనను తిరుగనియ్యనిదియుం గావున నెంతమాత్రము మైపు చేయగూడదనుట. యివియే యిందలి సారాంశములు.

# అజ్ఞానధ్వాంతచండభాస్కరము

## అర్థదోషాలు.

అర్థము సంపాదించునపుడు బహుదుఃఖము అది సంరక్షించునపుడును, వ్యయకాలమందును, మరియు దుఃఖము; రాజ, చోర-శత్రు-మిత్ర-భార్యాదులవల్లను ధనికుని దుఃఖానకు పారము వేరులేదు. తేనెబిందువును ఈగలు ముసిరినట్లు అర్థానకును సమస్తమైన ఆపదలు ఆశ్రయించుక ఉండును. మధుమక్షికలు బహుప్రయాసపడి ఒకదిక్కున తేనె పెట్టుకుంటేను వాటిని అన్నిటిని కాలిచి, అవి యెత్తుకపోగాను చూచి సంగ్రహదుఃఖమని చెప్పవలెను. మాంసఖండమును సంగ్రహించుకొని గోర్వంక పారిపోగా, గృధ్రకాకాదులు తగిలి దానిం గొట్టి యామాంసమును తీసికొనిపోవాయెనే? చేతనాచేతనప్రపంచమును ఏమి యాత్రమున పరిగ్రహించినను సమస్తదుఃఖాలకు ఆలయమని తెలిసి త్యజించినవాడె ధన్యుడు. అన్నపానాదులను క్షుద్బాధాపరిహారమయ్యేటట్టుగానును, వస్త్రాదులు, శీతనివారణమాత్రముగానును ఔషధమువలెను అనుభవింపవలెగాని అతిమాత్రమైతేను శరీరమందు మదమును, మనస్సునందు రజస్తమస్సులును వృద్ధిపొందును గనుక, దేహనిర్వాహమాత్రముగానే అన్నాదిసేవ చేయవలెగాని యెక్కువ ఆశించేనా ఆయాసపడును. అట్లు గావున ఐహికభోగాలయందు ఆసక్తిలేనివాడు పరమసుఖి;

2. యీశ్రద్ధాళువులయిన శిష్టజనులు కర్మోపాసనలు చేసి పుణ్యలోకాలయందు దేవాద్యుత్తమశరీరాలను బొంది దివ్యసుఖాల ననుభవింతురని వేదశాస్త్రపురాణాదులం జెప్పగాను, కుంభీపాక-రౌరవకుండ-శ్లేష్మకుండాదులయందు ఎటువలె నాసక్తి విడువవలెనంటేను చెప్పేను; ఆపుణ్యలోకాలను అక్కడి దేవాదిశరీరాలను అక్కడి సుఖాలను చెప్పేది వేదశాస్త్రపురాణాదులె. యీలోకమువలెనె పుణ్యలోకాలు అనిత్యాలు అనియు, ఇంద్రాదులు కామాతురులయి అహల్యాదులను ఆశింపబట్టి, శరీరమున సహస్రయోనులచేత చెడె

వనియుఁ, రాక్షసులచేత కొట్టఁబడినాడనియుఁ, దేవగురుఁడయిన బృహస్పతి తనభార్యను చంద్రుఁడు వేసుకపోతేను అదినిమిత్తము తగవాడి దుఃఖించె ననియుఁ, శుక్రాదులతోఁ గలహించెననియుఁ, బ్రహ్మదేవుఁడు కామాతురుఁడయి పుత్రికాగ్రహణము చేసి తలకొట్టఁబడెననియుఁ, వారిరాగద్వేషాలదుఃఖాలను చెప్పగా విని వివేకులైనవారలు ఆపుణ్యలోకాలను కుంభీపాకాదిసమముగానును ఆదేహాదిశరీరాలను శ్వసూకరాదిశరీర సమముగానును ఆసాధనాలయిన కర్మో పాసనలను వదలుకొన్న వాడె పరమార్థనిష్ఠుఁ. సర్వప్రకారముచేతనును జ్ఞాన మును సంపాదించుకొని, శరీరపరిగ్రహము లేకుండాచేసికొని శరీరరహితుం డయి పూర్ణబ్రహ్మస్వరూపుఁడయితేనే సుఖముగాని, శరీరపరిగ్రహము ఉండెనా దుఃఖమే విస్తారము. సుఖము లేశమయినను లేదు. ఈశ్వరులయిన రామ కృష్ణావతారములు సహా, శరీరపరిగ్రహముచేతనే చాలా సంకటాన పొందిరిగదా? మనవంటివారము శరీరాలను మోసుక సుఖపడితిమో? ఎటు వంటి దుఃఖముచేత సంకటపడుచున్నా గానిన్ని తెస్సగా నిద్రపట్టెనా? ఆ కాలమందు శరీరసంబంధము తనకు లేనందుచేతను దుఃఖము లేశమయినా లేక సుఖాననుండి నిద్రనుండిలేచి మగుడి శరీరదుఃఖము ప్రాపించినప్పుడు అనిద్రాకాలమందు అనుభవింపఁబడ్డ సుఖములను తలచుకొని నిద్రపట్టెనా సుఖపడెదుగాని యీదుఃఖానపడవలెనని శరీరమందు చాలా ద్వేషపడగాను లోకమును చూచియుఁ, తాను అనుభవించియుఁ, శరీరము దుఃఖము, అశరీర సుఖమే ఉత్తమమని తెలియనేరని నరపశువును గురుశాస్త్రాలు ఏమిబోధించిన, ఈశ్వరుఁడనెడు కొలుఁడు బ్రహ్మాండమనే కుమ్మరావమును నిర్మించి అందులో జీవులనే భాండాలను సృజించి, వారికర్మాలనే యింధనాలు కంతవానిని చుట్టి, కాలమనెడి అగ్నిని ముట్టించినందుచేతను, సమస్తమయిన జీవులున్నూ కుము లుచునుండఁగాఁ జూచి, సిగ్గువిడిచిన రంధ్రాలగుండా మలము స్రవించుచు మురికి డొక్క మోసుక తిరుగుటగాక ముందరమగుడెడి యిట్టిశరీరమును వివేకి ఆశింపవచ్చునా? కొందరు కర్మనులు, ఉపాసకులున్నూ, దేవాదిశరీరా

లను ప్రశంసింతురంటివారయినా, శోతుల పెండ్లికి గాడిదలు గానగాంధర్వులైను, ఒకటిని ఒకటి ప్రశంసించుకొనును. అనే న్యాయమువలె విచారింపవలయుం గాని, అది యథార్థమని తలతురా? శరీరసంబంధము దుఃఖము; అశరీరభోగ్య లయినస్త్రీ అన్నపానాలయితేను మరిన్ని దుఃఖము. ఈఅర్థమును లెస్సగ విచారించుకొని, యెన్నిభోగసాధనాలను సంపాదించినా ఆశకు పరిపూర్తి లేదని నిశ్చయించి సర్వమును విడిచిపెట్టినవాడే పరమసుఖి. వైరాగ్యమును విచారించితిమి.

## వేదాంతసారసంగ్రహము.

నిర్వికల్పసమాధియనగాను ఏదంటేను దృశ్యములోను గూడక శబ్దముతోనును గూడికొనక, కతకరజోన్యాయమునను అజ్ఞానావరణముపోయి పిమ్మట స్వరూపదృష్ట్యా నిల్పినదృష్టి. అప్రయోజకమయి చిత్తవృత్తి లయించును. ఈచిత్తవృత్తి అజ్ఞానావరణమునుమాత్రము పోగొట్టుగాని స్వప్రకాశమయిన బ్రహ్మమును ప్రకాశింపజేయలేదు. ప్రపంచమెల్లను జడాకారము గనుక, తానొక్కడే స్వప్రకాశుడయిన, చేతనుడు గనుక, జడమై యితరమైన సకలపదార్థాలున్ను ప్రపంచము గనుక, జడమైన ప్రపంచమెల్లను మిథ్య గనుక, తాను స్వప్రకాశుండు గనుక, త్రిపుటిలేక తానే ప్రకాశించుచున్నాడనెడి స్వానుభూతిచేతను దృఢనిశ్చయము కల్గును.

చిత్తవృత్తినిరోధము:—ఈ యవస్థయందు చిత్తవృత్తి నిరోధమనెడి ప్రపంచమున్ను లేకయుండవలెను. ఆయవస్థయందు సుషుప్తి యనెడుసంశయమును లేకపోవలయును. అంతట చిత్తవృత్తి లయమగును. మనిదొకదారిని యొందైనను నిర్వికల్పకము కానేరదు. ఈప్రకారాసను సర్వానుభూతి దొరకకనె నిర్వికల్పకమయ్యేటందుకు చిత్తవృత్తినిరోధము చేసినవాడు అధమాధముడు.

తాను స్వయంప్రకాశకుడు అనెడి అనుభవము కలిగిన్ని నిర్వికల్పకానకు చిత్తవృత్తినిరోధము చేయవలెనని యిచ్ఛయించినవాడు మధ్యముడు.

మనోవృత్తిని నిరోధించెడివెల్లను స్వానుభూతికొరకేగదా అని తెలిసికొని పూర్వాభ్యాసబలానను చిత్తము విదృశ్యమందు ప్రవర్తింపకుండా బట్టి, స్వయంప్రకాశకుడైన నాకు చిత్తవృత్తితోచెడి ప్రయోజనమేమని తెలిసి స్వయంప్రకాశుడ ననెడిన్ని లేక, తననిజానందానను ఉండేది యేదో అది నిర్వికల్పము. ఇటువలె నిర్వికల్పకమయ్యేవగ ఎరిగినవాడు ఉత్తముండు. మనన-నిధి-ధ్యాస-నాదులున్ను స్వానుభూతికొరకేగదా నిర్వికల్పకమనేటిదిన్ని, సకలమున్ననెడిదిన్ని, స్వయంప్రకాశము వినాగాను సర్వమున్ను కల్పితాలే గదా అని అత్యంతదృఢనిశ్చయముకలవాడు ఉత్తమోత్తముడు. అతడె జీవన్ముక్తు డనబడును.

ఇకను అధమాధమునిలక్షణము చెప్పుచున్నారను. నిర్వికల్పార్థమై చిత్తవృత్తినిరోధను చేస్తూఉండెను. అదేగాని మరి స్వానుభూతిలేదు గనుక వానికి దేహము తూగితూగిపడును. అదిగాక చిత్తవృత్తినిరోధము చేసెడి తన్ను చూచుకొనెనని తలంచును. తన్ను చూచుకొనును. అప్పుడు స్వప్రకాశునివలెను, పరిపూర్ణుని వలెనున్ను నామరూపాలు లేనివాలెనున్ను, నిరాశ్రయుడైన వానివలెనున్ను ఉండును. స్వానుభవమును, చిత్తవృత్తిలయమును, లేదుగనుక, జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞానరూపమయిన త్రిపుటి, భంగముగాక భావనలు పుట్టును. అటువంటి దబ్బరభావనలవలన అంతటను ఆచిత్తనిరోధకము విడిచి పెద్దలచేతను శిక్షితుండుగాక తాను ఏకాంతానను౦డి చిత్తనిరోధము నందువలన చేసే బ్రహ్మజ్ఞానిననెడి హామికను విడువక, తానె పెద్దనని పెద్దలతోను వర్తింపక, విద్వదనుభవానకును, వేదాంతశాస్త్రానకును విరోధాలయిన జ్ఞానవార్తలాడుకొంచున్ను తిరిగేవాడు అధమాధముడు. వానికి సంశయనివృత్తిగాక, అసంశయము వానికి హృదయశల్యమయియుండును. వానికి ఐహికసుఖమున్నులేదు. భ్రష్టు గనుక ఆముష్మికసుఖమును లేదు. ముక్తి దూరానకయి యుండును. ఈయర్థమందు—

సమ్మతివచనము; భగవద్గీతలలోను,—

శ్లో. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చసంశయాత్మా వినశ్యతి,
నాయంలోకో స్తి నపరోనసుఖంసంశయాత్మానాం.

అనిన్ని సంసారికసుఖాసక్తం బ్రహ్మజ్ఞో నాలివాదినమ్, కర్మబ్రహ్మో భయ భ్రష్టంతంత్యజేదంత్యజంయథా, విష్ణుపురాణవచనము ఉన్నది గనుకనున్ను "సర్వేబ్రహ్మవదిష్యంతి సంప్రాప్తాతు కలౌయుగే, నాయతిష్టంతి మైత్రేయీ శశ్నోదరపరాయణః." యాజ్ఞవల్క్యవచనము ఉన్నదిగనుకనున్ను ఇవి అధమాధమునిలక్షణము. ఇంక మరిన్ని ప్రపంచము చేయకూడదు. ముందు చెప్పిన యుక్తమోక్తములయిన జీవన్ముక్తునికి-బాల్య-యౌవన, కౌమార-వార్ధిక్యాలున్ను నీలపతాదివర్ణాలును, బ్రాహ్మణత్వాదిజాతులును, ధర్మాలును, బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయములును, తద్ధర్మాలును, ఇవియెల్లను నాకు లేవు. స్థూలశరీరధర్మాలనిన్ని, క్షుత్పిపాసాలు ప్రాణధర్మాలు అనిన్ని, కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్య-భయ-కంప-ధైర్యాదులు అంతఃకరణధర్మాలనిన్ని తలంచును. ఆత్మధర్మాలుగాను తలంపడు.

## సాత్వికబ్రహ్మవిద్యావిలాసము.

౧

ఇంకను ఏకజీవవాదియైన వివరణాచార్యులున్ను అనేకజీవవాదియైన వాచస్పత్యాచార్యులున్ను తనయందు ఏకదేశములై పూర్వపక్షములై యున్నట్టి శంకరాచార్యులయొక్క మతభాష్యక్రమము వినగింపబడియెడిని. అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యాది ఏకమేవాద్వితీయం బ్రహ్మతత్వమస్యాంతములైన సూత్రవాక్యములకు వినియోగం గొన్నక్రమము జ్ఞానాన్మోక్షః అనుటంజేసి నిర్విశేషచిన్మాత్రబ్రహ్మ మొక్కటికాని వేరొకవస్త్వంతరం లేదని తెలసిన అభేదజ్ఞానమేసాధనము. అవిద్యానివృత్తిర్ముక్తిః అనుటంజేసి అట్టిజ్ఞాననిష్ఠయే ముక్తియని ప్రసాదించియుండును. యీలాగు శబ్దభలసు యుక్తులవల్లను పోరాడేది మాయావాదము వేదాంతసూత్రములకు జేరదు. రెంటు

వలెనన్నను జ్ఞాతయైన జీవుండొకడున్ను వేదాంతశ్రవణమున బుట్టెడిజ్ఞాన
మొక్కటిన్ని యింతగాలము బ్రహ్మస్వరూపమును తెలియనియ్యక జ్ఞానతిరో
ధాయకమైనట్టువంటి అజ్ఞానమొక్కటిన్ని అజ్ఞానంవలన చెయ్యంబడిన
దుష్కర్మములున్ను అందువలన ప్రాప్తములైన మనుష్యతిర్యక్స్థావరశరీరపరి
గ్రహణములున్ను అందుండి అనుభవింపబడియెడి దుఃఖములున్ను ప్రమాణ
ప్రముఖలక్షణసిద్ధములై ప్రత్యక్షతా యుండడంగానే బ్రహ్మవ్యతిరిక్తమేదిన్ని
లేదనుట వేదాంతసూత్రములకు తాత్పర్యమవునాయేమి కాదేకదా అంటేను
అందుకు వారు చెప్పెడియుక్తి వ్యవహారాదులందు యిన్నిగలవు పారమార్థిక
దశయందు లేదందురు. అయితే వ్యావహారికదశ నిజముగదా యంటేను
అందుకు వారు చెప్పెడియుక్తి దృష్టాంతము లెట్టివన్నను ప్రాతిభాసికమైన
శుక్తి యందుల రజితకల్పనాభ్రాంతివలెను రజ్జువుయందు సర్పకల్పనాభ్రాంతి
వలెను నిష్కళంకబ్రహ్మమందులేని ప్రపంచము అవిద్యవల్లను తోచితే తోచె
గాని అప్పుడు చూచినశక్తిన్ని మున్నుచూచిన సర్పమున్ను నిశ్చయమై
వున్నవిగదా అంటేను అదిన్ని భ్రాంతి అందును భ్రాంతికి మూలమేదన్నను
మాయ అందురు. మాయ అనగా నొక్కటిగద్దా చెప్పుమంటేను అందుకు
వారు చదివెడిప్రమాణము 'తుచ్ఛానిర్వచనీయాచవాస్తవీచత్రిధామతా,
జ్ఞేయామాయాత్రిభిర్బోధైః శ్రౌతయౌక్తికలౌకికైః.' అని తమయొక్క వైదిక
జ్ఞానములకు రెంటికిన్ని విరుద్ధముగాకుండాను యోజించి అనిర్వచనీయమని
యుక్తులచేత సమర్థింప బెనంగుదురు. మాయ సత్తనిన్ని సదసత్తనిన్ని నిర్ణ
యించి చెప్పరాదందురు. అయితేను మీరుచెప్పిన త్రివిధలక్షణము గలదై
విపరీతజ్ఞానజనకమైన ఆయొక్క అవిద్యను పరమార్థతా కద్దనేరో లేదనేరో
యీరెంటిలో నొకటి నిలువపెట్టుమంటేను అందుకు వారు యోజించుకొన్న
క్రమము మాయ యొకటిగలదంటిమా అప్పుడు మాయాతత్త్వ మొకటిన్ని
బ్రహ్మమొకటిన్ని రెండుతత్త్వములు నిలిచి అద్వైతశబ్దమునకు వారు తొలుత
జెప్పిన శబ్దార్థము భంగమైపోవుననిన్ని కాక మాయ మధ్యే బ్రహ్మ

మందు తనంత నేపుట్టినంటి మానిష్కళంక నిర్గుణబ్రహ్మమందు త్రిగుణాత్మక
మైన మాయ పుట్టెననిచెప్పుట యుక్తముగాదనిన్ని కించ సర్వశక్తిగల ఆ
యొక్క పరబ్రహ్మముతోనే తనయందు సృష్ట్యర్థముగాను మాయను గల్పించె
నంటిమా అప్పుడు బ్రహ్మము తాను సంకల్పాదిగుణములు గలది అవును కాక
సన్నిధి విశేష తానే చెప్పించుచున్నదింతేకాని బ్రహ్మమునకు పనిలేదంటిమా
బ్రహ్మమునకు వెలియయిన గలిగినప్పుడుగదా సన్నిధి చెప్పబోయ్యేది అది
గూడదు. కాక పరమాత్మ జీవాత్మ అవిద్యాదులైనవి ఆరున్ను షడస్మాకమనా
దయః అన్నట్లు అనాదులంటిమా అవి ఆరున్ను సర్వదా నిత్యములే కావల
యును. అందులో బ్రహ్మేతరములైనవి అయిదు భవిష్యత్కాలాంతర వినా
శ్యములంటిమా అప్పుడు కాలతత్వ మొక్కటి వ్యక్తమై నిలుచును. సర్వ
ముక్తి ప్రసంగమున్ను వచ్చును కాక, బద్ధోనాస్తినుతో ముక్తః అనేమంటిమా
అప్పుడు తనశంకరాచార్యులు ముక్తులయిరి అనగూడదు. అదిగాక సనాతనము
వేదవైదికధర్మములకు వినియోగమున్ను ఫలమున్ను చెప్పరాక వేదబాహ్య
మతమై పోవును కాక మాయ సర్వాగా లేదంటిమా వితతప్రపంచమున్ను
కలిగి కార్యాకారణరూపములతోను యిటువంటివనున్ను యుండజేదయ్యె
వున్నది అదిగాన యీమండలంగా లేదని బొంకుబగూడదు. యిందుచేక నేను ఉత్తర
మిత్తామని పెద్దలయినవారు పరమాణతాసత్యమైన వేదవైదికధర్మమునకు
యొడంబడుదురు.

౨

74 పత్రము.

ఇంకను బౌద్ధాగమనకు బుద్ధుడే గురువు. అహింసాపురస్సరపురుషా
ర్థమే సాధనము. బహువిధావస్థలగలిగి ప్రవాహరూపేణ నిత్యమైనజ్ఞానమే
ముక్తి. అట్టి ముక్తావస్థయే పరమాత్మకత్వము. సౌత్రాంతికవైభాషికమాధ్య
మికసౌగతులనియేటి చతుర్విధభేదములుగల బౌద్ధులకు తుదను ఇదియే సిద్ధాం
తము. యిది త్రిపురాసురమోహనార్థముగాను బుద్ధావతారమై శ్రీహరిగల్పిం

చిన యాంత్రికసమయం గాని వైదికలేశమాత్రమున్ను లేదు. అదియెట్లన్నను జ్ఞాతయైన జీవుడు యెప్పుడునుండంగానె జ్ఞానము సుషుప్త్యవస్థయందు లోపించిపోవుటాను జాగ్రదవస్థయందు ప్రసరించుటాను వ్యక్తమై యుండంగాను జ్ఞానత్రైలోక్యములజాధః అనిన్ని జ్ఞానాన్మోక్షః అనిన్ని చెప్పుటజేసి జ్ఞాతృజ్ఞానములు రెండున్ను ధర్మిధర్మములవుట యెరుంగక జ్ఞానమే జీవుడనె గనకాను నిర్వికారశుద్ధజ్ఞానావస్థను బొందుటే పరమాత్మకత్వము అనుటా ఏకజీవవాదికిన్ని జేరదు. అనేక జీవవాదికిన్ని జేరదు. అదియెటువలెనన్నను బ్రహ్మాదిపిపీలికాంతమైన జంగమస్థావరశరీరములందున్న జీవులెల్లాను ఒక్కజీవుడే అంటేను జీవుడు యింకాను ముక్తుడు కాలేదు గనక యిది క్రిందనుండి యింత్తగాలమున్ను పరమాత్ముడు లేడు యికమీద పుట్టవలసియుండనుట వ్యక్తమాయను. అనేకజీవవాదమే నిజమాయనా యిట్లక్రిందట ముక్తులయినజీవులెందరు అందరున్ను పరమాత్ములే అయివుండవలెను. అదిగాన అనేకబ్రహ్మవాదము సకలప్రమాణవిరుద్ధము గాని త్రిపురాసురనాశనార్థమున్ను రుద్రప్రతిజ్ఞాపాలనార్థము గాను శ్రీహరికల్పించిన బాహ్యశాస్త్రమువుటే శిద్ధము! పురాణాదుల యందు లెస్సగా చూచుటనేది॥

3

## సాత్త్వికబ్రహ్మవిద్యావిలాసము
## (78 తాళపత్రములుగలది.)

(బహుధాన్యసంవత్సర ఆశ్వీజ శు 3 గురువారంవరకు సా...విలాసము సంపూర్ణముగా వొద్దిరాజు తిరువెంగళంవ్రాసెను.)

ఈగ్రంథములోనిభాషాస్వరూపము తెలియడానకు కొన్నివాక్యాలు ఎత్తివ్రాస్తున్నాను.

77 వ పత్రం...హిరణ్యగర్భమతసిద్ధాంతము. హిరణ్యగర్భుడే పరతత్వ...అంశమున బుట్టినచతుర్ముఖుండే సృష్టికర్త అతొలుతటి హిరణ్య

గర్భునివల్ల బుట్టిన హరిహరులిద్దరును స్థితిసంహారకర్తలు జగత్తునకు ప్రకృత్యాదిద్రవ్యములు, ఉపాదానము గాయత్రీమంత్రపురస్సరశ్రౌతస్మార్తనిత్యకర్మానుష్ఠానములున్ను అష్టాంగయోగములున్ను సాధనములు పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మపదప్రాప్తియేముక్తి. యీదర్శనము సూత్రశిద్ధమాత్రమింతేకాని ఆచరణప్రసిద్ధముగాదు. అయినాగాని రాజసధర్మముగనక క్రమముక్తిమార్గమవును.

అని యీలాగున ఆదియందు ఉత్తమవిద్యాప్రసంగమున్ను ప్రమాణనిరూపణమున్ను ప్రమాణగుణవిభాగమున్ను మూర్తిత్రయవిమర్శనమున్ను వైదికధర్మాధిదేవతానిర్ణయమున్ను గాయత్రీమంత్రాధిదేవతానిర్ణయమున్ను పరబ్రహ్మశబ్దార్థనిర్ణయమున్ను వేదాధిదేవతానిర్ణయమున్ను ప్రణవాధిదేవతానిర్ణయమున్ను ప్రథమసర్గాధిదేవతానిర్ణయమున్ను ప్రతిసర్గాధిదేవతానిర్ణయమున్ను శ్రీహరికి అవతారములందే కాని బ్రహ్మరుద్రాదులకుం బలెను జన్మమరణాద్యవస్థలు లేకపోవటమున్ను పరబ్రహ్మమైన శ్రీహరినిగూడాను పంచపూజలు విధించిన ఋషులహృదయమున్ను అందువల్ల వైదికత్రయవిమర్శనమున్ను వైదికత్రయలాంఛనములున్ను వైదికశబ్దార్థనిర్ణయమున్ను సత్కులప్రసూతులైనవారు సామాన్యధర్మములందు ప్రవర్తించే హేతువులున్ను వారివారికన్నాంశఫలములున్ను మోహశాస్త్రోత్పత్తిక్రమమున్ను వైదికశాస్త్రములందలి పరస్పరవిరోధములుపుట్టిన కారణములున్ను ఉరులింగోద్భవశేతులింగప్రతిష్ఠాకృష్ణ కైలాసయాత్రలయందు రుద్రుని గౌరవముచేసిన క్రమమున్ను అసురమోహనార్థముగాను మోహశాస్త్రపరిపాలనార్థముగాను నటించిన భగవల్లీలావతార నటనావిశేషములున్ను తారకమంత్రనిర్ణయమున్ను శైవాగమప్రతిపాదితపంచబ్రహ్మలక్షణములున్ను శాద్ధాదిషట్సమయశిద్ధాంతములున్ను హిరణ్యగర్భసూత్రక్రమమున్ను శేవలులమతమున్ను భావనాయోగనిష్ఠలమార్గమున్ను వేదాంతసూత్రములకు విపరీతముగా జెప్పిన భాష్యములున్ను సాత్వికమైన మధ్వరామానుజమతము

లున్ను మొదలయినలక్షణములు అన్ని అనతిచ్చిన ఆచార్యుంజూచి శిష్యుండు సర్వభూతదయాపరుండై ఓస్వామీ మోహశాస్త్రప్రవర్తకులైన తామసశైవ మాయావాదాదిమతములవారిని చెడకుండాను వైదికపరమవైదికమార్గాలకు వచ్చేటట్టుగాను బోధింస్తేను విశేషముగాదాయన్నను నీవన్నమాట నిశ్చయమే యౌను. అయితేను వారు విననొల్లరున్ను ఒడంబడరున్ను అదిగనక వారిని ఒడంబరచబెనంగవద్దు. మీది మిక్కిలి తామసాదిమతముల వారిని బోధించ బోయితేను తనకు అగౌరవమువచ్చును. అదియేలాగంటేను హిరణ్యకసిపుని తోను ప్రహ్లాదుండు బోధించితే సకలనిబంధములబెట్టెగాని విననొల్లడాయనే కదా. రావణాసురునితోను విభీషణాదులు యెంతజెప్పినాగాని వినక విభీష ణున్ని అవమానముచేసెనాలేదా? దుర్యోధనునితోను పరబ్రహ్మమైన శ్రీకృష్ణు లున్ను శ్రుతిస్మృతిపురాణేతిహాసకర్తలైన వ్యాసాదిమహాపురుషులున్ను గురువు లైన ద్రోణాదులున్ను పెద్దలయిన భీష్మాదులున్ను తల్లిదండ్రియయిన గాంధారి ధృతరాష్ట్రులున్ను చనవరులయిన విదురసంజయులున్ను యెంతబోధించినా వినక శ్రీకృష్ణులను అడ్డపెట్టజలపెచాలేదా. అదిగనక అసురాంశలబుట్టిన వారిని యెంతబోధించినా అహంబ్రహ్మమంచు నుందురుగాని ఆవాసన విడువరు.

అసురాంశలబుట్టినవారిలక్షణములు చెప్పేము. శ్రుతులకు విపరీతార్థా ములు కల్పింతురు. విష్ణుదూషణచేతురు. విష్ణుభక్తులను ద్వేషింతురు. వారితో వాదించబోవద్దు. వారుచెప్పే శ్రుస్మృతీతిహాసపురాణాలయొక్క విపరీతా ర్థాలు నీవు యెల్లకాలము దిద్దుకొనేసరిపోయ్యాని. నీవుదిద్దిచెప్పితివాయనా వారు సమ్మతిపడనేపడరు. సమ్మతిపడిరా విశేషమార్గాన నడవనేనడవరు. అది గాన ఓశిష్యోత్తమా అటువంటివారిని బోధించబోక నిన్నాశ్రయించిన భగ వద్భక్తులైనవారికి మేము నీకుచెప్పిన సాత్వికబ్రహ్మవిద్యావిలాసముయొక్క రీతులుంపదేశించి కృతార్థులజేయుమని అనతిచ్చిన తాను కృతార్థుండ నైతినని ఆచార్యున్ని శిష్యుండు నానావిధరత్నభూషణవస్త్రాదులబూజించి.

తదనుజ్ఞవడసి భగవత్కృపకు పాత్రుండై జిజ్ఞాసులకు పరమోపకారియై నిత్యానందకందళితహృదయారవిందుండగుచు సుఖంబుననుండెను.

## సాత్వికబ్రహ్మవిద్యావిలాసనిరసనము

సకలప్రపంచమున్ను శివునివలననే కలిగినందుకు మునుపటిప్రకరణమందు తెలిపేము. యిక్కడ విశేషించి బ్రాహ్మణులకు శివుడే జనకుడని ప్రమాణపురస్సరముగా తెలిపేము.

ఆపస్తంబసూత్రం. మధ్యపిండం పత్నైప్రయచ్ఛతి । ఆధత్తపితరో గర్భం కుమారం పుష్కరస్రజం యథేహ పురుషోసదితి । తత్పత్నీప్రాశ్నాతి పుమాన్ సహజానుకం భవతీతిజ్ఞాయతే । అని, మధ్యపిండమనంగా వసురుద్రాదిత్యరూపశ్రాద్ధీయ్య పార్వణపిండత్రయములోన నడిమిపిండము రుద్రపిండము అది శ్రాద్ధకర్తపెండ్లాముకు తినిపించితే మంచికుమారుడుపుట్టునని విధించె గనుక బ్రాహ్మణజాతికల్లాను శ్రాద్ధకరణమున్ను తత్పిండప్రాశనమున్ను ఆవశ్యము. అందువలననే కుమారుడు జన్మించేపనిగనుక బ్రాహ్మణునిజన్మమునకు రుద్రుడిప్రసాదమే హేతువాయెను. అయితే వస్వాదిత్యసాహచర్యము చేత నిక్కడ రుద్రశబ్దవాచ్యులేకాదశరుద్రులుగదా అంటే అవును. అయినా వారున్నూ రుద్రాంశసంభూతులే, స్కాందే॥ ఏకాదశాత్మా భగవాన్ వర్తతే కృపయాహర । ఈదృశాన్యవతారిణి దృష్ట్వాపి బహుశస్తవ । అనే, వచన ప్రమాణమున తదంశసంభవులుగనుక అంశాంశినోరభేదాత్ అనేన్యాయము చేత యీతాత్పర్యార్థము రుద్రునందే పర్యవసించును - అదిగనుకయ్యే వే లింగపురాణమందు॥ శ్లో॥ వసురుద్రాదిరూపేభ్యో మధ్యపిండస్తు పుత్రదః । అని, రుద్రపిండోద్భవో విప్రః శివం సర్వేశ్వరం విభుం । హా హా నైవావజానాతితాతం వేశ్యాసుతా యథా అనిన్ని యీలాగున మహారుద్రపరముగా వర్ణించెను. కూర్మపురాణగతేశ్వరగీతలందున్ను॥ శ్లో॥ యోమామేవం విజానాతి బీజినం పితరం ప్రభుం సధీర సర్వలోకేషు న మోహమధిగచ్ఛతి । అని,

ఆలాగే, హరివంశం విష్ణువాక్యము॥ శ్లో॥ అహం బ్రహ్మా కపిలో ధాన్యనంతః
పుత్రాస్సర్వే బ్రాహ్మణాశ్చాతి వీర్యాః త్వత్తస్సర్వే దేవదేవ ప్రసూతాఇతి ।
అదిగనుక శివానుగ్రహంచేత సద్యోవిజ్ఞానముకలిగేదిన్ని బ్రాహ్మణ్యముకలిగే
దిన్ని, పరాశరపురాణము॥ శ్లో॥ జ్ఞాననిష్ఠో భవే ద్విప్రో మహాదేవ ప్రసాదతః,
ప్రసాదేన హి రుద్రస్య బ్రాహ్మణో బ్రాహ్మణోభవేత్ । అని ఇదిగాక బ్రాహ్మ
ణుడు రుద్రాంశమున్ను క్షత్రియుడు విష్ణ్వంశమున్ను "నా రుద్రః క్రతుపా
దకః । నావిష్ణుః పృథివీపతిః" అని యిందుకు ప్రత్యక్షసిద్ధమైన యితిహాస
కథగలదు. గాధి అనేరాజు తనకూతురిని భృగువంశ్యుడైనఋచికున కిచ్చి
యుండగా నొకకాలమందు నాఋచికుడు గాధియింటికి వచ్చినప్పుడు ఆ
మునిని ప్రార్థించి అతనిభార్యఅయిన రాజకూతురు, తనతల్లికిన్ని తనకున్ను
పుత్రసంతానముగావలెనంటే నాలాగే, నొకయాగముచేసి శైవచరువొక
టిన్ని వైష్ణవచరువొకటిన్ని సంపాదించి నీవాశైవచరువు నీవుభక్షించితే
బ్రహ్మవేత్తయైన బ్రాహ్మణుడు జన్మించెననేని వైష్ణవచరువు నీతల్లిభక్షించితే
మహాభుజుడైన క్షత్రియుడు జన్మించేని అని తెలిపి యిచ్చెను. గుతెలియక ఆ
చరువులు రెంటియందును తనకుచెప్పిన శైవచరువు తనతల్లిన్ని ఆ వేఱిచ్చిన
వైష్ణవచరువు తానున్ను విపర్యాసము భక్షించితే గాధికి క్షత్రవంశమందు
బుట్టిన్ని శైవచరుసామర్థ్యముచేతను విశ్వామిత్రుడాదేహముందే బ్రహ్మర్షి
అయెను. ఉత్తమబ్రాహ్మణవంశమందు ఋచికుడను వేరు పేరుగల జమదగ్ని బుట్టిన్ని
పరశురాముడు వైష్ణవచరుసామర్థ్యమున క్షత్రకర్మము నడుచుకొనెను.
ఆలాగే హరివంశమందు॥ శ్లో॥ భృగోశ్చరువిపర్యాసే శైవ వైష్ణవయోః
పురా। జగత్యాం వైష్ణవాంశే జామదగ్న్యస్యజాయత । విశ్వామిత్రంతు
శైవాంశే గాధిః కుశికనందనః । జనయామాసపుత్రంతు తపోవిద్యాత్మకం ।
ప్రాప్యబ్రహ్మర్షిసమతాం యో యం బ్రహ్మర్షితాంగతః । అని శ్రుతి॥
త్వం దేవేషు బ్రాహ్మణోస్యహం మనుష్యేషు । అని దేవసహూహంలో
రుద్రుడు బ్రాహ్మణుడుగనుక బ్రాహ్మణోత్పత్తి అతనియందే కాని సంభవించదు.

అదిగనుక బ్రాహ్మణుడు తనపుట్టుకకు తండ్రివలెనే హేతువైన శిశువునను సరించే ఆచారము నడుచుకోవగినది. అథవా విష్ణువే బ్రాహ్మణాదిజనకు డతని ఆచారమే నడుచుకోదగినదన్నట్టాయెనా అలాగైనా కాదువలేదు. విష్ణువు శైవాచారసంపన్నుడగుట తెలిసినాముగనుక ఆయననను సరించే ఆయననడచిన శైవాచారము నడచుకోవగినది. ఇందుచేత నవశ్యం పితురాచారమన్నారు గనుక బ్రాహ్మణులల్లా విష్ణువునను సరించే ఆచారము నడచుకోవలెనన్న యుక్తి నిరసింపబడెను.

## సిద్ధాంతసారమునుండి

సమస్తమైన ప్రాణులున్ను నిత్యసత్యశుద్ధబుద్ధముక్తులయ్యి న్నప్పటికిన్ని సువ్యక్తమైన దేహేంద్రియాదిప్రపంచంలోను కొంత నేననిన్ని కొంత నాదే ననిన్ని కొంతఅన్యమనిన్ని, అకర్త అయిన షువంటి తన్ను కర్తననుకొనిన్ని అభోక్త అయినషువంటి తన్ను భోక్తననుకొని పుణ్యపాపఫలసహితులైన తాను పుణ్యపాపఫలాలనుపొందుచూ వున్నాననేటి భేదదృష్టిరూపమయిన అవిద్య చాతను ఆవృతులై అనాదిసంసారమందు మగ్నులైన వారింవలెనేవుండే జీవుల జూచి దయాసముద్రులైన ఆచార్యస్వాములవారు తమవలెనే సమస్తమైన జీవులున్ను ఆనందాత్మస్వరూపలై వుందురుగాకఅని ఆత్మస్వరూపమును ఉప దేశంచాయదలచి వాంఙ్మనసాతతంగనక అధ్యారూపాపవాదాలచాతను సర్వ లోకప్రసిద్ధవస్తు నిరూపణద్వారా బహుజన్మభాగ్యంవల్లను ప్రతిబంధత్రయ విహీనులై తమస్వరూపము తెలుసుకోవలెనని యిచ్చబుట్టినవానికిగూచికా అద్వితీయాత్మవస్తువును ఆంధ్రభాషచాత నిరూపిస్తూన్నారు॥ నిరూపించే ప్రకారం ఎషువలెనంటేను। సచ్చిదానందస్వరూపుడైన ఆత్మకు దుఃఖం యెందు వల్లవస్తుందంటేను దేహంవల్లను దేహం యెందువల్లవస్తుందంటేను కర్మంవల్లను కర్మం యెందువల్లవస్తుందంటేను రాగాదులవల్లను రాగాదులు యెందువల్ల వొచ్చునంటేను అభిమానంవల్లను అభిమానం యెందువల్లవస్తుందంటేను అవి వేకంవల్లను అవివేకం యెందువల్లవస్తుందంటేను అజ్ఞానంవల్లను అజ్ఞానం

యెందువల్లవస్తుందంటేను యెందువల్లారాలేదు। అనాదిగా ఆత్మను ఆశ్రయించి వున్నషువంటి(ది) అజ్ఞానము ఎందువల్లపోవునంటేను ఆత్మానాత్మావివేకంచాత వచ్చినషువంటి జ్ఞానంచాతపోవును॥ ఆత్మానాత్మవివేకమందు ఎషువంటివాడు అధికారిఅంటేను అనుబంధచతుష్టయంగలవాడు.........

సమష్టివ్యష్ట్యాత్మకమైన సూక్ష్మశరీరోత్పత్తిప్రకారమున్ను చెప్పేము॥ ఆకాశాదులయొక్క తామసాంశలైదింటినిన్ని ప్రాణిదృష్టమపేక్షించి పరమేశ్వరుడు పంచీకరణంచేశే ప్రకారం॥ వక్కొక్క అంశ రెండేసిభాగాలు చాయగాను పదిభాగాలాయను। అందులో అయిదుభాగాలు నిలిపి కొదవ అయిదుభాగాలున్ను వకటొకటి నాలుగుభాగాలు చేశి తన అర్ధభాగంవిడిచిపెట్టి యితరభూతార్ధభాగాలయందు నాలుగుభాగాలు కూర్చంగాను యీ సూక్ష్మభూతాలే పంచీకృతాలయినవవుతుందున్ను స్థూలభూతాలనే పేరుగలిగి బ్రహ్మాండచతుర్దశభువనచతుర్విధభూతగ్రామాద్యాకారమయి శ్రోత్రేంద్రియాలచాత గ్రహింపబడుచున్న సమష్టివ్యష్ట్యాత్మకమైన స్థూలప్రపంచమనిపించుకొనును। వ్యష్టి అనంగా యేమి సమష్టి అనంగా యేమిఅంటేను వక్కటిఅయితే వ్యష్టి అనుపించుకొనును. అంతాగూడితే సమష్టి అనిపించుకొనును. దీనియందు దృష్టాంతము । వనములో వకవృక్షం వ్యష్టి అనిపించుకొనును। ప్రసంగ అన్ని వృక్షాలుగూడంగాను సమష్టి అనిపించుకొనును। ప్రసంగద్వారా సృష్టిప్రక్రియచెప్పితిమి యింకను ప్రకృతంచెప్పేము॥

ఆత్మఅనంగా యెవరు అనాత్మఅనంగా యెవరుఅంటేను। అనాత్మ అనంగా సమష్టివ్యష్ట్యాత్మకమైన సమస్తప్రపంచము । సమష్టివ్యష్టుల సంగ్రహించిచెప్పితిమి । ఆత్మ అనంగా శరీరత్రయలక్షణుండు । అవ(స్థా) త్రయసాక్షి । పంచకోశవ్యతిరిక్తుండు। సచ్చిదానందస్వరూపుడు । శరీరత్రయమును ఎరిగి శరీరత్రయవిలక్షణుడైన ఆత్మను ఎరుగవలెను। శరీరత్రయమనంగాను స్థూలసూక్ష్మకారణాలు । స్థూలశరీరమనంగా షట్కోశాత్మకమై కరచరణాదులతో కూడుకవుండేది స్థూలశరీరము షట్కోశాలనంగాయేవంటేను చర్మమాంస

రుధిరమేదోమజ్జాస్థి సూక్ష్మశరీరమనంగా పదిహేడుఅవయవాలుగలది । పది
హేడుఅవయవాలు అనగా ఏవంటేను జ్ఞానేంద్రియాలుఅయిదు । కర్మేంద్రి
యాలైదు ప్రాణాలైదు మనోబుద్ధులురెండు కూడాపదిహేడు. జ్ఞానేంద్రి
యాలు ఏవంటేను శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణలు । శ్రోత్రేంద్రియము
అనంగా కర్ణశష్కులిలోవుండేటువంటి ఆకాశమునాశ్రయించి దిగ్రూప
మైన అధిష్ఠానదేవతచాతను కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి లౌకికవైదికశబ్దా
లనుగ్రహిస్తూవుండేది శ్రోత్రేంద్రియము । త్వగింద్రియమనంగా ఆపాదమస్త
కమును వ్యాపించివున్నటువంటి చర్మమునాశ్రయించి వాయువుచాతను
కర్మానుగుణంగా ప్రేరేపింపబడి శీతోష్ణాదిస్పర్శాలను గ్రహిస్తువుండేది త్వగిం
ద్రియము। చక్షురింద్రియమనంగా నల్లగుడ్డునడుమనుండి సూర్యునిచాతను
కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి రూపాలనుగ్రహిస్తూవుండేది । చక్షురింద్రి
యము రసనేంద్రియమనంగాను జింహ్వానాశ్రయించి వరుణదేవునిచాతను
కర్మానుగుణంగా ప్రేరేపింపబడి రసాలనల్లాగ్రహిస్తుండేది రసనేంద్రియం
ఘ్రాణేంద్రియమనంగాను నాసాగ్రమునాశ్రయించి అశ్వనీదేవతలచాతను
కర్మానుగుణంగా ప్రేరేపింపబడి గంధాదులను గ్రహిస్తువుండేది ఘ్రాణేంద్రి
యము యీఅయిదున్న జ్ఞానేంద్రియాలు। కర్మేంద్రియాలనంగా యేవంటేను
వాక్పాణిపాదపాయూపస్థలు వాగింద్రియమనంగాను బొడ్డు రొమ్ము మెడ
కింది పెదివి మీది పెదివి నాలుక కొననాలుక శిరస్సు యీఆయెనిమిదిస్థానాల
యందువుండి అగ్నిచాత కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి లౌకికవైదికశబ్దాలను
పలుకుచూవుండేది వాగింద్రియము పాణీంద్రియమనంగాను అరచాతనువుండి
యింద్రునిచాతను కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి యిచ్చిపుచ్చుకునేది
పాణీంద్రియము। పాదేంద్రియమనంగాను అరికాలనువుండి వుపేంద్రునిచాత
కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి రాకపోకడలుచేస్తూవుండేది పాదేంద్రి
యము। పాయురింద్రియమనంగాను గుదమధ్యమందుండి మృత్యువుచాతను
కర్మానుగుణంగా ప్రేరేపింపంబడి మలోత్సర్జనంచేస్తువుండేది పాయురింద్రి

యము । ఉపస్థేంద్రియమనఁగాను గుంహ్యామందుండి ఆనందాదులను చేస్తూ వుండేది ఉపస్థేంద్రియము యీఆయిదున్నూ కర్మేంద్రియాలు ॥పా॥

గడేకారిబళ్ళ నను కఁన్నలకాల్వనాగేశం అత్యంతప్రియపూర్వకముగా వ్రాసియిచ్చినసిద్ధాంతసారం.

వాసుదేవమననము

సాహిత్యపరిషద్గ్రంథాలయము

నెం 433 రు. మరి రెండుమూను ఇట్లేకన్నవి.

నెం 286, 193, 373

పు. 4-5 b లో మొదటిపంక్తి.

అనుగ్రహార్థం మర్త్యానాం సంస్కృతానధికారిణాం వివాక. సార శ్రోతృణాం రచ్యతే భాషయామయా॥

సాధనచతుష్టయనిరూపణం॥ యస్యాత్సాధనసంపత్స్యా । ఈశ్వరస్య ప్రసాదితః । యజ్ఞాదికర్మకరణతోఽధికారినిరూప్యతేః వేదాంతవిచారమందు । సాధనచతుష్టయసంపన్నుడే అధికారి । అది యెటువలెనంటే । దృష్టాంతమందు నిరూపించి । దార్ష్టాంతికమందు నిరూపింపుచున్నారము । బృహస్పతిసవనమందు బ్రాహ్మణుడు అధికారిఐ క్షత్రియవైశ్యులు ఎటువలె అధికారులుగారో, రాజసూయమందు క్షత్రియుండు అధికారిఐ బ్రాహ్మణవైశ్యులు యెటువలె అధికారులుగారో । స్తోమమందు వైశ్యుడు అధికారిఐ। బ్రాహ్మణక్షత్రియులు యెటువలె అధికారులుగారో । అటువలెనె వేదాంతవిచారమందున్నూ సాధనచతుష్టయసంపన్నుడైనవాడే అధికారి । సాధనచతుష్టయసంపత్తి । అనఁగా నిత్యానిత్యవస్తువివేకము యిహాముత్రార్థఫలభోగవిరాగము । శమాదిషట్కసంపత్తిముముక్షుత్వము ॥ యిందులో నిత్యానిత్యవస్తువివేకమనఁగా । బ్రహ్మమె నిత్యం ప్రపంచమంతా అనిత్యమని శ్రుతిస్మృతిగురుముఖంగా యెరుగుట.

ఇహాముత్రార్థఫలభోగవిరాగమనంగా । ఇహలోకమందు కర్మజన్యాలై అనిత్యాలైనట్టువంటి స్రక్చందనవనితాదిభోగవిషయములున్నూ । పరలోకమందు కర్మజన్యాలై అనిత్యాలైనట్టువంటి అప్సరఃస్త్రీసంభోగాలు మొదలైన స్వర్గభోగాలయందున్నూ వాంత్యాశనమూత్రపురీషాదులవలె అసహ్యపడుట । శమాదిషట్కమనంగా । శమం । దమం । ఉపరతి । తితీక్ష । శ్రద్ధా । సమాధానములని । ఆరువిధాలు । శమమనంగా । మనస్సును శ్రవణాదివ్యతిరిక్తమైనట్టువంటి విషయాలవల్లనుండిన్ని త్రిప్పి శ్రవణాదులయందె విడుచుట । దమమనంగా । జ్ఞానేంద్రియాలనున్నూ । కర్మేంద్రియాలనున్నూ । శ్రవణాదివ్యతిరిక్తమైనట్టువంటి విషయాలవల్లనుండిన్ని । త్రిప్పి శ్రవణాదులయందె విడుచుట । ఉపరతి అనంగా । విహితమైనట్టువంటికర్మలను విధ్యుక్తముగా విడుచుట । ఇదే సన్న్యాసమని చెప్పబడును । అథాంతరము చెప్పేము । విహితమైనట్టువంటికర్మలను కర్తృత్వాద్యభిమానరహితుడై ఫలాపేక్షరహితుడై చేయుట । తితీక్ష అనంగా । శీతోష్ణాలు సహించుట । అట్లనగా । మంచులోవుండి శీతము సహించుట । యెండలో ఉష్ణము సహించుట । శిష్యుడు ప్రారబ్ధవశంవల్ల యేవేళ యేయేసుఖదుఃఖములు వొచ్చునో అది అనుభవించి తీరవలెనని బుద్ధియందునిశ్చయమే తితీక్ష । శ్రద్ధ అనంగా గురువేదాంతవాక్యేశ్వరులయందలి విశ్వాసము అట్లాగనంగా పూర్వాం దేవియందు తనకునిండా । విశ్వాసమున్నదేనో । ఆవిశ్వాసమంతా గురువేదాంతవాక్యేశ్వరులయందె విడుచుట । సమాధానమనంగా నిన్న అక్షరా గురువాక్యం వొక్కటిగాయెంచి నిశ్చయాత్ముడగుట । ముముక్షుత్వమనంగా । మోక్షేచ్ఛ । వోయీ సమస్తప్రాణులున్నూ మోక్షమే కావలెనని కోరుచున్నారు । అది మోక్షేచ్ఛగాదు । మరియెట్టువలెనంటె గృహం దగ్ధమామావుండగా । ఆ గృహమందువున్న పురుషుడు నాపుత్రమిత్రకళత్రాదులు యేమైపోయిరో అని విచారపడ్డవాడై । అగ్ని చేత తప్తుడై । ఆపుత్రమిత్రకళత్రాదులవిడిచి శీతలస్థలమందు ప్రవేశించినట్టు దార్ష్టాంతికమందు । తాపత్రయాలనే అగ్ని చేత

సంసారమందు తపించుచూవున్న పురుషుడు యీసంసారమును యెవరుపో
మొత్తుదురో సద్గురువులు యెక్కడగలరో । దీనికిసాధనాలు యేమికావలెనో
అని తపించుచూవున్న వానిచిత్తవృత్తికి । మోక్షేచ్ఛ అనిపేరు యీనాలుగు
సాధనాలుగలవాడె అధికారి. శ్రవణానకుమునుపె సాధనచతుష్టయమును
సంపాదించి శ్రవణానకుదిగవలెను। లేకుంటేజ్ఞానముపుట్టదు।గురువులవారున్నూ
అ(న)ధికారికి ఉపదేశంచేయరు ఆదెట్లువలెనంటె శూద్రునికివొడుగుజేయిస్తే
బ్రాహ్మణత్వముయెట్లువలెసిద్ధించదో శూద్రునిచేతయజ్ఞంచేయిస్తె । స్వర్గఫలం
యెట్లువలెసిద్ధింపదో, అట్లాగె సాధనచతుష్టయసంపత్తిలేనివానికి శ్రవణా
దులుచేస్తె వానికి జ్ఞానఫలంసిద్ధింపదు । అయితే ఈశ్రవణాదులు వ్యర్థమై
పోవునాఅంటే పోదు । అశ్వమేధాదిస్వర్గఫలంయిచ్చును । యీసాధనచతు
ష్టయము శ్రవణానకుపూర్వము లేకపోయినాగాని । శ్రవణకాలమందైన
గురుముఖంగానువిచారించి సంపాదించుకోవలెను వోయీ యధికారికి యీ
నాలుగుసాధనాలు యెందుకుజెప్పవలెను వొక్క నిత్యానిత్యవస్తువివేకమాత్రం
చాలునని చెప్పదామంటె చాలదు । లోకమందు శాస్త్రజ్ఞులైనవారికి అందరికి
నిత్యానిత్యవివేకంకద్దు. వారలు విషయాసక్తిగలిగి కామ్యకర్మాలెజెయుం
చున్నారు। కాగావారికి అధికారంచాలదు । అట్లుగనక. రెండోసాధనమున్నూ
కావలెను। అయితె రెండుసాధనాలు చాలునని చెప్పదామంటె చాలదు ।
లోకములో కొందరుబుభుక్షీశ్వరులు నిత్యానిత్యవస్తువివేకం యిహాముత్రార్థ
ఫలభోగవిరాగ యీరెండుగలవూ వారలకూ కోపతాపాలుఅధికమై కొంద
రినిదూషిస్తూ కొందరినిభూషిస్తూవున్నారు । కాంగా । మూడోసాధనమైన
శమాదిషట్క సంపత్తీన్ని కావలెను । అయితె యీమూడుసాధనాలు చాలునని
చెప్పదామంటె । చాలదు । లోకమందు యీమూడుసాధనాలుగలవారు
కొందరుగలరు వారెవరంటె । కృష్ణాజినాలుచంకబెట్టుకొని తలలుపెంచుకొని
యోగీశ్వరులనుచుపేరుపెట్టుకొని సంసారములువిడిచిపెట్టి విరక్తులై ఉపశాం
తులై । ప్రతిగృహమున్ను లేక కొందరుగలరు. వారు శ్రవణమందు దగ్గిర

చేరరుగనుక వారికిన్నీ అధికారంచాలదు । కాంగా॥ మోక్షేచ్ఛయైన నాలుగో సాధనమున్నూ కావలెను । యీనాలుగుసాధనాలుకలవాడె వేదాంతవిచార మందు అధికారి । యీసాధనచతుష్టయసంపత్తి కాయకవాచికవ్యాపారరూప ముగాదుగనుక మానసికవ్యాపారముగనుక విషయాలయందు దోషదృష్టిగల వానికి సులభముగానె సంపాదించుకోవచ్చును యిందుకుసమ్మతి॥

శ్లో॥ యావదన్యసాత్వక్తా తావత్సామాన్యమేవహి ।
వస్తునాసాధ్యతెలోకె స్వాత్మాలాభెసుకాకథా॥
నహోతుం సఫలం కర్మ నథ్యమూలమశేషతః।
త్యజెత్తై వహిత్రెదయత్యక్తః తత్పూర్వం వదం॥

ఇతి శ్రీమద్వివెకసారె సాధనచతుష్టయంనామ ద్వితీయప్రకరణం సమాప్తం॥

## వాసుదేవమననము-ప్రథమవర్ణకము.

(అచ్చుపడ్డని మొదటిసారి)

ఈప్రకృతిలోపల ననేకకోటిజీవరాసులు తమయొక్క కర్మములు వాసనలు అదృష్టములతో ట్టుకూడా లయించియుందురు. అదియేలాగంటే మైన పుష్పండలో స్వర్ణరేణువులు రొట్టువలె లీనమైయున్నవో అటువలె లీనమై యుంచున్నారు. (ఇందుకు దృష్టాంతమేకదేశము) సర్వాభవమయిన సుషుప్తియేదృష్టాంతము. బహుకాలము లీనమయియుండగా నొకసమయమునను లీనమయినజీవులయదృష్టములు పరిపక్వమవును. ఆసమయమందు త్రిగుణాత్మకమయిన ప్రకృతియయ్యె సత్వగుణము విజృంభించుటచేత మాయయని చెప్పబడును. ఈమాయయందు ప్రతిఫలించినచైతన్యమున్ను ఆమాయయొక్కన్ను మాయాధిష్ఠానమయిన చైతన్యమున్ను ఈమూడునుంగూడి యీశ్వరుడని చెప్పబడును. ఆయీశ్వరునికే అంతర్యామియనియు, అవ్యాకృతుడనియుం కొందుపేళ్లు గలవు. ఇతడే జగత్సృష్టయనియును చెప్పబడును. ఇంతెయెగాక

సృష్టిని జేసెడియందు వుపాదాన కారణమనియును, నిమిత్త కారణమనియును, యీ రెండు కారణములు కావలెనసేటివి లోకమందుకన్నారము. అదియేటు వలెననిన ఘటశరావాదులుపుట్టేటియందు మృత్తువుపాదానకారణము-కులాలుండును దండాద్యుపకరాదులును, నిమిత్తకారణంబులు. పటము నిర్మాణమందలి తంతువులు వుపాదానకారణంబు. తంతువాయుండును, తురిమెవాదులు, నిమిత్తకారణము. ఈ ప్రకారము లోకమునందు రెండుకారణములచేతను ఘటపటాద్యుత్పత్తి యేటువలెనో దార్ష్టాంతికమందును రెండుకారణముల చేత జగత్తునకు వుత్పత్తియనితోచుచున్నది. (అదియెటువలెనంటే) మాయయుపాదానకారణంబును, యీశ్వరుడు నిమిత్తకారణంబునని చెప్పుదామంటే శ్రుతికి విరుద్ధముగానున్నది. ఇంతియేగాక-ఉపాదానకారణము-సత్పదార్థమయియుండవలెను. అటులనుండెనేని-మాయయును ఆత్మయును రెండుపదార్థములాయెనుగనుక నద్వైతహానివచ్చును. కాబట్టి యీపక్షముకూడదు. మాయ నిమిత్తకారణమనియును, ఈశ్వరుడు ఉపాదానకారణమనియును చెప్పుదామంటె పూర్వమువలె నద్వైతశ్రుతికి విరోధముగానున్నది.

లోకమునందు చేతనుణ్ణే నిమిత్తకారణముగా కన్నారము. అచేతనమయినమాయ నిమిత్తకారణము గానేరదుగనుక అద్వైతహానియునువచ్చును. ఈదోషములుండుటవలన కేవలమయినమాయ యుపాదానకారణమున్ను కానేరదు. నిమిత్తకారణమున్ను కానేరదు. గనుక నిమిత్తకారణంబును, ఉపాదానకారణంబును, ఈశ్వరునకే చెప్పవలెను.

అణిమాద్యష్టసిద్ధులు. సాహిత్యపరిషద్గ్రంథాలయము.

నె 1602 ఱ పుట V 2.

తదనంతరంబున ప్రాణాయామంబు సేయవలయు। నదెట్లన్నను ప్రాణవాయువును రేచించ్చి చంద్రనాడిచేతపూరించి యథాశక్తిగానిలిపి తిరుగా సూర్యనాడిచేత మెల్లనె వుదరమునువిడిచి తిరిగి ప్రాణవాయువును సూర్యనాడి

చేత మెల్లనె వుదరమునుపూరించ్చి శాస్త్రప్రకారంబుగా కుంభమునుధరించి తిరుగా చంద్రనాడిచేతన్నువిడువవలెను। యేమార్గమునవిడుచునో ఆమార్గము ననేపూరించ్చి ధరించవలెను। మొదటిమార్గమునకంటె రెండవమార్గమున త్వరపడక మెల్లనే విడువవలెను। యిడమందు పూరించి కుంభించి పింగళ నాడిని విడిచి। తిరిగి పింగళనాడినిపూరించి కుంభించి యిడయందు విడవ వలెను। యీక్రమంబుగా సూర్యచంద్రనాడులచేత వాయువునకు యెంత్త యుక్తమో అంతనిండించి। యంతయుక్తమో అంతనిలుపవలెను। ఈక్ర మంబుచేయు రేచకపూరకకుంభకత్రయంబ్బు నొక్కప్రాణాయామంబగు। వుదయమధ్యాంహ్నసాయంకాలార్ధరాత్రములకాలానకు యిరువై చొప్పు న కుంభకాలు మెల్లమెల్లనె యెనబైదనకా దినమున్ను అభ్యశింప్పవలెను। అప్పుడు ప్రాణనిరోధమగుచుండగాను। చెమటపుట్టినట్లాళింగ్గాణిహిడ్లను వెయిం చ్చును। ఈరీతున రాక్షసేంద్రుండు ప్రహ్లాదునియంద్దుగావించ్చినవిధములైన దురణోపాయములు। బాలునిసంహ్మరింపనెరక। పాపకర్మునియందు। జేసిన సత్కారములగా। వ్యర్థమైపోగా అదిచూచి హిరణ్యకశ్యపుడు। విచార క్రాంత్తుడై। యీపిన్నవాణ్ణి। సముద్రములోముంచ్చితిని చప్రకులకొట్టిస్తిని। గదలప్రహారించ్చితిని। కొండమీదబెట్టి మోళ్లించ్చితిని। నిప్పులలోబడ త్రోస్తిని। యెనుగకాళ్లలోత్రోక్కస్తిసి। ధిక్కరించ్చితిని। శపించ్చితిని। వీడు యెంద్దునాచావలేదు। పూర్వమంద్దు శునశ్శేపుడనె మునికుమారుడు తండ్రిచాత యాగపశుత్వానకు। దత్తుడై। తండ్రి తనకు అపకారియనెదల చక బ్రతికినచంద్దాన।

యనాకనిష్టంబగు। వణుకుబుట్టినట్టాయనా మధ్యమంబగు। మాటి మాటికి పద్మాసనంబెగశినట్టాయనా వుత్తమంబగు। నిట్టియభ్యాసమున పుట్టిన చెమటను మర్దనంబుచేయగా తనువునకు దృఢత్వలఘుత్వములుబుట్టును. యీప్రాణాయామము చేతను మూడునెలలమీదట నాడీశుద్ధికలుగును। యిది ప్రాణాయామంబగు నింక ప్రత్యాహారంబెట్లంన్ననూ్న।

## ఆత్మబోధామృతరసము. అచ్చుప్రతి.

### స్థూలసూక్ష్మశరీరభ్రమలు

యోగభ్రమ-మూర్తి-భ్రమ-యోగ-భ్రమ. నింద-భ్రమ-యీభ్రమ లైనవి. యెండమావులవలెను శుక్తియందు రజితంబువలెను-రజ్జువందు సర్పంబువలెను-స్థాణువందు చోరునివలెను-యెటుల దోచుచున్నవో-యీప్రకారంబుగా-నిష్ప్రపంచస్వరూపమందు - మాయాప్రకృతి - మహాతత్వఅహంకారతత్వము-పంచతన్మాత్రలు-స్థూలసూక్ష్మాదిజగద్భ్రాంతి దోచుచున్నది - అటు దోచుట కారణమేమన్నను-అజ్ఞానమువలన-అవివేకమువలన దోచుభ్రాంతికి - నివర్తియెట్లన్న-యెండమావులున్ను-శుక్తియందు రజితమున్ను-రజ్జువందు-సర్పమున్ను-స్థాణువందు చోరుడున్ను-కాలత్రయములయందు-లేదో యీచందంబున - యీభ్రాంతులుయేమిన్ని లేనేలేవుగావున - అఖండపరిపూర్ణసచ్చిదానంద-స్వరూపము తానుతానైయే ప్రకాశిస్తున్నదని-తెలియవలశినది.

### సాహిత్యపరిషద్గ్రంథాలయము

### No 1995 మంత్రార్థము తెనుగువివరణము.

భగవంతుడికిన్ని వున్న నవవిధసంభంధములలోను ప్రణవమందులకారంచాత చెప్పపడ్డభార్యాభర్తృత్వమె ముఖ్యమని తెలియవలశినది । భార్యకు భర్తృశేషవనిత్యమైనదిగన్క యీశేవనువదలి ఇతరపురుషుంణ్ని సేవించినా భర్తకానూపలెను. అన్యపురుషుణ్ని ఉపచారాదికంవల్ల సంతోషపెట్టినప్పటికిన్ని ఆఅన్యపురుషసేవ పాపహేతువఅయి స్త్రీకి వ్యభిచారిఅన్నఅపవాదను లోకమందుకలగజేశి పరమందు రౌరవాదినరకములను అనుభవింప్పచేశి తిరిగిన్ని పాపయోనులయందు పుట్టింత్యును. అటువలెనే జీవుడున్ను సకలరక్షకుడైన శ్రీమన్నారాయణుడు కర్తకాయైవుంటూవుండగా ఆభగవంతుడితో తుల్యులని భ్రమపడి అన్యదేవతాసేవనుచేసి అన్యదేవతలను సంతోషపెట్టినవాడైనప్పటికిన్ని తాను లోకమందు దేవతాంతరపరుడన్న అపవాదనుపొంది పరమందు

(దుర్గ)తిని పొందును అని తెలియవలసినది. ఈలోకమందు అన్యపురుష సేవచేసి రౌరవాదినరకములను అనుభవింతురు. జీవుడు అన్యదేవతా సేవవల్లను స్వర్గాది సుఖాలను అనుభవింతురు. ఉభయ.....ఇంత తారతమ్యం వుంటూవుండగా జీవుడికి అన్యదేవతాసేవ స్త్రీకి వ్యభిచారంవంటిది! అనుటయట్లన్నను స్త్రీవ్యభిచారంవల్లవచ్చిన పాపంచాతను రౌరవాదినరకములను అనుభవించ్చి తిరిగిన్ని కర్మా(నుసర)ణంగా దేవమనుష్యతిర్యక్స్థావరాదులయందు పుట్టుతూ మరణములనుపొందుతూ ఆయాయిగర్భజన్మబాల్యయవ్వనవార్ధక్య మరణనరకములనే దుఃఖములను అనుభవించ్చును. జీవుడున్ను దేవతాంతరసేవవల్లను సంభవించిన సుకృతివిశేషంచాతను స్వర్గాదిఫలములను అనుభవించి క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి అని చేసిన పుణ్యంసరిపడగానే స్వర్గముమంచి భూమియందుపడి తిరిగిన్ని పూర్వకర్మానుగుణమైన దేవమనుష్యతిర్యక్స్థావరాదులయందుల యోనులనుపొంది అనంతదుఃఖావస్థలను పొందుతానుగనక దేవతాంతరసేవ స్త్రీకి వ్యభిచారంవంటిదే అని విచారింత్సవలసినది.

## నిర్గుణవాదనిరాకరణము Page 5

(భూమిక)

భ్రమయనునది బ్రహ్మగుణమా, లేక మనోగుణమా, బ్రహ్మగుణమంటే, బ్రహ్మము సగుణమగును, మనోగుణమంటే, మనస్సు ౨౪ తత్త్వములలో చేరిన ప్రకృతియొక్క భేదముగాన, నట్టిమనస్సుకు భ్రమగలిగితే నిర్గుణమైన యాత్మకు నీశ్వరత్వజీవత్వాదిబాధము లెట్లుగలిగెనని యడిగితే, ఉపాధి ప్రయుక్తమయిన యీయవచ్ఛిన్నవాదముమీద నిట్టియాక్షేపములుగలుగునని కొందఱు ప్రతిబింబవాదము చేయుచున్నారు.

ఎట్లనగా అంతఃకరణమందు ప్రతిబింబించు బ్రహ్మప్రతిబింబమే, జీవుడనియు సుఖదుఃఖాదిభోక్తృతయు జన్మాంతరంబులును, నా ప్రతిబింబమునకే యనియు, బ్రహ్మాద్వితీయజ్ఞానముచేత నంతఃకరణము నాశనముకలుగుటే మోక్షమనియు జెప్పుచున్నారు.

ఇదిచూడగా, పులివాతతప్పించుకొనబోయి సింహమువాతబడెనన్న సామితగానున్నది యెట్లనగా;

అంతఃకరణప్రతిబింబమే జీవుడని చెప్పితే, అవిద్యాస్వరూపమయిన అంతఃకరణమెక్కడిది. అంతఃకరణముంటే ద్వితీయవస్తువేర్పడును. అది అవస్తువనియంటే లేనివస్తువునందు రూపములేని బ్రహ్మము ఎట్లు ప్రతిబింబించె. మంచిది ప్రతిబింబమునకు చైతన్యము లేదే సుఖదుఃఖాదుల నెట్లనుభవించును. ప్రతిబింబము బ్రహ్మము కాదుగదా? ఈయచేతన ప్రతిబింబమునకు బ్రహ్మా ద్వితీయజ్ఞానము గలుగుటయెట్లు.

ఇట్లుగలిగితే "బ్రహ్మభూయాయకల్పతే" అనుగీతావచనప్రకారము ప్రతిబింబమూ బ్రహ్మమయ్యెది.

లేదు ప్రతిబింబహేతువయిన బ్రహ్మమునకు మోక్షముగలుగుచున్నదని చెప్పితే, చేసేవాడొకడు, దానిఫలము ననుభవించువాడు మఱియొకడు, అను సామెతయగును.

## క్రైస్తవులబైబిల్ (పాతకూర్పు 1830?)

## అపోస్తలులకార్యములు. Page 102.

(దీనిలోనిభాష క్రొత్తకూర్పులో (1870) కొంతమట్టుకు గ్రాంథికభాషగా మార్చినారు)

అయితే ఫీస్తసు అఖండములో ప్రవేశించి మూడుదినములైనతర్వాత కైసేరియ్యనుంచి యెరుసలేముకు యెక్కి వెళ్లినాడు । అప్పుడు పెద్దప్రధాన అర్చకుడున్ను యూదులలోవుండే అధికారులున్ను వానితో పౌలసుమీద విరోధంగా అగుపరిణా తాముతోవలోపొంచివుండి వాణ్ని నరకగలందులకు వీడు వాంణ్ని యెరుసలేముకు పిలువనంపించవలెనని బతిమాలి వానికి విరోధంగా ఫీస్తసు దయనుకోరిరి । అయితే ఫీస్తసు ప్రత్యుత్తరమంగా చెప్పిన దేమంటే పౌలసుకైసేరియా యెందువుంచపడుతాడు అయితే మేము అక్క-

డికి త్వరగాపోయేవారమూదుము అయినందున యీమనిషి యొంచు యేదైన
తప్పువున్నట్టాయనా మీాలో మీాలోగా శక్తిగలవాండ్లు మాతో దిగివచ్చి
వానియొందు తప్పుమోపవచ్చునని వాండ్లతో చెప్పెను కాబట్టి వారు వాండ్ల
లోగా యెనిమిదిపదిరోజులు గడిపినతరువాత కైసేరియకు దిగివచ్చి మరునాటి
యొందు న్యాయాసనముమీాద కూచుండి పౌలసును తీసుకువచ్చేటందుకు
శెలవుయిచ్చెను । కాబట్టి వాడు అగుపడగానే యెరుసలేమునుంచి దిగివచ్చిన
యూదులు చుట్టూనిలచి అనేకభారమైనతప్పులు పౌలసుమీాద మోపినారు
అయితె వీటిని ప్రత్యక్షం చెయ్యలేకపోయిరి । అంతలో పౌలసు ప్రతి
వాదంగా చెప్పినదేమంటే యూదులయొక్క ప్రమాణానికైనా దైవమంది
రానకైనా కైసారుకైనా విరోధమైనది యేవకటీ నేను చెయ్యలేదని చెప్పెను ।
అయితె ఫేస్తుసు యూదులకు సంతోషం చెయ్య మనస్సుపుట్టి పౌలసుతో
చెప్పినదేమంటే నీవు యిక్కడనుంచి యెరుసలేమునకు వెళ్లి అక్కడ
నాముందర యీసంగతులనుగూరించి విమర్శపడనీకు సమ్మతమా అని
అడిగెను. అందుకు పౌలసు చెప్పినదేమంటే నాకు న్యాయతీర్పు కావలసిన స్థల
మనే కైసారుయొక్క న్యాయాసనముముందర నేను నిలచివున్నాను
యూదులకు అన్యాయం యెంతమాత్రమూ చెయ్యలేదు యిది మీాకు బాగా
తెలిసేయున్నది । నేను అన్యాయంగా నడిచి మరణానకు పాత్రమైనది యేమై
దైనావకటిచేస్తినట్టాయనా మరణంకావడానకు వద్దనేవాణ్ని కాను అయితే
వీండ్లు నాయొందు తప్పుమోపేటువంటి సంగతులలోయేదైనా నిజమైనది
కాకపోతే వాండ్లకు సంతోషంచెయ్య నన్ను అప్పగించశక్తిగలవారు వకరూ
లేరు కాబట్టి నేను కైసారునే కోరుతానని చెప్పెను । అప్పుడు ఫేస్తుసుసభ
తోటి ఆలోచనచేశినతరువాత ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే నీవు కైసా
రునేకోరితివి గనక కైసారుదగ్గిరకే వెళ్లవత్తువని పలికెను మరికొన్నిదినము
లైనతరువాత రాజైన అగ్రిపసున్ను బర్నీకి అనేస్త్రీనిన్ని ఫేస్తుసును పరా
మరిశచేసేటందుకు కైసేరియకువచ్చినారు । వీండ్లు అనేకదినములు అక్కడ

వుండగా ఫీస్తసు పౌలసునుగూరించి జరిగినసంగతులను రాజుకు తెలియ
చెప్పినదేమంటే ఫిలీక్సుచాత నిబంధీకుడుగావుండిన వకమనిషివున్నాడు ।
నేను యెరుసలేములోయెందు వున్నప్పుడు యూదులయొక్క ప్రధానఅర్చకు
లున్ను పెద్దలున్ను వీడిమీద అగుపర్చకుని వీణ్ని గూరించి న్యాయతీర్పుకు
కోరినారు । వీండ్లకు నేను ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటె తప్పు మోపపడిన
వాడున్ను తప్పు మోపేవాండ్లున్ను ముఖాముఖం తారశిల్లివున్నందున వాడి
యెందు మోపేతప్పునుగూరించి స్వాలుచెయ్యడానకు తగినసమయం దొర
కకమునుపే సంహారానికి యేమనిష్యినైనా అప్పగించేది రూమువాండ్లకు
మరియాదకాదని అంటిని । అయినందున వాండ్లు యిక్కడికివచ్చినప్పుడు
నేను అశ్రద్ధచెయ్యక మర్నాటియెందు న్యాయాసనముమీదకూచుండి
వాణ్ని తీసుకురావడానకు శెలవుయిచ్చినాను । కాబట్టి తప్పు మోపేవాండ్లు
నిలువపడినప్పుడు నాకు తోచినప్రకారం తప్పు వీడిమీద అగుపర్చలేక ।
తమమతమునుగూరించిన్ని చచ్చిపోయినతరువాత మళ్లీ బ్రతుకుచూవున్నా
డని పౌలసుచెప్పిన యేసనే వకణ్నిగూరించిన్ని అయిన తర్కవ్యాజ్యమే వీని
మీద వాండ్లకుకలిగియుండెను । అయితే అటువంటివాటిని విమర్శించేది
నాకుసందేహమైనందున పౌలసును అడిగినాను యేమంటె నీవు యెరుస
లేముకువెళ్లి అక్కడ యీకార్యములనుగూరించి విమర్శపడేటందుకు నీకు
మనస్సా అని అడిగితిని । అయితే చక్రవర్తితీర్పుదాకా తాను నిలుపుకావలె
నని పౌలసుకోరినప్పుడు నేను వాణ్ని కైసారుసముఖానకు పంపించేపర్యంతము
వుంచుమని శెలవుయిచ్చినానన్నట్టుగా చెప్పెను । అప్పుడు అగ్రిపసు ఫీస్త
సుతో చెప్పినదేమంటే వీనిముఖవచనమువల్ల విన మనస్సు నాకున్ను కద్దని అన
గానే రేపు వినవత్తువని ఫీస్తసుచెప్పెను. అయినందున మర్నాటియెందు
అగ్రిపసున్ను బణీకాకిన్ని గొప్పఘనముచాతవచ్చి సైన్యాధిపతులతోటిన్ని
పట్నపుశ్రేష్ఠులతోటిన్ని రత్నశాలలోకి ప్రవేశించినప్పుడు ఫీస్తసు శెలవు
యివ్వగానే పౌలసు తీసుకురాపడెను । అప్పుడు ఫీస్తసుచెప్పినదేమంటె వో

అగ్రిపసురాజా మాతోకూడావుండే సకలమనుష్యులలారా వీణ్ని మీరు చూస్తూవున్నారు వీణ్నిగూరించి యూదులయొక్క సమూహమంతా యెరుసలేమయందున్ను యిక్కడనున్ను నాతోటి మనవిచెప్పినదేమంటే యిఖమీదు బ్రతుకతగినవాడుకాడని ఆర్భాటించినారు । అయితె వాడు యేమైనా మరణానికి పాత్రమైనకార్యంచేసినట్టు నాకు అగుపడలేనందునానున్ను మరిన్ని వాడే చక్రవర్తిని కోరినందునానున్ను నేను వాణ్నిపంప్పించడానకు సిద్ధమైవుంటిని వీణ్నిగూరించి ప్రభువుగారికి యేమైనావ్రాయడానకు రూఢమైనవి నాదగ్గరలేనందున మీఅందరియెదటికిన్ని వోఅగ్రిపసురాజా మీయెదుటికి సహాగానున్ను వాణ్నిగూరించి విమర్శించడమైనతరువాత వ్రాయడానకు నాకుయేదైనా అగుపడునేమో అని వాణ్ని రప్పించితిని । యేమంటే సిబ్బాంధీకుణ్నిపంపినవానిమీద మోపినదియేదో అది అగుపర్చకవుండేది అప్రయోజనమని నాకు తోచననేదిగా పలికెను ।

## క్రైస్తవులబైబిలు. 1870 సం. కూర్పు.

## అపోస్తలులకార్యములు 25 అధ్యాయము

ఫేస్తు ఆదేశాధికారమునకువచ్చి మూడుదినములైనతరువాత కైసరయ్యనుంచి యెరూషలేమునకు వెళ్లెను. అప్పుడు ప్రధానయాజకుడు యూదులలో ముఖ్యులును అతనియెదుట పౌలుమీద నేరము మోపిరి. మరియు త్రోవలో అతనిచంపుటకు కుట్రచేసి—మీరు దయచేసి అతని యెరూషలేమునకు రప్పించుమని, అతనికి విరోధముగా మనవిచేసి వేడుకొనుచుండిరి. అందుకు ఫేస్తు-పౌలు కైసరయ్యలో ఉంచబడవలెను; అయితే నేను శీఘ్రముగా అక్కడికి వెళ్లనైయున్నాను, గనుక మీలోగట్టివారు నాతోకూడావచ్చి, ఆమనుష్యునియందు తప్పితము ఏదైనను ఉంటే, అతనిమీద మోపవచ్చునని ఉత్తరముచెప్పెను. అతడు వారిపట్టణములో కొంచెము ఎక్కువతక్కువ ఎనిమిది దినములు గడిపి, కైసరయ్యకువెళ్లి మరునాడు న్యాయపీఠముమీదకూర్చుండి,

పౌలును తీసుకొనివచ్చుటకు ఆజ్ఞాపించెను. అతడు వచ్చినప్పుడు యెరూష
లేమునుండివచ్చిన యూదులు చుట్టునిలిచి, తాము రుజువుపరచలేనివి బలు
వైనవియునైన చాలానేరములను పౌలుమీద మోపిరి. అందుకు అతడు-
యూదులబోధనప్రమాణమునుగూర్చియైనను, గుడినిగూర్చియైనను కైసరు
గూర్చియైనను, ఎంతమాత్రమును తప్పితము చేయలేదని ఉత్తరమిచ్చెను.
అయితే ఫేస్తు, యూదులు కృతజ్ఞతగలవారై యుండవలెనని-యెరూషలేమునకు
వచ్చి, అక్కడ నాయెదుట వీటినిగూర్చి న్యాయపుతీర్పుపొందుటకు నీకు
మనస్సుకలదా? అని పౌలును అడిగెను. అందుకు పౌలు కైసరు న్యాయ
పీఠము యెదుట నిలువబడియున్నాను. నేను న్యాయపుతీర్పుపొందవలసినస్థల
మిదే; యూదులకు నేను అన్యాయమేమియు చేయలేదని నీకు బాగా తెలి
సును. నేను న్యాయముతప్పి చావుకుతగినది ఏదైనను చేసియుంటె, చావుకు
వెనుకతీయను. అయితే వీరు నామీద మోపుచున్న నేరములలో ఏదియు
లేకుంటే ఎవడైనను నన్ను వారికి అప్పగించలేడు; కైసరుతో నాసంగతి చెప్పు
కొందునని పలికెను. అప్పుడు ఫేస్తు తనఆలోచన సభవారితో మాటలాడినతరు
వాత-కైసరుతో చెప్పుకొందువా? కైసరుయొద్దికి వెళ్లవలెనని ఉత్తరమిచ్చెను.
కొన్నిదినములు గతించినతరువాత రాజైనఅగ్రిప్పయు, బెర్నీకేయు ఫేస్తును
దర్శించేనిమిత్తము కైసరయ్యకువచ్చిరి. అక్కడ వారు అనేకదినములు గడిపిన
తరువాత, ఫేస్తు పౌలుసంగతి రాజుకు తెలియచెప్పెను. అదేమనగా-ఫేలిక్సు
వల్ల బందికాడుగా విడువబడిన ఒకమనుష్యుడు కలడు. నేను యెరూష
లేములో ఉన్నప్పుడు ప్రధానయాజకులు యూదులపెద్దలును అతనిగూర్చి
సమాచారము చెప్పి, అతనికి విరోధముగా తీర్పుచేయవలెనని వేడుకొనిరి.
అందుకు నేను-నేరము మోపబడినవాడు, నేరము మోపేవారికి ముఖాముఖిగా
ఉండి, తనమీద మోపబడిననేరమునుగూర్చి ప్రత్యుత్తరము చెప్పుకొనుటకు
అతనికి అవకాశమియ్యకమునుపు ఏమనుష్యునినైనను అప్పగించుట రోమీ
యుల ఆచారముకాదని ఉత్తరమిచ్చితిని. కాబట్టి వారు ఇక్కడికివచ్చినప్పుడు

నేను ఆలస్యమేమియుచేయక మరునాడు న్యాయపీఠముమీద కూర్చుండి, ఆమనుష్యుని తీసుకొనివచ్చుటకు ఆజ్ఞాపించితిని. నేరము మోపినవారు నిలచినప్పుడు, నేను తలంచిన నేరములలో ఒకటిని అతనిమీద మోపలేదు. అయితే తమమతమునుగూర్చియు చనిపోయిన యేసు అనే ఒకనిగూర్చియు ఇతనితో వారికి కొన్ని తర్కములుకలిగెను. అతడు బ్రతికియున్నాడని పౌలు చెప్పెను. నేను అట్టివాదములవిషయము సందేహపడి, అతడు యెరూషలేముకు వెళ్లి అక్కడ వీటినిగూర్చి తీర్పుపొందుటకు అతనికి ఇష్టమగునేమో అని అడిగితిని. అయితే పౌలు ఔగుస్తు విమర్శకు తానుఉంచబడుటకు చెప్పుకొనినందున నేను అతని కైసరుయొద్దికి పంపించేమట్టుకు అతడు ఉంచబడుటకు ఆజ్ఞాపించితినని పలికెను. అప్పుడు అగ్రిప్ప-ఆమనుష్యుని నోటిమాటవినుటకు నాకును మనస్సుకలదని ఫేస్తుతో పలికెను. అందుకు అతడు రేపు వినవచ్చునని చెప్పెను. కాబట్టి మరునాడు అగ్రిప్పయు బెర్నీకేయు మిక్కిలిడంబముతో వచ్చి, సహస్రాధిపతులతోను పట్టణమందలి శ్రేష్ఠులతోను కొలువుకూటములో ప్రవేశించినతరువాత, ఫేస్తుసెలవిచ్చినప్పుడు పౌలు తేబడెను. అప్పుడు ఫేస్తు-రాజులైన అగ్రిప్ప! మాతోకూడా ఇక్కడఉన్న సమస్తమనుష్యులారా మీరు ఈమనుష్యునిచూస్తున్నారు; యూదులసమూహమంతయు యెరూషలేములోను, ఇక్కడనును-వీడు ఇంకాబ్రతుకుటతగదని కేకలువేయుచు, ఇతనిగూర్చి నన్ను బతిమాలుకొనిరి. అయితే అతడు చావుకుతగినది ఏదియుం చేయలేదని నేను తెలుసుకొని, అతడు-ఔగుస్తుతో చెప్పుకొందుననిపలికినందున అతనిపంపుటకు నిర్ణయించియున్నాను. అతనిగూర్చి మన ప్రభువుపేర వ్రాయుటకు, నాకు నిశ్చయమైనది ఏదియు లేదుగనుక, విచారణఅయినతర్వాత వ్రాయుటకు ఏమైనను నాకుకలిగేటట్టు మీఅందరిఎదుటికి రాజైన అగ్రిప్ప! ముఖ్యముగా నీయెదుటికి అతని తెప్పించియున్నాను. ఖైదీమీద మోపబడిన నేరములుచూపక, అతనిపంపుట యుక్తముకాదని నాకు తోచుచున్నదనెను.

## లూకా పదిహేనోపర్వము.

### పాతకూర్పు. (1830?)

(దీనిలోనిభాష కొత్తకూర్పులో (1890) కొంతమట్టుకు గ్రాంథికభాషగా మార్చినారు.)

ఒకనికి యిద్దరు కుమాళ్లుగలరు । వాండ్లలోచిన్నవాడు తండ్రినిచూచి ఓతండ్రీ ఆస్తిలో నాకు వచ్చేవంత్తు యివ్వమనిచెప్పినందున వాడు తనపుత్రులకు తన జీవనోపాధిని పంచిపెట్టును । కొన్నిదినములైనతరువాత చిన్నకుమారుడు సమస్తం కూడచేసుకొని దూరదేశానకు వెళ్లిపోయి అక్కడ దుర్మార్గానులయందు నడచి తన ఆస్తిని వ్రయముచేసుకునెను । అయితె అంతా సరిపడినతరువాత ఆదేశమందు మహాక్షామం కలిగి వుండెను అయినందున వానికి లేమివచ్చెను। కాబట్టి వాడుపోయి ఆదేశముయొక్క పట్నపువాండ్లలో ఒకనితో కలుసుకున్నందున వీడు వాణ్ని పందులుమేపించడానకు తనపొలములలోకి పంపించెను । అప్పుడు పందులు తినేపొట్టువల్ల తనకడుపునింపుకోను ఆశించెను యేమంటె వానికి యంతమాత్రం యిచ్చేవాడు ఒకడూ లేడు । అయితే వాడు బుద్ధితెచ్చుకుని చెప్పుకున్నదేమంట్టే నాతండ్రివద్ద యిందరుమంది కూలివాండ్లకు విస్తారమైన ఆహారంకలిగివుండగా నేను క్షామమువల్ల లయమయేవాణ్నైతిని । కాగా నేనులేచి నాతండ్రిదగ్గిరకుపోయి వాణ్ని చూచి ఓనాతండ్రీ పరలోకానికిన్ని మీసముఖానకున్ను దోషంచేస్తిని । యికను నేను మీయొక్కకుమారుడని చెప్పపడపాత్రుణ్ని కాను మీయొక్క కూలివాండ్లలో ఒకనివలెనె నన్ను యెంచుకోవలెనని చెప్పుతానన్నట్టుగా అనుకుని లేచి తనతండ్రివద్దికివచ్చెను । అయితె వీడు యింకా దూరానవున్నప్పుడె వానితండ్రి వాణ్నిచూచి కనికారించ్చి పరుగెత్తివచ్చి వాని మెడమీద పడి వాణ్ని ముద్దులాడెను । అయితె కుమారుడు వాణ్నిచూచి ఓతండ్రీ పరలోకానికిన్ని మీసముఖానకున్ను నేను పాపముచేస్తిని యికను నేను

మీయొక్క కుమారుడనని చెప్పబడ పాత్రుణ్ణి కానని చెప్పగా తండ్రి శేవకులతో ప్రధానవస్త్రము బైటికి కొంచవచ్చి వీణ్ణి ధరింపచేశి వీని చేతికి వుంగరమున్ను పాదాలకు పాదరక్షలనున్ను తొడిగించండి। మరిన్ని కొవ్విన దూడను కొంచవచ్చి కొయ్యండి మనము భోంచేశి సంభ్రమముగా వుందాము। యేమంటే యీ నాయొక్క కుమారుడు చచ్చినవాడై తిరిగీ బ్రతికెను. పోయినవాడై వుండి తిరిగీ దొరికెనని చెప్పినందున వాండ్లు సంభ్రమము చెయ్య ఆరంభించిరి। అయితే వానియొక్క పెద్దకుమారుడు పొలములో వుండివుండెను వాడు యింటిసమీపానకు వచ్చినప్పుడు సంగీతమునున్ను నాట్యమాడేదిన్ని విన్నందున। శేవకులలో వకణ్ణి పిలచి యిదియేమిటి అని అడిగినాడు। వాడు యేమంటె మీయొక్క తమ్ముడు వచ్చెనుగనుక నీతండ్రి సుఖంగానున్ను క్షేమముగానున్ను వున్న వాణ్ణి చేచుణాకుని కొవ్విన దూడను కొయ్యించిరని చెప్పినప్పుడు। వాడు కోపగించి యింట్లోకి ప్రవేశించనివాడుగా వుండెను అందువల్ల వానితండ్రి బయలువెళ్లి వాణ్ణి వేడుకొనెను.

అయితే వాడు తండ్రినిచూచి యిదుగో యిన్ని సంవత్సరములుగాంచి నేను మీకు శేవచేస్తూవుంటిని మీయొక్క ఆజ్ఞను యేకాలమందైనా మీరినవాణ్ణి కాను అయినప్పటికిన్ని నాశ్నేహితులతోను నేను సంభ్రమము చేసుకోవడానకు యేసమయమందైనా మేకపిల్లనైనా యివ్వకపుండిరి. అయితే వేశ్యలతోకూడి మీయొక్క జీవనోపాధిని బక్షించిన యీమీయొక్క కుమారుడు వచ్చినప్పుడు వానికి కొవ్విన దూడను కోశివేయ్యిస్తిరని పలికెను। అయితే వాడు వీనితో చెప్పినదేమంటె వో నాకుమారుడా నీవు నావద్ద యెప్పుడున్ను వున్నావు నాకు కలిగినదంతా నీదేను. అయితే సంతోషముచాత సంభ్రమం చెయ్యవలశిననిమిత్తంకద్దు యేమంటె నీయొక్క తమ్ముడు చచ్చినవాడై తిరిగీ బ్రతికెను పోయివుండి తిరిగీ దొరికెనని చెప్పెనసేదిగా శలవుయిచ్చిరి.

## లూకా 15 అధ్యాయము

### పాతకూర్పులోని పాఠములు కొన్ని ఈకూర్పులో మారినవి. (1871)

ఒకమనుష్యునికి ఇద్దరు కుమారులు కలరు । వారిలో చిన్నవాడు తండ్రితో—తండ్రీ! ఆస్తిలో నాకు వచ్చుపాలు ఇమ్మని పలికెను. అతడు వారికి తనఆస్తిని పంచిపెట్టెను। కొన్నిదినములైనతరువాత ఆచిన్నకుమారుడు సమస్తము కూర్చుకొని, దూరదేశమునకు ప్రయాణమైపోయి, తనఆస్తిని దుర్వ్యాపారములో పాడుచేసెను. అదంతయు వ్యయముచేసినతరువాత, ఆ దేశమందు గొప్పకరువు కలిగెను. అప్పుడు అతడు ఇబ్బందిపడసాగెను. అతడు వెళ్లి, ఆదేశస్థులలో ఒకనితో కలుసుకొనెను. అతడు పందులను మేపుటకు తనపొలములలోకి అతని పంపెను. అతడు పందులుతిను కాయలతో తన కడుపునింపుకొన ఆశపడెనుగాని, ఎవడును అతనికి ఇచ్చుచుండలేదు.

అయితే బుద్ధి వచ్చినప్పుడు, అతడు—నాతండ్రియొద్ద ఎంతోమంది కూలివాండ్లకు అన్నము అతివిస్తారముగా నున్నది. నేను ఆకలివల్ల ఇక్కడ నశించిపోవుచున్నాను.

నేను లేచి నాతండ్రియొద్దకువెళ్లి,—తండ్రీ! నేను ఆకాశమునకు విరోధముగాను నీయెదుటను పాపముచేసితిని, ఇకమీదట నీకుమారుడను అనిపించుకొనుటకు యోగ్యుడనుకాను; నన్ను నీకూలివాండ్లలో ఒకనివలెచేయుమని అతనితో చెప్పుదుననుకొని, లేచి తనతండ్రియొద్దకువచ్చెను. అతడు ఇంక దూరముగానున్నప్పుడు అతనితండ్రి అతనిచూచి, కనికరపడి, పరుగెత్తి, అతనిమెడ కట్టుకొని ముద్దుపెట్టుకొనెను. అప్పుడు ఆకుమారుడు అతనితో—తండ్రీ! నేను ఆకాశమునకు విరోధముగాను నీయెదుటను పాపముచేసితిని; ఇకమీదట నీకుమారుడను అనిపించుకొనుటకు యోగ్యుడనుకానని పలికెను. అయితే తండ్రి తనదాసులనుచూచి—ప్రశస్తవస్త్రము తెచ్చి ఇతనికి తొడిగించి, ఇతనిచేతికి ఉంగరముపెట్టి, పాదములకు చెప్పులు తొడిగించుడి కొవ్వినదూడను తీసుకొనివచ్చి వధించుడి; మనముతిని సంభ్రమపడుదుము; ఈ

నాకుమారుడు చనిపోయి తిరిగీ బ్రతికెను; తప్పిపోయి దొరికెనని చెప్పెను. అప్పుడు వారు సంభ్రమపడసాగిరి. అంతట అతని పెద్దకుమారుడు పొలములో నుండెను. అతడు వచ్చుచు ఇంటికి సమీపించినప్పుడు, వాద్యము నాట్యమును విని, సేవకులలో ఒకనిపిలిచి,—ఇవియేమిటి? అని అడిగెను. ఆసేవకుడు అతనితో—నీతమ్ముడువచ్చెను. అతడు తనయొద్ద సురక్షితముగా చేరినందున నీతండ్రి కొవ్వినదూడను వధింపచేసెననెను. అయితే అతడు కోపపడి లోపటికి వెళ్లనొల్లకపోయెను. గనుక, అతనితండ్రి వెలుపటికివచ్చి అతని వేడుకొనెను.—అందుకు అతడు తనతండ్రితో—ఇదిగో! ఇన్నియేండ్లు నిన్ను సేవించుచున్నాను. నీ అజ్ఞను నేను ఎప్పుడును మీరలేదు. అయినను నేను నాస్నేహితులతో సంభ్రమపడునట్లు, నీవు నాకు ఎన్నడును ఒక మేకపిల్లనైన ఇయ్యలేదు.—అయితే నీఆస్తిని వేశ్యలతో కూడ తినివేసిన ఈ నీకుమారుడు రాగానే, వీనికొరకు కొవ్వినదూడను వధింపచేసితివని చెప్పెను.—అందుకు అతడు—కుమారుడా! నీవు ఎల్లప్పుడును నాతోకూడనున్నావు; నావన్నియును నీవైయున్నవి. మనము సంభ్రమపడి సంతోషించుట యుక్తమే. నీతమ్ముడైన ఇతడు చనిపోయి తిరిగి బ్రతికెను. తప్పిపోయి దొరికెనని అతనితో చెప్పెననెను.



౪

# కథలు.

## చార్‌దర్వీషు

పీఠిక..."భగవదనుగ్రహముచేత హిందుస్థాన్ ఖండము యొక్క ప్రజాపరిపాలనము వర్తమానమునందు ఇంగ్లీషువారు జరిగించుచున్నారు. పూర్వయుగములయందు ఋషులయొక్క తపస్సుచేత సాధించబడినదూర దృష్టి, దూరశ్రవణము, వాయువేగము, మనోవేగము కాలపరిమాణనిరూపణము మొదలయినవి వీరికి లోహాదియంత్రములచేత సమకూడినవి. అధికారులకే యిటువంటియోగ్యత కలిగినప్పుడు ప్రజలకందరికిని క్రమక్రమముగా సత్ప్రవర్తనకలుగుచున్నందున ఆయధికారమే యింకా అభివృద్ధికిరావలెనని కోరతగినది.

"ఈయధికారము కింద నున్న గొప్పపట్టణములలో నొకటియైన విశాఖపట్టణమనుపట్టణమందు నివసించి యున్న మహారాజశ్రీ గోడే నారాయణ గజపతి రాయనింగారు విద్యావ్యాసంగమునిమిత్తము అనేక గ్రంథములను చూచుచుండగా, వొక రోజున చార్‌దర్వీషు అనే నలుగురు ఫకీరుల చరిత్రమును చిత్తగించగా, చిత్రవిచిత్రములై మనోల్లాసము కల్పించినదేకాక, యీగ్రంథములోగడ అమీరుఖుసురూ యను ఒక మహమ్మదీయునివల్ల ఫారసీభాషలో జాతమయియున్నట్లున్ను, అది ౧౮౦౧ సం॥ లో ఢిల్లీ కాపురస్తుడయిన మీరుఅమ్మన్ అనే యొకతురకవల్ల ఉరుదూభాషలోనున్ను ౧౮౧౧ సం॥లో మేస్టర్ ఎల్ ఎస్ స్మిత్ అను యూరోపియన్‌వల్ల ఇంగ్లీషుభాషలోను తర్జుమ అయినట్లున్ను కనబడుతున్నందున, దీన్ని లోకోపకారముగా తెనుగు

భాషలో యెవరైనా చేస్తే బాగా వుంటుందని చెప్పినందున అపుడు యెల్జి మిల్లి మల్లికార్జునులనే యొకబ్రాహ్మణుడు ఆమోదించి ఈగ్రంథమును తెను గించడమున కుపక్రమించెను. తెనుగు దేశములో రాజ్యాంగములు బదలా యించడముచేతను యితరదేశస్థులనేకులు ఒక్కొక్కస్థలమందు తరుచుగా కలిగియుండడముచేతను అనేకభాషలయొక్క శబ్దములు మిళితమయి, స్వభావవలె వాడికై యున్నందున, వాటిని భేదించి తెనుగుమాటలతో వ్యాక రణపద్ధతిగా గ్రంథముచేసేయెడల, సర్వజనసాధారణము కాకపోవడమేకాక దేశీయభాషాచమత్కారము బోధపడక, విరసమౌనని తోచి, స్త్రీపురుషులం వకరితో నొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేప ముగా జాతీయరసముతో (భాషాంతరులకు పూర్వోత్తరములు తెలియడము నకు ముఖ్యమయినరిమార్కులతో) యీగ్రంథము సేయ నిశ్చయించడమయి నది; గనుక, ఇందుకు సమస్తమయినవారు హర్షించవలసినది.

"ఈచార్ దర్విషుకే బాగ్-బహార్ (అనగా శృంగారతవము) అని కూడ రెండోపేరు కలిగియున్నది. యిందుకు అధిదేవత విద్యాయు, స్థానము సరసహృదయము అయినందున కాలనిర్ణయములేకుండా యెల్లప్పుడు నందన వనమువలె పల్లవించుచు పుష్పించుచు ఫలించుచున్నది. విశేషించి యీవనము మున్షీ నూరుమహమ్మదుసాహెబు మొదలయినవారిసహాయమువల్ల ఆయా భాషలనే తోటలోనుండి అంటుగట్టుతీసి నాటినటువంటిన్ని, విద్వాంసులయిన శ్రీమత్పరవస్తు వేంకటాచార్యులయ్యవార్లగారి పాండిత్యమనే దోహదమువల్ల పెరిగినటువంటిన్ని, కృతినాయకుని యాదరణరసమనే జీవనమువల్ల సంరక్షింప బడినటువంటిన్ని ఈయారామవిహారము సమస్తమయిన దేవతలకు మనుష్యు లకుకూడా అభిరామమయి యుండడమే కాకుండా, దైవకటాక్షమువల్ల యీ సంతానప్రతిష్ఠాఫలము గ్రంథకర్తకు కలగడమునకు యేమివింత. మరిన్ని, యిది యచ్చుపడడమువల్ల బంగారు పుష్పసమూహమునకు పరిమిళము గలిగి నట్టు ప్రకాశించి మనోహరమయి యుండుననికూడా నమ్మతగివున్నది.

అయితే కొన్ని పుష్పముల క్రింద ముళ్లున్ను ఫలములయందు గింజలున్ను రస మందు నలకలున్ను వున్నట్టుగా నిందులో తప్పు లుండక మానవు. గనుక కరు ణచే స్వారస్యమును మాత్రమే గ్రహించవలసినదని సమస్తమయిన యోగ్యుల నున్ను ముందుగా ప్రార్థించి కథాప్రారంభము చేయడమయినది.”

[గ్రంథకర్త రచనకుమాదిరిగా “రెండోఫకీరుకథలోని” ఉపాఖ్యానము—హాతెంతాయి అనే ఆయనయొక్క వృత్తాంతము ఉదాహరిస్తున్నాను.]

“హాతేం దినములలో అరబ్బీ దేశంబునకు నవుఫల్ అనే పేరుగల పాదుషా అధికారియై యుండెను. అతడికి హాతేం విశేషప్రతిష్ఠావంతుడయి యున్నాడనే హేతువుచేత విరోధంబు పుట్టి విస్తారంగా బలములు తీసుకొని యుద్ధానకు హాతెం పయికి వచ్చెను. హాతెం భగవద్భక్తుడును పుణ్యాత్ముడును అయినందున, నేను యుద్ధసన్నద్ధుడనయితే ప్రజలు చనిపోదురని యోలోచించి తా నొంటరిగా వెళ్లి వకకొండ గుహలో దాగి యుండెను. అది నవుఫల్ కు తెలియగానే హాతెంయొక్క చరస్థిరములయిన, ఆస్తి తీసుకుని హాతెమును ఎవరైనా పట్టుకునివస్తే, వారి కయిదువేలమొహర్లు ఇనామిప్పించెద మని ప్రకటనచేసి, యిస్తియారునామా కూడా కట్టించినందున, అతణ్ణి వెదకడము కంద రారంభించినారు. వొక రోజు నొక ముసలివాడు, వాడి ముసలిది, యిద్దరును, ముగ్గురు చిరుచిన్నవాళ్లను కూడా తీసుకొని, యడవిలో కర్రలు కొట్టి తెచ్చుకొనే నిమిత్తం హాతేం దాగియున్న స్థలమందగ్గిరికి ప్రవేశించి, కర్రలు విరుచుచుండిరి. అప్పుడా ముసలిది మనదినాలు బాగా వుంటే, హాతెం మన కెక్కడనయినా కనుపడతాడు; అతణ్ణి మనము నవుఫల్ దగ్గిరికి తీసుకొని వెళ్లితే ఆయ నయిదువేల మొహర్లినామిచ్చును; ఆధనము తీసుకొని ఇబ్బందిలేక సుఖముగా వుండవచ్చు ననగానే, ముసలివాడు విని,—యేమిపేలుతావు. మన నుదుట ప్రతిరోజు కర్రలుతెచ్చుకొని బాజారులో అమ్మి జీవించవలసిన దని, లేదా, అడవిలో పులి యెత్తుకొని

పోవలసిన దని, వుండగా, మన చేతికి హాతెం యెందుకు దొరుకును; పాదుషా యెందు కిచ్చు నన గానే, ముసలిది విచారపడి, ఉసూరుమని ఊరకున్నది. ఈ యిద్దరి ప్రసంగం హాతెం విని, తాను దాగియుండి ప్రాణమును సంరక్షించుకోవడము వృథా; యీ యదృష్టహీనులకోరికె లభింప జేయక పోవడము తన పౌరుషమునకు ఔదార్యమునకు దూరమై యున్న దని కనికరము లేని వాడు మనుష్యుడే కా డని, వొరులకష్ట మెరుగనివాడు కటికవా డని, వకరాయాసము పోగొట్టడమునకు భగవంతుండు మనుష్యుని సృజించెను గాని, తన పూజార్థమై పుట్టించిన యెడల, దేవ దూత లాయన కేమి తక్కువగా నుండిరని, ఎంచి, పైకి వచ్చి—నేనే హాతెమును; నన్ను నవుఫల్ దగ్గిరికి తీసుకుని వెళ్లితే, ఆయన ఖరారు చేసిన ప్రకారము నీకు సొమ్ము యిచ్చు నన గానే, ఆముసలివాడు—ఇప్పట్లో ఈలాగు జరిగించడమువల్ల తనకు సదుపాయము, క్షేమము కలుగును; ఐతే, యతడు ఏమి యాలోచించి ఏమిచేసునో; నిన్ను వక వేళ చంపివేస్తే ఏమిచేతును. నీవంటియోగ్యుణ్ణి ఆశ చేత విరోధికి వప్పగించుట నావల్ల నయ్యేపని కాదు. ఆసా మెంత కాలము తిని జీవిస్తాను. చచ్చిన తరువాత భగవంతుని కేమి జవాబు చెప్పను. అనగా, హాతెం బహుంకా ప్రార్థించి,—నాయొక్క ప్రాణమున్ను ధనమున్ను ఎవరికైనా అక్కరకు రావడమే మంచి దని యాలోచించుచుంటాను. నన్ను తీసుకొని వెళ్లవలసిన దని, నే నెల్లప్పుడు ఇటువంటి తాత్పర్యము కలిగే వున్నా నని, సంతోషముగా ననెను; గాని, అతణ్ణి తీసుకొని వెళ్లి వప్పగించి ఆలాభమును పొందడముకా ముసలివాడు ఏవిధముగానున్ను వొప్పినవాడుకాడు. తుదకు హాతెం ముసలివానిని చూచి, నీవు తీసుకొని పోని యెడల ఖుద్దున పాదుషా దగ్గిరికి వెళ్లి, ఈముసలివాడు (నన్ను అడవిదగ్గర కొండ గుహలో దాచినట్టు చెప్పక మానన న్నందున, వాడు నవ్వి మంచికి బదులుగా చెడుగు సంప్రాప్త మయితే నా గ్రహచారమని, వకరి నొకరు మాటలాడే సందడి యనేకులు విని, పోగయి, యితడే హాతే మని పట్టి, తీసుకొని, నవుఫల్ వద్దికి వెళ్లిరి. ఆ

ముసలివాడు విచారపడుతూ వెంటబడ్డాడు. నవుఫల్ యెదుట పడగానే యితణ్ణి ఎవరు పట్టుకొన్నారని అడిగితే, వక రాతిగుండెగల అబద్ధీకుడు, ఇటువంటి పని తనకన్న మరియెవరు సేయ గలరని, ఈఫలితము తనకే గల్గినందున ఆకాశమువిూద జండా పాతితి ననెను. మరియొకడు—తాను చాలా రోజులనుంచి బహుప్రయత్నము చేసి యడవిలోనుంచి తీసుకు వచ్చె ననియు, చిత్తగించి కరారు ప్రకారం బహుమతీ సేయవలసినదనియు కొందరు సొమ్ముకాశపడి యనేక విధములుగా తమవల్లనయినమట్టుకు ప్రజ్ఞలు చెప్పిరి. ముసలివాడు వక మూలనుండెను. అప్పుడు హాతెం అందరు చెప్పినఅబద్ధములు విని, నవుఫల్ ను చూచి, మీకు నిజము తెలియవలసియుంటే, కేటాగా నిలువబడియున్న ఆముసలివాడు నన్ను పట్టి తీసుకొనివచ్చెను; వానికి మీ కరారు ప్రకారము ఇవ్వవలసిన దని—యవయవములలో మనుష్యుని నాలుక ముఖ్యమయినది గనుక, అన్న మాట తప్పకూడదు; లేకుంటే, ఆనాలుక నోరు యెరగని పశువుకు కలిగి యున్నందున మనుష్యునికి పశువుకు భేదమే లేదని—హాతెం పాదుషాకు చెప్పెను. ఆపాదుషా ఆముసలివానిని పిలిచి, యిందుల నిజము యే మని అడగగానే, వాడు యావత్సంగతులున్ను తెలియజేసినందున, నవుఫల్ హాతెం యొక్క ధయిర్యమునకు ఆశ్చర్యపడి,—చహాభాష్ ! నీయొక్క దాతృత్వము ప్రాణానకు సహితము లక్ష్యపెట్టలే దని, నేను తరువాత అబద్ధపు దావాలు తెచ్చిన మనుష్యులను విరిచికట్టి ప్రాణము పొయ్యే లాగున, అయిదువేల మొహరులకు బదిలీగా ప్రతివారికి అన్నేసి పయిజారు దెబ్బలు కొట్టించి తోలివెయ్యడమే కాకుండా, అనేకమందికి ఉపకర్తయున్ను యాచకులవిషయమయి ప్రాణము నిచ్చే మనుష్యుడున్ను దయివకార్యమందు ఎల్లప్పుడు నిలిచియుండే వాడున్ను అయిన హాతెముతో ఈవ్యాజాగా నుండడము ధర్మముకా దని, నవుఫల్ ఆలోచించి, హాతెం చెయ్యిపట్టుకొని, అందుకు యిందుకు నీనే తగుదువని, తాజీ మిచ్చి, తనయొద్ద కూర్చుండబెట్టుకొని, ఆయనయొక్క దేశము, ఆస్తి, ధనము తక్షణమే యాయన యధీనము

చేసి, అతనికి కలిగియుంన్న కులపెత్తనము తిరిగి యిచ్చి, యీముసలివాని కయిదువేలమొహారు లిప్పించినందున వాడు దీవిస్తూ పోయెను.

## ద్వాత్రింశత్సాలభంజికలకథలు.

(ఇది 1819 వ సం॥న రావిపాటి గురుమూర్తిశాస్త్రి బడిపిల్లలకోసము రచించి అచ్చువేయించినది; ఆకూర్పుప్రతి లండనునగరమందున్నది. 1855వ సం. కూర్పులోనిపాఠము ఉదాహరిస్తున్నాను. ఇంచుమించుగా మొదటికూర్పులో ఉన్నట్టే ఉన్నది.]

విక్రమార్కుడు భూసంచారముచేసేకాలములో వకనాడు అతని వద్దికి నలుగురుసిద్ధులు వచ్చిరి. వారినిచూచి విక్రమార్కుడు అయ్యా మీరు యేయేదేశములుచూచినారు. యేయేనదులలో స్నానముచేసినారు - యేయే పుణ్యస్థలములు సేవించినారు. యిప్పుడు యెక్కడినుంచివస్తున్నారు. యిక్కడనుంచి యెక్కడికిపోతున్నారు-అని అడిగెను. మేము సకలమైనదేశములున్ను తిరిగినాము-సకలమైననదులలో స్నానముచేసినాము. సకలమైనపుణ్యస్థలములున్ను సేవించినాము. సకలమైన మహానుభావులదర్శనము చేసుకొన్నాము. అయితే మంచుకొండమీద పన్నగాటవిలోనుండే సిద్ధయోగీంద్రుని చూడమైతిమి. అక్కడ విస్తారంగా పాములున్ను మంచుగడ్డలున్ను వుండునుగనక మాకు అసాధ్యమయినది. యిప్పుడు మేము ఆహిమవత్పర్వతముదగ్గిరనుంచి వస్తున్నాము. యీట్లాదక్షిణంగాపోవలెనని వచ్చినాము అనిచెప్పగా విక్రమార్కుడు తక్షణమే లేచి మంచుకొండకుపోయి పన్నగాటవిలో చొచ్చి పోతూవుండగా పాములు లెక్కలేకుండా అతనిదేహానచుట్టుకొనెను. అందుకు భయపడనివాడై మంచుగడలు విరగతొక్కుకుంటూపోగా సిద్ధయోగీంద్రుడు అగుపడెను. అతనుసమీపానకుబోగానే దేహమందుచుట్టుకొన్నపాములన్నిన్ని వదలి పారిపోయెను. అంతట ఆమహాపురుషుడు విక్రమార్కునిచేత నమస్కరించబడ్డవాడై లేచి విక్రమార్కునికౌగలించుకొని కూర్చుండబెట్టుకొని నీవు

మనుష్యమాత్రుడవుగావు మనుష్యుడవైతే యిక్కడికిరాలేవు. నీవు మహాను భావుడవు. నీవు యెవరవు. నీపేరేమి-నీవు యిక్కడికివచ్చిన కార్యమేమని అడగగా నేను వుజ్జయినీనగరముయేలేరాజు నాపేరు విక్రమార్కుడు-మిమ్ము లను చూచిపోదామనివచ్చినాను అని చెప్పెను. అనగా సిద్ధయోగీంద్రుడు సంతో షించి ఆరాజుకు వకబలపమున్ను వొకబొంతానున్ను వకలాతాపుకోలా నున్ను యిచ్చి ఏజంతువైనా నీకు కావలసివుంటే యీబలపానవ్రాసి యెడమ చేత లాతాపుకోలతీసుకొని తాకిస్తే ఆజంతువుకు ప్రాణమువచ్చి లేచును. ఏజంతువైనా నశించవలెనని నీవు తలస్తివా బలపాన ఆజంతువును వ్రాసి కుడిచేత లాతాపుకోల తీసుకొనితుడిస్తే ఆజంతువు నశించును. ఈబొంత విధి లిస్తే కోరినంతధనము కుప్పబడును. యివితీసుకొని పోయిరమ్మనగా ఆసిద్ధునివద్ద నుంచి విక్రమార్కుడు తిరుగా వస్తూవుండేసమయములో మనుష్యసంచారము లేనియడవిలో వకడు కట్టెలు విరుస్తూవుండగా వాణ్ణిపిలిచి నీవు కట్టెలకుగాను యింతదూరం యేవూరునుంచి వస్తివి. మీవూరిదగ్గర అడవిలేదా అని అడిగెను. వాడు రాజుకు మొక్కి తాను తూర్పుదేశముయేలేరాజుబంటును ఆరాజు పగవారిచేత రాజ్యముకోలుపోయి జగడములోచచ్చెను. తర్వాత ఆయన కొమారుడు నన్నువకణ్ణి వెంటబెట్టుకొని పట్నంవిడిచి యీ అడవికి వచ్చినాడు. ఇన్నాళ్లురాజ్యముయేలి యికను బిక్షమెత్తుకొని తిరిగేబ్రతుకు యెందుకని అగ్నిప్రవేశమయ్యేటందుకు ప్రయత్నపడి నన్ను కట్టెలువిరుచుకొని రమ్మనగా వస్తిని. నేనున్ను ఆయనతోగూడా అగ్నిప్రవేశమవుతాను అనిచెప్పెను. విక్రమార్కుడు ఆరాచకొమారుడివద్దికిపోయి రాజులకు జగడానపడేది వుత్త మం. లేదా తమ్ముజయించినవారికి శత్రువులయినవారితో గూడుకొని మరి కొన్నాళ్లకయినా సాధించవలెను. యిటువంటికార్యాలుచేతురా అనగా ఆరాచకొమారుడు తన అదృష్టమీలాగునవుండగా యేమిచేయవచ్చునని అంగ లార్చెను. అప్పుడు రాజు ఆచిన్నవాణ్ణి ఆదరించి కన్నులనీళ్లుతుడిచి వళ్లుదువ్వి నీవుయేల అంగలార్చేవు. నీకు వచ్చిన కొదవ యేమి. నీవు అధైర్యపడవద్దు

యిదిగో యివి తీసుకోమ్మని తాను తెచ్చిన బలపమున్ను, లాతాపుకోలానున్ను కొంతాను యిచ్చి వాటిమహాత్యము చెప్పి ఆరాచకొమారునిచేతనే బలపముతో చతురంగబలాలున్నూ వ్రాయించి యెడమచేత లాతాపుకోల మోపించెను. ఆచతురంగబలాలున్నూ ప్రాణమువచ్చి లేచి సంచరించసాగెను. తర్వాత కొంత విదలించుమనెను. విదలించగానే అతను కోరినప్రకారం తొమ్మిదికోట్ల ధనము కుప్పబడెను. తర్వాత వోరాచకొమారుడా యీచతురంగబలాలున్ను యీధనమున్ను వుంచుకొని నీపగవారిని జయించి నీవు సుఖముగా రాజ్యము చేస్తూవుండుమని చెప్పి విక్రమార్కుడు తననగరానకు పోయెను. కాబట్టి అటువంటివితరణసహాసాలు నీకులేవు పొమ్మనగా యింతలో లగ్నము తప్పె గనక ఆదినం భోజరాజు యింటికిపోయెను.

## ద్వాత్రింశత్సాలభంజికలకథలు.

విద్యాభిలాషగలబాలుర కత్యంతోపయోగంబగునటుల నందినారద సంవాదపుత్తళికోపాఖ్యానంబను గీర్వాణగ్రంథంబును ఆంధ్రంబున రచియింపంబడి ద్వాత్రింశత్సాలభంజికలను విక్రమార్కచరిత్రంబును నామద్వయం బమర్చి పండితులసహాయముచే లేఖకప్రమాదజనితాశుద్ధదోషములను దొలగ దోసి చెన్నపట్టణము-పెద్దినాయనిపేట-లోపు వెంకటాచలయ్యవీధిలో స్థాపింపబడియుండే విద్యాకళానిధిముద్రాక్షరశాలయందు కం॥ అళ్వారుసెట్టివలన ముద్రాక్షరాంకితము చేయింపబడియె. 1856 జూలై నెల ౧౦ తేది.

(పుట ౨౧)...

విక్రమార్కునిగుణాలు చెప్పుతాను విను - అప్పుడు వచ్చినట్టయితే వెయ్యివరహాలున్ను స్తోత్రము చేసినవానికి పదివేలవరహాలున్ను విద్యలలో పరిక్షయిచ్చి మెప్పించినవానికి లక్షవరహాలున్ను విక్రమార్కుడు యిచ్చుచు యిట్లావుండగా వొకనాడు వొకవిద్యావంతుడు వచ్చి రాజును చూచి బహు ప్రకారములుగా స్తోత్రము చేసెను. నీ వెవరని రాజు అడిగెను. నేను చిన్న

నాటి స్నేహితుణ్ణి. ఆరుఅక్షరాల పేరుగలవాణ్ణి ఆపేరు యెట్లాగంటే చెప్పు తాను విను. చతురంగతజ్ఞుడను మొదటి అక్షరమువిడిచితే తురంగతుజ్ఞుడను రెండు అక్షరాలువిడిచితే - రంగతుజ్ఞుడను. మూడు అక్షరాలువిడిచితే-గతజ్ఞుడను. నాలుగు అక్షరాలువిడిచితే-తజ్ఞుడను. అయిదు అక్షరాలు విడిచితే - జ్ఞుడను-యీవిద్యలలో పరీక్షపుచ్చుకొమ్మని చెప్పి పరిక్షయిచ్చి రాజును మెప్పించెను. అప్పుడు రాజు తనకు ఆనిద్యావంతుడు అప్తుడైనందువల్లనున్ను స్తోత్రము చేసినందువల్లనున్ను విద్యలలో పరీక్షయిచ్చి మెప్పించినందువల్లనున్ను లక్షా పదకొండువేల వరహాలు యిచ్చిపంపించెను. అటువంటి వితరణగుణము నీకు వున్నట్టయితే నీవు యీసింహాసన మెక్కుమనగా నాటికిపోయి మరియొకనాటి శుభలగ్నమునందు సింహాసన మెక్కవచ్చెను.

(హంసవింశతి - వచనము) } పేజీలు 20-21.
పరిషత్తువారి నంబరు 1087 }

పదునాలుగవనాడు ప్రొద్దుగూకుటయుం హేమావతి చిత్తజా కా... మోహంబు చిత్తం బుత్తర పరప కస్తూరి తిలకవాసనలు ముఖవాసనలకు లంచం బివ్వంగా నవరత్నఖచిత తాటంక ద్యుతులు కపోలంబుల జిగికి నుపాయంబు లొసంగంగా మానికంపుదండలపొయలు శరీరకాంతికికట్టంబిడగా...గడాలు పాదంబుల రక్త ఛవికి వగిది బెట్టంగా విడివడిన మన్మథగజంబు బలె బెడగైన నడల నిల్లు వెడలి జనుచో హంస యా హంస గమనం గాంచి భళీ నీవు రాజహంస కడ కేగెద వేమో యీకథ విని పోవలయు ననిన...యో కలహంసమ్మా యనన్యసామాన్యంబులగు శృంగార కథలు జెప్పెద నవి నీస్వబుద్ధి చెంగల్పితంబు లైనవో బెద్దలవలన పూర్వంబున విన్నవియో దేవతావరప్రభావలబ్ధంబులో వింతలుగా నున్నయవి. నీమేధాశక్తి యిట్టిదట్టి దని చర్చింప దగునా హంస రెక్కల నట్టె విదచిణా యిట్లనియె.

25 వ పేజీ.

యసహ్యాంబైన నొక పాడూరిలో నొకనాటికడజామునం దారి పోయ్ని దేహంబునుం గుంటికాళ్లును వీడిన బంధంబును గలిగిన యొక బక్క గుఱ్ఱంబును యొక ముసలి యెద్దును వచ్చి యుండగా గుంటికొమ్ములు ...నుగల యాకుమ్మరవాని యెనుబోతువచ్చి యో గుఱ్ఱమా నీకు శుభమా యో వృషభమా నీకు శుభమా మీరీతీరున నేల డస్సియున్నారది తెల్పుండని యొడుగ నా యెద్దు పోతుతోడ నిట్లనియె. వోస్నేహితుడా నాయజమా... దున్నించి బడగొట్టి బళ్లకు గట్టి పాపనంబులు డోలి గానిగెలలో త్రిప్పి యవార్యంబులగు బాధల పాలు జేశి యనుబంఢ్రెడు దుక్ఖాలు కాగానే నన్నుం బనికి రాదని పోదోలిన నేనిట్లె తిననని విని పోతుతల త్రిప్పి

## కాంభోజరాజుకథలు.

## No 356 Pages 39-41.

అదయ్యా సకల జన్మాలయొందున్ను మనుష్యజన్మ యెత్తుట దుర్లభం। మనుష్య జన్మ మెత్తిన్ని। అసత్యం పలుకుదురా। పశువువంటిది పులికి అగపడి సత్యంపలికి విడిపించ్చుకునిపోయి పులికి హారమయ్యేకొరకూ తిరిగి రాలేదా అని రాజకుమారుడు బల్కగా। ఆ కథ యెటువంటిదో తెలియ చెప్పుమని అడిగితే బహ్మ రాక్షసునితోను రత్నమండసుడు చెప్పిన చిత్రకథ॥ పూర్వమంద్దు తుంగభద్ర తీరాన రోహితాద్రి అనే పర్వతము గద్దు॥ ఆ పర్వతము దరిని చంద్రపురమనే అగ్రహారం గద్దు। ఆ యగ్రహారములో వొక బ్రాహ్మణుని ఆవు మేతమెయ్యబోతె। పులి వెయ్యవచ్చె గనుక। ఆ గోవు తంద్దరపడి పులితో ఒక వుత్తరం బలికెను। శార్దూలరాజా। నీవు బహు ఆకలి గొని వున్నావు। నీకు ఆహారమయ్యా అంతకంట్టే విశేషము లేదు। మూడుదినములకింద్దను నాకు వక కుమారుడు పుట్టినాడు గడ్డి మెయ్య నేరడు। అటు గనుక పోయి కుమారునుకి పాలు గుడిపి। తిరిగీ నీకు ఆహారానకు వస్తున్నానగా। పులి అన్నవుత్తరం। నీవు ప్రాణాలమీద ఆశ చాత।

అబద్ధమాడి తొలంగ్గిపోవలశ్ని మాత్రాన । నేను యేాల పోనిస్తుంన్నాను । ప్రాణం కంట్టే తీపిలేదు । ఆ కథ యేాలాగంట్టేను । ఒక బ్రాహ్మడు వేదాంత్త శిద్ధాంత్త రహస్యవేదియై శిష్యులు తానుంన్ను । గౌతమీ తీరాన సంచ్చారం చేస్తూ వుండ్డగా ఒక చాకలిది ఆబ్రాహ్మణునిచూచి అతని చక్కదనానకు భ్రమపడి నమస్కారం చేశి నీమీద నాకు వాంఛ పుట్టినది. నాకోరిక దీచ్చి నన్ను బ్రతికించు యనగా ఆ బ్రాహ్మణుడు అన్నా ఉత్తరం॥ నీవు యిటువంటి వినరాని ఉత్తరం ఎందుకు అడిగితివి । నీవు ఆడదానవు శిక్ష చేయరాదు అని కోపంచేసి చక్కా పోగా । చాకలది పోనివ్వక కాళ్లు బట్టుకొని యేాడ్వగా బ్రాహ్మణుడు యేమింన్ననలేక । ఆ చాకలిదానితో సంసర్గ్గం చేసెను । అదింన్ని సంతోషపడి చక్కా బోయను । అంతట బ్రాహ్మణుడు చిన్నబోయి వున్న గురువును శిష్యుడు చూచి నమస్కారం చేశి । అయ్యా వుంన్నాలాగు యేమని అడిగితే శిష్యునితోను బ్రాహ్మండు తన వృత్తాంత మంత్తా తెలియజెప్పి । నీవు ప్రియశిష్యుడవు గనుక నీతో వక వుత్తరం తెలియచెప్పుచుంన్నాను యేమంట్టె నేను యిప్పుడు చేసిన పాపానకు యిద్దాపున యెరుకలపల్లిలో యెరుక రాజు యింట్ట వుంన్నా పందికి అయిదో పిల్లనై పుట్టగలవాండను నీవు ఆ యెరుక రాజును అనుసరించ్చి పంద్దికి బుట్టిన అయిదో పిల్లను అడిగి పుచ్చుకొని పుట్టగానే చంపితివా నాకు వుత్తమలోకం కద్దు । యీ ప్రయోజనం అత్యావస్యంగ్గా కాయమని చెప్పి బ్రాహ్మడు అగ్ని ప్రవేశమయి యెరుక వాని యింట వుంన్న పంద్దికి చూలై వుండెను । అంతట శిష్యుడు గురువు చెప్పిన లాగుననే యరుకవాంణ్ని అనుసరించి । ఆపందిపిల్ల పుట్టగానే అడిగి పుచ్చుకొని దూరానకు దీశుకపోయి చంప్పబోగానే । ఆపందిపిల్ల మానవ భాషలతో ఆబ్రాహ్మణుని వకవుత్తరం బలికెను । బ్రాంహ్మడా పందికడుపున పుట్టగానే యేాల చంపవైతివి । గాలి సోకినంద్ను ప్రాణాలమీద ఆశవదలదు సకలవస్తువులు కంటె ప్రాణం తీపి । యింకాకొంన్ని దినములు యీ శరరీసుఖం అనుభవింపవలశ్నిది । అంతట కొన్ని దినములకు శ్రీమహావిష్ణువు ఆజ్ఞచేత

ము_క్తిని పొందగల వాడననగానే శిష్యుడు చక్కాబోయెను । మరికొన్ని దిన ములకు విష్ణుదేవుడు కపట శూద్ర వేషధారియై యెరుకలవాని యింటికివచ్చి ఆ పందిపిల్లను కొనుక్కొని అరణ్యంలోకి తీసుకపోయి వక వుత్తరం బలికెను। పందిపిల్లా నిన్ను చంపుచున్నాను నీ యిష్టదైవమును తలంచుకొమ్మనుమంటే పందిపిల్ల మానవభాషను వక వుత్తరము బలికెను । అయ్యా నాయిష్టవేల్పులు ఆదినారాయణమూర్తి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు వేదవేదాంత వేద్యుడు పురాణ పురుషుండు దీనరక్షకుండు ఆయన వినాగా నాయిష్టవేల్పు మరి యవ్వరూ లేదు । అనగా శ్రీ మహావిష్ణువు సంతోషపడి కపట శూద్ర రూపం మాని గరుడ వాహనారూఢుడై యదుట నిలిచి బ్రాహ్మణునికి । పంద్ది జన్మం విమోచనం చేసి ఆతని పూర్వజన్మం శరీరం తోట్టు తనలోకానకు దీసుకపాయను అటుగనుక మహాత్ముని నంటివాడు శూకరరూపం యెత్తిన్ని పూర్వజ్ఞానము తెళిశిన్ని ప్రాణాలమీద ఆశ వదల లేక చంపనియ్యడాయెను కాగా వో ధేనువా నీవు యెంన్నిమాట లాడేదిన్ని ప్రాణాలు విడువలేక తప్పించుక పోయ్యే నన్నావు నేను యీాల పోనిస్తూ వుంన్నానగా గోవు వక వుత్తరం బలికెను.

## తాతాచార్యులకథలు.

### అచ్చుప్రతి 1855.

### గిరిన్నయ్యారే అనేకథ.

చెన్నపట్టణములో లక్ష్మీనర్సు పంతులనే వొక వేపారి కొంచము సంస్కృతము చదుపుకొని ఇంగ్లీషుయందున్ను అరవమందున్ను తెలుగుయందున్ను ఫారిషీయందున్ను మహారాష్ట్రమందున్ను కన్నడమందున్ను మళయాళ మందున్ను యీావిద్యలయందు కొంచెము కొంచెము పాండిత్యము కలిగి తాను అష్టభాషాపండితుడని వొకబిరుదు వేసుకొని యీాయెనిమిదిభాషలలోగా దే విద్యావంతులు వచ్చినా వారితో మహావినయపూర్వకముగా ప్రసంగములు

చేస్తున్న కించిత్కారం ఆయా విద్వాంసులకు సంభావనలు యిస్తూ తాను మహాభాగ్యవంతుడై కీర్తిబొంది వుండగా ఆయన దగ్గిరికి వొక విద్వాంసుడు వచ్చి ఆశీర్వాదముచేశి తాను తర్కవ్యాకరణములయందు బహుఘట్టివాడ నిన్ని తనతో యీపట్నములో యెవ్వరూ ప్రసంగముచేసేవారు లేరనిన్ని ఆత్మస్తుతి చేసుకొనెను. అప్పుడు యీలక్ష్మినర్సుపంతులు యెనిమిది విద్యలు తెలిసినవాడైయుండిన్ని ఆవొక సంస్కృతవిద్యమాత్రము తెలిసి గర్వపడినటువంటి ఆవిద్వాంసుణ్ని చూచి మనస్సులో నవ్వుకొని లోకాభిరామముగా కొంతసేపు మాట్లాడగా ప్రస్తావోచితముగా ఆపంతులు వొక స్లోకము చదివెను అదియేలాగంటే:—

స్లోకం॥ గిరిన్మయూరె గగనే పయోధరే లక్షాంతరె భానుజలేచపద్మం ద్విలక్షసోమో కుముదోత్పలానాం స్నేహోచ బంధునఃకదాచ దూరః. అని యీశ్లోకమును చదవగా ఆవిద్వాంసుడు యీస్లోకమును విని నవ్వి యీ శ్లోకము శుద్ధతప్పులు యివి తమబోటి పండితులుకూడా యిట్లా తప్పులు చదివితే యికను బాగా చదివేవారు యెవరున్నారు అని ఆక్షేపించెను అప్పుడు ఆపంతులు యీవిద్వాంసుణ్ని చూచి తమరు తర్కవ్యాకరణములయందు బహుసమర్థులుగదా యీశ్లోకమును తప్పుదిద్ది శుభద్ధముగా చేసినట్టయితే మీకు శిష్యులమైన మాబోటి వారందరమున్ను చదువుకొంటున్నాము అనగా ఆపండితుడు ఆశ్లోకమును దిద్దెను. యేలాగంటె॥

శ్లోకం॥ గిరౌ మయూరో గగనే పయోధరో లక్షాంతరే భానుః. యింతమట్టుకు దిద్ది వుత్తరార్థము యోచించి దిద్దవలసినది అని చెప్పెను. యీపంతులు నవ్వి యీపూర్వార్థమును దిద్దినందుకు వొకఫలమున్ను లేదు. వుత్తరార్థము దిద్దక పోయినందుకు వొకనష్టిన్ని లేదు అయితే తమపాండిత్యము యిందువల్ల అందరికి బాగా ప్రకాశించినది. కడమపాండిత్యమున్ను యిటువలెనే వుండునని చెప్పి తమరు దిద్దినప్రకారం యీశ్లోకమును చదివేటందుకు వేరే వొక కొత్త గ్రంథాపుట్టి కొత్తగా తమవంటి విద్వాంసులను

సృజించేమట్టుకు మీరుదిద్దిన శ్లోకమును మీవద్ద భద్రముగా దాచి పెట్టవలసి నదేకాని యీలోకములో యెవ్వరున్ను మెచ్చరని చెప్పెను. అందుకు ఆ విద్వాంసుడు రోషపడి నన్నుయెగతాళిచేస్తున్నావా నీవు తెలిసినవాడవని నీవద్ద నాపాండిత్యమును ప్రకటనచేయవలెనని వచ్చినందుకు నీయంతమూఢుడు యీలోకములో లేడని తెలిపెను. నీసాహావాసమువల్ల నాకున్నూ మూఢత్వము వచ్చెనని చెప్పెను. అప్పుడు వీధి అరుగుమీద యీవుభయులు కూర్చుండి ఆదోవను వచ్చేపొయ్యే పండితపామరసాధారణజనులను పిలిచి వద్ద కూర్చుండ బెట్టుకొని యీశ్లోకమును అడిగితే అందరున్ను యీపంతులు చెప్పినప్రకారమే చదివిరి అవిద్వాంసుడు దిద్దినప్రకారము వొకరున్నూ చెప్పకపోయిరి. అప్పుడు కొందరు పండితులు అక్కడ సభగూడి యీశ్లోకమును పూర్వము యేకవి చెప్పినాడో అప్పుడే దిద్దవలసివుండెను, యిప్పుడు దిద్దేవాడు పిచ్చినాడని సిద్ధాంతము చేసిరి.

## తెనాలిరామునికథలు

పేజీ 66. ఆ. 209.

### 4 కథ. అప్పులవాడికిపోను చెప్పినది.

ఒక శెట్టిదగ్గర ఒక కాపుతనంచేసేవాడు వేయివరహాలు అప్పుతీసుకొనెను. శెట్టి గడువులోవచ్చి రూకలు అడిగెను. కాపుతనంవాడు సంవత్సరం గడువుగా కొంతసంవత్సరములు చెప్పుకొనివచ్చెను. అదిచూచికండించి అడిగేటప్పుడు నెలలగడువుగా కొన్ని నెలలుచెప్పి అవతల వారములుగడువుగా కొన్ని గడువులచెప్పి అవతల దినాలగడువుచెప్పి యింతలో నలభైయేండ్లవరకు తిరిగి తిరిగి అలశిపోయినట్టిదినం యెట్లయినయిచ్చునని శెట్టి నమ్ముకొనివచ్చెను. వీధి కొనలో అప్పులవాడువచ్చేదిచూచి కాపుతనంవాడు శీఘ్రముగాలేచి ఒక వుటికలో చింతవిత్తుయెత్తుకొని ఒక గెరిటకాడతో పెలివోరలోగుంటతొవ్వి వరుసగా వేస్తున్నుండెను.

## శుకసప్తతికథలు.

ఇది 1910 వ సం॥ లో చెన్నపట్నము శ్రీరామానందముద్రాక్షర శాలలో అచ్చు పడ్డది; చాలా కాలముకిందటనే వ్రాసిన వచన కావ్యమట. పండితులు చక్కగా పరిష్కరించినారట. వారు దిద్దక ఏ కారణముచేతనో విడిచి పెట్టిన వాడుక మాటలు ముద్దులు గులుకుతూ ఉన్న చిలక పలుకులు అక్కడక్కడ వినబడు తున్నవి. ఒక్క వాక్యం చూడండీ.

యీ ప్రకార మార్గురుని పారవేసి ఏడో వాణ్ణి యెత్తుకొని వీడు యెక్కడ వేసినా లేచి నా కంటె ముందుగావచ్చి చేరుతున్నాడు. యీ లేప పూరి వెలపల వుండే గుంటలో వేతామని గభక్కున వేళ వీడు యెట్టు లేచి వస్తాడో చూతామని నలుదిక్కులూ కనిపెట్టి యుండెను. అవూళ్లో వక దేవాలయంలో పూజచేసే వైష్ణవుడు ధనుర్మాస మాటవల్ల వేకువజామున ఆ గుంటకుపోయి స్నానసంధ్యాదులు నెరవేర్చి తిరుమణి శ్రీచూర్ణాలు చక్కగా ధరించి ధోవతులు వుతికి మడుస్తూ వుండి యకస్మాత్తుగా గుంటలోబడ్డ ధ్వని విని భయపడి యిది యేమో దయ్యముగా నున్నదని తన ధోవతులం చేత బట్టుకొని వెళ్ల సాగెను. గట్టు మీదవున్న దాసరి పరుగెత్తి యీ అయ్య వారిని చూచి తా పారవేసిన పీనుగ తిరిగా లేచి తనకన్నా ముందుగా పో తున్నదని కూడా వెంబడించి తరిమి పట్టుకొని చూస్తే నామములు బలంగా వుండుటచేత నేను వైష్ణవుడని యెంత చెప్పినా వినక పట్టుకొని మూట కట్టి గుంటలో వేసెను. (పుట 145)

## కీరాబహత్తరికథలు

విక్రమార్కుడు నవరత్నపట్నానికి వచ్చెను. నవరత్న రాజుహూతురు దేవమాన యనేది మహాచక్కనిది దాని వుద్యానవనంలో పళ్లు ఫలాలు విస్తారం కలవు మంచి మధ్యాన్నవేళ ఆదేవమాన వనానికివచ్చి నేరేడుచెట్టు యెక్కి పండ్లుకోయగా విక్రమార్కుడు చెటుకిందవుండి చిన్నదానా వొక

పండు వేయమని అడిగెను. అడిగితే వేడిపండు వేతునా సద్దిపండు వేతునా అని అడగగానే శవ్వాసు ఎంత జాణగావున్నది. చూతాముగాని అని వేడి పండు వేయమనెను మంచి మాగిన నేరెడుపండు వేడియిసకలో వేయగానే కందెను. పండు యెత్తుకొని వూదబోయెను. ఊదకవూదక బావా నీమీసాలెల్ల కమిలేను. అనగానే విక్రమార్కునికి కోపంవచ్చి మంచిదే చిన్నదానా నిన్ను పెండ్లిఆడి యెవరురానిచోట యిల్లుకట్టి నీకు యెవరూ సహాయం లేకుండా నిన్ను వొంటిగా యిరవైయేండ్లు చెరసాలలో వేయకపోతున్నానా అని అనగానే మంచిదోయి రాచకొమారా, నీకే వకకొమారుణ్ని కని వాని చేతను నిన్ను చీమలమాన్కు కట్టించకపోతున్నానా అని చిన్నది చెట్టుమీద నుంచి అనెను. మంచిది అని వుజ్జయినిక్కి పోయి భట్టుతో యీసమాచారం చెప్పి చీకారణ్యమైన అడ్వీలో నగరు కట్టించి అందులో యిరువైయేండ్లకు తినుబండారం వుంచి సకలమైనవస్తువులు నీళ్లు కూరలు వక్కలాకులు కోకలు రవికలు మొదలయినవస్తువులు అన్నీ వుంచి చీమసహా దోమసహా దూరకుండా.

ఇదే శుకసప్తతికథలు. వేరేతరహా

## నిజమయిన కాశీమజిలీలు.

### 18 వ మజిలీ

పు. 230.

పదునెనిమిదవ మజిలీలో నొకచోట నొక చెరువుదగ్గర నొకరాతిమీద స్త్రీలయొక్క చర్యలు వ్రాయబడియుండగా జూచి యిది యేమిటని యడుగగా యేమీలేదు. స్త్రీలు స్నానముచేయుచున్న చర్యలను అనేక చిత్రవిచిత్రములుగా జేయుచుండగా నొక రాచచిన్నవాడారాతిమీద వేయించెను గాని మరియొక విరుద్ధమయినదేమీ లేదని చెప్పగా నీవు చెప్పాజాలవు నేను వినాజాలను అని తనదారిని తాను పయనముకాగా సింహాద్రి ఆవృత్తాంతము చెప్పెదనని సన్యాసిగారు చెప్పుచుండగా సింహాద్రి ఊకొట్టుచున్నాడు.

ఒక రాజకుమారుడు తండ్రిగారు వివాహము చేస్తామంటే స్త్రీ యొక్కమర్మము కనుక్కొంటేనేగాని వివాహము చేసుకోననెను. ప్రపంచములో మహాఋషులవంటివారికి తెలిసింది గాని రాజాధిరాజులకు తెలియలేదు. కనుక నరే దేశాంతరము వెళ్లవలెనని సరదాగా నున్నది కాబట్టి వెళ్లిరమ్మని యాజ్ఞాపించెను.

## గాంధారికథ

అక్కడ కాకరపాద వుండగాను ఆకాకరపాదలో దొరబడ్డాడు. గాంధారి చూచి వొకపదం పాడుతుంది పదం.—

కాకరచెట్లోదిబూచీ నాతో కలసిపోదువురావే బూచీ
నావద్ద యెవ్వరులేరె బూచీ వచ్చి వాలలాడిపోవె బూచీ
నీకు బోనలిచ్చినానె బూచీ నీకు బలిపీఠగొట్యానె బూచీ
నీవు రట్టుసేయకరావె బూచీ నీవు రట్టాడిసేయకే బూచీ

ఓరన్నో యెమో బూచిబూచిబూచి అంటుంది చేసుకున్న మొగుణితో చెప్పుకుంటూవున్నది కాబోలు వోరె అని చెట్టంతా వెదకులాడినాడు ఎక్కడచూచినా యేమీలేదు తనపైని చూచుకున్నాడు. కంబడివున్నది. ఆరెన్నా నాకంబడి నాకొంపతీసెరా. పోయిత రాజుతో చెప్పుకుంటూవున్నది వాడు వచ్చెనా నాసన్నగొంగడి జడ్డిగం వూడబొడుస్తాడు. అని కంబడితీసి దూరంగా పారవేసినాడు గాంధారి స్నానంచేసేదిక్కున జాలారిబండ వుండగాను ఆబండ పొర్లిగించి బండకింద మొద్దుకటారితో గొమ్ములలోతు గొయ్యి తవ్వి ఆగోతులో కూర్చుండ పదిమళ్లచాపు బండ నెత్తిని పెట్టుకున్నాడు. వీపుపొయంచాత పెట్టుకొన్నాడు కాకరచెట్టులో బూచి వున్నదని పోయింతరాజుతో గాంధారి చెప్పుతూవున్నది వాడు కొట్టుతానని కత్తి తీసుక చక్కావస్తాడు అవతల యివతల చూస్తాడు ఎక్కడచూచినా యేమీలేకపోతుంది ఆకోపంచేత బాకు బండనేసి పొడుస్తాడు. ఫెళ్లున విరిగి

పోతుంది అది విరిగిపోంగానే అట్టె గోతులోనుంచి దిగ్గున లేచిపోయిత రాజును పట్టుకుని ఆగోతులో పడవేసి పైన యీబండవేసి అట్టె అణగ ద్రొక్కి పోదామని ఉపాయంచేసుకొని కూర్చున్నాడు గాంధారి చూచి పదం పాడుతున్నది......యెటువలెను.

పదం.

ఆదినాథుడ రావె తుమ్మెదా అల్లతడు వూరికిపోయె తుమ్మెదా.
నావద్ద యెవరూ లేరు తుమ్మెదా వచ్చి వాలలాడిపోవె తుమ్మెదా.
చెట్టువేసి పాయెతుమ్మెదా వా కావి లెవ్వరు లేరు తుమ్మెదా.
రాతికిందా వున్న తుమ్మెదా నీ నెత్తిబయ్య దింపె తుమ్మెదా.
బాసలిచ్చినాను తుమ్మెదా నీకు బలిపీఠగొట్యాను తుమ్మెదా.
రావె సుందరగిరి తుమ్మెదా.

ఆ. ఆ. ఈతేప కాస్తె వున్నదోయి. ఆదినాథుడ రావె తుమ్మెదా అనెను. ఆదిని వచ్చినవాణ్ణి నేనూ అంత్యాన వచ్చినవాడు సోయితుడు అతడు వూరికిపోయినాడు కాబోలును సుందరగిరి తుమ్మెదా అని అనెను సుందరగిరిపట్టణము నాది. నేనేకదా గాంధారిచేతులో చచ్చినామేలే బతికినా మేలే. ఆగోతిలోనుంచి దిగ్గునలేచి గాంధారిదగ్గిరకు వస్తున్నాడు.

## పలుకని పద్మాక్షికథలు

ఆపట్నం యేలేషువంటిరాజు అధిపరాజు అనే బ్రాహ్మడు అరుతాళ యనే గౌడుడు వాడి పెండ్లాంపేరు అంజనవల్లి ఆ అంజనవల్లి యెనేది తనపురుషుడు మేదకుడు కాబట్టి ఆవీరబ్రాహ్మణునునే బ్రాహ్మంణ్ని వుంచుకొని వుండునూ॥ దానికి వక ఆవు కద్దూ. ఆబ్రాహ్మంను దీనియింటికి వచ్చేదిలేదూ. కాబట్టి ఆయావుపాలు పిండి కాచి చక్కెరవేశి తొంచపోయి ఆబ్రాంహ్మణుడికి యిచ్చి వానిదగ్గిరవుండి వచ్చును. యిట్లా దినకాలమున్న యీరొయ్యే నమాచారం ఆగౌడుడికి తెలియదూ. వకనాడు అర్ధరాత్రిలో మేలుకొని

యుండి చూచినాడు పెండ్లాన్ని పక్కను కానకుండా మేలుకొనియుండెను. తెల్లవారరాగానే పెండ్లాము వచ్చెను. వచ్చినదాని చూచి యింతసేపు యక్కడికిపోతివి అని అడిగినాడు. నేను యిప్పరుదా వెళ్లకుపోయివస్తినని చెప్పెను మంచిది రేపుచూస్తానని పండుకునెను.

## బాలనాగమ్మకథ (వచనపుపట్టు)

వరహా చేతికిచ్చెను. అన్నం వండుతూవున్నది. ఓ పేదరాసిపెద్దమ్మా మీపట్నంలో యేమి వర్తమానాలే. ఏమి వర్తమానం నాయనా. ఆరునెలల బట్టి మంచినీళ్లయెరగము. ఉప్పునీళ్లు తాగి బతుకుతున్నాము. యెందునుంచే పేదరాసి పెద్దమ్మా. నాయనా వూరి మంచినీళ్ల బావికాడ పెద్దపులి చేరింది అది నిత్యా ఆయిదుగురిని నియమంచేసింది దాన్ని యెవరూ చంపలేకుండా వున్నారు నదులకు అలవిఅయ్యేమార్గం లేనట్టుగా వున్నది కోట రాళ్లు పడ గొడుతూవున్నది. అందుకు మీపట్నంరాజు యెమన్నాడే. మారాజు షరతు చేసినమాట యేమిటంటె పద్దెన్మిదికులాలలో యెవడైనానరే యీపులిని చంపి నట్టైయితె వానికి నాకొమార్తె సుభద్రాదేవిని యిచ్చి పెండ్లిచెస్తానని నాలుగు వీధులా సాటింట చేయించి మూడుమూర్ల కాకితం వ్రాయించి నడివీధిలో గెడపాతించి ఆగెడను ఆకాకితం కట్టించినాడు. నేను అడినమాటతప్పినా కాశిలో గోహత్య చేసినపాపాన పోదునని రాజు దీక్షవహించినాడు. దాన్ని యెవరూ చంపేవారులేరు ఇదే వర్తమానం. నాయనా పట్నంలోను-

## భేతాళపంచవింశతి ౫-వ కథ

వినవోయి రాజా నుజ్జినిపట్నమందు అగమస్వామి అనే బ్రాహ్మణుడొకడు గలడు. అయనకు వేదపాలకుడనే కొమారుడు సోమప్రభయనే కూతురు ఆపడుచు పెళ్లిప్రాయమైనప్పుడు యీకన్యకను అనుకూలమైనవరునిగా జూచి యియ్యవలెనని ఆలోచనచాయగా జ్ఞాని విజ్ఞాని శూరుడనేవారు ముగ్గురు పెళ్లికొమాళ్లువచ్చిరి ఆపడుచుకు తండ్రి జ్ఞానికి యిత్తామనెచు తోడ

బుట్టినవారు శూరుని కిత్తామనెను యీరీతున తమలోతమరు ఆలోచనచేశి నప్పుడు వకరాక్షసుడువచ్చి ఆకన్యకను యెత్తుకొనిపాయెను దానితలి దండ్రులు అన్న విచారపడుతూవుండగా జ్ఞాని అనేవాడు రాక్షసుడుపోయిన జాడ జ్ఞానముతో తెలసిచెప్పెను. విజ్ఞాని అనేవాడు రథము విల్లు అమ్ములు సంపాదించియిచ్చెను శూరుడనేవాడు రథంయెక్కి ధనుర్బాణాలచాత రాక్ష సునిజంపి ఆకన్యకను తెచ్చెను యీముగ్గురిలో ఆకన్యకకు మొగుడు యెవరు అని అడగగా విక్రమార్కుడు విని శూరుడే వరుడని చెప్పగా భేతాళుడు పోయి ములుమోదుగందు వళియించియుండెను తిరిగిన్ని విక్రమార్కుడు భేతాళుణ్ని తెచ్చేటప్పుడు కథచెప్పుతున్నాడు.

## పంచతంత్రికథ

శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రుల్లుగారి పంచతంత్రం. 1834;

అనేకకూర్పులు 1871 వరకు.

Schoolbook.

తరవాత గ్రాంథీకరణం.

ఈగ్రంథము శిద్ధార్థినామసంవత్సర ఫాల్గుణ శు ౧౩ సోమవారం సాయంకాలమునకు పూర్వప్రతినున్న క్రమంగా యీపంచతంత్రి యనెడు అయిదుతంత్రములు సంపూర్ణముగా వ్రాతాయెను.

"ఆరాజశ్రేష్టుండు ఒకనాడు...తన కొడుకులంజూచి సభలో నున్న వారితో నిట్లనియె. విద్వాంసుండును ధార్మికుండును కాని కొడుకు పుట్టితే ఫలమేమి. చూడి పాడిలేని గోవును పెట్టుకొని యేమిచేయవచ్చును. బహు మంది కొడుకులు గలరని లెక్కపెట్టుకొనుటచేత కొంచమైనా ప్రయోజనము కద్దా వంశమునకు కీర్తి తెచ్చిన కుమారుడు ఒక్కడేచాలును రూపమున్ను ధనమున్ను బలమున్ను కలిగినా శాస్త్రజ్ఞానము లేనికొడుకు యెందుకు అటు వంటి కొడుకును గనుటకంటె తల్లి గొడ్రాలైనా మేలు కడుపు దిగబడిపోయినా

మంచిదే. పుట్టినవాడు చచ్చినా మంచిదే ఆడదిగా బుట్టినా వాని పూర్వ జన్మములయందు తండ్రి జేసిన పూర్వకర్మముచేత ఉదారుండును తల్లిదండ్రులు జెప్పినమాట జవదాటనివాడున్ను మంచినడత గలవాడున్ను సర్వజనులకు హితుడున్ను విద్వాంసుండును సమర్థుండును ఒకరు తనకు చేసినమేలు మరవని హితుడును అడితప్పనివాడు నైన పుత్త్రుండు గలుగును. పాపకర్మముచేత పాలసముద్రములో విషము పుట్టినట్టు మంచివంశములో దుర్మార్గుడు పుట్టి కులము చెరచును. యౌవనము, ధనము, దొరతనము, అవివేకము అనే యీ నాలుగింటిలో ఒకటొకటె అనర్థము బుట్టించును. ఈనాలుగున్ను వకచోట బుట్టిన చెప్పవలసినదేమి కాబట్టి వివేకములేనందున దుర్మార్గులైన నా కొడుకులకు నీతిశాస్త్రము చదివించి వివేకము కలుగజేసుటవలన వారిని పునర్జన్మసంభూతులుగా నేర్పరచగల పుణ్యాత్ము లెవరైనా యీసభయందు గలరా అని రాజు చెప్పగా...విష్ణుశర్మ లేచెను..."

## విక్రమార్కచరిత్రము.

"మా రాజు రాజసూయయాగము చేస్తూవుండి నానాదేశముల రాజులనూ పిలువనంపించి సముద్రుణ్ణి పిలిపించే నిమిత్తం బ్రాహ్మణుని అంపించగా ఆ బ్రాహ్మణుడు సముద్రుణ్ణిదర్శించి విక్రమార్కుడు రాజసూయయాగము చేస్తూవుండి మిమ్మును తోడుకు రమ్మని అంపించినా డనగా సముద్రుడు చాలా సంతోషపడి బ్రాహ్మణుని సన్మానం చేసి బ్రహ్మదేముని అనుమతి తప్పరాదు. మేము వచ్చినట్టే రాజుకు ప్రియంచెప్పుమని అమూల్యమైన నాలుగు రత్నములు యిచ్చి రాజుకు అంపించగా రాజుసముఖానకు వొచ్చి బ్రాహ్మణుడు సముద్రుడు అడినమాటలు చెప్పి ఆనాలుగురత్నాలూ పొడగనుపు పంపినాడని చెప్పి ఆరత్నాలు నాలుగూ ముందరవుంచి యిందులో వకరత్నము యిష్టాన్నములూ గూర్చును, వకరత్నము కోరిన ధనము గూర్చును, వకరత్నము దివ్యాంబరములూ కలుగజేసును, వకరత్నము చతురంగ బలములూ కలుగ

జేసును. అని రాజుకు చప్పగా మారాజు బ్రాహ్మణునిచూచి నాలుగురత్నముల లోనూ నీకు కావలసిన రత్నము పుచ్చుకొమ్మనగా ఆబ్రాహ్మణుడు మహారాజా నా భార్యనున్ను నా కొమారుణ్ణి కోడలినిన్ని అడిగి వొచ్చి పుచ్చుకునేనని యింటికిబోయి తమవారిని అడగగా కొమారుడు చతురంగ బలములిగా యిచ్చే రత్నము పుచ్చుకొమ్మనెను. భార్య యిష్టాన్నములూ గూర్చే రత్నము పుచ్చుకొమ్మనెను. కోడలు వస్త్రాలుగూర్చే రత్నము పుచ్చుకొమ్మనెను. బ్రాహ్మణుడు రాజుసముఖానకు మగుడివచ్చి తనభార్యానున్ను కొమారుడున్ను కోడలున్ను అన్నమాటలు బ్రాహ్మణుడు చెప్పగా రాజు విని బ్రాహ్మణుడు ధనము గలిగితే యీపదార్థములు అన్నీ కలిగీని అనగా రాజు నవ్వి ఆనాలుగురత్నాలూ బ్రాహ్మణునికి యిచ్చెను...”

ఈగ్రంథము ప్రమాదీచనామ సం॥ ర ఆషాఢ శు 3 ఆదివారంనాటి రెండుఝాముల సరికి భత్తీసుపుత్రికలు తమ్మినైన రామకృష్ణం నైడు మాతృకలో వున ప్రకారం శ్రీకుంబోదిమెట్టి పేరుభట్లు కుమార్డు లోకంభట్లు సంపూర్ణముగా వ్రాశెను. అతని నిమిత్తం.)

## విక్రమార్కచరిత్రము.

పేజీ 16. సె. 79.

చిత్రకూటాద్రియందు కనకమైన ప్రాకారములు నాలుగు వాగిళ్లు నాల్గుగోపురాలు గల్గినషువంటి దేవాలయ మొకటియున్నది ఆదేవాలయ సమీపముననూ హిమవత్పర్వతమందు గంగాప్రవహించినటువలెనే మహా నిర్మలమైనటువంటి త్యాటయై కనుపట్టే కలయేరువకటి ప్రవహిస్తున్నది. అది యందు పుణ్యాత్ములైనవారు స్నానం చేస్తే ఆవుదకము అత్యంతం శ్వేతమై పాలువల వుండుగనక వానికరీరము కలయేటి ఉదకముచాత పరిశుద్ధమై యుండునూ. పాపాత్ములయినవారు స్నానంచేస్తే కలుకవలనై యుండును. వాని శరీరమున్ను అత్యంతం నలుపైయుండును. అటువంటిపుణ్యానదీతీరమందు వొక

బ్రాహ్మణుడు నిత్యమున్ను హోమగుండమందు హోమము జేశి అవిభూతి యెత్తి అవతల కొమ్మరించిన రాశి ఒఖ వెండికొండగాపడి ఉన్నట్టు ఉన్నదీ. అదియేమి నిమిత్యముగా యిఘవంటి హోమము జేస్తున్నాడో తెలియదూ అని చారులు చెప్పగా విని సాహసాంకమహీపాలుడైన విక్రమార్కుడు అవింత చూతా మని.

## సారంగధరచరిత్రము.

పరిషత్తునంబరు 62. 76-77 పేజీలు.

### గ్రంథకర్త సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు

అప్పుడు ప్రోడలగు చేడియ లాచేడియం జ్జూచి యిక్కుమారుని చక్కదనంబ్బును యీచక్కెరబొంమ్మ యక్కరయుం జూచిన సెటికిం బ్బోటికె మోపాటు వచ్చునని తోంచుచున్నయదీ. యిత్తరి యీచిత్తిరి కింత్త తత్తరం బ్బేమిటికి సూటిగానిచోట మోహంబ్బు పాటించుటంబాతిగాదు యివ్విధంబ్బు మానుమని పలికినంబ్బగ...యీవనిత మనము మానుపలేము. దైవగతి విపరీతంబయ్యెనని దోంచుచుంన్నయది. మనమేమి శాయంగ్గలవార మా యమ్మనియమింంచ్చిన చందంబ్బున నుండుప మట మీాద నెట్టులయ్యె నట్టు కాగాకయని గుసగుసలంబ్బోవుచు నటునిటునడయాడుచుండ్డ చిత్రాంగి విచిత్రంంబైన మేడమీాది కతనిం దోడ్కొని తనపద్మరాంగంబ్బులు సోపాన పద్మ రాగంబ్బులు పరస్పరంబును సంఘింప—



౫

# దేశచరిత్ర.

---

## తంజావూరి యాంధ్రరాజులచరిత్ర.

[ఇది గవర్నమెంటువారి లిఖితపుస్తకభాండాగారమం దున్నది.
బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1914-వ సం॥
ముద్రించి ప్రకటించినారు.]

శ్రీకృష్ణదేవరాయలవారు, పాండ్యరాజ్యము, చోళరాజ్యము సంపూర్ణంగా స్వాధీనపరుచుకున్నారు. వారి అనుజ్ఞమీాదనే మొదట, విశ్వనాథనాయడు, అక్కడకుపోయి ఆరెండురాజ్యములు, ఆలించి పాలించినట్లు కొన్నిచోట్ల వున్నది. కృష్ణరాయలతర్వాత ఆయనసవతితమ్ముడు అచ్యుతరాయలు రాజ్యానికివచ్చెను. ఈతడే చోళదేశానికి ప్రత్యేకం చెవ్వప్పనాయణ్ణి రాజుగా యేర్పాటుచేసెను. అచ్చుతరాయలవారిభార్య తిరుమలాంబ, అని, ఆమెచెల్లెలు మూర్తమాంబ అనీ, మూర్తమాంబభర్త అయిన చెవ్వప్పనాయనికి అచ్చుతరాయలవారు చోళదేశం స్త్రీధనంగా అరణం యిచ్చినారని కొన్నిగ్రంథాలవల్ల తెలుస్తూ వున్నది.

"గీ. తీవి నచ్యుతరాయలదేవి యైన
తిరుమలాంబకుఁ జెలియలై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తి వెలయఁ
జెవ్వ విభుఁడు మహోన్నతశ్రీఁ జెలంగె."

విజయవిలాసము.

కాని యిక్కడ వొకచిక్కు తగులుకొన్నది. కృష్ణరాయలవారివంశం క్షత్రియవంశం, అని వెనకటిశాసనాలలోను ప్రబంధాలలోను వర్ణన వుంటుంది. చంద్రవంశపు క్షత్రియులట! చెవ్వప్పనాయనివారివంశం, శూద్రవంశం, అనికూడా అప్పటిశాసనాలే ప్రబంధాలే చెప్పుతూవున్నవి. అప్పచెల్లెళ్లు క్షత్రియుడికి శూద్రుడికి భార్యలుకావడం యేవిధంగా? ఆకాలంలో కులమర్యాదలు చెక్కుచెదరకుండా వుండేవే! అని సందేహం! ఇదేచిక్కు. వైసంబంధం ఆధారంచేసుకొని, కొందరు కృష్ణదేవరాయలవారిని శూద్రులలో కలుపుతున్నారు. రాజులయినారు గనుక, దర్పానికి క్షత్రియులని పెద్దగా వర్ణించుకొన్నారేగాని నిజానికి క్షత్రియులుకారని వారిసిద్ధాంతం. ఈమాట అంతపొందుబాటుగాలేదు. కృష్ణరాయలవంశం శూద్రవంశం అయితే ఆవెనుకటిబుక్కరాయలవంశం, సాళువవారివంశం క్షత్రియవంశాలగునా? గజపతులుమాత్రం క్షత్రియు లెట్లా అవుతారు? ఆకాలంలో, కులకట్టుతప్పడమే! విద్యారణ్యులంతవారు మంత్రులు, గురువులుగావుండేవారు! ఆరాజులు తాము వాణీవిలాసం మొదలయిన ధర్మశాస్త్రగ్రంథాలుకూడా రచించేవారు. శూద్రులైతే యిట్లా సాగునా? దర్పానికే క్షత్రియులమని చెప్పుకున్నారు. అప్పుడు తావొప్పుకున్నారు, సరే, అయితే వారిబంధువులిక శూద్రులమని చెప్పుకుంటారా? చిక్కుగాదా? అచ్యుతరాయలమరదలిని పెళ్లిచేసుకొన్న చెవ్వప్పనాయడుకూడా క్షత్రియుడే అనిపించుకోవలెగాదా? లేదే? ఏమికుదిరింది? పెంచడం యెందుకు? వైసిద్ధాంతం అపసిద్ధాంతంగానే వున్నది కొందరంటారు:—"అచ్యుతరాయలమరదలిని పెళ్లిచేసుకొన్నాడని వున్నది. అంతమాత్రంతో ఆ అచ్యుతరాయలు విద్యానగరం అచ్యుతరాయలనడం యెట్లా? ఈఅచ్యుతరాయ లింకొకడు కావచ్చు"నని ఈయెత్తుగడకూ పొత్తు కుదురలేదు. విజయనగరం రాయలుగాక మరియెవ్వ డియ్యగలడు చోళరాజ్యం? చెవ్వప్పనాయడు సరిగా విజయనగరపు అచ్యుతరాయల కాలం

లోవున్నాడు. వీరికి రాజ్యం రావడానికి వేరేకారణం కనపడదు. శౌర్యంతో జయించినట్టు ఎక్కడా లేదు.

నా వూహయేమంటే:—అచ్యుతరాయలనాళ్లలోనే "అచ్యుతరాయాభ్యుదయమ్" అనేసంస్కృతకావ్యం వొకటి వెలసింది. అందలివిషయం ఆయనచరిత్రమే. ఆగ్రంథంలో అచ్యుతరాయలకు తిరుమలాంబ అనేభార్య ఉన్నట్టు కానరాలేదు. తిరుమలాంబ పట్టమహిషి గాక పరిగృహీతకావలెను. రాజులకు చాలామంది భార్యాలుండేవారు. కొందరు పట్టపురాణులు కొందరు పరిగృహీతలు. పరిగృహీతలు భిన్నజాతివారుకూడా కావచ్చును. కృష్ణరాయలవంశం క్షత్రియవంశమే. చెవ్వప్పనాయనివంశం శూద్రవంశమే కావడమునకు ఇప్పుడు చిక్కేమున్నది? నిజమేదో నిలకడమీద తేలవలెను.

పాండ్యరాజ్యానికి విశ్వనాథనాయనివారి సంతతిన్నీ, చోళరాజ్యానికి చెవ్వప్పనాయనివారిసంతతిన్నీ రాజులైనాటినుండీ రెండురాజ్యాలూ యేలుకొంటూవచ్చిరి. వారిలో పరస్పరం చుట్టరికమున్నూ మధ్యనడిచెను. చోళరాజ్యంవారు విజయనగరరాజులకు విధేయులయి సర్వవిధాలా వారికి తోడ్పడుతూ వచ్చిరి. పాండ్యరాజ్యంవారు కొన్నాళ్లయినతర్వాత భిన్నయింటివాసాలు లెక్కపెట్టినారు.

చెవ్వప్పనాయడికే చినచెవ్వప్పనాయడనిన్నీ పేరు. వీరిపూర్వులు రాజ్యమేలినట్టు కనపడదు. విజయనగరరాజుల దగ్గరనే సేనానాయకులయి వుందురు. వారినిగూర్చి విజయరాఘవనాయనివారు రచించిన రఘునాథాభ్యుదయంలో వున్నవిధం:—"ద్విపద. వనజాక్షుపదముల వరలు వాహినికి ననుజయై మించు నాలవజాతి జగతి. ఆజాతిలోఁ జాల నధికులై నట్టి, రాజులు కొందఱు ప్రఖ్యాతిఁ గనిరి, వారిలోఁ గృష్ణభూవరుఁడు లావణ్య, కారుణ్యగుణముల ఘనకీర్తి గాంచె, నమ్మహామహునకు నాత్మజుఁడైన, తిమ్మభూపాలుండు ధీరత వెలసి, బయ్యాంబిక వరించి ప్రౌఢివహించె, నయ్యిరువురు గాంచి రాత్మసంభవులఁ, బెదచెవ్వభూపాలుఁ బినచెవ్వ విభునిఁ, బెదమల్లభూజాని

బినమల్లవిభుని, వారిలోఁ జినచెవ్వ వసుధాబలారి, మేరుధీరుఁ డనంగ మేదిని వెలసెఁ, జిరతంబుగభక్తి శ్రీశైలమందు, నరుణాచలమున వృద్ధాచలమందు, శంకరార్పణముగా శాశ్వతానేక, కైంకర్యములుచేసి ఘనకీర్తిగాంచె, సుగుణ సంతతికి నచ్యుతరాయనలిటిఁ, దగిన సోదరి కృశోదరి మూర్తమాంబ, యతనికి భార్యయై...చోళదేశంలో వీరిరాజధాని తంజావూరు. వీరు తెలుగువారు. ఆదేశం అరవదేశం. భాషవేరు. అందుకని వీరు తెలుగుదేశమునుండే, మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు, గాయకులు, వేశ్యలు మొదలయినవారిని తీసుకొనిపోయిరి. ఆకాలంలో అక్కడకుపోయి నెలకొన్న తెలుగువారిసంతతి యిప్పటికిన్నీ ఆయాస్థలములలో వున్నారు. ఇప్పటికిన్నీ తంజావూరులో సగంమూడుపాళ్లు తెలుగుమాట్లాడగలరు. తిరువైయారు, మొదలయినస్థలాలలో ఎందరో తెలుగువారున్నారు. అప్పుడు రాజులవల్ల అగ్రహారాలుపొందిన తెలుగుబ్రాహ్మలసంతతి యిప్పటికీ అగ్రహారాలు అనుభ విస్తూ వున్నారు.

చెవ్వప్పనాయడు తంజావూరులో, కోట, అగడ్తలు, మొదలయినవి నిర్మించినాడు. శివగంగాతటాకమనే తియ్యనీటిచెరువు తవ్వించినాడు. ఇప్ప టికీ ఆచెరువు చెక్కుచెదరకుండా వున్నది. తంజావూరి కది మహోపయోగం. కోట, అగడ్తలు, కొంతచెడినప్పటికీ, యిప్పటికీ ఆశ్చర్యం కలిగిస్తూవున్నవి.

రఘునాథరాయలు రచించిన సంగీతసుధ అనేగ్రంథం పీఠికలో గోవిందదీక్షితులవారు (ఈయన యెవరో ముందు తెలుస్తుంది) చెవ్వప్పనా యణ్ణి వర్ణించినవిధం:—

"శ్లో॥ కర్ణాటసింహాసనకార్యధుర్యః పరాక్రమాక్రాంతపరావనీపః శోణాద్రి నాథస్య సచెవ్వభూపో నిర్మాయ చత్వార్యపి గోపురాణి. ప్రాకారవప్రేర్ రథ మంటపాని తటాకదివ్యో పవనాని భూయః, గ్రామాననేకానుపకంఠసీమ్ని దత్వా విచిత్రాణిచ భూషణాని. రథానసేకాన్విరచయ్యరమ్యాం శ్చక్రే మహా రాజవిభూతి మస్య, న కేవలం శోణగిరీశ్వరస్య కైంకర్య మేవం కృతవాన్

వ భూపః. ఏకామ్రనాథస్య చ దీర్ఘ (?) శైలనివాసినశ్చాపి రఘూద్వహస్య, వృద్ధాచలేశస్య సమస్తమేత త్ప్రాకారముఖ్యం వ్యతనో ద్విశేషాత్. శ్రీశైల నాథస్యచ వేఙ్కటాద్రినివాసినః పద్మవిలోచనస్య, హైమం విమానం విర చయ్యహార్షా దన్యచ్చ కైఙ్కర్య మసావతానీత్. చోళేషు (?) కిం బహునా నరేంద్ర! స్థానేషు సర్వేషు మాహేశ్వరస్య, ప్రాకారసౌధప్రముఖాననేకాన్ని ర్మాయ ధర్మాన్సుమదేనరేంద్రః. మహీసురాన్ కించ మహాగ్రహారైరహర్నిశం సాదరమన్నదానైః, దానైరనేకైరపి భక్తిపూర్వం సంప్రీణయామాస సచెవ్వ భూపః."

ఈధర్మకార్యాలలో కొన్నిటికి శాసనాలున్నవి. ఈచెవ్వప్పనాయ కుడు, క్రీ॥ 1580 ప్రాంతములవరకు జీవించెను. ఈయన కుమారుడు అచ్యుతప్ప నాయుడు. ఈయనయోగ్యత సంగీతసుధపీఠికలో యిట్లు వర్ణింపబడినది:—

"శ్లో॥ తత్తాదృశైర్ధర్మభరైరముష్మాదావిర్బభూవాచ్యుత భూమిపాలః, మూర్త్యంబికాయాం జగదంబికాయాం బాలేందుమౌళేరివ బాహులేయః॥ ఆరభ్య బాల్యాదతి భక్తిశాలీ...రంగనాథం. అవాప్య తంజాపురమప్రతీపః కౌమారఏవాభృతరాజ్యభారః, గజైరనేకైస్తురగైర్భటైశ్చ నిర్జిత్య సామంత నృపాలవర్గమ్. సంపాద్య దత్తేస్మ సమస్తమర్థం శ్రీరంగనాథాయ తథా ద్విజేభ్యః, రంగేశితుర్దివ్యమసౌ విమానం హైరణ్మయం రత్నమయం కిరీటమ్. మణీమయం వర్మ చ నిర్మమీతే సింహాసనం క్ష్మాతలపాల విమః, తస్యైవ పూర్వోత్తరపశ్చిమాని సగోపురాణ్యప్రతిమప్రభాని. ప్రాకారమప్యష్టమమాత నిష్టమహాసనం చాపి మహీమహేంద్రః, లక్ష్మ్యాశ్చ సర్వాణ్యపి మండపాని దివ్యాని రత్నాభరణాన్యతానీత్. ఆరోహమార్గం చ మరుద్వరాయా (?) మలంక్రియాభావ ము పేయివాంసమ్, ఆరామసీమామపి రంగభర్తుర్గ్రామానసే కానపినవ్యతానీత్. దానం తులాపూరుషమచ్యుతేంద్రో హిరణ్యగర్భం ప్రతి వర్షమేవ, హేమాద్రికల్పేకథితాని సమ్యక్ సర్వాణి దానాని ముహుర్వ్య తానీత్. రామేశ్వరస్యాపిచ గోపురాణి తీర్థాని సర్వాణి నవీచకార. సందర్భ

నం కించ సిరామసేతో రసావత్సాదనువర్ష మేవ, దినే దినే భోజయ దేవ, లక్షా
ధికాన్ ద్విజానచ్యుతభూమిపాలః."

రాజచూడామణిదీక్షితుల రుక్మిణీపరిణయమహాకావ్యమునకూడా
యిట్లే వర్ణించినాడు.

"శ్లో. మాయూరమధ్యార్జునకుంభఘోణ శ్రీచంపకారణ్యముఖస్థలేషు,
మహోత్తరం మండపమాతతాన భక్త్యా మహత్యా పరమచ్యుతేంద్రః. అగ్రాశ్వ
నేకానపిచాగ్రహారానసౌ వ్యతారీదవనీసురేభ్యః కార్యే చ ధైర్యేపి చ దాన
కేళ్యాం సమోనకశ్చిద్ధరణీభృదస్య."

"రంగాజీ" మన్నారుదాసవిలాసమందు వర్ణించినవిధం:—

"సీ. మన్ననాయనకును మహనీయగోపుర, ముఖములా గోపురముల
నొనర్చె, రామసేతువునఁ దీర్థములెల్ల బ్రకటించి, యిలమహాదానంబులెల్లఁ
జేసె, రంగధామున కంతరంగ ముప్పొంగఁగా, రత్నాంగియుం గిరీటరాజ
మొసఁగె, శ్రీముష్ణముఖ్యవిశేషస్థలంబుల సకలవైభవములం సాగఁజేసె,

గీ॥ సార! నాలుగుదిక్కులయందు శౌరి, కఁతను సేయనికైంకర్య
మవనిఁ గలదె, పాండ్యతుండీరముఖ్యభూపతులఁ గెల్చె, సొరిది నాఘనుఁ
డసహాయశూరుఁ డగుచు.

ఉ॥ సారభుజాబలంబునను జక్కదనంబున సద్గుణంబులన్
ధీరసుతప్రతాపమున దిక్కుల మిక్కిలి నిండుకీర్తులన్
ధారుణిఁ బ్రోచు నేర్పునను దారదయుం గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథభూమి పరిణీమణికిన్ సములే నృపాలకుల్?"

విజయవిలాసంలో:—

"శా॥ శ్రీరంగేశుఁడువచ్చి యచ్యుతధరిత్రీభర్తయై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి తాన తనకున్ గైంకర్యముల్ చేసెఁ గా

> కేరాజైనను జేయఁగాఁ గలిగెనే యిట్టివిమానం బహో
> భూరిస్నిగ్ధముగా, మహామణిమయంబుల్గాఁ గిరీటాదులన్."

మహానుభావుడైన యీఅచ్యుతప్పనాయనికి, విద్యారణ్యులవంటి మహాత్ముడు గోవిందదీక్షితులు మంత్రిగా వుండెను.

శ్రీ

## రాయవాచకము.

"(ఈగ్రంథము తాటియాకుప్రతులు రెండు పుదుకోటలో దొరకినవి. అందొకటి సంపూర్ణముగను మఱియొకటి యసంపూర్ణముగను నున్నవి. రెంటిని బరిశీలించి పాఠమును నిర్ణయించుట యైనది. భాష తఱచుగా లక్షణవిరుద్ధమయినను జరిత్రాంశములే ప్రధానము చేసియుం దక్షిణదేశమం దానాఁడు వ్యాపించియున్న వ్యావహారికాంధ్రభాషాస్వరూపము లోకమునకుఁ దెలియుట మంచిదనియు వాక్యరచన మున్నది యున్నట్లే ప్రకటించుచున్నారము. శీఘ్రముగనే యీగ్రంథము టిప్పణముతోఁ బుస్తకరూపముగఁ బ్రకటింపఁదలఁచినారము.)"

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

### అవతారిక.

క. విజయనగరవృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్యల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయశేఖరుచరితల్.

క. విజయనగరజనపాలుఁడు
విజయాపురి గోలకొండవీరులతోడన్
గజపతిని నాజి గెలిచిన
విజయుండౌ కృష్ణరాయవీరునిచరితల్.

క. రాయలకు రాజనీతులు
నాయండు నప్పాజి చెప్పినవియన్నియుం దాఁ
బాయక మనసున నునిచిన
రాయసములు వ్రాయఁ జదువ రసికతగలుగున్.

క. బాలురు చదివిన బుద్ధివి
శాలురు గావలయుం శాస్త్రజలంబులలో
లోలురు నరివధచింతా
శీలురు గావలయు భక్తిశీలత నెపుడున్.

## కథాప్రారంభము.

శ్రీవంతు సకలగుణసంపన్నులయిన మహామేరుసమానధీరులైన అఖండితలక్ష్మీప్రసన్నులయిన శ్రీమన్మహామండలేశ్వరరాజమాన్యమహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథనాయనయ్యావారి దివ్యశ్రీపాదపద్మములకు దేవరవారిస్థానాధిపతి భక్తపరాధీనుండు సద్వినయభయభక్తులనున్న కాయంగలవిన్నపం.

**కర్ణాటరాజుల దినచర్య**

విద్యానగరమందు వీరనృశింహ్మరాయులవారు బ్రాంహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యులు నామావళులున్ను అధ్యాత్మసంకీర్తనములున్ను పాండవగీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్ష భారతసావిత్రి దధివామనస్తోత్రము గంగావతరణము నదీప్రార్థనమున్ను భారత భాగవత రామాయణం ముచికుంద్దస్తుతి అక్రూరస్తుతి భీష్మస్తుతి సంజ్ఞయంనినీతి విదురనీతి చాణూరనీతి పద్యనీతి ఇవి మొదలైనవిన్ని నీతి వైరాగ్యశతకం పురాణశ్రవణమున్ను రాజనీతులన్నియుం విని దర్పణావలోకనాంతరం కన్యకామణులు కపిలకామధేనువను స్పర్శనంబుచేసి విప్రవరులదర్శనంబు చేసినపిమ్మట దంతధావనముఖమజ్జననామతీర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగా నూటయెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థప్రసాదములున్ను రాగా యెదురుకొని

ప్రత్యుత్థానముచేసి అంజలి చేసందుకొని శిరసావహించి స్థలాంతరాలనుంచిన్ని
వచ్చిన అయ్యంగార్లనున్ను ఆరాధ్యులవారలనున్ను ఉచితాసనములయందు
కూర్చుండనియమించి అష్టస్వయంవ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచ
లం సాలగ్రామంతో తోతాద్రి నైమిశారణ్యం పుష్కరక్షేత్రం ఇవిమొదలయిన
స్థలాలకు సురక్షితముగలవా అని అడిగినందులకు దేవరవారి ప్రతాపాతి
శయమువల్ల ఆయాస్థలాంతరములనున్న ముద్రకర్త వొకటికొకటి కొదువ
లేకుండ నడుపుతూ వున్నారు నూటయెనిమిదితిరుపతులున్ను నిత్యోత్సవము
లుగా నడుస్తావున్నవి అని అయ్యంగార్లున్ను పలకగా, పృథివ్యాపస్తేజో
వాయురాకాశకాత్మకమైన యేకామ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళ
హస్తీశ్వర చిదంబరం మొదలైన డెబ్భైరెండుదేవస్థలాలున్ను పదునెనిమిది
శక్తులకున్ను నిండుపడితరములుగలిగి నిత్యోత్సవములు గలిగియున్నదనే
ట్టుగా ఆరాధ్యులు తెలుపంగా, విన్నవాడై చాలసంతోషపడి వార్లకు
పట్టెములమర్చి ధర్మాసనం ధర్మయ్యను పిలువనంపంగా అయనవచ్చి నిలచి
దేవరవారు అనతిచ్చినప్రకారం ద్రావిడరాజ్యములోగల అగ్రహారములున్ను
ఆంధ్రదేశం హోయనదేశం మొరసునాడు మొల్నాడు కర్నాటకం ఘట్టశీమ
చేర చోర పాండ్య మగధ మళయాళ ఆదిగాగల అగ్రహారములకున్ను అవధి
ఆటంకములులేక నిత్యకర్మానుష్ఠానపరులై ఋగ్యజుస్సామాథర్వణపారీణులయి
షట్ఛాస్త్రపారీణులయి పంచయజ్ఞపరాయణులై అతిథిసంతర్పణలుచేసుకొని
నిర్విచారులై సుఖవసతిగావున్నారని విన్నపంశాయగా, రాయలవారు వినవ
ధరించి దళనాయకుల పిలువనంపగా, వారువచ్చి పొడగని నిలిచి వినయము
తోడట్టు సింహాసనరాజ్యములోగల గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గముల
యందు కావలికట్లు ప్రహారిబడగరములున్ను బీగముద్రలు స్వామివారిప్రతా
పమువల్ల జతనమైయున్నవి, సామంతరాచకార్యములు విశేషముగా లేదు
అని విన్నపంశాయంగా; ఆవెంబడిగా తలారి జంగమయ్యవచ్చి రాయలవారి
సముఖానకు అడ్డబడి చేతులుకట్టుకొని నిలిచి దళనాయకులతోను విద్యానగర

పట్టణములోనున్న వెలిపాళ్యములయందున్న యాదిహెచ్చరికలు గలిగి
రాత్రిపగళ్లు తలార్లు జతనమై జాగ్రతగా కాస్తావున్నారు; గనక పట్టణము
లోగల అష్టాదశవర్ణాలవారును అంత్యంతసంతోషపరులై అతివైభవములతో
డట్టు నిత్యకల్యాణములున్ను పచ్చతోరణములున్ను గల్గియున్నారని విన్నపం
కాయంగా, దళనాయకులు విని రాయలవారికి విన్నపంజేశినారు. ఆపిమ్మట
విఠలవిరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది రథోత్సవానకు విజయం
కాయవలెను అని విన్నపం కాయంగ దగ్గరవున్న దళనాయకులు ఆతీరున్ని
రాయలవారు విచ్చేస్తావున్నారు స్వామి రథారూఢులైనతోడుతోనె వచ్చి
విన్నపం కాయమని ఆప్పించి రాయలనగరికి తొమ్మిది సంప్రతులనున్ను
బిలువనంపగా కరణాలువచ్చి పదునెనిమిది రేవులలెక్కలున్ను వినుపించిన
తర్వాత రాయలవారు దిక్కులనుంచివచ్చిన కమ్మకాకితములు యేకాంత
ముగా వినుపించ్చగా విని ప్రధానులను దళవాయిని రప్పించ్చుక కొంతతడవు
యేకాంతముగా ఆలోచించి ఆపిమ్మట నిండుకొలువునకు వచ్చినవారై సకల
సామాజికులను రప్పించుక నగరిఅళ్లుళ్ళు కొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు
పాళెగార్లు అమరనాయకులు పురోహితులు ఆచార్యపురుషులు జియ్యంగార్లు
యతీశ్వరులు దైవజ్ఞులు నాటకాలంకారులు విద్వాంసులు వీణాధరులు
చేరువగార్లు రాజులు వందివైతాళికులు పాటకులు పరాణీకులు శాస్త్రులు ఇవి
మొదలుగాంగల డెబ్భైరెండు వినియోగాలవారలున్ను వచ్చి కొలువుండగా
దైవజ్ఞులు లక్షణికులు దళనాయకులతోను ఆగతానాగతభూతభవిష్యద్వర్త
మానంబులు ప్రసంగనకాయగా ఆవెంబడిని విద్యానగరపట్టణంగ్గావిచ్చే
టందుకు మునుపు విద్యారణ్యశ్రీపాదులు యెందుండిరి వారు ఇచ్చటికి రా
కారణంయేమి వారువచ్చి పట్టణంగావించినది యెట్లు అని అడిగినందులకు
ముల్లంద్రడిండిమపుంభావసరస్వతి విద్యారణ్యులవచనాలున్ను విజ్ఞానేశ్వరముని
వచనాలున్ను ఆయనకు డెలిశివుండును. పుంభావసరస్వతి విన్నపం జేశిన
వివరం:——

## కర్ణాటరాజ్యవృత్తాంతము.

### (ఉత్తరభాగము.)

### అవతారిక.

[ఈవృత్తాంతముగల కాగితపుగ్రంథము పరిషత్పుస్తకభాండాగారమందున్నది. దీనిసంఖ్య ౩౯౦౭. మదనపల్లిగ్రామములో దొరకినది. ఇందు, తాళికోటయుద్ధము, తరువాతివృత్తాంతము కొంతవర్ణింపబడినది. కథ పూర్తికాలేదు. కొన్నివిషయములు యథార్థములుగానున్నవి. కొన్ని పుక్కిటిపురాణములుగూడ గలవు. పూర్వాపరసంబంధము చక్కగ పాటింపబడలేదు. భాష సలక్షణమైనదిగాదు. ఇన్నిదోషములున్నను విషయము దేశచరిత్రపరిశోధకుల కుపచరించు ననునూహతో గ్రంథ మున్నదియున్నట్లే ప్రకటించినారము.]

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

శ్రీరస్తు.

శ్రీమద్రాజాధిరాజ తేజోనిధిరాజకందర్పరాజకంఠీరవ అమరాయరగండాంకరాజమనోభయంకర। శశివంశకులపావనా। ధామా। ఆత్రేయగోత్ర్య ఆపస్తంభసూత్ర రమణచరణకమలనికేతనపూర్వసింహాసనోద్ధారణ శ్రీరాజపరమేశ్వర। యేకపవిత్రోదయ। శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరవెంకట। పిన్నమకాకల్లూరాజ్యంలోగాను గుండాండమ నేపట్నంబనేది లక్షరాజ్యం తాణావేసుకొని సబాంధవర్గాతిసమేతముగా రాజ్యభారం చేస్తువుండగాను తోరశంట్టినరసరాజువారియంట్టితిమ్మమ్మగారిని వివాహంచేసుకొని యీయంమ్మయందు కుమారుడు శ్రీరంగరాజు నంద్యాలతాణావేసుకొని వుండ్రి। అంబళాదేవి। చెల్లాదేవీ। ఆనంద్యాల నిజరాజ్యధానిగా రాజ్యపరిపాలనచేస్తువుండ్రి। వారికుమారుడు రామరాజు అనేఆయనా। కందనూలు తాణావేసుకొని ప్రభుత్వం చేస్తావుండెను। మూడో ఆయన నారసింహ్మరాయ

లువారు కుతుబశాయివారిమీదను । గజపతివారిమీదను మోహారంచాయ
గాను । యీబుక్కరాజున్ను । నాల్గువేలమురికినాడురాచిరికెమున్నూ।రెండు
వేలారెనూరుక్రమ్మ వెలమలూన్ను । అల్లుంఢ్లు । కుమాల్లుఁగాముస్నాటితోను
నారసింహ్మారాయులవారితోను డిల్లీఆప్రాంత్యమునకు గమనంచేసిరి । కుతుబ్‌శా
పాచ్చాయివారి మొనవిరిగినంత బార్‌నో గజపతివారిఫౌజువారికి సహాయము
వచ్చి యెదిరించి యుద్ధంచేసేయెడల రాయులవారిఫౌజువిరిగివచ్చి నర్మదా
తీరంచేరినంతలో బుక్కరాజు వారు స్వజనంఫౌజుతోకూడా యెదిరించినిలిచి
కుతుబ్‌శావారిని సహాగాను గర్వభంగముచేసి పలాయనముచేసినందున రాయుల
వారికి శ్రేయస్సువచ్చెగనుక నారసింహరాయులవారు మెచ్చి వీరికి లక్ష
రాజ్యముకాక । ఆరవీడు । చెలమనూరు । అనేడిస్థలాలు రెండులక్షలరాజ్యము
జహాగీరుఇచ్చి మీరుమాసముఖమందువస్తేను మీకుమర్యాదలు మాకుమాల్లు
అచ్యుతరాయులు । ప్రౌఢదేవరాయులు । వారితోసమముగా కూర్చునేటట్టు
నిర్ణయించి । మాఫౌజుకు ప్రథమజండానడచేటట్టు నిర్ణయించి అంపించిన
వెనుక । ఈరెండుసర్కార్లుచేసుకొని మందీలుహోజీలఁకన్నా మేలుగా వెల్గోటి
యాచమనాయనిగారు । పెమ్మసాని తిమ్మానాయనిగారు । యీనాల్గుమన్నిరి
కాలుకన్నా అండెంహిరెబసప్పనాయకపజీరుకన్నా అతిశయముగాను । నడి
పిస్తూవున్నారు । యేతక్కెం నిమిత్యముగాను స్వజనబంధునల్గురిపెద్దలపిలువ
నంపించి యేకాంతంచేసి వారితోను । రా॥ బుక్కరాజుగారు పలుకరించిన
వివరం । నారసింహ్మారాయులవారు బహుమానపురస్కరంగాను । మాకుమర్యా
దలుచేసినారుగనుక మీనల్గురిదయావిశేషంచాతను ఫేషక్కుపొందినారం ।
కాగా మీరుమాకు పఖుపెద్దతనంనడిపించవలసినదని అడిగినందున ఆబుక్క
రాయలవారితోను నల్గురుబంధూలు అనినవివరము మనవాల్లఁలోను నీవు
ఆరవేటిబుక్కరాజవు । దశావంతుడవు । మీకు మేముమర్యాదయిస్తున్నారం
యావత్తుక్షత్రియజాలమున్ను । మొక్కిచాయంగలవిన్నపాలు అని వుత్త
రంలో రాసుకుంటున్నారం. మీరు మాపేరవ్రాయించవలసితేను దీవించిపుత్తెం

చిన ప్రయోజనం అని నిరూపం వ్రాయించవలెను । అని నల్గురు బాధూలు పేషకు్కయిచ్చిరి । ఆషింమట మహారాజులగాను రాయలవారిచిత్తంసంపా యించుకుని । సబాంధవసపరివారయుక్తంగాను రాజ్యంచేస్తూవుండగాను ఈ బుక్కరాజుకు పెద్దరామప్పయ్యగారు జననమైరి । యీరామరాజుగారు కందనూరులో ప్రసిద్ధిగారాజ్యంచేస్తూవుండిరి । వీరికి తింమ్మరాజు । శ్రీరంగ రాజు । రామరాజు । తిరుమలరాజు । వెంకటపతిరాజుగారు । అయిదుగురు కుమాళ్లలోగాను కృష్ణరాయులవారిపట్ణం అల్లుడు రామప్పయ్యకు లభ్యమా యెను । యువరాజ్యపట్టం తిరుమలరాయులకుయిచ్చెను । కడమముగ్గురిలో కందలనూలు వెంకటపతిరాజుకుయిచ్చెను । రాయవేలూరిలోను తిమ్మరాజును వుంచెను । గుర్రంకొండ । బెల్లంకొండ । కంభం । కాకర్ల । పెనుగొండ । సమాగాను కోనేటిరాజుగారికి యిచ్చెను। తాము యేకపత్నివ్రతుండై రాజ్యం చేసెను.

## ప్రతాపచరిత్రము.

(ఇది ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటితమైనది.)

ఈక్రమంబున శ్రీమత్ ప్రతాపవీరరుద్రుండు రాజ్యంబు సేయంగాను, తనఆజ్ఞకు మరలబడిన పశ్చిమదేశాధీశ్వరులపై దళంబుబంపి వారినోడించి పత్నీయుక్తంబుగా ఆపారశిరాజును ఏకశిలానగరంబునకు దెచ్చుటయు— ఆసమయంబున దేవగిరినున్న రామదేవరాయలు పారశిరాజు తమ్మునింగలయు టయు—ఇక్కడ ఏకశిలానగరంబుననున్న పారశిరాజు మృతిబొందిన యతనితమ్ముడు జవానుములకు పక్కీరువేషంబున ఏకశిలానగరంబున జొచ్చి పురంబు అంత తనచేత సాధ్యంబుగాకుండజేసి తనఅన్న సతిసుతులకున్ను తాను తొరుకచేసుకొని వారిని పఖీరువేషంబున పురంబువెడలదీసుకొని తమ రాజ్యంబునకువచ్చి వాండ్లనునిచి రామదేవరాయలు తానున్న జవానీములుకు ఢిల్లికింబోయి సుల్తానునుజూచి యేకశిలానగరంబు బలంబు తెరంగుకొలందియు,

చెప్పగ కొంచెంబని కార్యంబూహించి యేకశిలానగరంబు సాధింపన్ దలంచి
అపుడు సుల్తానుతో కూడినరాజులు పశ్చిమదేశాధీశ్వరుండు లక్షగుర్రంబులును
రెండులక్షలపదాతివర్గంబును, కటకవల్లభుడు ఏభయివెయిలగజంబులును, రెండు
లక్షలతురంగంబులును, ఎనిమిదిలక్షలపదాతివర్గంబులును, తక్కినరాజులు
రెండులక్షలతురంగంబులును, రెండులక్షలపదాతివర్గంబులును, ఈచొప్పున
దళంబునుగూర్చుకొని రాచర్లపద్దవిడియుంటయు ఢిల్లీశ్వరుండును మల్కిశేఖా
నును దళవాయంజేసి రెండులక్షలయాభయివెయిలగుఱ్ఱంబులున్ను పదిహేను
లక్షలపదాతివర్గంబునుగూర్చి యేకశిలానగరంబునకు ఉత్తరదిగ్భాగంబున
మాద్గల్యంబునవిడియుంటయు, ఇట్లు మూడుదిక్కులవిడియుంట శ్రీమత్ప్రతాప
వీరరుద్రుండు చారులచే విని నరపతిరాయలకెరింగించిన అతండు ముప్పయి
రెండులక్షలపదాతివర్గంబును యేడులక్షలతురంగంబులతో దక్షిణదిగ్భాగంబున
వేల్పుగొండద్వారంబున నరపతిరాయలువిడియుంటయు, ఏకశిలానగరంబునం
గల కొంతబలంబును డెబ్బయియెద్గురుపద్మనాయకులున్ను రాజాత్ముడు
అన్నమదేవుండును పశ్చిమంబునడిగిన బలంబులమీదికిపోవుటయు, సుల్తాను
బలంబులమీదికి తనమూలబలంబును తలపడి, అఘోరయుద్ధంబు జేయుసమ
యంబున మల్కిశేఖానుండు సమసినహతశేషులు డిల్లిమార్గంబుపట్టిపారు
టయు అన్నమదేవుండు డెబ్బయియేడుగురుపద్మనాయంకులును తలపడిన
జవానుములుకువిరిగిపారుటయు రామచంద్రరాయని తలదునిమిన బలంబులు
పారిపోవుటయు కటకవల్లభునిపై నరపతిరాయలు కయ్యంబుచేసినరాయులు
తనపరాక్రమంబున రెండువెయిలమదగజంబుల పదివెయిలగుఱ్ఱంబుల యెని
మిదిలక్షలపదాతివర్గంబులను ద్రుంచి వెయ్యిగజంబులపట్టుకొనిన అతండు
తిరిగిపారుటయు, ఇట్లుహతశేషంబైనవారలు ఢిల్లికింజని సుల్తానుతో జెప్పిన
విని బలంబులుమగుడగూర్చి బిసరుఖానునిదళవాయింజేసి ఉత్తరానవిడియుం
టయు చిల్లరరాజులు ఎప్పటియట్లబలంబులుగూర్చుకొని పడుమరరాచర్లకాడ
విడియుంటయు, ఎప్పటియట్ల మూడుదిక్కులవారు సంగరంబుచేసివిడియుంటయు

కటకవల్లభుండును ముకుందనందనుండును వానిపట్టణంబుగట్టుకొని మగుడా బలంబులుగూర్చుకొని యప్పటిసుల్తానుబలంబులకూర్చి పుల్లుఖానును దళవాయింజేసి యేకశిలానగరంబునకు ఉత్తరదిగ్భాగంబునవిడియుంటయును. చిల్లరరాజులు బలంబులుగూర్చుకొని పడుమటిరాచర్ల కాడవిడియుంటయును యప్పటి యట్లు మూడుదిక్కులసంగరంబుచేసివిరుగుటయును ముకుందసుందరుండు ఒక్కనాడు ఏకశిలానగరంబుచూడవలెనని విప్రవేషముదాల్చి పురంబుజొచ్చి అన్నివీధులు రాజద్వారంబుజొచ్చుసమయంబున అతన్నిఎరిగినధొరలు అతడు కటకవల్లభుండనిన ఈవార్త శ్రీమత్ప్రతాపరుద్రునకు ఎరింగించిన అతణ్ణిగిరివేయించిన అప్పరిపైశ్యుండు కోటిపల్లివిశ్వనాథుండనువాడు శ్రీమత్ప్రతాపవీరరుద్రునకు మూడుకోట్లధనంబులుఇచ్చి యామకుందసుందరున్ని విడిపించుటయును అంతట కటకవల్లభుండు తనబలంబులచేరి నరపతిరాయులచే సంగరంబుచేసివిరుగుటయును పుల్లుఖానుండు జగడంబుచేసివిడిబడుటయును అన్నమదేవుండు చిల్లరరాజులతో యుద్ధంబుచేసిన తిరిగి తమతమదేశంబులకుం బోవుటయును.

## కాశీయాత్రచరిత్ర. 1838

నూటయిరవైయేండ్లక్రిందట చెన్నపట్టణమందుండే సుప్రీముకోర్టులో ఇంటర్ప్రిటర్ హోదాతో గొప్ప అధికారమువహించి, చాలా పలుకుబడి గలిగి, తన విద్యచేతను ధర్మముచేతను శీలముచేతను త్యాగముచేతను అసాధారణపురుషుడని కీర్తిపొందిన ఏనుగుల వీరాస్వామయ్యవారు సకుటుంబముగాను సపరివారముగా కాశీయాత్రపోయినప్పుడు, తానుచూచిన దేశములు, నగరములు, పల్లెలు, అందుండే నానాజాతులమనుష్యులు, వారివృత్తులు, ఆచారములు మొదలయిన విషయములు సవిస్తరముగా వర్ణిస్తూ దినచర్య రచించినాడు. ఆతనిమిత్రుడు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లె అనే ఆయన గవర్నమెంటువారి ఉత్తరువుప్రకారము ఈగ్రంథము 1838 వ సం॥ లో

అచ్చువేయించి ప్రకటించినాడు. 328 పుటలు గలిగి ఉన్నది. గ్రంథకర్త చరిత్ర కూడా పిళ్లగారు రచించి చేర్చినారు. ఆచరిత్ర ముందుగా ఉదాహరించి, వీరాస్వామయ్యవారి గ్రంథములోనిది ఒకనాటి దినచర్యమాదిరిగా ఎత్తి చూపిస్తున్నాను. ఈరెంటిరచనా ఎంత చక్కగా ఉన్నదో ఉదాహరించిన వాక్యములనుబట్టి తెలుసుకోవచ్చును. గ్రంథకర్త పాండిత్యము లోకజ్ఞానము గ్రంథమంతా చదివితేకాని తెలియదు; అయినా పిళ్లగారివాక్యములు కొంత మట్టుకు సూచనచేస్తున్నవి. 1912 సం. లో ఈగ్రంథము వ్యావహారికభాషా రచనకు మాదిరిగా విద్యాధికారులు ప్రకటిస్తే శాసననిర్మాణసభలోని తెలుగు సభ్యులు నిజముతెలుసుకోకుండా గ్రంథకర్త ఊరూ పేరూ లేనివాడనిన్ని గ్రంథము చదవదగినది కాదనిన్ని హేళన చేసినారు!]

## ఏనుగుల వీరాస్వామయ్యవారిచరిత్ర. 1838

ఈ చెన్నపట్టణపు కాపురస్థుడయిన శ్రీవత్సగోత్రోద్భవుడైన యేనుగుల......మంత్రిమూర్ధన్యునకు పుత్రుండగు యేనుగుల వీరాస్వామయ్య (వారితో)ను బహు దినములు సహవాసముచేసి స్నేహితుడనై యుండిన నేను ఆయనచేసిన కాశియాత్ర చరిత్రలోని సంగతులను వ్రాసేటందుకు ముందుగా ఆపురుషుని చర్యలను తెలిపినమట్టుకు చెప్పకపోదునేని ఆయన విషయమై న్యాయము నడిపించినవాడను కాకపోదునన్న భయముచేత వాటిని పూర్తిగా వర్ణింపను శక్తియోగ్యతలు లేనివాడనైనా పూనుకోవలసివచ్చినందున వాటిలో కొన్నిటిని సంగ్రహముగా వర్ణించినవాడ నౌచున్నాను.

యేనుగల వీరాస్వామయ్యవారికి తొమ్మిదవయేట పితృవియోగము సంభవించెను. అప్పుడు ఆయనకు తల్లివినాగా వేరేపోషకులు లేకయుండిరి. తండ్రి వుంచిన ఆస్తిన్ని మితముగానే యుండెను. పండ్రెండవ యేట యింగిలీషు బహువేగముగా చదవ శక్తిగలిగి యుండినందున అప్పుడు ఆయన వాలంటీరుగా వుండిన - బోడు అప్ ట్రేడు అనే ఆఫీసులోనుండే యజ్ఞామినరులు

యిద్దరున్ను ఆయనను రీడరుగా వుంచుకోవలెనని వివాదపడుచు వచ్చిరి. దాని వల్ల అవయస్సులో ఆయనకు కలిగియుండిన సామర్థ్యము తెలియవచ్చు చున్నది. పదమూడవ యేట తిర్నవల్లి కలక్టరు కచ్చేరిలో యింటేరుప్రీటరు గానున్ను త్రాన్సులేటరుగానున్ను రెండు సంవత్సరములు వుండి పదియేనవ యేట పట్టణమునకు వచ్చిచేరెను. అ... చేయుంచువచ్చి వొయర్ హావుసులో బొక్కీపరుగా వుండి హెడుకౌంటాంటు అయి తర్వాత సుప్రీంకోర్టు యింటేరుప్రీటరుపనిలో ప్రవేశించినారు. అప్పుడు బోర్డు ఆఫు త్రేడు ఆఫీసు వారు ఆయన యెడల తమకు కలిగియుండే విశ్వాసమునకు గురుతుగా ముక్కుపొడిచేశే బంగారు డబ్బి యొకటి బోర్డు శక్తిచేరిమూలముగా సుప్రీంకోర్టు జడ్జీగారి సెలవుమీద ఆయనకు యిప్పించినారు. ఆయన తనకు పరులు స్వల్పోపకారము చేసినా వారియెడల జరిగించిన మేలు చెప్పవలవి గాదనుటకు ఆయన తిరుణామలకు వెళ్లినప్పుడు ఆగుడిలో తనవలెనే స్వామి దర్శనమునకు వచ్చిన ప్రజలకు సహాయముగానుండే యొక బంట్రోతు తనకు జాగ్రతగా స్వామిదర్శనము చేయించినందుకు వాని మంచి నడతలను యిచ్చట రివిన్యూబోర్డువారికి శ్రుతపరచి వానికి వెండిబిళ్లయున్ను ఒక వరహా యెక్కువ జీతమున్ను కలిగేలాగు చేసినది సాక్షిభూతముగా నున్నది. అశ్వల మునకు అష్టబంధనము చేయించి గజదానము చేసినారు. యిది వారిశక్తికి యెచ్చయిన కార్యముగా అందరికిన్ని తెలియవలశినది. అక్కడి కలకటరు ఆయననున్ను ఆయనతో కూడా వచ్చిన మరికొందరు ప్రభువులనున్ను చూచి మీరందరున్ను కూడి యిక్కడి దేవునికి రథము కట్టిస్తే బాగా వుండునని చెప్పగా అప్పట్లో ఆప్రభువులందరున్ను అలాగే చేయుచున్నామని ఆయన గుండా అనిపించి అక్కడినుంచి పట్టణమునకు వచ్చిన తర్వాత ఆ ప్రభువులు ఆకార్యమును గూర్చి సదరహీ అయ్యవారితో యెచ్చరించడమే మాను కొనిరి. అయ్యవారు తానుమంచిదని చెప్పినందున ఆకార్యము తనశక్తి మించిన దైనా అపరిమితమైన ధనవ్రయముచేసి రథము కట్టించి తనమాటను

కాపాడుకొన్నారు. యిందువల్ల ఆడిన మాట కాపాడుటకై శక్తికిమించిన కార్యములను సాధింపుచు వచ్చినారని స్పష్టముగా తెలియుచున్నది. వారు కాశీయాత్ర వెళ్లినప్పుడు సేను ఆరథానకు యినపగొలుసులు జాగ్రతపెట్టి గవర్నమెంటు వారిగుండా వాటికి రంగు పూయించిన సంగతి స్వల్పసహాయమైనా దాన్ని అనేక ప్రకరణములలో నుదాహరించి గొప్పగా కొనియాడిరి. యీలాగు స్వల్పోపకారములను గొప్పగా కొనియాడుచూ వచ్చినందున యితరులకు విశేషకార్యములయెడల ప్రవృత్తికలుగుచూ వచ్చెను. ఒక్కసంవత్సరమునకు అధికముగానే వారు ప్రతిద్వాదశిన్ని భక్ష్య భోజ్య ఫలాజ్య దధి ప్రాజ్యములయిన బ్రాంహ్మణారాధనలుచేసి తర్వాత తాను ద్వాదశీ పారణ చేయుచు వచ్చినారు ఆ సంతర్పణాలు యీపురమందు మహోత్సవములుగా నుండినవి. అన్నప్రదానమందు వారి చాతుర్యమున్ను జాగ్రతయున్ను వర్ణింప శక్యంబులు గావు. వొక్కస్థలమందు ఏకపాకములో ఏకాపోశనముగా వొక్కలోపమున్ను లేకుండా మూడు నాలుగు వేల బ్రాహ్మణులు భుజించునప్పుడు తానొక పరిచారకునికంటే సులభుడుగా నటించెను. అందరికిన్ని అనేకవిషయములలో కాలయాపనవౌచున్నది. ఆపురుషుడు యిట్టి సద్విషయమందు శ్రమను యెంచక స్వల్పకాలమును వ్రయపరచినది పరలోకగతుడైనా వున్నట్టే కొనియాడబడేలాగు చేయుచున్నది. యిట్టి సత్కార్యము చేసినవారికి అది కీర్తిహేతువు కావడము మాత్రమేగాక యితరులకున్ను అలాటికీర్తి యెడల సుబుద్ధికలుగుటకు కారణమవుచున్నది. యీపురమందు క్షయ మాస విషయమయి మహాసభకూడినప్పుడు అయ్యవారు తన పక్షమును శ్రుతి స్మృతి ప్రమాణములతో స్థాపనచేయగా ఆసభవారు మిక్కిలీ సంతోషపడి అందుకు చిహ్నాగా అయ్యవారికి రత్నహారమును బహుమతిచేసి వారి సద్గుణములను వొక పత్రికలో వ్రాసి ఆయనకు పంపిరి.

ఆయన వుద్యోగములో నుండినకాలమువరకు అకోర్టుజడ్జీలకు తృప్తిగా నడుచుకొన్నారనే టందుకు దృష్టాంతముగా పెద్దజడ్జీయయిన సర్ రాల్ఫు

ఫాల్మరు దొరగారు ఆయనకు వ్రాసియిచ్చిన టెష్టిమోనియాల్-అనే యోగ్య
తా పత్రికలో విశేషముగా ఆయన కోర్టులోనున్ను చేంబరులోనున్ను అల
సటలేక బహు నెమ్మదితో పనులు గడుపుచు వచ్చెననిన్ని ఆయన తన గొప్ప
వుద్యోగపు పనులను మిక్కిలీ నమ్మకముగా జరిపించెననిన్ని మరిన్ని ప్రజల
మేలుకోరి స్మృతిచంద్రిక మొదలైన కొన్నిపుస్తకములకు త్రాన్సులేషన్
చేసెననిన్ని నేనెరిగినంతలో గవర్న్మెంటువారి విశేష కృపకు యీ పురు
షుడు పాత్రుడయినట్టు హిందు పెద్దమనుష్యులలో మరి ఎవరున్ను యెక్కు
వైనవారు లేరని దృఢముగా నాకు తోచియున్నదనిన్ని వ్రాయబడి
యున్నది.

లోకములో గంగా స్నానమునకు వెళ్లినపురుషుడు తన తల్లిదండ్రు
లకు గంగ తెచ్చి యివ్వడము వాడికె బడియున్నది. యీమహాపురుషుడు
గంగను పడవలు బండ్లు కావళ్లు వగయిరాలమీద తెచ్చి యీదేశములో
నుండే నాలుగు వర్ణాలవారిలోనున్నుండే గొప్ప మనుష్యులగుండా ఆయా
వర్ణములలోని ముఖ్యుల పేళ్లు తెలుసుకొని వారికందరికి గంగనున్ను జగ
న్నాథపటప్రసాదములనున్ను యిప్పించెను. అందువల్ల అందరినిన్ని తనబంధు
సమానులుగా చూచేవారని స్ఫుటముగా తెలియుచున్నది. ఆయన యాత్ర
పోవునప్పుడు నేను సకృదావృత్తి అక్కడి వినోదములను, వ్రాయించిపంపించ
వలెనని అడుగుకొన్నందుకు యాత్రలో ప్రతిదిన చర్యలనున్ను ఆయాప్రస్తా
వములలో జగదీశ్వరుడు తనకు తోపచేసిన తాత్పర్యములనున్ను మార్గమందు
పరులవల్ల తానుచెందిన సహాయములనున్ను తనవలె యాత్రపోవువారు మార్గ
ములో పూర్వముగానే జాగ్రత పెట్టుకొనవలసినవిషయములనున్ను క్రమముగా
అప్పుడప్పుడు వ్రాసిపంపుచువచ్చిరి. ఆపుస్తకమును చూచుటవల్ల యాత్రపోయి
చూచి తెలియవలసిన సంగతులన్నీ తెలియుచున్నవి. ఆపుస్తకము పనయారి
వెంకు మొదలారిగుండా అరవముతో తర్జుమాచేయించబడి అచ్చువేయించ
బడి యున్నది. నాగపూరి వీరాస్వామి మొదలారి మహారాష్ట్రములో భాషాం

తరము చేయించినాడు. ఆ మహారాష్ట్రపుస్తకమును నాగపూరి రిసైడెంటుగారు తాను యింగ్లీషుతో ట్రాన్సులేషన్ చేసి ప్రసిద్ధిపరచ తలచి అయ్యవారిని సెలవు అడిగినందుకు వీరు నేనే భాషాంతరము చేయించి పంపుచున్నానని తెలియజేసి కొంత భాషాంతరము చేయించినారు. భగవంతుని కృపవల్ల కొదవయున్ను యేపుణ్యాత్ములగుండా నయినా పూర్తికావచ్చును.

నందనసంవత్సరపు క్షామములో నేను కొంతధాన్యసంగ్రహము చేసి వుంచడము మేలని చెప్పినందుకు అయ్యవారు మనము ధాన్యము సంగ్రహించి మనముమట్టుకు భుజించి అన్నాతురులై దుఃఖపడే పేదలను చూచుచు జీవించుట అప్రయోజకము గనుక తన ప్రయోజనమునకుగాను విస్తరించి జాగ్రత పెట్టుకొనరాదని చెప్పి ఆదుర్భిక్షములో శక్తివంచన లేకుండా తాను అన్నప్రదానము చేయుచు యితరులను స్వప్రయోజనమునకు అనుసరించేలాగు అనుసరించి వారినిన్ని పేదలపోషణవిషయమై ప్రవర్తింపజేయుచు ఆలాగు ప్రవర్తించినవారిని తాను మిక్కిలీ కొనియాడి సంతోషపెట్టుచువచ్చిరి. అందువల్ల మరికొందరున్ను అన్నదానమందు ప్రవర్తింపుచు వచ్చిరి.

మరిన్ని గంజిదొడ్డియనే అన్నసత్రములో గవరన్మెంటువారు అపార ద్రవ్యమును బీదల అన్నప్రదాన విషయమై ఖర్చు చేసినప్పుడు అయ్యవారు ఆధర్మవిచారణప్రభువులలో తాను వొకడుగా నుండి పేదలకు కాలములో విమర్శగా అన్నమును అందచేసే కొరకై పడినశ్రమ చెప్పశక్యము కాదు. అది యేలాగంటే ౧౦౦౦-౨౦౦౦ తూముల బియ్యమును ప్రతిదినమున్ను పాకము చేయించి తన దృష్టిపథములో పేదలను శ్రమపడనీయకుండా రెండు జాములకు లోగానే అన్నమంతయు వినియోగపరచుచు వచ్చిరి. మరిన్ని తన బుద్ధిశక్తిని యావత్తున్ను రాత్రిన్ని పగలున్ను ఆ కార్యము విషయమై వాడుచు వచ్చిరి. యిదిగాక అయ్యవారు నాతో ఒక ప్రస్తావములో చెప్పియుండే యొకసంగతి మిక్కిలి ప్రయోజనకారిగా తోచినందున యీ అడుగున వ్రాయుచున్నాను. వొక పురుషుడు విస్తరించి ద్రవ్యము నార్జించి

పెట్టి తాను సద్వ్యయము చేయకుండా చనిపోవుట నిష్ఫలమనియున్ను చని పోవువారు తమకు పిమ్మట జరగవలసిన కార్యములను వ్రాసే మరణశాసనములు అనేకముగా తన వుద్యోగమునుపట్టి ట్రాన్సులేషన్ చేయవలసి వచ్చినందున ఆ వ్రాసినవారి తాత్పర్యములనున్ను వారు జీవించియుండగా చేయుచు వచ్చిన కృత్యములనున్ను వారికి యీలోకవిషయమై యుండిన తాత్పర్యములనున్ను వారు వ్రాసినమరణశాసనములు వారి మరణాంతరము ఆ తాత్పర్యానకు సంబంధించక పోవుటనున్ను వారు స్వప్నావస్థలోగూడా చూడనివిగానున్ను యెట్టి బుద్ధిమంతులకున్ను యీలాగు సంభవించునని ఊహించ కూడనివిగా నున్ను వుండే అనేకవిషయములు సంభవించడమునున్ను తాను తెలుసుకొన్నందున తన మనసుకు లోకరీతి బాగాతెలసి పరలోక దృష్టి ప్రబలమవుచు వచ్చినదని చెప్పినారు. మరిన్ని తన కూతురివివాహమందు అన్నస్య క్షుధితః పాత్రమనే వచనప్రకారము అన్నానకు ఆకలిగొన్నవారందరున్ను పాత్రులని యోచించి అందుకు ఆక్షేపించినవారినిన్ని సమ్మతిపెట్టి సమస్తజాతులకున్ను అన్నప్రదానము చేసినారు. దీనివల్ల ఆయన సర్వసమదృష్టిగల పురుషుడని స్పష్టముగా తెలియవచ్చుచున్నది. కొందరు యీవివాహవిషయమై ద్రవ్యము వ్యయపరచుటకంటె చిన్నదానికి ఆస్తిగా వుంచుట మేలని అయ్యవారితో చెప్పినందుకు ఆయన చిన్నదాని పోషణకొరకు ద్రవ్యమును మను ష్యాధీనముగా నుంచుటకు ప్రతిగా యీశ్వరునిచేత నేను వుంచుచున్నానని చెప్పి అపారముగా అన్నదానము చేసినారు.

యీ చెన్నపట్టణమందు హిందు లిటరైరి సొసయిటి యనే విద్వత్సభను తాను కల్పనచేసి దాన్ని వృద్ధిపొందించను యిచ్చటి గొప్పమనుష్యులను స్వంతపనికి అనుసరించేలాగు అనుసరించి వారివారికి ఇష్టములయిన విద్యావిషయములన్నీ యీ సభవల్ల సిద్ధించునని అనేక మార్గములను కనుపరచుచు వారికందరికిన్ని యీసభమీద శ్రద్ధ వృద్ధిపొందేలాగు చేయుచువచ్చిరి.

అయ్యావారు తన వుద్యోగమును వదలుకొని విరామదశను బొందవలె నని తన్ను యేలుచునుండిన సుప్రీంకోరటు పెద్ద జడ్జీయైన సర్ రాబర్టుకమిన్ దొరగారికి వ్రాసుకొన్నప్పుడు ఆకోరటు అడ్వొకేటు జనరల్ జార్జినార్టను దొరగారు అయ్యావారియొక్క అతి చాతుర్యవిశిష్టమయిన ద్విభాషిత్వక్రమ ములను విస్తరించి చెప్పినంతలో జడ్జిగారు తామున్ను అయ్యావారి సుగుణము లను బహుంతరముగ తెలియపరచునప్పుడు యీవుద్యోగమును యీపురుషుడు గడిపినట్టు గడిపే శక్తిమంతులను నేను యిదివరలో చూడలేదనియున్ను యీ పురుషుడు యీవుద్యోగమును వదులుట యీకోరుటుకు బహు నష్టమనిన్ని వ్యసనపూర్వకముగా సెలవిచ్చినారు. జడ్జిగారు యీలాగు చెప్పేపాటి యోగ్యతతో అయ్యావారు తన వుద్యోగమును జరుపుకొన్నారు.

అయ్యావారు తాను జీవించియుండిన కాలమువరకున్ను కీర్తిప్రతిష్ఠా హేతువులయిన సత్కార్యములను అనేకముగా జరిగించి తుదను నిర్యాణ కాలము సంభవించినపుడు తీర్థయాత్రా ఋగ్యజుస్సామ వేదత్రయ పారా యణాది సత్కర్మప్రభావ పరిశుద్ధాంతఃకరణులై పరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధ తత్వావబోధచేత మాతృ భ్రాతృ పుత్రికా భార్యా సుహృన్మిత్ర బంధు వులయెడల నుండిన స్నేహపాశములను మూషికాజాలచ్ఛేదనన్యాయముగా ఛేదించి యీషణత్రయరహితులై దేహలోకశాస్త్రవాసనలనే వాసనాత్ర యమునున్ను అవిద్యాస్మితారాగద్వేషాభినివేశంబు లనియెడు పంచక్లేశముల నున్ను జయించి నిస్సంగులై వానప్రస్థాశ్రమ ప్రతినిధిగా కొన్నిదినములు ఆరామవాసముచేసి మహావాక్యార్థవిచారణవల్ల సచ్చిదానందఘనమయిన బ్రహ్మమున్ను తనకున్ను భేదములేదని తెలిసి సోహంభావన జేయుచునుండి యిష్టులుగా నుండినవారిని తనకు ఆపత్సన్యాసము సిద్ధింప చేయవలెనని బహు తరముగా ప్రార్థించి తన స్నేహసంబంధికులయినవారికి అనేకవిధవివేకహేతు వులగు వాక్యములను బోధచేసి సమ్మతిపరచి నిర్యాణదినమందు బహిరంగ మయిన ఆపత్సన్యాసమును స్వీకరించిన ముహూర్తములోనే యోగాసనా

సీనులయి ప్రణవానుసంధానము చేయుచు ప్రాణోత్క్రమణ క్షణపర్యంత మున్ను పూర్ణమయిన తెలివికలిగియుండి ఆత్మనిత్యుడు దేహము అస్థిరమని యున్ను తెలిసినవారు గనుక దేహము వదలుటవల్ల వ్యసనమును చెందక సంతోషముతో అనాయాసముగా శాలివాహనశకంబు ౧౭౬౦ అగు దుర్ముఖి సంవత్సర భాద్రపద బహుళపక్షాష్టమీ సోమవారమునాడు ఉదయాన స్థూలదేహము వదిలి లింగదేహముతో పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకనివాసమును పొందినారు.

కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ల.

## కాశీయాత్రచరిత్ర.

౭ తేది ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి నాల్గు కోసుల దూరములో నుండే తిలవారా అనే ఊరు దారిలో నర్మదా మహానది దాటి ౯ ఘంటలకు ప్రవేశించినాను. ఇక్కడ ౨ వందలమంది యొక్కపడవ ఒకటిన్ని ౫౦ మంది యొక్క చిన్నపడవ ఒకటిన్ని ఉన్నది. ముందు యిటువంటి పడవలు ఈ నర్మదామహానది రేవులో అనేకములుగా నుండినవి. అయితే యిటుతర్వాత౯ను ౨ సంవత్సరములకిందట అకస్మాత్తుగా ప్రవాహము వచ్చి రేవున నున్న పడవలన్ని కొట్టుకొని పోయినందున ఇప్పుడు కుంఫిణీవారు రెండు చేయించివేసి ఘాటుసుంకము సంవత్సరము ౧ కి ౩౦ రూపాయిలకు ఒక ఆసామికి గుత్తకిచ్చినారు. వాడు మనిషికి ఒక పయిసా గుర్రానికి ౧ అణా ఈ వంతున హాశ్సీలు తీస్తాడు. ఈనది పశ్చిమవాహిని సుమతి అనే పశ్చిమ సముద్రతీరపు గ్రామమువద్ద సాగరసంగమమవుచున్నది. యిక్కడికి ఆసంగమప్రదేశము రెండు నెలల ప్రయాణమున్నది. అమరకంటకమనే ప్రదేశములో వెదురు పొదమధ్యే యీనది పుట్టినది. ఆ మహాస్థలము ఇక్కడికి ౨౦ దినముల ప్రయాణముంచున్నది. యీ నది మహిమ యేమంటే ధ్రువమహారాజు యాగము చేసినప్పుడు ఋత్విక్కులుగా వచ్చినమహాపురు

షులు యాచనమీద సాంబమూర్తిని తపస్సుచేత సంతోషపెట్టి భూమిలో ఎక్కడా నదులులేకనుండగా పశ్చిమ వాహినిగా ఒకనదికావలెనని ప్రార్థించి సాంబమూర్తియొక్క అర్థదేహాన్నే ప్రవహించేటట్టు చేసుకొన్నారు. తద్వారా యిది పురుషనది అనిపించుకొనుచున్నది. యీమహానది మహిమ వాయుంపురాణములో ౧౨ వేల గ్రంథములచేత విస్తరించి చెప్పియున్నది. యిందులో పుట్టే శిలలంతా లింగాలుగా ఆరాధింపుచున్నారు. ఈ లింగాలు హిందూస్తానీమాటతో నర్మదుకాకంకరు సబు శంకరు అంటారు. బెడా ఘాటులో కృష్ణవర్ణపులింగాలు పుట్టుచున్నవి. ఆ స్థలము ఇక్కడికి ర కోసులదూరము. ఓంకారం ఘాటులో శ్వేతలింగాలు పుట్టుచున్నవి. ఆ స్థలము ఇక్కడికి ౧ర దినముల ప్రయాణము ఈ తిలవారా స్థలములో ఒక దృష్టాంతము నాకండ్ల చూచినాను. అదియేమంటే వేసిన అస్థులు సగము ముక్కాలువాశి శిలామయములవుచున్నవి గనుక క్రమముగా అంతా శిలామయము లవుచున్న వనడానకు సందేహములేదు. ఈమహానది పశ్చిమవాహిని కావడముచేత అత్యాశ్చర్యముగా పది యిరువై తాటిచెట్ల పొడుగుగల కొండలనడమను భేదించుకొని ప్రవహింపుచున్నది. యీవేడుక బెడాఘాటుకు పోతే చూడవచ్చును. ఈమహానది ఇక్కడ నిండా వెడల్పులేదు. ౩౦ సంవత్సరముల కిందట రఘోజీబాబాతల్లి బహుస్తోమముతోకూడా యిక్కడికి యాత్రకువచ్చి ముందర నర్మదానదిని పూజచేసి దాటవలసినదని ఘాటువారు చెప్పగా మా నాగపూరివద్ది ఖనానా అనేనదిపాటి వెడల్పులేదే పూజ ఏమని అలక్ష్యపెట్టినందుకు నాటిసాయంకాలమే యివతలిగట్టుకు వచ్చినది వోరగా దిగి వుండగా గడియలో అమితముగా ప్రవాహమువచ్చి ఆమె సర్వస్వాన్ని హరించి మరుసటి గడియలో ప్రవాహము తీసిపోయి యథాస్థితికి వచ్చినది. ఈ తిలవారా అనే ఊరిలో ౧౨ ఇండ్లవారు కృష్ణాతీరమందలి యాంధ్రబ్రాహ్మణులు ఇండ్లుకట్టుకొని బహుకాలముగా ఈ దేశపు బ్రాహ్మణులతో సంబంధబంధుత్వములు చేయకుండా అధ్యయనముచేయుచు పాఠము

చెప్పుకొనుచున్నారు. రామటెంకి వదిలిన వెనక ఈయూరివరకు బ్రాహ్మణదర్శనమే అయినదికాదు. ఈ యూరిలో వసతి అయిన కొట్టాయి కట్టియున్నారు. నేను బ్రాహ్మణ యింట్లోనే దిగినాను. సకల పదార్థాలు దొరుకును. ఇక్కడ క్షౌరము మొదలయిన పితృక్రియలు చేసినాను. నేటిదారి నల్లరేగడ అయినా ప్రయాసకాదు. అడివిరాలిగొట్టు లేదు. ఈ మహానది దాటిన వెనక రంగిడి జాతి బ్రాహ్మణులని ఒక సమూహమును చూచినాను. వీరికి గాయత్రీ జపము కలిగియున్నా వ్యవస్థలేని నడితిని నడిచేవారు. ఈదేశపు కరాడీ బ్రాహ్మణులున్ను చిత్పావనీ బ్రాహ్మణులున్ను వీరిని గర్హింపుచున్నారు. విమ్మట వ్రాసిన రెండు తెగలవారితో మనదేశపుబ్రాహ్మణులు సాహచర్యము కలిగి సహపఙ్క్తిగా భోజనమజ్జనాదులు గడుపుచున్నారు. చిత్పావనీవారు పునాశ్రిమంతుని జాతి. కరాడీవారు శక్తి పూజాపరులు. ఈ యిరుతెగలవారినిన్ని పరశురాముడు బ్రాహ్మణులయెడల జహాసతోచి మసీదులలో ఉండే శవాలనులేపి చిత్పావనీలను పుట్టించి కాష్ఠములగుండా కరాడీలను సృష్టించి తాను పితృకర్మాలను ఆ రెండుతెగలవారిగుండా గడుపుకొన్నాడు. తెగకు ౭ గోత్రాలవంతున వీరు ౧౪ గోత్రాలవారు. వీరిని కొంకణ దేశస్థులని అనుచున్నారు. నర్మదకు ఇవతలి గట్టు మొదలుగా విక్రమశకము ప్లవనామసంవత్సరము బహుళ పాడ్యమి మొదలుగా పున్నమ వరకు మాసమున్నని వ్యవహరింపుచున్నారు. వింధ్యపర్వతమును కురాయి అనే ఊరివద్ద ఆరోహణము చేసినట్టుగా లోగడ నేను వ్రాసినాను. అదే వింధ్యపర్వతమునకు ఆరంభమనిన్ని యీ భూమి యావత్తున్ను వింధ్యపర్వతముమీదిదే ననిన్ని చెప్పుతారు. రాయచౌడువద్దనున్న పర్వతము మహాదేవ పర్వతమనిన్ని అచ్చట వరప్రసాదము చేయగల ప్రసిద్ధమయిన యొక శివస్థలము ఉన్నదనిన్ని చెప్పుతారు. యీ తిలవారాలో రెండు మూడు దేవాలయాలు చిన్నవయినా సుందరముగా కట్టియున్నవి. బ్రాహ్మణ పూజలేదు. గోసాయిల ఆధీనములో నున్నవి. ;కురాయి అనే వూరు మొదలు నర్మదానది పర్యంతము లోగడి కాలాలలో దారి నడిచి సురక్షితముగా చేర

డము బహు దుర్లభము. అందుకు దృష్టాంతముగా యిక్కడి దేశస్థులు సాహి
త్యాలుగా ఈమధ్యే వుండే ఊళ్ల పేళ్లుకని కొన్ని చేసినారు. వాటి తాత్ప
ర్యము ఈ యూళ్లుగడిచి నర్మదచేరితే తల్లికడుపులోనుంచి మళ్లి పుట్టినట్టు
అనుకోవలెనని యున్నది. ఆ భయాలు యింగిలీషు దొరతనము వచ్చిన వెనక
లేదు. ఈవిషయములలో వీరి దొరతనము మేలని అనిపించుకొన్నా యిక్కడి
బ్రాహ్మణులు, "నాగపూరురాజు సాగరా రాజు మొదలయినవారు బాగా
వుండగా మేము రాజాన్నభోజనము చేస్తూవస్తిమి. వారున్ను వారికింది అధి
కారస్థులున్ను పుష్కలమయిన జీవనాలు మాకు కలగజేసి యిచ్చుచు వచ్చి
ఇప్పుడు పస్తుగా నున్నామంటారు. దొంగతనముపోతే దొంగను పట్టి శిక్షించే
వరకు సొమ్ము పోగొట్టుకొన్నవారున్ను సాక్షులున్ను ఇల్లువాకిళ్లు వదిలి భత్యము
కట్టుకొని తిరిగి చస్తాము తుదను శిక్ష బలములేదు కొంతకాలము గిడ్డంగిలో
దొంగనుపెట్టి వదులుతారు. వారు మళ్లివచ్చి కన్నమువేసి దొంగిలింపుచున్నే
ఉంటారు. దొంగిలించినదానికి సాక్షి తెమ్మంటే యెక్కడనుంచి తెచ్చేది"
అని, ఈవిషయాలలో యింగిలీషుదొరతనము బహుహింసగా నున్నదని వ్యసన
పడుకొంటారు. ఈ దృష్టాంతము చూడగా ఒకమంచి వూహించి పనిచేయ
బోతే ఒక చెడు(గు) ఆ మంచిలోనే ఉత్పత్తికావడము నిశ్చయమేనని
తోచుచున్నది. హయిదరాబాదు మొదలుగా తీయని దొండకాయలు విస్తార
ముగా దొరుకు చున్నవి. యీ తిలవారాఘాటులోపల వరకాయలని ఒక
దినుసుకాయలు చూచినాను. పచ్చి పోకకాయలవలెనే ఆకారము గలిగి
దొండకాయలవలె గీతలుతీరి యున్నవి. వంటచేసి భోజనము చేస్తే పువ్వాలు
రాలని లేత వంగపిందెల రుచితో సరిపోలియున్నవి. యీ కాయలు బహు
ఆరోగ్యకరములనిన్ని రుచిగా నున్నవనిన్ని రాజాధిరాజులు నలభై యాభై
ఆమడదాకా విందులకు గుర్రపుసవారీలను తపాలుపెట్టి తెప్పించుకొంటారు
గాని తమస్థలములో వృద్ధి అయ్యే యోచన చేయడములేదు. యీ కాయలకు
బీజము గడ్డలు. వాటిలో మొలక మొలచి తీగెలు అల్లి కాయలు కాచు

చున్నవి. ఆవాలనూనె నాలుగయిదు మజిలీలుగా దీపపుచమురుకు దొరుకుచు వచ్చుచున్నది. చింతకాయ తొక్కును నేను ఆవనూనె పోయించినంతలో అతి రుచికరముగా నున్నది. యీ యూరిలో ౯ లేది మధ్యాహ్నపర్యంతము వుంటిని. (పు 76-79)

## జోనుబన్యానుయొక్క సంక్షేపమైనచరిత్ర.

(అచ్చుప్రతి)

ఇంగ్లాండనేదేశములోని బెడ్ఫోర్డనేపట్టణమునకు సమీపమైయున్న గ్రామములో జోను బన్యాను ౧౬౨౮ సంవత్సరమున పుట్టెను. అతనితండ్రి తగరపుపనివాడు. అతడు బీదవాడైనప్పటికిన్ని బాగాపనిచేసిన యధార్థమనుష్యుడై యుండెను. అతనికుమారుడైన జోను మొండిధైర్యమున్ను భక్తిహీనతయున్ను గలపడుచువాడు. అతడు ౧౭ సంవత్సరములవాడు కాకమునుపు రాజు దండులో పేరు వ్రాయించుకొనెను. అయితే మఱికొన్ని సంవత్సరములైన తరువాత అతడు సర్కారుకొలువువిడిచి తనవూరికి తిరిగివచ్చెను. అప్పుడు అతని భక్తిహీనతవల్ల అతనిప్రవర్తన మిక్కిలీ చెడ్డదై యుండెను. అతనిహృదయము బహుగా కఠినపరచబడెను. అతడు అత్యాసక్తితో దుష్కార్యములను చేసేవాడు. అయితే అతడు పాపేచ్ఛలను నెఱవేర్చుకొనుటవల్లనున్ను జూదము, పందెము మొదలైన ఆటలవల్లనున్ను సుఖభోగములను వెదకుకొంటూ వున్నప్పటికిన్ని వొకానొకప్పుడు భీకరమైనతలంపులచేతనున్ను స్వప్నములచేతనున్ను వానిమనస్సులో చాలా వేదనపుట్టెను.

అతడు ౨౦ సంవత్సరములవయస్సు గలవాడైనప్పుడు అతడు భక్తిగల దరిద్రుని కొమార్తెను పెండ్లాడెను. వారు మిక్కిలీ బీదవాండ్లు. అయితే ఆమె తండ్రి, భక్తికి అనుగుణ్యమైన ప్రవర్తనఅనేదిన్ని విద్యలేని మనుష్యుడు పరమలోకమునకు వెళ్లేమార్గదర్శి అనేదిన్నయిన రెండు మంచిపుస్తకములను ఆమెకు దయచేసెను. ఆమె ప్రేరేపణవల్ల ఆమెపెనిమిటి ఆపుస్తకములను చదివెను.

ఆభార్యతోకూడా దేవునిదీవెన అతనికివచ్చెను. అయితే అతనిమనస్సు యింకా దేవునితట్టు తిప్పబడకపోయెను. అయితే ఆకాలమర్యాదచొప్పున అతడు మతాచారములయందు ఆసక్తిగలవాడై రోజుకు రెండుసారులు గుడికి వెళ్లేవాడు. అతడు మునపటివలె దుష్ప్రవర్తనగలవాడై యుండేవాడు. అయినప్పటికిన్ని అతడు—యితరులవలె ప్రార్థనలను పలుకుతూ కీర్తనలను పాడుతూ గుడి, గురు, గురువస్త్రములు, ఆరాధనక్రమము మొదలుగాగల మతాచారములను వినయభయభక్తులతోటి గౌరవముచేసేవాడనని తన్నుగురించి తానువ్రాసెను.

ఆలాగుసవుండగా వొకఆదివారము సంఘబోధకుడు సబ్బాతువారమును గురించి ప్రసంగముచేసి దేవుడు దానివిషయమై యిచ్చినఆజ్ఞను పనిచేతనైనా ఆటలచేతనైనా మీరుట చెడ్డదోషమని చూపించెను. ఆప్రసంగమువల్ల బన్యానుమనస్సులో చెడ్డభారము పుట్టెను. అయితే గుడి అయినతరువాత అతడు భోజనముచేసి ఆప్రసంగమును మరిచిపోయి తనదుష్టసహవాసులతో యెప్పటివలె ఆటలకు బైలువెళ్లెను. వారు ఆడుకొంటూ వుండగా ఆకాశము నుంచి వొకశబ్దమువచ్చినట్టు అతనికి వినబడెను. అది—నీవు నీపాపములను విడిచి ఆకాశలోకమునకు వెళ్లుదువా లేక నీపాపములను వెంటబెట్టుకొని నరకమునకు వెళ్లుదువా అని పలికెను. అందువల్ల అతడు మిక్కిలి భ్రమపడి—నేను మహా కఠినపాపిష్టుడను గనుక క్రీస్తు నన్ను క్షమించడే. ఆలాగైతే మిక్కిలీ దురవస్థలో వున్నాను. నా పాపములను విడిచిపెట్టినా దౌర్భాగ్యుడను వాటిని యింకా అనుసరించినా దౌర్భాగ్యుడనే. యేలాగైనా నాకు నాశనమే కలుగును గనుక నా పాపములు యెక్కువైతేనేమి తక్కువైతేనేమి అని అనుకొని తనబాధను నిరాశచేతనే తప్పించుకొనుటకు కోరెను.

ఒకరోజున బన్యాను తనపొరుగువాని యింటి కిటికీయెదట తన మర్యాదచొప్పున పిచ్చివాడుగా నటిస్తూ బూతులాడుతూ వున్నప్పుడు ఆ యింటి ఆడుమనిషి తానున్ను మిక్కిలీ చెడ్డదైనప్పటికిన్ని ఆమె సహా అతని

మాటలను విని చెప్పినదేమంటే—వీడు నేను జడిసి వణికేటట్టు చేసును. నేను చూచిన దుష్టులందరిలో వీడే చెడ్డబూతులాడే దుర్బుద్ధిగలవాడనిన్ని వూరిలో వున్న పడుచువారినందరినిన్ని చెరిపివేయుటకు చాలుననిన్ని చెప్పెను. అతడు ఆమాట విని మిక్కిలీ సిగ్గుపడి—మళ్లీ చిన్నవాడనైయుండుట కోరితిని యెందుకంటే బూతులులేకుండా మాట్లాడుట నాతండ్రిగారు నాకు నేర్పునని వ్రాసియున్నాడు. తరువాత బన్యాను బూతులాడుటమాని చాలామట్టుకు గుణపడి పది ఆజ్ఞలను గైకొనుటవల్ల రక్షణపొందుదునని అనుకొనెను. అయితే అతడు కొంతమట్టుకు మనస్సాక్షికి లోబడి బహిరంగమైన పాపకార్యములను విడిచిపెట్టినప్పటికిన్ని తనహృదయమును యింకారక్షకుడైన యేసుకు అప్పగించలేకపోయెను. అతనిప్రవర్తన చాలామట్టుకు మార్చబడినందున అతని యెరిగినవారు అతడు భక్తిగల నీతిపరుడని చెప్పుకొనేవారు. ఆకీర్తి అతనికి బహుసంతోషము కలుగచేసెను. అయితే ఆత్మరక్షణ పొందేనిమిత్తము తన స్వనీతి చాలునని అనుకొని యింకా యేసుక్రీస్తు విషయమైన జ్ఞానమును పొందుటలేదుగనుక ఆయనకృపయైనా ఆకృపవల్లపుట్టే విశ్వాసమైనా ఆ విశ్వాసఫలమైన నిరీక్షణయైనా అతనికి తెలిసియుండలేదు.

అలాగున తనస్వనీతియందు అతిశయపడి తన్నుతాను కొనియాడుకుంటూ వుండగా వొకరోజున అతడు తనపనిమీద బెడ్ఫోర్డనే పట్టణమునకు వెళ్లి—ముగ్గురు నలుగురు బీదలైన స్త్రీలు యింటితలుపుదగ్గెర యెండలో కూర్చుండి దేవునిసంబంధమైన సంగతులనుగురించి మాట్లాడుతూవుండుట చూచెను. ఆస్త్రీలు క్రొత్తహృదయమును గురించిన్ని దేవుడు తమహృదయములలో చేసిన కృపాక్రియనుగురించిన్ని చెడిపోయిన తమసహజస్థితి తమకు యేలాగున తెలియచేయబడెనో దానిగురించిన్ని దేవుడు ప్రభువైన యేసుక్రీస్తుయందు అగుపడిన తనప్రేమను తమకు యేలాగున విశదపరిచెనో దానిగురించిన్ని తాము యేలాగున తమస్వనీతిని ఆక్షేపించి అది కేవలము అసహ్యమైనదనిన్ని రక్షణకొరకు పనికిమాలినదనిన్ని యెంచిరో దానిగురించిన్ని

తాము యేయేమాటలచేతనున్ను వాగ్దత్తములచేతనున్ను సేదదేర్చుకొని నెమ్మది
నిన్ని పాపమునకు విరోధముగా పోట్లాడుటకు సహాయమున్ను పొందిరో
దానిగురించిన్ని మాట్లాడుకొనేవారు. వారు మాట్లాడుటకు సంతోషమువల్ల
బలవంతము చేయబడినట్టు మాట్లాడిరని అతడు చెప్పెను.

ఆస్త్రీలు సంభాషించినసంగతులు అతనికి యెంతమాత్రమున్ను బోధ
పడలేదు గనుక తన ఆత్మస్థితి యింకా బాగా ఉండలేదని తలంచుకొని దాని
గూర్చి మిక్కిలీ విచారపడుతూ బైబిలనే దేవునిగ్రంథమును చదువుటకు
మొదలుబెట్టెను. అప్పుడు వేకువచుక్క అగుపడెను. తెల్లవారినది. నీతి
సూర్యుడు సమీపించెను. అతడు తనపాపస్థితిని తెలుసుకొని పాపజ్ఞప్తిచేతను
కుంగబడి—పురుగుకంటె నీచుడనైయున్నానని అనుకొని ఆస్త్రీలవలె వుండ
వలెనని కోరెను. అతనిమనస్సులో పుట్టిన మొదటివెలుగు యేదంటే—క్రీస్తు
యెవడో అదిన్ని ముఖ్యముగా ఆయన యీభూలోకమందు నరావతార
మెత్తి అగుపరిచిన సద్గుణములున్ను తేటగా తెలిసియుండుటయే. అందువల్ల
అతడు మిక్కిలీ నెమ్మదిపొందెనుగనుక శీఘ్రముగా చనిపోయి యేసుక్రీస్తు
యొద్దకి వెళ్లవలెనని కోరెను.

ఆతరువాత భీకరమైన చీకటికాలము తిరిగీ అతనికి వచ్చెను. అగ్ని
బాణములవంటి చెడ్డతలంపులు విరోధిచేతను అతనిమనస్సులో పుట్టించబడెను.
వొకప్పుడు యిష్కారియోతుయూదావలె యీలోకభాగ్యమునిమిత్తము తన
రక్షకుని అమ్మివేయుటకు భయంకరమైన శోధనలోకి వచ్చెను. మరియొకప్పుడు
మిక్కిలీ బాధపడి ఆత్మత్యాగము చేసుకొనవలెనని తలంపుపుట్టెను. ఆశోధన
వల్ల అతనిమనస్సు రెండుమూడుసంవత్సరములు బాధపెట్టబడెను. అప్పుడు
సూర్యునికిరణములచేతను చీకటి యేలాగుపోవునో ఆలాగున దేవునివాక్యముల
వల్ల ఆతని హృందయాంధకారముపోయెను. అప్పుడు అతడు సత్యమును
తెలుసుకొని క్రమక్రమముగా నెమ్మదిపొందెను. దేవునివాక్యములకంటే వేరే
హేతువులచేతను వచ్చిన ఆదరణయందు నమ్మికె వుంచకూడదని అతడు తన

అనుభవమువల్ల నేర్చుకొనెను. అతనికి మిక్కిలీ నెమ్మదికలుగచేసిన దేవుని వాక్యములు యేవంటే—నాకృప నీకు చాలును. నాయొద్దికి వచ్చేవాడెవడో వాని నేను యెన్నడున్ను త్రోలివేయను. (౨ కొరిం. ౧౨ ప. ౯ వ యోహాను. ౬ ప. ౩౭ వ.) మరిన్ని అతడు ఆలోచనచేసి—కాఠిన్యముగల ఆజ్ఞాప్రమాణముకంటే దయగలసువార్త దేవునిమనస్సునున్ను స్వభావమునున్ను మరీ తేటగా తెలియచేసునుగదా అని అనుకొని సుఖించెను.

౧౬౫౩ సంవత్సరములో జోను బన్యాను తాను యేసుయందు వుంచిన విశ్వాసమును బహిరంగముగా వొప్పుకొని ఆయనసంఘములోకి చేర్చబడెను. అయినప్పటికిన్ని అతనిమనస్సులో జరిగినకలహములు యింకా కడదేరినవి కావు. విరోధితంత్రములవల్ల అతనికి ఘోరమైనశోధనలు వచ్చెను. అయితే దేవునివాక్యమువల్లను అతడు వాటిని అణిచివేసెను. వొకప్పుడు అతడు క్షయరోగమువల్ల శీఘ్రముగాచావవచ్చునని తోచెనుగనుక—నేను దేవునియెదటికి వెళ్లుటకు సిద్ధముగా వున్నానా అని తన ఆత్మస్థితిని విమర్శించినపుడు లెక్కలేనిపాపములసమూహము అతనికి జ్ఞాపకమువచ్చినందున అతడు—నేను యికను బ్రతకకూడదు, చచ్చుటకు తెగించలేననే రెండు ఆలోచనలమధ్యను మిక్కిలీ యిబ్బందిపడుతూ తనయింట్లో యిటు అటు తిరుగులాడుతూ వుండగా—యేసుక్రీస్తు యందున్న విమోచనమువల్ల ఆయనకృపచేతనే మీరు నీతిమంతులని యెంచబడుదురనేవాక్యము అతనిహృదయమునకు తగిలి మిక్కిలీ నెమ్మదిని అతనికి కలుగచేసెను. అందునుగురించి అతడు వ్రాసినవి యేలాగంటే—ఘోరస్వప్నము కని మేలుకొనినవానివలె వుండి ఆదివ్యవాక్యమును ఆలకించి వొకడు దానిభావమును నాకు బోధపరిచి—ఓీ పాపీ నీకు పాపములున్ను తప్పితములున్ను కలిగినందున నేను నీ ఆత్మను రక్షించలేనని అనుకొంటున్నావు. అయితే యిదుగో నాకుమారుడు నాయొద్దవున్నాడు. నేను నిన్ను చూడక అతనిపైపుచూచి ఆయనయందే నాకు కలిగిన మహా

సంతోషమునకు అనుగుణ్యముగా నీయెడల నటించుదునని నాతో చెప్పినట్టే నాకు వినబడెను.

మరికొంత కాలమైనతరువాత బన్యాను అతని యెరిగినవారందరి దృష్టికి ఘనతవహించిన నీతిపరుడై తానే క్రీస్తుసువార్తను ప్రకటించుటకు మొదలు బెట్టెను. అయితే ౧౬౬౦ సంవత్సరమున యింగ్లాండురాజైన చార్లెసున్ను అతనిమంత్రులున్ను యేకీభవించి ఆదేశస్థులందరున్ను తమతాత్పర్యములు యేలాగున వున్నప్పటికిన్ని సర్కారు స్థాపించినరీతిగానే దేవుని ఆరాధించవలెను. లేకుంటే బహిరంగముగా దేవుని ఆరాధించకూడదనిన్ని క్రీస్తుసువార్తను ప్రకటించకూడదనిన్ని నిర్ణయించిరిగనుక అనేకులైన మంచిబోధకులు, మనుష్యులు యేమిసెలవిచ్చినప్పటికిన్ని దేవుని మాటవిని ఆయననే సేవించవలెనని నమ్ముకొని ఆ అధికారులసెలవు చొప్పున మిక్కిలీ హింసనుపొందిరి. వారిలో జోను బన్యాను వొకడు. ౧౬౬౦ సం॥ నవంబరుసెల ౧౨ తేదీని అతడు— నీవు దేవుని కుమారునియందు విశ్వాసముంచియున్నావా అనేవాక్యమునుపట్టి ప్రసంగముచేయబోతూవున్నప్పుడు వొకమాజిస్త్రాటు ఆసంగతినివిని, బన్యానునుపట్టుకొని తనయెదటికి అతని తెచ్చుటకు సెలవిచ్చెను. అతరువాత న్యాయాధిపతి విమర్శచేసి—అతనిచూచి—నీతీర్పును వినుము. నీవు తిరిగీ చెరసాలలోకి తీసుకొనిపోబడి అక్కడ మూడుసెలలు వుండవలెను. అతరువాత నీవు ప్రసంగముచేయుంట మాని దేవుని ఆరాధన వినుటకు గుడికివెళ్లుటకు సమ్మతించకపోతే యీదేశములోనుంచి వెలివేయబడవలెను. అతరువాత రాజు సెలవులేకుండా నీవు మళ్లీ యీరాజ్యములో కనుబడినట్టయితే నీవు వురిదీయబడవలెనని పలికెను. అందుకు యీశూరుడైనక్రైస్తవుడు—సరి. యీవేళను నేను ఖైదులోనుంచి విడుదలపొందితే దేవునిసహాయముచేతను రేపు మళ్లీ క్రీస్తుసువార్తను ప్రకటింతునని పలికెను.

కాబట్టి అతడు తనభార్యనున్ను తననలుగురుపిల్లలనున్ను విడిచి చెరసాలలోకి వెళ్లవలెనని సర్కారు సెలవైనదిగనుక అతడు తనకుదొరికిన రక్షణ

మార్గమును యితరులకు తెలియచేసినందుచేతనే ఆమంచిక్రైస్తవుడు ౧౨ సంవత్సరములు ఖైదులో వుండెను. అయితే అతడు—"ప్రభువు స్తుతించబడును గాక. నాదీనాత్మలో దేవునిసమాధానముగలవాడనై చెరసాలలోకి వెళ్లితినని అనెను.

జోను బన్యాను గుహవంటిచెరసాలలో వున్నప్పుడు కొన్ని మంచి గ్రంథములను రచించెను. అయితే The Pilgrim's Progress అనే యీ యాత్రికునిప్రయాణమే వాటిలో మిక్కిలీ శ్రేష్ఠమైనదిన్ని వుపయోగమైనదిన్నియినది. యిది ౭౫ భాషలలో తరుజుమా చేయబడియున్నది. అతడు విడిపించబడినతరువాత అతడు యింకా ౧౬ సంవత్సరములు బ్రతికి జీవనము కొరకు పనిచేస్తూ సువార్తను ప్రకటిస్తూ వుండేవాడు. బహువిద్యగలవారు అతని ప్రసంగములను వినుటకు గుడికివెళ్లిరి. వారిలో జాను ఓయెను అనేవాడొకడు. రాజుగారు విస్తారవిద్యగల అతనితో మాట్లాడుతూ—బహువిద్యగలనీవు వొకకంచరపనివాడు ప్రసంగముచేయుట విన వెళ్లుట ఆశ్చర్యమని అన్నప్పుడు అతడు—ఆకంచరవానివలె ప్రసంగముచేసే సమర్థతకు నాసమస్త విద్యను యిచ్చివేతునని పలికెను.

జోనుబన్యాను తనప్రభువైన యేసుయొద్దికి వెళ్లవలసినకాలము వచ్చెను. అతనిపిలుచుటకు వచ్చినదూత జ్వరము. అప్పుడు ఆయన క్రీస్తు మూలముగానే రక్షణకలుగునని దృఢముగా నమ్మి తనమంచముయొద్ద నిలిచిన వారిని చూచి—నేను మనప్రభువైన యేసుక్రీస్తుతండ్రియొద్దికి వెళ్లుతున్నాను. ఆయన తనశ్రీమంతుడైనకుమారుని మధ్యస్థమువల్ల పాపినైన నన్ను చేర్చుకొనునని నిస్సందేహముగా నమ్ముతున్నాను. అక్కడ దీర్ఘకాలము కాకమునుపు మనము మళ్లీ కలుసుకొని నూతనకీర్తన పాడుతూ యుగయుగాలకు నిత్యమున్ను సుఖముగా వుందుమని నిరీక్షిస్తున్నాను. ఆమేనని పలికెను. అలాగున ఆయన ౬౦ సంవత్సరములుగలవాడై ౧౬౮౮ సం॥

అగస్టునెల ౧౨ తేదీని చనిపోయి లాండనపట్టణముయందలి (Bunhill Fields) బన్‌హిల్లనే పొలములో పాతిపెట్టబడెను.

## స్వప్నసాదృశ్యరీతిగా రచించబడిన యాత్రికుని ప్రయాణము.

ఈలోకమనే అరణ్యమందు నేను నడుస్తూవున్నప్పుడు నేనుగుహయున్న వొకచోటున దిగి, అక్కడనిద్రించుటకు పండుకొంటిని. నేను నిద్రిస్తూవుండగా వొకకలగంటిని. నాకలలో చినిగినబట్టలుకలిగి తనయింటికి విముఖుడైయున్న వొకమనుష్యుడు వొకచోటున నిలిచి యుండుట చూచితిని. అతనిచేతిలో వొకపుస్తకమున్ను అతనివీపున వొకభారమున్ను వుండెను. అతడు ఆపుస్తకమును విప్పి చదివెను. అతడు చదువుతూ వున్నప్పుడు అతడు కన్నీరు విడుస్తూ వణుకుతూ వుండుట చూచితిని. అంతలో అతడు అది భరించలేక—నేనేమిచేతునని యేడుస్తూ వడిగా మొరబెట్టెను.

ఆస్థితిలో అతడు తనయింటికివెళ్లి తనభార్యయున్ను పిల్లలున్ను తన వ్యసనమును చూడకూడదని అనుకొని తనవల్లనైనంతమట్టుకు తనలో తాను దాని యిముడ్చుకొనెను. అయితే అతనికి శ్రమవిస్తరించినందున బహు కాలము వూరకుండలేకపోయెను. కాబట్టి అతడు తనభార్యకున్ను పిల్లలకున్ను తనమనస్సును విప్పి వారితో పలుకుటకు మొదలుబెట్టెను.



# కైఫియ్యతులు.

## పిఠాపురము కైఫియ్యతు.

Local Records Vol XIX P. 46.

కైఫియ్యతుమువుంజే జల్లూరుపరగణే ప్రోలునాడుతాలూకే

పిఠాపూరు.

త్రిలింగమధ్యస్థళమైన ఆంధ్రదేశమునందు దాక్షారామమహాస్థళము నకు యీశాన్యభాగమునందు యోజనద్వయం పరిమితస్థళమున ప్రోల్నాటి శీమకు అణుకువ అయిన భూమియందు పూర్వమున బిలహుడు అనే జయన రాజు రాజ్యము చేస్తూవున్నప్పుడు వకపట్నము నిర్మాణము చేశి జయనులకు అగ్రహారముగాను యిచ్చి అక్కడ జయనదైవములుగా విగ్రహాలు శిలలు చేయించి ప్రతిష్ఠచేయించినారు. తరువాతను ఆపట్నము చూడగలందులకై ప్రభువు వచ్చినప్పుడు వీధిని రాజమార్గమునుంచి చతురంగబలమును కూడు కుని రాజు వెళ్లేటప్పుడు ఆపురస్త్రీలు అంతా ప్రభువుపై శేషలు చల్లిరి. అప్పుడు ఆపట్టణమునకు జల్లూరు అని నామం చేసిరి. తరువాతను బహుకాల మువరకున్ను ఆపట్టణమునందు సుఖజీవనము చేస్తూవుందురు.

యీావల చంద్రవంశపురాజులు ఆంధ్రదేశము యేలినవివరములు చంద్రవంశమునకు భూషణములుగా సర్వోత్కృష్టవర్తి అయినషువంటిన్ని విచిత్రవీరుడు అనే మహారాజుకు కొమారుడైనషువంటిన్ని పాండురాజు ఆయన సంతతివారు అర్జునుడు మొదలుగాగల ప్రశిద్ధిపురుషులు యీాశై

తొమ్మిదిమందిరాజులు గతించినపిమ్మటను ఆవంశమునందు విజయాదిత్యుడు
అనే మహావీరుడున్ను అత్యంతపరాక్రమశాలిన్ని అయినట్టువంటి రాజు.
స్వభుజాబలిమిచేత శత్రురాజులను ఆక్రమించేటి పౌరుషయంకలిగిన
వాడున్ను పుట్టి-అయ్ను త్రిలోచనపల్లవమహారాజు అనే అయ్ను పశ్చిమ
రాజ్యమునందు మధ్యరాష్ట్రమున ప్రభుత్వము చేస్తూవుండగాను ఆత్రిలోచ
పల్లభుణ్ని సాధించవలెనని సమస్తసామగ్రీ కూర్చుకుని చతురంగబలసమే
తుండై కదలిపోయి మధ్యరాష్ట్రమునందున త్రిలోచనపల్లవమహారాజుతోటి
యుద్ధము చేసినంతల్లోను ఆయుద్ధములోను దైవబలము చాలకను విజయాదిత్య
మహారాజు దైవగతిని పొందెను.

అదివరకు విజయాదిత్యమహారాజుయొక్క ధర్మపత్ని అయినట్టువంటి
మహాదేవి అదివరక్కు ఆరుమాసములు గర్భిణి అయివుండి ముడివేము అనే
అగ్రహారమునకు పోయి ఆయగ్రహారమందు నివాసము చేసుకుని వుండేటి
విష్ణుభట్టు సోమయాజి అనే బ్రాహ్మడివల్లనుండి పుత్రికాప్రాయముగా సంరక్షణ
చాయబడి నవమాసం పూర్ణం అయినతరువాతను కుమారుణ్ని కనెను. ఆవిష్ణు
వర్ధనుడు విష్ణుభట్టసోమయాజివల్లను నివర్తించబడినటువంటి జాతకర్మాది
క్రియలు కలిగినవాడై వర్ధమానమును పొందుతూవుండి సంప్రాప్తితయవ్వనుడై
తల్లియొక్క ముఖవచనములవల్లనుండి గతమైనట్టువంటి యావద్వృత్తాంత
మున్ను తెలియబడి తరువాతను ఆయగ్రహారము విడిచి అక్కడనుంచి
చాళుక్యగిరి అనే పర్వతమునకు పోయి అక్కడ స్వయంవ్యక్తమైనట్టువంటి
నందు భగవతీ అనే మహాదేవిని ఆరాధించి కుమారనారాయణభగవానుల
నున్ను మాతృగణమునున్ను తృప్తిపొందించి ఆయొక్క మహాప్రసాదమువల్ల
నుండి శ్వేతాతపత్రంశంఖము పంచమహాశబ్దము ఆలికీతనము ప్రథక్కవర
హాలాంఛనమున్ను పించమున్ను కుంతమున్ను మకరతోరణమున్ను మొదలైనవి
మహాసామ్రాజ్యచిహ్నములను గ్రహించి అక్కడనుంచి కదలివచ్చి త్రిలోచన
పల్లవవంశస్థుడైన రాజును జయించి సమస్తమైన రాజ్యమున్ను స్వభుజాబలము

చాతను అప్రతిశాసనముగా పరిపాలనచేశినవాడాయనూ ఆయ్యన కొమారుడు విజయాదిత్యుడు ఆయ్యన కొమారుడు కులకేశి అనే ఆయ్యన సమస్తధర్మము లున్ను జరిగిస్తూ ప్రజపరిపాలనచేసెను. ఆయ్యన కొమారుడు కీర్తివర్మ అనే ఆయ్యన మహాధర్మపద్ధతిని రాజ్యభారము యేలినాడు. ఆయనకు సత్యాశ్రయ వల్లభేంద్రుడు కుబ్జవిష్ణువర్ధనమహారాజు అనేవారు యిద్దరు కొమారులు కలిగి నారు. అందు జ్యేష్ఠుడు అయిన సత్యాశ్రయవల్లభేంద్రుడు కుంతలదేశమునకు రాజై పోయెను.

యీయన్న తమ్ముడైన కుబ్జవిష్ణుమహారాజు అశ్వమేధయాగము చేసి నాడు. తదవ భృతస్నానము వలన పవిత్రమైన శరీరము కలిగినవాడై వేంగి దేశమునకు రాజై పద్దెనిమిది సంవత్సరములు ప్రభుత్వము చేసినాడు.

యీయన్నకు జయసింహమహారాజు యిందరాజు అనేవారు యిద్దరు కొమారులు కలిగినారు. అందుకు జయసింహమహారాజు పిత్రేయమైనషపంటి వేంగిదేశమునకు అధిపతి అయి ముప్పైమూడుసంవత్సరములు రాజ్యము యేలెనూ ! అటుపిమ్మటను యీయన్న తమ్ముడైన ఇందరాజు వేంగిదేశమునకు అధిపతి అయి ఆరునొక్కదినము రాజ్యము యేలెనూ ! తరువాతను యీయన్న కొమారులు విష్ణువర్ధనమహారాజు పిత్రియమైన సింహాసనమునందు అధివశించి తొమ్మిదిసంవత్సరములు వేంగిదేశము ప్రభుత్వముచేసినాడు.

యీయన్నకు మంగియుంవరాజు అనేకుమారుడు కల్గివుండి పిత్ర్యమైన సింహాసనమునందు అధివశించి మహాధర్మముగాను వేంగిదేశము యేలినాడు. యీయన్న రాజర్కము యిరువై అయిదుసంవత్సరములు జరిగినది. తదనంత మందు యీమంగియుంవరాజు కొమారుడు జయసింహవల్లభమహారాజు అనే ఆయ్యన పిత్ర్యమైన శింహాసనమందు అధివశించి వేంగిదేశము పదమూడు సంవత్సరములు ప్రభుత్వము చేసినాడు తరువాతను విష్ణువర్ధనమహారాజు ముప్పైయారు సంవత్సరములు వేంగిదేశము రాజర్కము చేసినాడు. అటు పిమ్మటను ఆయ్యన కొమారుడు విజయాదిత్యమహారాజు పద్దెనిమిదిసంవత్సరములు.

వేంగిదేశము ప్రభుత్వము చేసినాడు. తరువాతను ఆయ్యన్నకొమారుడు విష్ణువర్ధనమహారాజులు ముప్పైఆరు సంవత్సరములు పిత్రార్జితమైన సింహాసనమందు అధివసించి రాజ్యము యేలినాడు । తదనంతరమునందు । యీఆయ్యన్నకొమారుడు నరేంద్రుడు పిత్రార్జితమైన సింహాసనమందు అధివశించి రాజ్యము యేలినాడు.

తదనంతరమునందు యీఆయ్యన్నకొమారుడు నరేంద్రుడు పిత్రార్జితమైన సింహాసనమున అధివశించి వేంగిదేశము నలుభైసంవ్వత్సరముల పర్యంతము వేంగిదేశమునకు అధిపత్యంచేసి వేంగిదేశమునకు లోనైన గ్రామాంత్రాలలోను అనేకముగా యీశ్వర దేవాలయములున్ను విష్ణు దేవాలయములున్ను కట్టించి ప్రతిష్టలు చేయిస్తూ వచ్చినారు నరేంద్రమహారాజు రాజనరేంద్ర పురమనే పట్నమయందు కోటలు కట్టించి అక్కడ శింహాసనారూఢుండై వుండగాను రాజ్యము యేలుచువున్న సమయమునందు ఆయనకు రత్నాంగి చిత్రాంగి అనే వారు వుభయులు భార్యలు । ఆ మహారాజు పుత్రసంతానార్థమై బహుగా దేవతారాధనచేసి అనేకస్తళాలను యీశ్వరదేవాలయమున్ను శ్రీవిష్ణు దేవాలయమున్ను కంట్టించి ప్రతిష్టలు చేయించి అనేకముగా తటాకము మొదలు గాగల ధర్మసంతానంబులు ప్రతిష్టించిరి. అటుతరువాతను ఆయ్యనకు జేష్ట భార్య్యా అయ్ని రత్నాంగియందు సారంగధరడనిన్ని విష్ణువర్ధనుడు అన్నిన్ని యిద్దరు కొమాళ్లు కలిగినారు అందు జేష్టుడు అయ్ని సారంగధరుడు మహా సౌందర్యవంతుడున్ను సంప్రాప్తయవ్వనుడై వుండి వక పావురమును పెంచి ఆపావురముతోటి వినోదముగా ఆటలాడుతూ వుండేవాడు. వకనాటి కాలమునందున సారంగధరుడి చేతిమీద పావురముపోయి చిత్రాంగి నగరి మేడమీదను వ్రాలెను. ఆపావురమునను చిత్రాంగి పట్టుకుని దాచినది. ఆపావురమును గురించి సారంగధరుడు చిత్రాంగి మేడలోనికి వెళ్లినంత్లో అయమ్మ సారంగధరునియొక్క రూపయవ్వనవిలాసవిభ్రమములు చూచి మదనమాయా మోహాతురాలై కొమారుడని ఎగ్గు విచారించక చిత్రాంగి సారంధరుణ్ని నిరో

ధించెను. అందుకు సారంగధరుడు అంగీకరించక యీలాగంటి ద్రోహచింత నకు యేలాగున తోచెను అని పినతల్లి అయ్ను చిత్రాంగిని బహు నింద్యచేసి ఆ మేడలోనుంచి వెలపలకి లేచిపోయిన వాడాయను. తరువాత చిత్రాంగి బహు చింతాక్రాంతురాలై రాజు వచ్చేవరకు మిక్కిలి చిన్నతను పొంది వుండగాను రాజు అనేకవిధములచాత లాలించి యందునిమిత్తముచాతను యీప్రకారము ఖిన్నురాలవై వున్నావు అని అడుగగాను రాజుతో చిత్రాంగి చెప్పినమాట. నీ పెద్దభార్య కుమారుడు అయినటువంటి సారంగధరుడు నేను పినతల్లిని అని విచారించక నతి విడిచి యవ్వన గర్వంచాత కామాంధకార మగ్నుడై నీవు నానగరున లేకుండా చూచి నామేడకు వచ్చి నేను నీకు తల్లిని నీకిది వుచితము కాదని మందలిస్తూ వుండగానున్నా నాపలుకు ఆల కించక బలత్కారముచాత నాపతివ్రతాభంగము చాయడాయన్కు సంక ల్పించినాడు ఆసమయమునందు న్నేనైతే దేహత్యాగం చాయవలెననే నిష్కర్ష చేసుకుంటిని. అయితే మీదర్శనము చేశి శలవు పుచ్చుకుని తరువాత యీవృత్తాంతము విన్నపంచేశే నిమిత్తము అగపరచి దేహత్యాగం చాయ వలెనని యిదివర్కు సజీవురాలను అయి నిలిచివుంటిని. యీవృత్తాంతము మీతో మనవిచేశినాను. యిటమీదను అనుజ్ఞ దయచేసిస్తే దేహం చాలి స్తున్నాను. గాని యీలాగంటి లాఘువమున పొంది యేమని జీవించను అని మిక్కిలి దుఖ్కపడినంతట్లో రాజు చాలాదూరము విచారించి విమళకావల్ల సత్యం అసత్యము రెండు విభజయన చాయలేక అక్కడనుంచి బహుకోపం వచ్చినవాడై రాజు కచ్చేరీలో వచ్చి ఆస్థానమునందు కూచుండి మంత్రుల నున్ను పెద్దలైనవారినిన్నీ పిలుపించి మాతృద్రోహికి ప్రాయశ్చిత్తము ఏమి అని అడుగగాను వారు చెప్పినమాటలు అరణ్య మద్యమునందు వుదకములేని స్థళములో కాళ్లుచేతులు కొట్టించి విడిచిపెట్టవలెనని చెప్పగాను ఆమాటలు విశ్వసించి రాజు తన పట్నములో వుండే తలవర్లను పిలుపించి తనకొమారు డైన సారంగధరుడు కామాంధకారముచేతను పినతల్లి అయిన చిత్రాంగిని

బలాత్కారముగా పట్టబోయినాడు. అదిగనుక్క యీ ద్రోహిని మీరు తీసుకునిపోయి అరణ్యామధ్యమునందు వుదకంలేని స్తళములోను కాళ్లుచేతులు నరిక్కి అక్కడ విడిచి వేశిరమ్మని ఆజ్ఞాపించగా ఆప్రకారముగా తలవర్లు సారంగధరున్ని పట్టుకునిపోయి అరణ్యామధ్యమందు కాళ్లు చేతులు నరికి ఆ చిన్నవాణ్ని అక్కడ విడిచివేసి తలవర్లు ఆసమీాపమైన పొదల మరుగువుండి ఆచిన్నవాడిముఖతః యేమి వాక్యము వినబడుతున్నవో విని పోవలసినది అని తలంచి పొంచివుండగాను సారంగధరుడు తన శరీరవేధకు సహించలేక బహు దుఖ్కపడుతూ వుండగా ఆసమయమునందు అకాశవాణి ప్రసన్నమై సారంగధరుడుతో పలికిన వాక్యము యేమంటే వోయి రాజకుమారుడా యందుకు దుఖ్కపడతావు పూర్వజన్మసంచితమైన నీదోషమంతా యిక్కడికి నివత్తి అయ్యినది అదియెట్టిదని అడిగితివాయనా చెప్పుతున్నాను వినుమనునూ—

పూర్వమునందు కోశాంబ పురమనేది వకపట్టణముకలదు. ఆపట్టణము యేలేవాడు దవళచంద్రుడు అనేరాజు కలడు. ఆరాజుకు యేడుగురు భార్యలు కలరు. అందులో ఒక ఆమెపేరు భువనసుందరీ. ఆమెయందు రాజు మిక్కిలి అనురాగం కలిగి వుంటూ వుండునూ ఆరాజువద్దను సుమంతుడు జయంతుడు అనేవారు యిద్దరు బ్రాహ్మణులు ప్రధానులు అయివుండిరి. ఆవుభయంలలోను సుమంతుడియందు రాజుకు మిక్కిలి అనుగ్రహంకలిగి వుండడమువల్లను సుమంతుడు అయిశ్వర్యవంతుడై వుండేవాడు. ఆయననుచూచి సహించలేక జయంతుడు విరోధం తలుస్తూ వుండేవాడు. వకనాటికాలమందు జయంతుడు సుమంతునికి కీడు చేయవలయునని సంకల్పించి రాజు నగరిలో భువనసుందరి అనే రాజుభార్యవద్ద వుపచారముచేస్తూ వున్నదాశిదాన్ని పిలుపించి బహువిధముల విహితంచేశి నాకు ఒకమేలు అయ్యేకార్యం నీవు సానుకూలము చాయవలశినది అని ఒడంపరచి చాలా కట్నం కానుకలు యిచ్చి సుమంతుడుయెుక్క పాదుకలు యేలాగునైనా సంగ్రహించుకొనిపోయి రాజు భార్యఅయిన భువనసుందరీ మేడలో ఆయమ్మ పవ్వళించే మంచముకింద వుంచ

మని చెప్పగా అది మంచిది ఆప్రకారం చేస్తానని దానినేర్పుచాత సమయం కనిపెట్టి సుమంతుడుయొక్క పాదుకలు సంగ్రహణంచి తీసుకొనిపోయి భువనసుందరి అనేరాజుభార్య పరుండే మంచము దిగువనువుంచి వచ్చినది. అటుతరువాతను దవళచంద్రుడు అనేరాజు భువనసుందరిమేడలోకివచ్చి యిచ్ఛావిలాసముగా కొంతశేపు ప్రొద్దుగడపినతరువాత పాన్పుమంచము క్రిందనువున్న పావాలు చూచి ఆపావాలు యక్కడివి అని అడిగెను. భువన సుందరివిని తాను యరగనని చెప్పినది. ఆమాట విని రాజు ఆపావాలు తనవి కావని తెలిశి అన్యులపావాలు ఆమేడలోకి రావలశిన కారణములేదని యోచనచేశి ఆమెయందు వశద్రోహము ఆపాధించి ఆపావాలు పట్టించు కుని ఆస్థానమండపమున వచ్చి కూర్చుండి డెప్పైరెండు వినియోగములవారి నిన్ని సమక్షమానికి రప్పించి ఆపట్నములోవుండే వడ్లంగులనుపిలుపించి నగ రులోనుంచి తెచ్చినపావాలు అగపరచి యీపావాలు యెవరివి అని అడు గగా వడ్లంగులుచూచి యివి సుమంతుడివి అని చెప్పిరి. రాజుకు అప్పుడు చాలా కోపమువచ్చి సుమంతునివైపునచూచి నీపావాలు నగరిలో పానుపు మంచము కిందకు రావలశిన నిమిత్తము యేమని అడుగగా ఆయ్న నిట్టూర్పు నిగుడ్చి తలవొంచుకుని నిరహేతుకముగా యీలాగంటివి అపవాదం వచ్చెను గదా అని బహు విక్షేపంచాత వున్నరాజు ఆయాస్థానములో వున్న పెద్దలను చూచి మాతృద్రోహికి ప్రాయశ్చిత్తము యేమని అడుగగా వారువిని అరణ్య మునకు అంపించి కాళ్లుచేతులు నరికించి విడిచిపెట్టవలశినది అని శలవు యిచ్చిరి. రాజు ఆప్రకారముగాను తలవర్లను పిలువనంపించి శలవు యివ్వగా వారు విచ్చుకత్తులతోటి సుమంతున్ని తీసుకొనిపోయి అరణ్యములో వుదకము లేని స్థళములో కాళ్లుచేతులు నరికివచ్చిరి. ఆనిమిత్తమువల్లనుండి సుమంతుడు రాజరాజై పుట్టెను. జయంతుడు నీవై పుట్టినావు. నాటి దుష్కృతము నేటి కాలమునందు నీకు అనుభవములోవచ్చినది. కాబట్టి యిక్కడితో నీయందు వుండే దోషము పరిహారము అయ్యినది. యిటమీద శుభం కాగలదు అనిచెప్పి

ఆకాశవాణి అదృశ్యమైపోయెను. ఆవాక్యములు పొదలమాటున వుండి పొంచిన తలవర్లువిని యీవృత్తాంతము అంతా తెలిశివచ్చి చెప్పగా రాజు బహు చిత్తవిక్షేపమున పొంది ఆలాగంటె నిరపరాధి అయ్ని కొమారుణ్ణి విచారణశాయక దుర్మార్గురాలు అయ్ని చిత్రాంగిమాట విని చంపిస్తిని అని చాల దుఖ్ఖపడి అప్పుడు చిత్రాంగిని వుప్పుపాతరలో వేయించి చంపించినాడట.

తదనంతరమందు ఈరాజరాజుకొమారుడు రాజేంద్రచోళుడు వేంగి దేశమునకు అధిపతిఅయి పదిహేనుసంవ్వత్సరములు రాజర్కము చేశినాడు. తరువాతను యీయ్న కొమారుడు విక్రమచోళ మహారాజు అయ్ని వేంగి దేశము ప్రభుత్వముచేశి రాజ్యము యేలినాడు. ఆయ్న తదనంతరమునందున యీరాజుకు జ్ఞాతి అయ్నిచేత రాజు అనే ఆయ్న ఆయ్న భార్య పేరు గంగమాంబ ఆయ్నకు విమలాదిత్యుడు అనే కొమారుడు కలిగినాడు. ఆయ్నభార్య విజయమహాదేవి. వారికి మల్లపదేవచక్రవర్తి అనేకొమారుడు కలిగి ఆయ్న యిరువైరెండుసంవ్వత్సరముల వయిస్సు కలిగిన వాడైవుండి వేంగీ దేశమునకు రాజై ప్రభుత్వం చేశినాడు. ఆయ్న పట్టాభిషేకకాలమునను శాలివాహన శకవరుషములు 1120 అగునేటి కాళయుక్తి నామసంవ్వత్సర జేష్ట బ ౧౦ ఆదివారం నాడు యీ జల్లూరు గ్రామానికి పశ్చిమం అయిదుక్రోసుల దూరమునను వున్న గుడివాడా గ్రామము శ్రీపిఠాపురమున శ్రీకుంతీమాధవస్వామికి భోగరాగాదులకుగాను సర్వమాన్యముగా యిచ్చినారు. తరువాతను అన్నలదేవు అనేరాజు అఖండగోదావరి తీరము మొదలుకొని తూర్పున కొనపరియంతమున్ను దేశానికి అధిపతిఅయి రాజ్యము యేలుచూనుండి పిఠాపురమునకు పశ్చమం మూడున్నర ఆమడ దూరాన వున్న శ్రీలక్ష్మీనరసింహమూర్తియొక్క నివాసస్తళమైనటువంటి కోరుకొండకు వుత్తరభాగమునందు రెండుక్రోసులదూరమునను పూర్వమున రాజనరేంద్రుడు కట్టించిన కోట శిద్దేశ్వరం అగ్రహారం వద్దను విస్తారమైనకోటలు కట్టించుకుని అక్కడ నివాసముగా వుండి ప్రభు

త్వము చేస్తువుండిరి. అయ్యన యేలుబడిలోనను భూమికొలతకు గడప్రయాణము యేరుపాటు చేశినారు-యీయ్యన తొమ్మిది సంవ్వత్సరములు ప్రభుత్వము చేసెనూ. తరువాతనూ కాకతప్రతాప రుద్రదేవ మహారాజులుగారు ఆంధ్ర దేశప్రభుత్వము చేస్తూ వారితట్టుననుంచి పెదమల్లిదేవరాజు, చినమల్లిదేవ రాజు అనే వారలును వుభయులును అన్నలదేవుని యేలే దేశానుక్కు అధి పత్యము ఇచ్చి వుంచి అప్పుడు కాకతప్రతాపరుద్రదేవ మహారాజులు ఆజ్ఞ వల్లనుండి పెదమల్లిదేవరాజు చినమల్లిదేవరాజు వుభయులున్ను బెండపూడి అనే గ్రామమువద్దను కొండలు అసరాచేసి విస్తారమయ్ను దుర్గము కట్టించి కొన్నాళ్లు ఆదుర్గములో నివాసముగా సైన్యముతోకూడా వుండి గోదావరి తీరమయ్ను రాజమహేంద్రవరము మొదలుకొని: తూర్పున కోనపరియంత మున్ను ప్రభుత్వముచేశినారు. తరువాతను రెడ్లవారు అనే కొండవీటి నివాసు లయ్ను శూద్రులు కూనమనాయకుడు అనే ఆయ్న కోరుకొండ పట్నముయందు ప్రభుత్వముచేస్తూ యుండి యీ యిల్లూరుగ్రామానికి పశ్చమం పైపున పూర్వాపుది రాజనరేంద్రుడు ప్రతిష్ఠ చేయించినది యీశ్వరుని ఆలయం వకటి సిధిలమై యుండగాను ఆదేవాలయము జీర్ణోద్ధారముచేయించి దేముడికి 23 భూమి చీకటియేరు లక్కుపాలంలోను యిప్పించినారు; తరువాతను ఆయ్న కొమారుడు ముమ్మడినాయకుడు పిత్రార్జ్యమయిన దేశమునకు అధిపతి అయి చాంగలనాడు మొదలైన దేశమునకు అధిపతి అయి చాంగలనాడు మొద లైనదేశము పాలనచేశినాడు. యీరెడ్లవారి తరువాతను వారి సమంధీకులే కోటమరెడ్డి వేమారెడ్డి అనే ఆయ్న బహుప్రశిద్ధి పురుషుడై యీప్రాంత్యా మైనదేశము ప్రభుత్వముచేస్తూ వుండెను. ఆయ్ను తరువాతను ఆయ్ను కొమా రుడు మారారెడ్డి ఆయ్న కొమారుడు కాటమరెడ్డి; ఆయ్నుకుమారుడు వేమారెడ్డి యీవేమారెడ్డి అందరికీ నగరశింహాసనాధీశ్వరుడైన శ్రీకొమరాద్రిరెడ్డిగారికి హాస్తకుడుగా గోదావరివుభయతీరములైన దేశము యేలుచు వుండెను. యీ వేమారెడ్డిగారి యేలుబడిలోను ప్రోలునాడు కాకినాడు కలపాకనాడు యీ

మూడున్ను మట్టిపిల్లివారు అనేకమ్మవారికి జమీాదారి కాయము చేసినందున వారికింద జరుగుతూవుండేది అప్పుడు యీాజిల్లూారు గ్రామము ప్రోలునాడు సీమలోకి చెల్లుతూ వుండేది. తరువాతను మట్టిపిల్లివారు వారిలోవారికి విరోధమువచ్చి యేడుగురు అన్నతమ్ములు కత్తులతో నరుకులాడి చచ్చిపోయినారు. తరువాతను పోగా మిగిలినవారివల్ల తాలూకాపని నిర్వాహకము కాకపోయివున్నందువల్లను వారికి అక్కరలేకుండా చేశి చిట్నిడివారు అనే వెలమవారికి పైనవ్రాశిన కాకినాడు శలపాకనాడు ప్రోలునాడు యీామూడు శీమలున్ను జమీాదారీగాను కాయముచేశి చిట్నిడి ధర్మారాయనింగారికి యిచ్చినారు. తరువాతను అయ్ని కొమాళ్లు వెంగన్నగారు వెంగన్నగారితమ్ముడు సూరయ్యారాయనింగారు తరువాతను వెంగన్నగారి కొమాళ్లు తమ్మన్నగారు తరువాతను అయ్నకొమారులు రామారాయనింగారు దొరతనము చేస్తూ వుండిరి. అయ్నకు పుత్రసంతతిలేనందుచాతను మేనఅల్లుళ్లు అయ్నిరావు తెనుగురాయనింగార్ని వద్దవుంచుకుని వుండిరి అదివరక్కు దొవలతు దక్కనుకు సులతాను అబ్దుల్‌హాసను కుదుబను ముల్కు గారికి ఆయను గన్కు తాలూకానుగురించి పైకము పాలికెలు బాకీవుంటే అందుకు వాయిదాపాయిదాలు చేసుకుని ఆవాయిదాల్కు రావు తెనుగురాయనింగార్ని జామీాను ఇస్తూ వచ్చి యీాప్రకారము చిట్నిడి రామారాయనింగారు దొరతనం చేస్తూ వుండిరి. రావు తెనుగురాయనింగార్కి మాధవరావు వెంకటపతిరావు చిన్నారావు చంద్రారావు జగ్గారావు వెంకటక్రిష్ణారావు రంగశాయిరావు యీా ఆరున్నొక్కరు కొమాళ్లు. వీరు చిట్నిడివారి స్థళములో శ్యామనకోట గ్రామములో గృహాలు కట్టుకొని వుండేవారు. యీాయేడుగురిలోనున్ను వెంకటక్రిష్ణరాయనింగారు గోలకొండలో సులతాను అబ్దులిహాసను కుదుబనుముల్కు గారి తావున రెండువేలమందితోటి సరదారీ కొలువు కొలుస్తూ వుండేవారు. వేంకటకృష్ణారాయనింగార్కి దేహములో స్వస్తములేక మూడు నెలలకు శలవు పుచ్చుకుని యింటికివచ్చిరి. యిక్కడ అయిదుమాసముల పరియంతము

నిలిచినారు. వాయిదా మిగిలినందున ఆయ్నా గోలకొండవెళ్లి ఖావందు దర్శనం చేశినంతలో మూడుసెలలకు శలవు పుచ్చుకుని మా అన్నగారు జాడ్య ముతో యింటికివచ్చిరి. యీ అయిదుమాసములు అతిక్రమించినది. ఆయ్నా దేహస్థితి యేలాగు వున్నది యేమి అని అపసవ్యభాషచాత అడుగగా ఆ మాటలు కోపంచాత మిగలనాడినట్టుగా బాకున పొడుచుకొని దేహం చాలించినారు. అందుమీద ఖావందు వెంకటక్రిష్ణారాయనింగారిని హుజూర్కి పిలవనంపించిరి. యిక్కడ రావు తెనుగురాయనింగారు శ్రీజగ న్నాథం యాత్రకు వెళ్లి అక్కడను కాలము అయిపోయిరి. చిట్టినిడి రామా రాయనింగారు చామర్లకోటలో కాలము అయిరి. వెంకటకృష్ణారాయనింగారు గోలకొండకుపోయి ఖామందుదర్శనము అయ్నాతరువాతను నిండా సన్మానము చేశి మేమయితే మరేమీ మోతాదు మిగిలినజబాబు సవాలున నడిపించ లేదూ. మేము కుశలప్రశ్న అడిగినంతలో మీతమ్ములు వేరే అర్థము చేసుకుని దేహము చాలించినారు. ఆయ్నా గరఫ్తారి ఆరీతిని వున్నది. యెవరు యేమి చేసేరు. యిప్పుడి చిటినిడి రామారావుదేహం చాలించినారు గనుక్కా కాకి నాడు ప్రోలునాడు శలపాకనాడు తాలూకాలు మూడున్ను మీఫరం చేయిస్తున్నాము మీకు వసతి చెప్పుతున్నాము జమీదారీ నడిచేలాగునూ నాలుగువేలరాణువకు ముజరా ఉండచెప్పి మీకు కాయం బేరీజు మొక రర్రు చేయిస్తున్నాము. దివాణపు పైకం యిచ్చుకుని మీవసతులున్ను ర్యాయ తిన్ని మీరు అనుభవిస్తూ సర్కారు దౌలతు బాహిలో ఉండుకుని తాలూకా బందుబస్తు చేసుకోమని ఫరవానా సాందీరుచేయించి యిచ్చి అప్పించి అప్పుడు పిఠాపురంతాలూకా పెద్దాపురంతాలూకా రెండుతాలూకాల గ్రామాలుక్కా మాగాణీ పైరులకు ఆస్పదముగా నీరుప్రవహించే యేలేటి నీరు పెద్దాపురం తాలూకాకు ఆరురోజులున్ను పన్నెండురోజులు పిఠాపురం తాలూకాకున్ను నిర్ణయంచేసి అంపించి వెంకటక్రిష్ణారాయనింగారు ఫర వానా తీసుకొని వచ్చి పిఠాపురం ప్రవేశించి వెంకటకృష్ణారాయని అన్నగా

రయిన చంద్రరాయనింగారికి పట్టాభిషేకం చేసినారు. చంద్రారాయనిం గారున్ను జగ్గారాయనింగారున్ను కూడా తాలూకా బందుబస్తు చేసు కున్నారు.

చంద్రారాయనింగారితరువాత వెంకటకృష్ణారాయనింగారు దొరతనము చేశినారు. తరువాతను చంద్రరాయనింగారికొమాళ్లు మాధవరాయనింగారు నలభైసంవత్సరములు రాజరికం చేసినారు. తరువాత ఈయ్యిన తమ్ములు నర శింహరాయనింగారు సంవత్సరము దొరతనము చేశినారు. తర్వాత ఆయన కొమాళ్లు వెంకట్రాయనింగారు దొరతనముచేశినారు. తరువాత వీరికి జ్ఞాతి వెంకట్రాయనిం గారిక్కి సన్నిహితులు వేంకటక్రిష్ణారాయనింగారు దొర తనము చేశినారు వీరిదొరతనములో అజుహూశేను అనే సర్లస్కరుడు వచ్చి వుండగా సుబాదారుడిమీద తిరుగబడి వారికి జ్ఞాతిఅయిన బుచ్చన్నగారిని వెంటతీసుకొని తోటపల్లి మాన్యానికి మొవాసుగిరీకి లేచిపోయి అక్కడ వేంకటక్రిష్ణారాయనింగారు దేహం చాలించినారు. బుచ్చన్నగారు తిరుగ పిఠాపురం వచ్చినతరువాత అజుహూసేను పట్టుకుని తలకొట్టివేసినారు. తరువాత బుచ్చన్నగారికుమాళ్లు చిన్నమాధవరాయనింగారు మూడు సంవత్సరములు దొరతనము చేసినారు. అటుపిమ్మట ఆయ్యినకొమాళ్లు పెదమహీపతిరాయనిం గారు యిరువైవెసంవత్సరములు దొరతనముచేశినారు. యీయ్యినకు సంతులేదు. వీరిజ్ఞాతి నీలాద్రిరాయనింగారు పన్నెండు సంవత్సరములు దొరతనము చేసి నారు. తరువాతను యీయ్యినకు నలుగురు కుమాళ్లు పెదవెంకటరావు, యర్ర వెంకటరావు బుచ్చివెంకటరావు ముద్దువెంకటరావు నల్గురు. అందులో పెద వెంకట్రాయనింగారు వికృతి సంవత్సరములగాయితి నందనసంవత్సరం వరక్కు దొరతనముచేసి మసూచకమువచ్చి దేహం చాలించినారు తరువాత తాలూ కాకు జమీనుదార్లు అయిన వత్సవాయి తిమ్మరాజుగారు తాలూకా అమాంత చేసుకొనిరి. 1744 H. D. జయసంవత్సరమువరకు జప్తీ గన్కు వత్సవాయని వారి అములు మన్మథసంవత్సరములోను బుచ్చివెంకటరాయణింగారు జప్తీ

వపలించి తాలూకా స్వాధీనం చేసుకొని మన్మథసంవత్సరంలగాయతి పరాభవ సంవత్సరంవరకు దొరతనం చేసినారు. ప్లవంగసంవత్సరం లగాయతి పెద వెంకటరాయనింగారికొమాళ్లు కొమారవెంకట్రాయనింగారు దొరతనంచేసి కుంపిణీవారికి పైకం బాకీఅయి చితపట్ల మాధవరాయని బోధనునుంచి మోహాళిగిరికి పాలవంత్సలేచి అక్కడ దేహము చాలించినారు. ప్రమాదిసంవత్సరం వరకు దొరతనం జరిగినది. ఆనంద సంవత్సరంనుండి యీపల బుచ్చి వెంకట్రాయనింగారికొమాళ్లు వెంకటనీలాద్రిరాయనింగారు దొరతనం భావ సంవత్సరం ఆషాఢ శు ౧౦ వరకు జరుగుతూ వున్నది.

యీ జల్లూరుగ్రామాన పూర్వమున వుండే యీశ్వరదేవాలయం ఆజుహాపు సేనువచ్చినప్పుడు దేవాలయం విప్పించి పెద్దాపురం పిఠాపురం చామర్ల కోట కోటమీద పోట్లాడడానికి దమదమాలు తయారు చేయించడానికై రాయి తోవించుకు పోయినారు. మాన్యంనగర కలిశిపోయినది. యీవూరి పాటిమీద జయప్రతిమెలు శిలావిగ్రహం వకటి కొంత శిథిలమై వున్నది. పాతవూరి వద్దనుండి దండుదోషగనుక దోవతప్పించి పాతపాటి వుత్తరం వైపున వూరు నలభైసంవత్సరములకిందట తిరుగ కట్టుకున్నారు.

యీగ్రామానను వడ్లు రాగులు పెసలు మినుములు అనుములు ఆముదాలు అలచందలు గోగులు జనుములు యీధాన్యములు పలిస్తవి.

## చామర్లకోట కైఫియ్యతు.

కైఫియ్యతు మౌంజే, చామర్లకోట,
భీమవరంతాలూకా. అచ్చుప్రతి.
పిఠాపూరు మౌంజే, మజుకూరు కులకర్ణి వద్దిపర్తి నీలాచలం
వగయిరావారు చెప్పినసంగతులు.

జంబూద్వీపమున దక్షిణవారాశిసమీపమునకు త్రిలింగమధ్యస్తమై వుండే ఆంధ్ర దేశంలోను వేంగీమండలమునందు అఖండగౌతమీకి పూర్వ

భాగమునందు నాల్గు ఆమడదూరమునను పూర్వమున ఈశ్వరపుత్రుడైన కుమారస్వామి తపస్సు చేస్తూవున్నటువంటి వనం కలదు. అది కుమారవనం అని ప్రసిద్ధి కలదు. తరువాతను యీ ఆశ్రమమునకు పూర్వభాగమునందు వకనది కలదు. అది కుమారనది అని పేరు. అక్కడ సామీప్యములోనే వక దివ్యోదకము గలిగిన సరోవరము కలదు. అది కుమారసరస్సు అని ప్రసిద్ధి కలదు. ఇందుకు ఉత్తరంవైపున సామీప్యములోనే ఒకనిమ్నప్రదేశమునందు సర్వదా అతినిర్మలమైన మధురోదకము కలిగియుండుటవల్లను, పూర్వమునందు ఆతీర్థమందు కొందరు మునులు స్నానముచేస్తూ నిత్యకర్మలు తీర్చుకోవడము చేతను ఆదిమునులతీర్థము మహాత్మ్యమని ప్రతిష్ఠతమైనది. మండనారాయణ స్వామికలరు. ఇది బహుపురాతనమనివాడుక అయియుండేది. ఈప్రకారం వుండగాను ఈశ్వరుడు త్రిపురపురాలు సంహారం చేసిన సమయమందు త్రిపు రాలయందలి రాక్షసులయొక్క ప్రాణలింగము భిన్నమై అయిదుఖండములు భూమియందుపడినవి. అవియేవి అంటే అమరారామ, క్షీరారామ, ద్రాక్షా రామ, కుమారారామ, సోమారామా, యీప్రకారము అయిదు స్థలాలయందు పడినలింగములు యింద్రప్రతిష్టమై అందుల మహాత్మ్యము విశేషముగా కాశీ ఖండములో చెప్పబడుచున్నది. తరువాతను చాళుక్యభీమమహారాజు, కుమారా రామ భీమేశ్వరునియందు మహాభక్తి తాత్పర్యముచేతను సమస్తవిధభోగములు నడిపిస్తూ వుండెను. మరిన్నీ భీమేశ్వరుని స్థలమందున్న ద్రాక్షారామ స్థలమం దున్న రేనూరేసి శిలాస్తంభాలతో మంటపములు కట్టించినాడు. కుమార రామస్తలమందు కట్టించినపట్నము, చాళుక్యభీమనగర మనేవాడుకగలిగి యుండెను. (అదియే యిప్పటి చామర్లకోట భీమవరము) ఆపట్నంలో భీమ మహారాజు మహల్లు కట్టించి యుండిరి. ఆపట్నానకు తూర్పు పశ్చిమ వుత్తర దక్షిణవైపులను నాలుగు వాకల్లు కలిగి యుండెను. తరువాతను కీర్తిపురమనే పట్నానకు రాజైనటువంటి యింద్రసేనుడు అనేరాజు చతుర్థాన్వయుడు. ఆవైశమునందు కీర్తివర్మ అనేరాజు పుట్టెను. ఆయన వంశమందు మల్లవర్మ

పుట్టెను. ఆయనకు రణదుర్జయుండైన కుమారుడు కీ ర్తివర్మరాజు పుట్టెను. ఆయన పాలన యీవేంగిదేశమందలి చాళుక్యనగరమనే పట్నానకు నాలుగు వాకిళ్లకు పశ్చిమపు దరవాజాలో మారడు అనేవాడున్ను దక్షిణపు దరవాజాలో పోత డనేవాడును వుత్తరపుదరవేజాలో పుల్లడు అనేవాడున్ను యీప్రకారంగాను దేవిడీలలోని నాయకులు వుండేవారట. కళింగదేశ గంగరాజుగారు యేలే టప్పుడు వేములవాడ భీమకవి అనే కవీశ్వరుడు పశ్చిమరాజ్యమునుంచి వచ్చి పడమటి దర్వాజాలోనుంచి చాళుక్య భీమనగరములో ప్రవేశించబోతే ఆదర వాజా కావలికానే మండడు అనేవాడు ఆయను సత్తువ యెరుగ లేనివాడై ఆయనను పట్ణములోనికి వెళ్లకుండా అడ్డగించి నిలిపిన వాడాయెనట. అంతట భీమకవిగారికి కోపమువచ్చి తిట్టినారట ఏమనియంటే.

క. కొండికల భీమవరమట
గుండా కొయ్యలును గూడి కుహాకములచే
బండాయె భీమనగరము
మండడు రాకుండగట్టె మడికెం గిడిచెగా.

అని యీప్రకారము తిట్టినంతమాత్రానే ఆయన మహాదేవి వర ప్రసాది గనుక ఆదేవిడీ కావలికానే మండడు అనేవాడు తక్షణమందే మృతి పొందినాడు. మరికొద్ది దినములలోగానే చాళుక్య భీమనగరమున్ను ప్రజ లకు జయప్రదంకాక దినేదినే ప్రజహరించి పోవడంచేతను పట్ణం పాడు అయినది. తరువాతను పైనివ్రాసిన కీర్తివర్మ అనేరాజుకు మల్లవర్మ అనే కుమారుడు కలిగి ఆయన అంగ, కళింగ, వంగ, మధుర, ఆంధ్ర, పుళింద, కుంతల, కేరళ, గౌడ, పాండ్య, మరాట, లాట, కటక, రాజులను జయించి ద్వనథపురమనే పట్నానకు రాజైనాడు. ఈయనకు బలియవర్మ అనే కుమా రుడు కలిగెను. ఆయనకు మల్లమహీపతి అనే రాజు పుట్టెను. యీయనకు కుడియవర్మ అనే కుమారుడు పుట్టెను. యీయన్ని యొక్క యుద్ధభూమిని పొందినప్పువంటి శత్రురాజులను దేవతాస్త్రీలతో సంతోషముగా విహరి

స్తుండేలాగున చేస్తూవచ్చినాడను. అంతట చాళుక్యవంశభూషణుం డైనటువంటి విమళాదిత్య దేవమహారాజు యీపైనవ్రాస్ని కుడియవర్మ అనే రాజుయొక్క సహాయమువల్లనుండి యుద్ధభూములను జయములను పొందినవాడై కుడియవర్మకు గరుడవెక్యం యిచ్చినవాడాయెను. యీకుడియవర్మ అనేరాజు వేంగీదేశము పాలనచేస్తూవుండెను.

## హరికోటయానాదుల కైఫియతు

Mackenzie manuscripts Vol I. 1837 P. 619 to 623.

### యీ శ్రీహారికోటలోవుండ్డే యానాదులజాతి

### విలాజుకైఫియ్యతూ సన్ 1812 సంవత్సరము.

పూర్వం రాఘపరెడ్డి అనేవాడు పాకనాటిశీమనుంచ్చి యీశ్రీహరికోటకు వచ్చి ఆశీమలోవుండ్డే యానాదులు అరువైయిండ్లవాండ్లను పిల్చుకొనివచ్చి యీశ్రీహారికోట అడవినరూవత్తు సంవరించ్చి రాఘపురం అనే పట్నం నిర్మాణంచేశి యీ రాఘపురానికి ఆగ్నేయమంద్దు యీ అరువైమంది యానాదులకున్ను యిండ్లు కట్టించి పెట్టుకొని వున్నంతలో కొన్నాళ్లమీాదట యీయానాదివాండ్లు ప్రబలమయి యీవెనాడుపేర నాడుమొదలుచేసుకొని అడువులో తిరుగుతుంన్ను తిరుకమానుతోకూడ వుండేవి. యిట్లా యీశ్రీధరకోట మొదలయిన అరంణ్యాలలో తిరుగుతూ వుండ్డగా వక స్తళమందు అంబ్బరకేశి అనే రుషీశ్వరుడు యీశ్రీహారి కోటమధ్యారంణ్యమంద్దు వక సరోవరందగ్గిర నిత్యమున్ను కాశీనుంచి వచ్చి స్నానాజపానుష్ఠానాలు తీర్చుకొని శివపూజ చేస్తూ వుండ్డేది. వకునాడు యీకిరాతలు అయిన యానాదివాండ్లు యీరుషీశ్వరుంణ్ని చూచి మహాభయభక్తితోకూడా సమస్త పండ్లుఫలాలు అడవిలో కలిగినషువంట్టిది తెచ్చి ఆయన శివపూజ చేశేయడల వుంచ్చేది యిట్లా అనేకదినాలు జరిగినపిమ్మట ఆరుషీశ్వరుడు వకునాడు యీకిరాతలనుచూచి వోకిరాతులారా మీారు బహుదినాలనుంచ్చి మాకు సమస్త

మైన ఫలాలు తెచ్చి యిస్తున్నారూ మాకు యేమికావలెశినది మీరుయేమి నిమిత్యముగాను నన్ను ఆశ్రమిస్తున్నారూ అని అడుగగా అప్పుడు యీ కిరాతులు చెప్పింది స్వామీ మేము యిదే స్థళమందు సార్వదా నివాసంగా వుండేటట్టున్ను మేము సంచ్చారం చేసేయడల మరియేమీ సర్పభయం మొదలయినది యేమీ తట్టకుండా వుండ్డేటట్టున్ను మాకు మంత్రతంత్రశిద్ధి అయ్యేటట్టున్ను వరం దయచేయవలెననేటప్పటికి ఆదేప్రకారం అంబ్బరకేళి మునీశ్వరుడు వీండ్లకు యేమిన్నుపద్రవం తట్టకుండా వరమిచ్చి అంతర్ధాన మయినాడూ.

అసిమ్మట యీయానాదులు మహాప్రబలమయి మంత్రతంత్రాలలో విచక్షణులయి ఆరణ్యమంద్దే నివాసంగా వుండ్డేది. వీండ్లలో నాలుగువిధాలు యేమంట్టే చెంచ్చువాండ్లు । యానాదులు । కోయవాండ్లు । యిరలవాండ్లని। నాలుగువిధాలు । యానాదివాండ్లు అనేవాండ్లు ఔషధక్రియలయంద్దు మంచి విక్షణ కలిగినవాండ్లు కోయవాండ్లు అనేవాండ్లు పడమట గుత్తి ఆద వని ఆప్రాంత్యాల అరణ్యమందు సంచారం చేస్తున్నవాండ్లు తిరిగే సరిహద్దు లలో యేవృక్షాలకేగాని ఫలాలకేగాని మంత్రతంత్రాలవల్ల దిగ్బంధనచేశి వుంచేది. యెవరైనా బాటసార్లుగావుండి అడవిలో పోతూవుండ్డి పండ్లు ఫలాలుచూచి తినవలెననే ఆపేక్షచాత ఆవృక్షాల పండ్లుకోశేటంద్దుకు పోంగ్గానే ఆదేరీతిగా వీడుకోశేలాగున వుండ్డవలెనేగాని తిరిగి రావడంలేదూ యిట్లా వీడు వృక్షంమీదికేతగులుకొని వుండ్డేటప్పుడు కొంత్తశేపుకిమ్మట యవ డైనా వకు కోయవాడూ చూచి ఆదేమార్గంగా యీవస్తున్ను వుండేవాంణ్ని చూచి, యేమొయినీకు పండ్లమీద ఆశగావున్నదా అనివీంణ్ని అడిగితే అప్పుడు ఆవృక్షాన చిక్కుకున్న బాటసారి వీంణ్నిచూచి వోయీ కోయ ధొరా నేను పండ్లుతినవలెననే ఆశచాతను పండ్లుకోయపోతే ఆచెయ్యి తిరిగి రాకుండా వున్నది నాయంద్దు అపచారం వచ్చింద్ది అనిచెప్పుకుంట్టే అప్పుడు ఆకోయవాడు వీణ్ణి వృక్షంనుంచ్చి విడదలచేశి యెన్నిపండ్లుకావలెనో అన్ని

పండ్లు కోసుకోమని వాడు వుత్తర్వు చేయంగ్గానే వాడివుత్తర్వుమీద యెంన్ని
పండ్లుకోసుకుంన్నా మరి యేమీభయం లేదూ ఆమీదట ఆకోయవాడికి వఖ
పోగాకుమట్ట యిస్తే వాడికి అతిసంతోషమవుతుంన్నది. యిదిగాక నలభై
యేండ్లకుమునుపు పాలవంచ్చ భద్రాచలాన వుత్తరంగా వుండే కానులో
విస్తరించి కోయవాండ్లువుండ్డగా శాలివాహనశకం 1635 వఖ బ్రాహ్మడు
దక్షిణశీమనుంచ్చి వుత్తరంగా పోతూ ఆపాలవంచ్చ భద్రాచలం అడవులలో
పోతుంన్నా యీకోయవాండ్లు యావత్తుకూడి సర్ప్పాలు మొదలయినవి తింట్టూ
వుండ్డేవిచూచి యీబ్రాహ్మడు అత్యాశ్చర్యం చాతనూ వీండ్లను చూచి వోయీ
కోయదొరలలారా మహాకాలకోటివిషంగా వుండ్డేసర్ప్పాలను తినేవాండ్లను
నేను యెక్కడా చూడలేదు అనిఅడగగా అప్పుడు యీకోయవాండ్లు
యావత్తు బ్రాహ్మడుచెప్పినమాటలు విన్నషుపంటివాండ్లై యీబ్రాహ్మణ్నిచూచి
వాండ్లు అన్నది యేమంటే వోబ్రాహ్మడా యివిసర్ప్పాలు కావు యివిపురుగులు
సర్ప్పాలు అనేది బయట తిరిగేవిలేదూ మేము యేవిషంగావుండ్డే జీవరాసులును
తిన్నప్పటికింన్ని మాకు యేమివుపద్రవం అయ్యేదిలేదని మాకు అంబ్బరకేశి
ఋషీశ్వరుడి వరంగనుక మేము తింట్టున్నాము. మీకు సర్ప్పంని చూడవలె
నంట్టే మేము చూపిస్తామని చెప్పేటప్పటికి యీబ్రాహ్మడు అది యెటువంట్టి
సర్ప్పమో అదిచూడవలెననే అపేక్షచాత చూడవలెనని చెప్పేటప్పటికి అప్పుడు
ఆకోయవాండ్లు సమ్మతింంచ్చి వఖచింన్నదాంన్ని పిలిచి యీబ్రాహ్మడితోకూడా
యిచ్చి యీ బ్రాంహ్మడికి సర్ప్పం చూపింంచ్చవలెనని ఆనతిచ్చి పంపింంచ్చేటప్ప
టికి అదేప్రకారం ఆచింన్నది పొయ్యేటప్పుడు వఖ వఖ మోపు యెండ్డుగడ్డిన్ని
వఖచాటానున్ను తీసుకోని యీ బ్రాహ్మణ్నికూడా వెంటపెట్టుకొని అనేక
ధూరం ఘోరారణ్యమంద్దు పోయి అక్కడ వఖపుట్టచూచి ఆపుట్టమీదఅగడ్డి
యావత్తు పర్చి యీబ్రాహ్మణ్ని దూరంగ్గా చూస్తూన్ను నిల్వమని చెప్పి తన
చాతవుండ్డే చాటతీసుకుని విశిరేటప్పటికి మరి అరఘడియను ఆపుట్టలోనుంచ్చి
ధూమ్రం బయలుదేరినది. మరినిమిషానికి నలుపువర్న్నంగానున్ను పసుపువర్న్నం

గానున్ను అనేకవర్ణాలుగా ధూమ్రం బయలుదేరినది ఆమీదట మరినిమిషా
నికి యెరుపువర్ణంగా ధూమ్రం బయలుదేరి దానితోకూడా జ్వాల బయలు
దేరి ఆజ్వాలతోకూడనే మహాగొప్పసర్పం అద్భుతాకారంగా యేడుశిరస్సుల
తోటికూడ పుట్టలోను బయలుదేరేటప్పటికి యీగెడ్డ యావత్తు కాలిపోయి
నది. అప్పుడు యీ బ్రాహ్మణుఁ ఆసర్పం యొక్క శిరస్సు మాత్రచూచి మహా
భయస్తుడై వుండ్డే బ్రాంహ్మణ్ని యీకోయచిన్నదిచూచి అయ్యా బ్రాంహ్మడా
సర్పమనేదియిది చూచినారా అని అడిగేటప్పటికి బ్రాంహ్మడికి నోటమాటాడే
టంద్దుకు ద్రవంల్యాకుండా వుండ్డేటప్పటికి యీకోయపడుచుచూచి యీ
బ్రాంహ్మడు యీసర్పాంన్ని చూచి నిండ్డా భయస్తుడైనాడని తెలిశి తిరిగి
యథాప్రకారం పుట్టలోపలికి సర్పం పొయ్యేటట్టు అభిమంత్రించ్చేటప్పటికి
అదిలోపలికి పోయినది ఆ షిమ్మట ఆకోయచిన్నది యీ బ్రాంహ్మడికి అనేక
పండ్లు ఫలాలుచాత కైతోపచారం చేశి యీబ్రాంహ్మణ్ని కూడా వెంట్టపెట్టు
కోని తమయొక్క గడ్యానికివచ్చి తమవాండ్లతో యీవృత్తాంత్తం అంతా
చెప్పేటప్పటికి వాండ్లు యీవృత్తాంతం విన్నషువంట్టివారై బ్రాంహ్మడా
సర్పాన్నిచూచినావా అనిఅడిగేటప్పటికి యీ బ్రాంహ్మడు విస్రమించుకోని
వాండ్లతో చెప్పింద్ది యేమంట్టే మీరు మహాత్ములు మీవంట్టివారివల్ల అటువంటి
మహాఘనమయిన సర్పాంన్ని చూడడమయినది అనిచెప్పి అక్కడనుంచ్చి
బ్రాంహ్మడు బయలుదేరి వుత్తరయాత్రకు నడిచినాడూ.

చెంచ్చువాండ్లు అనేవాండ్లు పడమట అహోబిళం శ్రీశైలం మొద
లయిన అరణ్యప్రాంత్యాలలో వుండుకోని విల్లు అంబ్బు సమేతంగ్గా వ్యాట
ఆడుతుచ్చూ అరణ్యమంద్దు సంచ్చరిస్తూంన్ను వుండేవాండ్లు ఆకులుకట్టేది
వెదురుబియ్యం పుట్టతేనె తినేది బాటసార్లను దోస్తూంన్ను అంద్దరినింన్ని
చంప్పుతుంన్ను సమస్త ప్రాణులకున్ను వుపహాతిచేస్తుంన్నువుండేది వాండ్లుంన్ను
మంత్రతంత్రాలయందు సామర్ధులు.

యిరలవాండ్లు అనేవాండ్లున్ను విల్లంబులు తీసుకుని అడవిలో సంచ్చ
రిస్తుంన్ను వుండ్డేది. దొంగ్గతనం చేస్తూవుండ్డేది యీ యానాదిజాతిలో

మాత్రం దొంగ్గతనం చేశేదిలేదూ. వీండ్లు వూళ్లలోనే సర్కారు తరుపున కావలిగావుండ్డేది. వీండ్లు పూర్వంనుంచ్చిన్ని సురటి పట్టతీగెలున్ను శిరివె రున్ను యివిరెండ్డు దినుస్సులున్ను రంగువెయ్యడానుక సర్కారుకు అనేక బార్వలు తెచ్చియిచ్చేదిన్ని అడవిలో కల్గినటువంటి పళ్లిగెడ్డలు అనేదిన్ని తేనె మొదలయినది అహారం చేస్తున్నా సర్కారువారు దయచేశినది పుచ్చుకుంటున్నా సర్కారుకావలితనం చేస్తూవుండ్డేది యిప్పటికిన్ని అదే రీతిగా వున్నారూ. యిప్పుడు యీ శ్రీవారికోట అడవిలో నలుభైమంద్ది యానాదులువున్నారూ. యీనలుభైమందికి ముఖ్తియారుగావుండ్డే యానా దికి సర్కారులోనుంచ్చి కలిమెమువడ్లు నెల 1 కి యిస్తారూ వాండ్లు శిరివె రున్ను సురటిపట్టాకున్ను నెలకు పదిబార్వలు తెచ్చియిస్తారూ లోతక్కువ యానాదులకు సర్కారులో యేమిన్ని యివ్వకహూ వాండ్లు అడవిలో పళ్లి గెడ్డలు తింట్టున్ను జీవనం చేస్తారు యీయానాదిజాతిలోమాత్రం యీ ప్రాంత్యాలలో ఉండ్డేవాండ్లు మరివకప్రాంత్యం అడవిలో వుండ్డవలెనని పోతే అక్కడికిరాతలు వీండ్లనుచంప్పి వీండ్ల పెండ్లాలను పట్టుకొని తమవశం చేసు కుంట్టారు కాబట్టి వాండ్లను యీప్రాంత్యాలకు వీండ్లు రానియ్యరు వీండ్లు ఆప్రాంత్యాలకు పోరు.

యిది తాను గుర్తెరిగినమట్టుకు యానాదిఅయిన జాతామారుడు అనే వాడు వ్రాయించ్చిన కైఫియ్యతూ.

ఆ ర్జీ.

Local records. vol. 62

(అన ౧౮౪౨ సం॥ ది 3 నవంబరు)

మకాం దాచెపల్లి.

మహారాజశ్రీ గుంటూరుజిల్లా మేజశ్రీలువారి సముఖానకు తమ నవు కరు వెలిదండ్ల దాసప్ప హెడ్డాపు పోలీసు ఠాణే దాచేపల్లి వ్రాసుకున్న అర్జీ విన్నపము ।

ఈ జిల్లాలోనేమి యితరజిల్లాలోనేమి కుడియెడమ కులాలవారిలో కులాచారవిషయమై స్వల్పసంగతులను గురించి గొప్ప కలతలున్ను ప్రాణహానిన్ని సంభవిస్తూ వున్నది గనుక యీలాగంటె దుర్మార్గములు జరగకుండా యేప్రకారం జరిగిస్తే నిలచిపోతవో అందునగురించి అవలంబించ వలశిన యుక్తమయిన మార్గమును గురించి నా అభిప్రాయమున్ను ప్రతికులస్థులలో ముఖ్యమయిన వార్ని పిలిపించి వారికి యేయే మర్యాదలు యేమేమి బిరుదులు జరగవలసినవో ఆబిరుదులు వారికి యేవిధంగా రాబడ్డవో ఆలాగంటె బిరుదులు అన్నిన్ని జరిగించే పక్షము వచ్చే లాభమేమో నిలిపివేసే పక్షముకు సంభవించే చెరుపు యేమో వారిని విచారించి జమీరుచేసెదనిన్ని పోయిన నెల ది 21 తారీఖున దయచేయించిన ౧౫ నంబరు సరికిలేరు హుకుం ది ౨౨ తారీఖున రాత్రి నాకు చేరి అందుల సంగతులు గ్రహించి మనవి వ్రాసుకొనేది యేమంటే—

తాణా మజుకూరు యిలాకాలో కుడియెడమ కులాలు అనేవాడిక లేదుగాని యితరజిల్లా యిలాకాలో యీవాడిక కలిగి వున్నట్టున్ను కుడి అనగా మహానాటివారు అనిన్ని యెడమ అనగా మత్తులలో చేరిన కంసాలులు గొల్లలు ముతరాచలు మాదిగలు వగయిరాలు అనిన్ని తెలియవస్తూ వున్నది. యీరెండు విధాలవారిలో పెండ్లిండ్లు మొదలైన వాటిలో యేమేమి కలతలు వుంటూ వున్నవో నని విచారించి నంతల్లో—మహానాటి కులస్థులలో మాల కులస్థులు గుర్రాన్ని యెక్కి వూరేగడముకు మాత్రం కొన్ని గ్రామాదులలో కలతలు వున్నట్టున్ను తతిమ్మా కులాలలో వారివారి కులాచారం తారతమ్య ప్రకారం గుర్రాలు పాలకీలు మొదలయినవి యెక్కి భజంత్రీలు వగయిరా మేళాలతోకూడా పెండ్లిండ్లల్లో వూరేగడం మొదలయినవి జరిగించుకునే యెడల యెడమ కులస్థులవల్ల ఆటంకమయి వున్నట్టున్ను తెలియలేదు.

మాలవాండ్లు గుర్రాని యెక్కి వూరేగేయెడల కొన్ని గ్రామాదులలో వారిషించి వున్నట్టున్ను కొన్ని గ్రామాదులలో యెడమ కులస్థులు మొదలయిన

వాండ్లు కలతలు చేస్తూ వున్నట్టున్నూ తెలియవస్తున్నది. యెడమ కులస్థులలో కంసాలీలు మొదలయిన పంచదాయీల వాండ్లు పెండ్లిండ్లు చేసుకునే యెడల గుర్రాన్ని యెక్కి వూరేగడమునకు వచ్చిన మేళం చోడ్రాయి అనగా గ్రామం కట్టేటప్పుడు స్తంభప్రతిష్ఠ కాలమప్పుడు పాతబడ్డ రావిస్తంభం దగ్గిర నాదార్చకపోయినా మహానాటివారు ఆటంకంచేసి కల్త జరిగిస్తూ వున్నట్టు తెలియబడుతూ వున్నది.

విశేషించి వీండ్ల గురువు అనే యికుస్తుడే సంచారం వచ్చేయెడల పగలు కంచుదివిటీలు మొదలయిన బిరుదులు వేసుకుని వచ్చిన పక్షమునకు ఆటంకపెట్టడమున్ను యిందువల్ల వుభయులకు కల్త సంభవిస్తూ రావడమున్ను వున్నట్టు తెలియబడుతూ వున్నది.

గొల్లవాండ్లున్ను గుర్రాన్ని యెక్కి వూరేగే పక్షమునకు కల్త సంభవిస్తూ వున్నట్టు తెలియవస్తున్నది.

యీ యెడమ కులాల్లో చేరిన మాదిగవాండ్లు నాలుగు తట్లా పట్టుకునే వుల్లెడ తెల్లకత్తి కాలికి గజ్జ కట్టుకుని గ్రామంలోకి వచ్చే పక్షమునకు మహానాటివారు ఆటంకము చేయడమున్నూ వుభయులకు కల్త జరుగుతూ వున్నట్టున్ను తెలియవస్తున్నది.

తలిమ్మా ముతరాచలు మొదలయినవాండ్లు పెండ్లిండ్లు చేసుకునే యెడల గుర్రాన్ని యెక్కి వూరేగడం మొదలయినవి జరిగించుకోవడంలో మహానాటివారు ఆటంకపెట్టటమే కాని అందువల్ల కల్త సంభవించడమే కాని లేనట్టు తెలియబడుతూ వున్నది.

యీలాగున సంభవించడమునకు అనగా యీవుభయవారలకు వుండే విరోధములు పూర్వోత్తరం తెలియడమునకు యెంత దూరం విచారించినా రూఢి అయిన సంగతి తెలియబడదు.

## Local Records. No. 15-5-17.

సెంటెన్సు. నం॥ 4

## గుంటూరుజిల్లా అసిస్టాంటు మేజస్ట్రీటువారు చేసినతీర్పు.

ఫిర్యాదిఅయిన చీరెపూడి కోటప్ప,

సా॥ కంత్తేరు.

ముద్దాయి బెల్లంకొండ తాతయ్యా

సా॥ పెదపరిమి

సాక్షులు. 1 నంబేల క్రిష్ణమ్మ, 2 పాటిబండ్ల మాదయ్యా, 3 కొండ వీటి నారాయణప్ప.

ఫిర్యాదితాలూకు ఆవు పెయ్యాను మందకు తోలితే షుమారు సంవత్సరము కిందట తప్పించుకుని పోయినట్టున్ను నాటనుంచి వెతకగా ముద్దాయీ పశువులలో వున్నందున అతణ్ణి అడిగితే ఆవు పెయ్యాను తోలిపెట్టకపోయినాడని ఫిర్యాదు చేసినాడు.

యిందునగురించి ఫిర్యాదీవద్దనున్ను ముద్దాయీవద్దనున్ను సాక్షులవల్లనున్నూ వాంగ్మూలములు పుచ్చుకోవడమయినది.

ముద్దాయి ఫిర్యాదితాలూకు పెయ్యా తనపశువులలో చేరలేదనిన్ని చేరినట్టుగా ఫిర్యాదీ ఒకసారి వచ్చి తనను అడిగితే లేదని చెప్పెనుఅనిన్ని వ్రాయించినాడు. 1,2,3 సాక్షులు—ఫిర్యాదీతాలూకు తప్పించుకొనిపోయిన ఆవు పెయ్యా షుమారు సంవత్సరం కింద ముద్దాయీపశువులలో తాను మాచి తక్షణం ఫిర్యాదికి తెలియచేసినట్టి సాక్షీన్ని, తానున్ను ఫిర్యాదిన్ని ముద్దాయీ దగ్గిరికివెళ్లి పెయ్యాను అడిగితే అతను తిరిగితోలిపెట్టక పోయినాడనిన్ని అందుమీద గ్రామమునసబయిన 3 సాక్షితో ఫిర్యాదు చేసినాము అనిన్ని 2 సాక్షిన్ని; యీకక్షదార్లనున్నూ యీసంగతిన్ని తాను యెంతమాత్రం యెరగనని 3 సాక్షిన్ని పల్కినారు.

యిందువల్ల విచారించగా ఫిర్యాదితాలూకు తప్పించుకునిపోయిన ఆవు పెయ్య ముద్దాయి స్వాధీనములోవున్నట్టు 1,2, సాక్షులవల్ల పూరాగా రుజూవు అయినది. యిది దొంగతనం నేరంకింద యేర్పర్చడముకు చాలివుండ లేదు. ముద్దాయీ పశువులలో యీ పెయ్య చేరగానే తక్షణం సర్కారుకు రిపోర్టు చాయువలసినపనికి ఆలాగున జరిగించినవాడు కాడు గనుక యీముద్దా యీకి 1816 సం॥రం. 7 రిగ్యులేషన్ 32 శెక్షన్ ప్రకారం రు 3 రూపా యీలు జులుమానా విధించి యివ్వనిపక్షముకు 6 రోజులు కొత్వాలుచావ రాలో ఖయిదున వుండేలాగుననున్నూ ఫిర్యాది చార్జి దాఖలు చేసిన తర్వాత ముద్దాయీ ఆవు పెయ్యను కనుపడకుండా యెక్కడికో తోలి పెట్టినట్టు రికార్డు వల్ల వూహించడానకు హేతువుకల్గివున్నదిగనుక యిందునుగురించి ఫిర్యాది శివిలుకోర్టులో ఫిర్యాదు చేసుకొని న్యాయమును పొందేలాగుననున్నూ ఫయి సలు చాయుడమయినది.

గుంటూరుజిల్లా ఆశిస్టాంటు మేజస్ట్రీటు కచ్చేరి. 1842 సం॥ ది 23 శపటంబరు. మకాం గుంటూరు.

శెంటెన్సు నెం॥ 8

ముద్దాయీలయిన ప్రత్తిపాటిముత్తాసముద్దారు తయినాతిమాలు జవానురాగా పురికోటప్ప చిల్కలూరిపాటి ఠాణా మాలుడఫేదారు బొప్ప వరపుగోవిందుగురించి గుంటూరుజిల్లా మేజస్ట్రీటువారు జరిగించిన ప్రొశీ డింగ్సు—

ఫిర్యాదిఅయిన పోహూరు ఆచార్లుగాడు తనను 1 ముద్దాయీ కోళ్లను లంచం యివ్వమని అడిగితే తాను యివ్వకపోయిన హేతువ చాత తనను తిట్టికొట్టి కర్రలతో పొడ్చినారనిన్ని 2 ముద్దాయితో చెప్పుకుంటే విచారించ కుండా అతనున్నూ మిగల ప్రసంగములు జరిగించినాడనిన్ని చేసినఫిర్యాదును గురించి ముద్దాయీలను విచారించినంతల్లో యీనేరమును వప్పుకోలేదు. చవడవరం చరువుకట్టనిమిత్తం పిల్చినాననిన్ని, అతను రాకపోయినందున

తోసినానని వకటో ముద్దాయి చెప్పినాడు. యిందులగురించి సాక్షులయిన నేలపాటి కోటడినిన్ని వాశిమళ్ల ముత్తడినిన్ని విచారించినంతల్లో ఫిర్యాదిని 1 ముద్దాయి కోడిని అడిగినాడు అనిన్ని అతను లేదని చెప్పితే ఫిర్యాదీని 1 ముద్దాయి చవుడవరం చెరువుకట్టకట్టవలెనని రమ్మనుమని మిగల ప్రసంగములు జరిగించి కర్రతో కొట్టి వీపుమీద కర్రతో పొడిచినాడనిన్ని 2 ముద్దాయి అప్పట్లో కూడావుండిన్ని విచారించకుండా యితనుకూడా మిగలమాటలు ఆడినాడనిన్ని పల్కినారు.

1 ముద్దాయి యీప్రకారం జరిగించినందుకు అతనికి రు 3 లున్ను 2 ముద్దాయి హోదాదారు అయివుండిన్ని విచారించకపోయినందుకు అతనికి రు 1 జమలా నాలుగు రూపాయలు జులుమాన విధించి యివ్వనిపక్షముకు 5 రోజులు కొత్వాలుచావడిలో విడిఖయిదున వుండేలాగుననున్నూ సదరహీ జులుమానా రూపాయీలలో ఫిర్యాదికి దేహనష్టంకింద రు 1 యిప్పించి తతిమ్మా రు 3 లు గవునరుమెంటువారికి దాఖలుకాగలందుకు తీర్పుచాయడమయినది.

ది 4 అక్టోబరు 1842 సంవత్సరం.

## వినుకొండ పూసపాటిరాజులచరిత్ర.

### ఓరియంటల్ లైబ్రరీబుక్కు నంబరు 31

### వాల్యూము IV ఆఫ్. యల్. ఆర్.

పేజీలు 3 లగాయతు 5 వరకు:—

"పూర్వం విదర్భదేశమందు ముర్తుజానగరు సర్కారులోపల వినుకొండ తాలూకాలో పూసపాడు అనేగ్రామమందు మాధవవర్మ అనే రాజకోమారుడు కాపురము వుండేవారు. యీయాన ఒకానొక సమయమందు బెజవాడపోయి అక్కడ కనకదుర్గాంబ అనుగ్రహామువల్ల దినదినప్రవర్ధమానుడై ఆరాజ్యానకు అధిపతియై రాజ్యంచేస్తూ వుండేదినములలో యితనియొక్క

సుగుణాలకున్ను బలశక్తులకున్ను తనయందుగల భక్తికిన్ని మెచ్చి కనకదుర్గ యేదుఘడియలు కనకవర్షం కురిపించినది. గనుక తనకు కావలసినంతధనం వుంచుకొని తతిమ్మా స్థాప్యం చేసినాడు అటుతర్వాతను కొన్నిదినములకు వజ్రపుగనులున్ను కనుపించె గనుక యీరెండువిధాలా అనేకధనవంతుడై రాజ్యం చేసినాడు. తదనంతరం యీయనకొమారుడు రవివర్మ ప్రభుత్వానకు వచ్చి తండ్రిసంపాదించిన రాజ్యమున్ను ధనమున్ను స్థిరంగా నిలుపుకొని బెజవాడ కనకదుర్గ అనుగ్రహించొప్పున రాజ్యంచేసినాడు. అటుతర్వాత యీయనకొమారుడు భూవర్మ, యితనికొడుకు నందిరాజు యితను తనపూర్వులు సంపాదనచేసిన స్థలమందు రాజ్యంచేసినాడు. యీప్రకారం యీనలుగురు రాజులున్ను బెజవాడతక్తుకు అధిపతులై దుర్గానుగ్రహంవల్ల ఆధిపత్యము చేసినారు. తదనంతరం నందిరాజు కొమారుడు బసవరాజు తండ్రిగతించిన తర్వాత పట్టాభిషిక్తుడై బెజవాడలో వుండి రాజ్యంచేస్తూవుండగా డిల్లీ పాచ్ఛావారు మనరపతి గజపతి వారిని జయించి సకల దేశాలున్ను ఆక్రమించుకొనిరి. గనుక తమటాణ్యం చేసుకొనేటప్పుడు వీరిదేశమున్ను జమేదారిన్ని ఆక్రమించుకొనిరి గనుక లోపడి మాకు యేమివసతి అనిమందలిస్తే అప్పుడు పాదుషహావారు తూర్పుదేశాలు తమకు రుజువుకానందున అది అంతా అరణ్యభూమి గనుకనున్ను విచారించి మీకు తూర్పుదేశానకు జమీదారీ దయచేసి వున్నాము. మాతోటి ఆరాలు నడపమని సెలవుయిచ్చినారు..."

2

"శ్రీనాథుడు వారికీర్తి ప్రఖ్యాపనచేయగా నానాదేశాలయందు వినికరి ఆయెను. గనుక కృష్ణదేవరాయలు శ్రీనాథుని రెడ్లవారి కవీశ్వరుడు అనివినికిరి ఆయెను గనుక శ్రీనాథుని జూడవలెనని కృష్ణదేవరాయలు పిలపించెను. గనుక శ్రీనాథుడు విజయనగరం పొయ్యి రాయలదేవుని సన్నిధానానకు పోయి నిలిచినంతలో నీదియేవ్వూరు అని అడిగెను. గనుక శ్రీనాథుడు

రాయలదేవుడు అన్నవాక్యముకు పద్యముగా చెప్పెను. గనుక అప్పుడు శ్రీనాథుడని యెరుకతగిలెను. శ్రీనాథుని బహుమానంగాను కూర్చుండమని నియమించెను. కొన్ని దినములు అయినతదనంతరమందునను కృష్ణదేవరాయలు విజయనగరంలోను గృహరాజు మేడ కట్టించవలెనని యత్నంశాయగాను శ్రీనాథుడు మాధొర కట్టించినాడు అనె గనుకను నేను మారెడ్డి కట్టించినాను కొండవీటిలోను అంటే విచారించి అక్కడ కట్టించినాడా లేదా అని తమ వారిని తగువారిని పంపించిరి. వారు అక్కడకు వచ్చేవరకు మీాకు మాట తప్పితం కాకుండా గృహరాజు మేడ కట్టించుమని రెడ్డికి త్వరగా వుత్తరం పంపించెను. గనుకను శ్రీనాథుడు వ్రాసినవుత్తరం చూచుకుని వారు వచ్చేవరుక్కు యేలాగుకట్టింతు ననుమాట తప్పితంవచ్చెను. అని చింతిస్తూవుండగాను వారి దేవత ముల్లపూరమ్మవచ్చి యేల చింతిస్తూ యున్నావు. నాలూరులోను పోతరాజుగుడిముందరను తుమ్మవున్నది. పోతరాజుకు నీపేరుపెట్టి వుత్తరంవ్రాసి మనుష్యులను పంపిస్తేను పోతరాజు ఆతుమ్మ యిస్తున్నాడు ఆతుమ్మతెప్పించి స్తంభము తెప్పించి కట్టించమని స్వప్నమందున చెప్పెను. గనుక అప్పుడే పోతరాజు రెడ్డికి తనపేరుపెట్టి మేము యిక్కడ గృహరాజుమేడ కట్టిస్తూ యున్నాము. స్తంభములేదు. మీాద్వారమందుయున్న తుమ్మకొయ్య దయచేయవలెనని వుత్తరంవ్రాసి మనుష్యులను పంపించెను, గనుకను ఆపోయినవారు ఆమీాలు పోతరాజుముందర చదివి ద్వారంముందర జాబు వుంచిరి. గనుక వారిచవులకు కొట్టి కొంచ పొమ్మన్నధ్వని వినబడెను. గనుక ఆతుమ్ము నరికించి తెప్పించి స్తంభము వేయించి తొమ్మిది దినములకు మేడ అయేటట్టుగా కట్టించెను రాయలవారు తగువారు వచ్చునంతలో వారిని రెడ్డి చాలా బహుమానం చేయించి పంపించిరి. గనుకను వారుపోయి రాయలవారితోను కట్టించినారని విన్నవించిరి. గనుకను అప్పుడు శ్రీనాథునికి చాలా బహుమానం చేసిపంపిరి. ఆశ్రీనాథుడు తమధొర రెడ్డి వున్నదిక్కునకు వచ్చెను..."



౭

# కోర్టుతీర్పులు.



## కట్టమూరి నరసింహులు దాఖలు చేసుకొన్న అర్జీ దాని విచారణ.

మహారాజశ్రీ గుంటూరు జిల్లా అసిస్టాంటు మేజస్ట్రీటు వారి సముఖానకు,

ఫిర్యాది కట్టమూరి నరసిహ్మలు సాకీన్॥ యనమదల; ముద్దాయి చింతలపాటి కోటయ్యమీద వ్రాయించి దాఖలుచేసుకొన్న అర్జీ యేమంటే.]

ఈ ముద్దాయి ప్రత్తిపాటి తాణా యిలాకా యీదులపాళెమునకు అగ్రహారీకుడున్ను మజుకూరు కాపురస్థుడున్ను అయినందున; నావద్ద రెండు మూడు నెలలనుంచి వెచ్చము తీసుకొంటూఉండేది. నేను నేటికి ౧౦ రోజుల నాడు వెచ్చం లెక్కచూచుకొని పయికం యిమ్మని అడిగితే లెక్కచూచి వెరశికట్టుకొని, ఆపయికము యిదుగో యిస్తాను అదిగో యిస్తానని నాలుగు రోజులు తిప్పినాడు. అంతట, వొకరోజు యివ్వవలసిన దని నేను ఖట్టిగా అడిగేటప్పటికి నన్ను మిగులమాట్లాడి, పయికము ఇవ్వడము లేదనిన్ని ఫిర్యాదు చేసుకోవలసినదనిన్ని, చెప్పడమేకాకుండా; నేటికి నాలుగు రోజులనాడు నా పశువులు డొంకకుపోయి మేసి రావడములో తన అగ్రహారపు పొలములో మేసినవని, వొక లేనిపోని దావా బనాయించి, మొన్నటి రోజు వుదయాన నావాకిటివద్ద వెట్టివాండ్లనున్ను, మహస్సూలుదారుణ్ణిన్ని కూర్చుండబెట్టి, యిదివరకు పశువులను మేతకు, నీళ్లకు, పొలానికి పోనియ్య

కుండా, అరికట్టి, మమ్మున శిశుబాలాదులను నీళ్లువగయిరాలు తెచ్చుకోకుండా నున్ను, బయటికి రాకుండానున్ను, చాలా నిర్బంధపెట్టుతూ వున్నాడు.

పయిగా, పశువు ౧ కి రు॥ ౪ చొప్పున బందెయిస్తే, అరికట్టకుండా వదులుతానని చెప్పి, నిండా తొందరపెట్టుతూ వున్నందున, పశువులకు మేత లేక చచ్చిపోతవిగనక, చొప్ప అయినా తెచ్చి వేసుకొందామని నేను పొలంలోకి పోయి, మోపెడుచొప్ప కట్టుకొని, బజారున వస్తూవుండగా ముద్దాయియొక్క మహాసూళ్లుదారుడైన శానంశెట్టి వెంకు పశువులకు నిన్ను చొప్ప తీసుకపోయి వేసుకోనిస్తానా? అని, ఆమోపు పడదోసి, నామెడ వంగదీసి, కొట్టుతూ వుండెను. అప్పుడు, మజుకూరి కాపురస్థులయిన మాచెర్ల పాపయ్య యీ అంకమ్మ మొదలయినవారు చూచి విడిపించి, ఆచొప్పమోపు నాకు ఇప్పించినారు. అంతట, నేను యింటికివచ్చి ఆ చొప్ప పశువులకు వేసుకొంటూ వుండగా, ముద్దాయికోటయ్య నన్ను తన యింటిదాకా పిలిపించి నీవు మిగుల మాటలుఆడుతావు; బందెదాఖలు చెయ్యవా? నీకొంప తగల వేయించి నిన్ను వెళ్లకొట్టుతానని, అనడమేకాకుండా; ఒకలాటీ కర్ర తీసుకొని నారొమును రొమ్మునపొడిచి, నన్ను వంగదీసి నాపైబట్టతో కాలికి మెడకు అంటగట్టి శ్రమపెట్టుతూవుండెను.

అప్పుడు మజుకూరి కాపురస్థులైన యంద్రప్రగడ నాగయ్య జవ్వాజి లక్ష్మడు పొన్నంరాముడు చూచి, నన్ను వదలించినారు. అప్పట్లో యీ ముద్దాయి నాపయిబట్టకూడా తీసుకొని యివ్వలేదు. నన్ను యీలాగునకొట్టి నాపశువులను మేతకు నీళ్లకు పోనియ్యకుండా, అరికట్టి వుండడముచేతనున్ను తిరిగీ నన్ను కొట్టుతాడనే భీతాహముచేతనున్ను, ఖామందులయిన తమకు మనవి వ్రాసుకొనేదియేమంటే; న్యాయకర్తలయిన తమరు, నా అర్జీ సాకల్యముగా చిత్తగించి, నారొమ్ముదురురొమ్మునవుండే పోటుచూచి, ముద్దాయి కిన్ని, మహాసూళ్లుదారుకున్ను సమ్మను చేయించి పయినవ్రాసుకొన్న హాంసా యీ సాక్షులవల్ల విమర్శించి ముద్దాయికి ఘట్టి శిక్షచేయించడమేకాకుండా

వాడు నాపశువుల దరిమేసాకు రాకుండా చెయ్యావలెనని, తమకున్నాన్ని వేడుకొంటున్నాను.

ఆన ౧౮౭౩ సంవత్సరం ది ౨౭ జనవరి.

కట్టమూరు నరసిమ్హులవ్రాలు.

Hamsa'ya; a neighbour (H)

ఆన ౧౮౭౨ డో సంవత్సరం ది ౨౯ జనవరి తారీఖుకు సరి అయిన శుభకృతునామసంవత్సర పుష్య బ ౧౦ లు ఫిర్యాది అయిన కట్టమూరి నరసిమ్హులను ప్రమాణము చేయించి అడిగినప్రశ్న.

ప్ర. ఈ అర్జీ నీవు వ్రాసుకొన్న దేనా? యిందులో వున్న సంగతులు నిజమేనా? యీసంగతులు యెవరివల్ల నిరూపిస్తావు?

ఉ. ఈ అర్జీ నేను వ్రాసుకొన్న దేను యిందులసంగతులు వాస్తవ్యమేను. యీఅర్జీలో వ్రాసుకొన్నవన్నీ సాక్షులవల్ల నిరూపిస్తాను.

కట్టమూరు నరసిమ్హులవ్రాలు.

సమ్మన్.

ముద్దాయీలు.

౧. చింతలపాటి కోటయ్య } సాకీన్ యనమదల
౨. కానంశెట్టి వెంకు

ఇందువల్ల మీకు ఆజ్ఞాపించేది యేమంటే; ఫిర్యాది అయిన కట్టమూరు నరసింహులు, తన్ను మీరు కొట్టి అక్రమము జరిగించినారని చేసిన ఫిర్యాదును గురించి మేము విచారిస్తున్నాము గనక; మీరు యీనెల ౨౬ రో తారీఖు పగలు ౧౦ ఘంటలకు మా కచ్చేరికి హాజరు కావలసినది.

గుంటూరుజిల్లా అ॥ హె॥ అ॥ మేజస్ట్రీటు కచ్చేరి.

౧౮౭౩ సంవత్సరం ది ౨౯ జనవరి. వెలిచెర్ల.

బెల్లంకొండ వెంకటరంగాచార్యులు, మేజస్ట్రీటు జవాబునవీసు.

కట్టమూరు నరసిమ్హులు చేసినఫిర్యాదును గురించి, హాజూరు జవాను మహమ్మదల్లి మాకు సమ్మను తెచ్చినందున, జనవరి నెల ౨౬ రో తారీఖు వుదయాన ౬ ఘంటలకు చూచినాము.

ముద్దాయీలు; ౧. చింతలపాటి కోటయ్యవ్రాలు. ౨. శానంశెట్టి వెంకు నిశాని.

## సమ్మన్

### సాక్షులు.

౧ యండ్రాప్రగడ నాగయ్య; ౨ జవ్వాజి లక్ష్మడు; ౩ పొన్నం రాముడు; ౪ మాచెర్ల పాపడు; యీ అంకమ్మ. సా॥ యనమదల.

ఇందువల్ల మీకు ఆజ్ఞాపించేది యేమంటే; ఫిర్యాది అయిన కట్టమూరి నరసిమ్హులు, ముద్దాయీలయిన, చింతలపాటి కోటయ్య, శానంశెట్టి వెంకు, వీండ్లమీద చేసిన ఫిర్యాదునుగురించి, మిమ్మున సాక్ష్యము ఇవ్వగలందులకు కోరినాడుగనుక, యీనెల ౨౬ రో తారీఖు పగలు ౧౦ గంటలకు మీరు మాకచేరికి హాజరు కావలసినది.

The date as usual. Signature.

ఆన ౧౮౪౩ డో సంవత్సరం ది ౨౬ జనవరి మహమ్మదల్లి అనే జవాను యీసమ్మను తీసుకొని వచ్చి మాకు కనపరచినందున మేము చూడడ మయినది.

యండ్రాప్రగడ నాగయ్యవ్రాలు; మాచర్ల అంకమ్మ నిశాని; జవ్వాజి లక్ష్మయ్య వ్రాలు.

## మహారాజశ్రీ గుంటూరుజిల్లా హెడ్డు అసిస్టాంటు మేజస్ట్రీటువారి సముఖానకు.

అన ౧౮౭౩ డో సంవత్సరం ది ౨౬ జనవరి తాజే యనమదల కరణాలు వ్రాయించి దాఖలుచేసిన కయఫియ్యతు.]

మజుకూరు కాపురస్థుడయిన కట్టమూరు నరసిమ్హాలు చింతలపాటి కోటయ్య వగయిరాలమీద చేసినఫిర్యాదును గురించి మహామ్మదల్లి అనే జవాను సాక్షులకు సమ్మను తీసుకొని వచ్చినంతట్లో; ౩ డో సాక్షిఅయిన పొన్నం రాముడు, ౪ గో సాక్షిఅయిన మాచర్ల పాపయ్య, యీయిద్దరున్ను గ్రామములో హాజరులేరు. గనక, యీవాస్తవము కయిఫియ్యతు వ్రాశి దాఖలు చేయడమయినది.

Signature.

### ౧ ముద్దాయి.

౧౮౭౩ డో సంవత్సరం ది ౨౭ జనవరికి సరిఅయిన శుభకృతునామ సంవత్సర పుష్య బ ౧౨ శుక్రవారం.

నాపేరు కోటయ్య; యింటిపేరు చింతలపాటివారు, etc. etc.

Question about language as usual.

ప్ర. ఫిర్యాది అయిన కట్టమూరి నరసిమ్హాలు, తన్ను నీవు కొట్టినావనిన్ని; తనపశువులకు బందె రావలెనని, పశువులను అరికట్టినావనిన్ని; నీమీద ఫిర్యాదు చేసినాడు. యిందుకు యేమి చెప్పుతావు?

ఉ. పశువులను అరికట్టించినమాట వాస్తవమే. రెండురోజులు పది ఘడియలప్రొద్దు యెక్కేమట్టుకు, పశువులు నాచేలో మేసినందుకు బందె రావలెనని అరికట్టించినాను. బందె వొప్పుకొన్నాడు. బందెనుగురించి యెంత మాత్రము నాకు, అతనికి తగువురాలేదు. జమీందారుగారి ఆవులు ఆవూరికి వచ్చి వున్నందున ఆయన యిలాకా యనమదల సముద్దారు కోటంరాజు

తిరుమలరావు మాగ్రామానికి వచ్చి అక్కడ వుండే అనేకమంది చొప్ప మోపు లను ఆసామీల మేతకుగాను నెత్తిమీదనుంచి పడదోస్తూవుండి, నరసిమ్హులు తాలూకు మోపువొకటిన్ని, మాచర్ల అంకమ్మ తాలూకు మోపు వొకటిన్ని, పడదోయించినాడుగాని నేను యెంతమాత్రము పడదోయించలేదు. నేనున్ను, గొల్లపూడి మాధవరావు, మిరియం కోటయ్య, గొల్లపూడి భగవానులు, మహా స్సాలుదారు గులాం మొహద్దీను, యింకా కొందరు వెట్టివాండ్లున్ను, అక్కడ వుండివుండగా ఫిర్యాది ఆజమీదారుగారి సాకర్లతో కొట్లాడుతూవుంటే, యిది యేమి అని నేను అడిగినందుకు, నన్ను ఫిర్యాది తిట్టినాడుగాని, నేను ఫిర్యాదిని యెంతమాత్రమున్ను కొట్టలేదు, అప్పుడు రెండో ముద్దాయి అక్కడ వున్నాడు. అతనున్ను కొట్టలేదు. బందె పుచ్చుకోకూడదనేసంగతి నాకు తెలి యదు గనక, బందెనిమిత్తం పశువులను అరికట్టినాను.

కోటయ్యవ్రాలు.

౨ డో ముద్దాయి.

The date, as usual.

నాపేరు వెంకు; ఇంటిపేరు శానం శెట్టివారు; etc. etc.

Question about language as usual.

ప్ర. ఫిర్యాది అయిన కట్టమూరి నరసిమ్హులతాలూకు పశువులను నీవు అరికట్టి అతణ్ని కొట్టినట్టుగా నీమీద చార్జి తేబడి ఉన్నది. యిందుకు యేమి వుత్తరం చెప్పుతావు?

ఉ. నేను ౧ టో ముద్దాయి తరఫు మహాస్సాలుదారుణ్ని అపుట చేత, అయన వుత్తరవుప్రకారం వొకరోజు ప్రొద్దుపొడిచినది మొదలుకొని రెఘామ ప్రొద్దు యెక్కేమట్టుకు ఫిర్యాదితాలూకు పశువులను అరికట్టిన మాట వాస్తవమేగాని, ఫిర్యాదిని నేను కొట్టలేదు.

వెంకునిశాని.

## ౧ టి సాక్షి.

The date, as usual.

నా పేరు నాగయ్య; యింటిపేరు యండ్రాప్రగడవారు; etc. etc.

(Usual particulars regarding Language etc.)

ప్ర. ఫిర్యాది అయిన కట్టమూరి నరసింహులు, చింతలపాటి కోటయ్య మొదలయినవారిమీద చేసిన ఫిర్యాదును గురించి నీకు యేమైనా తెలుసునా?

ఉ. ఫిర్యాదికి ౫-౬ పశువులు వుండి వున్నందున, వాటిలో ౨ పశువులు సుమారు ౭-౦ రోజులక్రిందట చొప్పా *చెంగన్న చేలో పడ్డవనిన్ని; అందుకు బందెరావలెనని ౧ టో ముద్దాయి ౨-౩ రోజులు పెట్టి వాణ్ని కూర్చుండపెట్టి వాటిని అరికట్టించినాడనిన్ని; అరికట్టిన మూడో రోజున పశువులకు ఫిర్యాది మేత తెచ్చుకొంటూవుండగా నేను అరికట్టిన పశువులకు నీవు మేత తెచ్చుకొంటావా అని, ౧ టో ముద్దాయి అతని మోపును పడదోసి అతణ్ని కొట్టినాడనిన్ని; చెప్పుకోగా విన్నానుగాని, కొట్టగా చూడలేదు. అయితే ఫిర్యాదిభార్య తనపెనిమిటిని కొట్టిరి కొట్టిరని బజారులోకివచ్చి మొత్తుకొన్నది గనక, నేను మాదుకాణం దగ్గిరనుంచి ఫిర్యాది యింటికి వచ్చేవరకు కలత అణిగిపోయినది. అప్పట్లో ఫిర్యాది యింటికాడ ఫిర్యాదిన్ని, ముద్దాయి యింటికాడ ముద్దాయిన్ని కూర్చుండి వుండిరి. వాండ్లు కొట్టుకొన్నారని మాచర్ల పాపయ, మాచర్ల అంకమ్మ, జవ్వాజి లక్ష్మయ, వనమాచిన కోటయ, నాతో చెప్పినారేగాని, ఆకలతసమయములో నేను అక్కడలేను.

ప్ర. ఫిర్యాదిని ముద్దాయి కొట్టినట్టుగా విన్నానని చెప్పితివిగదా? యేమితీసుకొని యెక్కడ కొట్టినట్టు విన్నావు? యీకలతజరిగిన స్థలం యెక్కడ?

---

* అని వున్నది.

ఉ. ఈకలత జరిగినది ముద్దాయి వాకిట అనిన్ని, చొప్పమోపు పడ దోసినప్పుడు ఫిర్యాదిని ముద్దాయి జుట్టుపట్టి వంగదీసి రెండు గుద్దులు గుద్ది తర్వాత ఫిర్యాదిని యింటినుంచి పిలిపించి, మూరెడు పొడుగుకర్ర తీసుకొని రొమ్మున పొడిచినాడనిన్ని చెప్పగా విన్నాను.

ప్ర. కలతజరిగినది యేవేళప్పుడు?

ఉ. రాత్రి రెండు ఘుడియలప్రొద్దు పోయినపిమ్మట.

ప్ర. ఫిర్యాదిని ముద్దాయి కర్ర తీసుకొని పొడిచినప్పుడు కిందపడితే నీవు వాణ్ని లేవదీయలేదా?

ఉ. నేను లేవదీయలేదు.

ప్ర. ఈకలతజరిగినప్పుడు మహాస్సూలుదారు వెంకయ్యను చూచినావా?

ఉ. నేను పొయ్యేటప్పటికి ముద్దాయి వాకిటిముందర అతడు నిలుచుండివుండినాడు.

ప్ర. చొప్పా వెంగన్న చేలో పిర్యాది తాలూకు పశువులుబడితే అందుకు ముద్దాయి బందె రావలెనని తగాదా చేయడమునకు యేమి హేతువు?

ఉ. ముద్దాయి అగ్రహారపుపొలంలో చొప్పా వెంగన్న చేసేది. గనక, అబీటిచేలో అవిమేసినవని ౧ టో ముద్దాయి అగ్రహారకుడయినందున, బందెనిమిత్తం తగాదాచేసినాడు.

నాగయ్యవ్రాలు.

౨ డో సాక్షి.

The date, as usual.

నా పేరు లక్ష్మడు; యింటిపేరు జవ్వాజివారు; etc. etc.

(Usual Particulars regarding language etc. etc.

ప్ర:—కట్టమూరి నరసిమ్హాలు తనమీద ముద్దాయీలయిన చింతల

పాటి కోటయ్యా వగైరాలుం దొమ్మి జరిగించినారని ఫిర్యాదుచేసుకొన్నసంగ
తిలో, నీవేమి యెరుగుదువు?

ఉ:—ఫిర్యాదితాలూకు రెండుపశువులు, అనగా వొకఆవున్ను, ఆవు
పెయ్యానున్ను ౧ టో ముద్దాయి తన అగ్రహారపు పొలములో మేసినవని,
౨ రోజుల క్రిందట ఆపశువులకు పుల్లరి రావలెనని, అరికట్టి మూడురోజుల
దనుక మహాస్సూలుదారిణ్నిన్ని పెట్టివాణ్నిన్నికూడా అతనివాటికి*ముందర
కూర్చుండపెట్టి నిర్బంధపెట్టుతూ ఉండెను. నేను పొలములోకిపోయి, రాత్రి
౭ ఘంటలకు ఇంటికి వచ్చేవరకు, ఫిర్యాదియింట్లో ఫిర్యాదిపెండ్లాము యేడు
స్తూ వుండినది. ఫిర్యాది యిల్లున్ను, మాయిల్లున్ను, యెదురుగడ అయినందున
యెందుకు యేడుస్తావని నేను అడగగా ౧ టో ముద్దాయి యింటికి వెళ్లినంత
ల్లో వాడు ఫిర్యాదిని అతనిబట్టతీసుకొని కాలికి మెడకు అంటకట్టినాడు.
నేను వాన్ని విడతీసేటప్పటికి ఫిర్యాది యెదురుగొమ్మున ౧ టో ముద్దాయి
తాను యెప్పుడున్ను చేతపట్టుకొనివుండే మూరెడుపొడుగుగల వొకలాటీ
కర్రతో పొడిచినాడు. పొడవగానే, ఫిర్యాది వెల్లవెలికల పడ్డందున, యంద్ర
పాటి నాగయ్యా, వనమూచినకోటయ్యా, ఫిర్యాదికి వదినె కొమారుడయిన పెను
బండ వీరయ్యా వగయిరాలు వాణ్ని లేవదీసినారు, అంతట ముద్దాయి మాకు
బందె యివ్వక మళ్లపడుతారా? మీకొంపలు తగలవేస్తామని, అంటూవుండగా
మేము యింటికి చక్కా వచ్చినాము. అప్పట్లో ఫిర్యాదిపంచె యవరు తీసు
కొన్నదిన్ని కనుపడలేదు. యిది నేను యెరిగినసంగతి.

ప్ర:—ఫిర్యాదివాకిట అరికట్టినమహాస్సూలుదారుని పేర*న్ను పెట్టి
వాడిపేరున్ను చెప్పవలసినది.

ఉ:—మహాస్సూలుదారుపేరు వెంకయ్యా అనిమాత్రం తెలుసునుగాని
ఇంటిపేరు యెరగను. పెట్టివాడిపేరు నేను చెప్పజాలను. చూపిస్తే గుర్తుపట్టు

* అనిఉన్నది.

తాను. వెంకయ్యా అనే అతను యిప్పుడు మేజస్ట్రీటువారియెదుట ఉండే అతనేను. యితనితోకూడా కూర్చున్న వెట్టివాడు సత్తిగాడు అని జ్ఞాపకం.

ప్ర:—ఫిర్యాదిని ముద్దాయీ కర్రతో కొడిచినాడని చెప్పితివిగదా; ఆకర్ర యెటువంటిది?

ఉ:—అది నల్లటికర్ర, అది యేమికర్రో నాకు తెలియదు.

ప్ర:—ఫిర్యాదిని ముద్దాయి కర్రతో కొడిచినప్పుడు మోహతాదు వెంకయ్య యెక్కడ వుండినాడు.

ఉ:—దగ్గిరనే వుండినాడు.

ప్ర:—ఫిర్యాదిని కొడిచినది యేవేళప్పుడు.

ఉ:—రాత్రి ౫-౬ ఘడియల ప్రొద్దుపోయినప్పుడు.

ముద్దాయి అడిగిన సవాలు.

ప్ర:—నేను ఫిర్యాది తాలూకు గొడ్లను అరికట్టిస్తే ఫిర్యాది దొంగతనముగా తోలుకొని పోయినది నీకు తెలుసునా?

ఉ:—నాకు తెలియదు.

జవ్వాజి లక్ష్మయవ్రాలు.

3 డో సాక్షి.

The date, as usual etc, etc.

నాపేరు అంకమ్మ; ఇంటిపేరు మాచర్ల వారు; etc. etc.

(Usual particulars regarding language etc. etc.)

ప్ర:—ఫిర్యాదిఅయిన నరసిమ్హులు ముద్దాయీలయిన చింతలపాటి కోటయ్యావగయిరాలమీద చేసినఫిర్యాదునుగురించి నీవు యేమి యెరుగుదువు?

ఉ:—నరసిమ్హులకు ముద్దాయి బాకీ అనిన్ని, ఆబాకీ అడగబోతే అతణ్ని బండెయిమ్మని సకలతంటాలుపెట్టినాడనిన్నిమాత్రము విన్నానుగాని మరియేమిన్ని యెరుగను?

ప్ర:—ఫిర్యాదిని ముద్దాయి కొట్టగా నీవు చూచినావా?
ఉ:—నేను చూడలేదు.

## ఫిర్యాది అడిగిన సవాలు.

ప్ర:—నీవున్ను, నేనున్ను పొలములోనుంచి చొప్ప మోపులు యెత్తుకొనివస్తూ వుండగా రెండో ముద్దాయి నామోపుపడదోసి, జుట్టుపట్టుకొని వంగుండబెట్టి నన్ను గుద్దగా నీవు చూడలేదా?

ఉ:—మోపులుమాత్రము కిందపడదోసి ముద్దాయి ఫిర్యాదిని నెట్టినాడుగాని గుద్దులు గుద్దడము నేను చూడలేదు.

అంకమ్మ నిశాని.

## గుంటూరుజిల్లా అసిస్టాంటు మేజస్ట్రీటువారు చేసినతీర్పు.

| ఫిర్యాది. | ముద్దాయీలు. |
|---|---|
| కట్టమూరి నరసిమ్హులు. | ౧ చింతలపాటి కోటయ్య |
| సాకీన్. యనమదల. | ౨ శానంశెట్టి వెంకు. |
| | సా॥ యనమదల. |

ఫిర్యాది దాఖలుచేసినచార్జిలో తనపశువులు అగ్రహారపుపొలములో మేసినవనే నెపం బెట్టి, బందెరావలెనని, మూడురోజులు ౧ టో ముద్దాయి ౨ డో ముద్దాయిచేతనున్ను యింకాకొందరు వెట్టివాండ్లచేతనున్ను, పశువులను అరికట్టించి తన్ను కర్రతీసుకొనికొట్టినాడని వ్రాసుకొన్నాడు.

ఇందునగురించి ముద్దాయీలనున్ను, సాక్షులనున్ను విమర్శించినంతల్లో ఫిర్యాదిని ౧ టో ముద్దాయి కొట్టి వానిపశువులను అరికట్టించినది తాను చూచినానని ౨ డో సాక్షిన్ని; ఫిర్యాది పశువులను అరికట్టించినసంగతి వాస్తవ్యమేగాని, వాణ్ని కొట్టగా తాను చూడలేదని ౧-3 సాక్షులున్ను, వాజ్మూలములు వ్రాయించినారు.

ఇందువల్ల చూడగా, ఫిర్యాదితాలూకు పశువులను ముద్దాయీలు అరికట్టడము సర్క్యూలరు హుకుముకున్ను, రిగ్యులేషన్‌లకున్ను, విరోధముగా వున్నదిగనుకనున్ను; సాక్షుల వాఙ్మూలములవల్లనేమి, మేము ఇప్పుడు చూచిసంతల్లోనేమి, ఫిర్యాదిని ముద్దాయి కొట్టినట్టుగానే కనపడుతున్నదిగనకనున్ను; ౧౮౧౬ సంవత్సరము ౯ డో రెగ్యులేషన్ ౩౨ డో సెక్షన్ ప్రకారము ౧ టో ముద్దాయికి రూ॥ ౪ లు జులుమానావిధించి, యివ్వనిపక్షమునకు ౧౦ రోజులు జిల్లాజయిలులో కయిదున వుండగలందులకున్ను; ౨ డో ముద్దాయికి రూ॥ ౧ జులుమానావిధించి, యివ్వనిపక్షముకు ౭ రోజులు కయిదున వుండగలందులకున్ను, తీర్పుచేయడమైనది.

గుంటూరుజిల్లా ఆ॥ హె॥ అ॥ మేజస్ట్రీటుకచ్చేరి.

ఆన ౧౮౪౩ డో సంవత్సరం॥ ది ౨౭ జనవరి.

End of third case.

---

# వార్తాపత్రికలు.

Masulipatam] April 1872. No. 4. P. 17-19.

## పురుషార్థప్రదాయిని

### మతవిషయము.

ఈఅగ్ని ఉపాసనఅనేది ఈజగత్తులో సర్వభక్షకుడు కాబట్టి ఈయనను సమిష్టిస్వరూపుడయిన ఈశ్వరునకు ముఖముగా యెంచి ప్రార్థించడమును కారణమయినది. ఇట్టి ఈశ్వరుని సర్వజ్ఞునిగానున్ను సర్వేశ్వరునిగానున్ను సర్వగతునిగానున్ను సర్వాత్మునిగానున్ను సర్వరూపునిగానున్ను యెంచి కర్మలుంచేయఁబడుతవి. ఈకర్మలు శక్తివంచనలేని విమర్శతోనున్ను భక్తితోనున్ను సిద్ధాంతవిరోధరాహిత్యముతోనున్ను సాకర్యహేతువైన పరధర్మ-పరిత్యాగము కలిగి యథాశక్తిని యమవిశిష్టములైన స్వకర్మానుష్ఠాన నిష్ఠకలిగి కర్మలు చేయఁబడుతవి. ఇట్టికర్మలు ఐహికాముష్మికోపయోగములైయున్నవి. అటుతరువాత నింద్రియభోగములు చాలామట్టుకు తీరినతరువాత వానప్రస్థాశ్రమమును స్వీకరించి చిత్తశుద్ధ్యర్థమైన అష్టాంగయోగాదులు వనములయందుండి అభ్యసించఁబడుతవి. అటుతరువాత సంపూర్ణవైరాగ్యము కలగడముతోనే సన్యాసాశ్రమమును స్వీకరించి సర్వసంగపరిత్యాగియయి, స్వరూపానందమును పొందుటయే మోక్షమని ఉత్తమావస్థ అని అనిపించుకొనుచున్నది. ఇట్లు కాక మోక్షమేలేదని విషయానందమే ప్రాధాన్యమని వర్ణాశ్రమభేదములు అగత్యములేవని కర్మ అనగత్యమని ఈశ్వరుడు అవాఙ్మానసగోచరుడు అయినప్పటికి కేవల వాగ్వ్యాపలచేతనే స్వర్గాదిభోగములను యిచ్చునని

యీ ప్రవృత్తికి కారణములైన జడములయిన భూతములను విగ్రహములను పూజించుట హానికరములని యెంచుట కేవలము అజ్ఞానమూలమైనట్టు యిది వరకు వ్రాసిన హంశములవల్లనేగాక యికనున్ను ముందు వ్రాయుచున్నాము. మోక్షము లేదనుటకు సుఖదుఃఖాత్మకమయిన సర్వావస్థలకు అతీతమయిన సుఖదుఃఖరాహిత్యమైనటువంటిన్ని సర్వావస్థలకు ప్రాధాన్యమైనటువంటి తూష్ణీసమాధిసుషుప్త్యవస్థలు ఉంటూ ఉండగా మోక్షావస్థలేనట్టు యెంచ వల్లగాదు. ఇంద్రియములకే సుషుప్తిమరణాదులయందు బాధకలుగుచుండగా తద్విషయమైన యానందములు నిత్యములనుటకు అవకాశము కలుగదు.

అట్టి అనిత్యమైన అనందము స్వల్పభేదముచేత అనేకవస్థలు పొందిన సర్వత్రులకు కొద్దిహెచ్చుతగ్గులతో సమానమయ్యే ఉన్నది.

అంతేకాక విషయానందము విశేషకష్టసాధ్యమయియున్నది. వర్ణాచారములు లేనందువల్ల వృత్తిసాంకర్యము గలిగి కొన్నివృత్తులకు నాశన మున్ను అప్పటప్పటికి స్వవృత్తి పరిత్యాగముకలిగి నూతన వృత్త్యర్థమై విశేష శ్రమను పొందుతూ స్వవృత్తియందు తనకు ఉండే పరిశ్రమ నశించడము నకున్ను కారణమగుచున్నది. వర్ణనియమము కలిగినయెడల అన్నివృత్తులు నానాటికి అభివృద్ధిని పొందుతూ సుఖజీవనోపాయములు అన్యోన్యసహాయమై విశేషశ్రేయస్సును పొందుచున్నవి.

బ్రహ్మచర్యాశ్రమము అగత్యమయినట్టు యితర దృష్టాంతరములవల్లనే గ్రహించవచ్చును. అట్టి అవస్థ యిప్పట్లో లేనందువల్ల మనపూర్వులు విశేష ప్రయాసతో సంపాదించిన తర్క-వ్యాకరణపూర్వోత్తర మీమాంస జ్యోతిష గణిత సంగీత సాహిత్య వైద్యము మొదలయిన శాస్త్రములున్ను భూలోకములోనుండే అన్నిభాషలలో శ్రేష్ఠములయినవని యితరదేశీయ్యులచేత ఒప్పుకొనఁబడి జర్మనుదేశీయ్యులు మొదలయినవారిచేతకూడా పరిశ్రమచేయఁబడు చున్న సంస్కృతభాషకుల అశ్రద్ధవల్ల మనదేశములో నశించి పోవడమున కున్ను కారణమగుచున్నది. ఇప్పుడు అట్టి శాస్త్రపరిశ్రమ లేనందువల్ల ఇహ

పరస్వాతంత్ర్యము లాభమును పోఁగొట్టుకొని పరతంత్ర్యమయిన వస్తువ నాశించి అట్టివిద్య నభ్యశించనందువల్ల ముందు ఎంతహానికరమో విచారించగా కనుపించఁగలదు. గృహస్థాశ్రమమునందు వర్ణాశ్రమధర్మములు లేక ఈశ్వర విషయమైన చింత విశేషముగ లేక ఐహికమే ముఖ్యధర్మముగ నేర్పరచు కొన్నవారికి సద్గుణములువదలి కేవలదుర్గుణములవల్లనే ధనార్జనగలిగి అందు వల్ల ఇహపరములందు నశించడమునకు కారణమగుచున్నది. విషయపరిత్యాగము లేకపోవుటవల్ల స్వరూపానందము సిద్ధించదుగదా! లోకమునందు ప్రతి జీవికిన్ని స్వభావసిద్ధమైన కర్మగలిగియుండగా నియమనరూపమైనకర్మ లేనందువల్ల కర్మ నియమన కలగక పోవడమే కాకుండా యథేష్టముగా నిషిద్ధకర్మాచరణమునకున్ను కారణమయి సమిష్ట్యుపాసన లేనందువల్ల ఈశ్వర ప్రసన్నత్వమును కలుగ చేసుకోవడమునకు విశేష దుష్కరమయి యుంటున్నది.

అవాఙ్మానస గోచరుడైన యీశ్వరుడు ఎట్లుగా మనప్రార్థనలు వినును! ఎట్లుగా మనకు ఫలమును యిచ్చును! కాబట్టి యిది అయుక్తమయి యున్నది.

కింది అధికారులవలన కావలసినపనులు పయిఅధికారులవలన కానేరవుగదా. మూఢులవిషయములో లీలార్థమయిన ప్రయోజనములు లేనందువలన వారికి ఈశ్వరవిషయమయిన జ్ఞానశ్రద్ధలు కలుగవు. మూఢులకు లీలా ప్రయోజన మూలముగానే ఆయీశ్వర సేవగలిగి క్రమముగా అభివృద్ధి పొందడమునకు కారణమగుచున్నది.

కృ॥ కా॥ దీ॥ C. C. D.

పురుషార్థప్రదాయిని. నవంబరు 1875. పేజి 171-172.

పత్రికావాదములో నిఅంశము.

మరియు భోగమోక్షరూప పురుషార్థసాధన భూతసకల ధర్మానుష్ఠానములకు వేదమే ముఖ్యకారణంబని చెప్పఁబడుచున్న తద్వేదంబు యదూపపం

బైయుండెనని యోచించఁగ శబ్దరూపంబుగనుండునటులఁ గానవచ్చుచున్నది. తచ్ఛబ్దంబు పదసమూహాత్మక వాక్యరూపంబై వర్ణపుంజంబుల కధీనంబై పెక్కుతెరంగులనుండి నానార్థబోధజనకంబైయున్నది. ఇట్టినానాశబ్దములకు వేదమను వ్యవహారమా లేక అందున్న కొన్నిటికి మాత్రమేనా అనుసంశయము తోఁచింపచేయుచున్నది. ఒకవేళ సర్వశబ్దములకు వేదమను వ్యవహారము చెప్పునట్లయితే ఒకదానికొకటి సమన్వయించక అత్యంతమైన పృథక్కులుగ నుంచుచున్నందుకు గైర్వాణ పశాణయావన్యాదివేదంబులే సాక్ష్యంబులై యుంచుచున్నవి. కాఁబట్టి మొదటిపక్షమువల్లకాదు. యింకను కొన్నిటిని మాత్రమే వేదమను వ్యవహారము చెప్పవలసివచ్చును. అట్లయితే అవెటువంటివి, అందుకేమి ప్రామాణ్యంబని యడిగఁగా యజ్ఞాదిక్రతువులను బోధించెడివియె యైయున్నవనియు యిందుకుఫలము పునర్జన్మమునందు కలగడమే ప్రామాణ్యమని చెప్పుచుందురు. అందుకుత్తరువేమనఁగా ప్రత్యక్ష రూపమయిన ఘటము ప్రత్యక్షంబుగానే నశించిపోవుచుండగ మరియొకజన్మము సిద్ధించడ మెట్లు కలుగును. అట్టిజన్మాభావమునందు కర్మఫలంబులు నెట్లుకలుగును? కాఁబట్టి అట్టిజన్మము సిద్ధించడముమిథ్యయే, కర్మఫలంబులు పొందడముమిథ్యయె అగుచున్నప్పుడు అటువంటిఫలంబులను బోధించెడివికూడను మిథ్యయె కావలసివచ్చును. కాఁబట్టి యెన్నటికి యుక్తివిహీనమయినపలుకులు ఉన్మత్తప్రలాపములతో సమానమైనట్టు నిరాఘాటమేగనుక అట్టిపలుకులను అంగీకరించగిట్టదు. కాఁబట్టి మేముచెప్పుచున్న యుక్తియుక్తములనంగీకరించి లోకమునందనుభవసిద్ధంబైయున్న యుక్తి, భక్తి, భుక్తి, ముక్తులను నీచతుర్వర్గమును యైహికమునందే మామతమునందు కనుపరచతగి యుండును. ఎట్లంటే సర్వదా లోకానుభవానుగుణ్యమైనదేయుక్తి. యట్టియుక్తియందుఁగల ఆసక్తియే భక్తి. తద్భక్తివల్లనేభుక్తి యనఁగ షడ్రసోపేతమైన యాహారాద్యనుభవమేయనుట యీయనుభవ వ్యతిరేకమైన దుఃఖరాహిత్యమేముక్తి, యిట్టిచతుర్వర్గమును

పొందఁజేయతగినదియే యాప్తవాక్యంబు. ఇట్టివాక్యములను బోధించునదియే మామతవేదంబు గనుక సర్వజనులును అంగీకరింపఁదగినది.

లోకమిత్రుఁడు దేహాత్మవాది.

ఇది బహుశః ఆత్మలేని వాదమే.—Ed. P.

## హిందూజనసంస్కారిణి

1889 జనవరి తే 1 ది పుట ౬౫.

మ-రా-రా-శ్రీ. బ్రహ్మశ్రీ వైదికమహాసభ వారిలో

౧-సభాధ్యక్షులు.

౨ వాదులు. 3 ప్రతివాదులు.

(౧) వాదివాదించే వాదమేమనగా:—ప్రస్తుతము ఈదేశమందు బ్రహ్మక్షత్రియ వైశ్యవర్ణములలోచేరిన స్త్రీపురుషులు గురుకులవాసంవదలు కొనివచ్చి పురుషునివల్ల స్నాతకవ్రతారంభ కాలమందుంచబడిన గృహ్యాగ్ని యందు తమజీవిత కాలమువరకు సాయంప్రాతః కాలములయందు అవుపాసనా హోమము మొదలైనవి జరిగిస్తాముఅని వివాహకాలమందుభయులు ప్రతిజ్ఞ లుచేసి, ఆచర్యలు జరిగిస్తూవుండి, భార్యచనిపోవడముతోటే, ఆప్రతిజ్ఞకుభంగ ముగా కొంతమంది అగ్నిత్యాగంచేయుచున్నారు. ఇదిధర్మశాస్త్రవిరుద్ధము. సమయవిరుద్ధము. శిష్టాచారవిరుద్ధము. వీరుకర్మభ్రష్టులు. వీరుచేసిన నిత్యనైమి త్తిక కామ్యకర్మలవలన ప్రయోజనములేదు. గనుక యీయంశములు విమ ర్శించి వీరుక్రమప్రకారము ఆచర్యలుజరిగించేలాగున యుత్తరువు దయచేయ వలయునని వాదించుచున్నాడు.

(౨) ప్రతివాదులుచేసెడి యెదురువాదమేమనఁగా:—పయిన వివరిం చిన స్త్రీపురుషులు వివాహకాలమందు గృహ్యాగ్నిప్రతిష్ఠాపనజరిగించినారే గాని స్నాతకవ్రతారంభకాలమునందుకాదు. ఆయగ్నియందు తమజీవిత కాలమువరకు అవుపాసనహోమము మొదలైనవి జరిగించెదమని యుభయులు ప్రతిజ్ఞలుచేసినది నిజమేను. ఆప్రతిజ్ఞకు భర్తతోటిభార్యకు వివాహబంధ

నివృత్తికలిగినతోడనే భంగము కలిగిపోయినది. అందువల్లప్రత్యవాయం లేదు. పునర్వివాహాము చేసికొన్నయెడల పునఃఅగ్నిసిద్ధి కలుగుచున్నయది. అగ్నిత్యాగము చేయవచ్చును. సన్యసించెడియెడల నగ్నినుంచుకోవచ్చును. ఇందుకులోక విరుద్ధము లేదు. ధర్మశాస్త్రసమయాచార విరుద్ధము లేదు. వీరుశిష్టులేను. వీరికి కర్మాధికారమునుకలదు. వీరు చేసిన నిత్యనైమిత్తిక కామ్యకర్మలవల్ల ప్రయోజనమునుకలదు. అని యెదురువాదము చేయుచున్నారు.

(3) సభాధ్యక్షులు నిర్ణయించినసాకాంశము లేవనగా:—

(౧) వైదికసభవారి కీయంశములువిమర్శించి తీర్మానించడమునకు అధికారముకద్దా?

(౨) వాదికివాదించెడి యధికారముకలదా?

(3) ప్రతివాదులు ఇందుకు త్తరవాదులు కావలసినవారేనా?

(౪) స్నాతకవ్రతమనేది ఆచార్యాధీనమయినదా? లేక, స్వాధీనమయినదా?

(౫) గృహ్యాగ్నిప్రతిష్ఠాపనాసంకల్పము ఎందుకు కలిగినది? ఎప్పుడు కలిగినది? ఎవరు చేసినారు? అందుకు వికల్పమేమైననున్నదా?

(౬) ఔపాసనాసంకల్పము ఎందుకుకలిగినది? ఎప్పుడుకలిగినది? ఎవరు చేసినారు? అందుకు వికల్పమేమైననున్నదా?

(౭) వివాహసిద్ధి కన్యాప్రతిగ్రహామువల్లనా? లేక, పాణిగ్రహణమువల్లనా?

(౮) అగ్నిత్యాగము చేసినవానికి యాజనాధ్యాపన ప్రతిగ్రహాధికారముకద్దా?

(౯) ఇందుకు ధర్మశాస్త్రవిరోధము ఏమయిననున్నదా?

(౧౦) సమయవిరోధమేమైననున్నదా?

(౧౧) శిష్టాచారవిరోధమేమైననున్నదా?

అనివివాదాంశములు యేర్పఱుపఁబడినయవి.

(౪) వాదివల్లకనుపయుపఁబడ్డ దృష్టాంతములనేకములు.

మఱియు దాఖలుచేయబడిన సాధనములు.

(౧) యస్యవ్రత్యేహన్ పత్న్యనాలంభుకాభావాతి ॥ తామపరుధ్య యజేత । సర్వేణైవాస్యాజ్ఞేనయజతే॥ అనెడి అచ్ఛిద్రపాఠమునందలి యజుర్వేదశ్రుతివలన, పత్నికాలను చేసినప్పటికిని అగ్నిహోత్రాదికర్మలు వదలకూడదని రుద్రదత్తయనెడి ఆపస్తంబసూత్రభాష్యములో వ్రాసియున్నది.

(౨) అహంత్వదస్మిమదసిత్వమేతత్ మమాసియోనిః తవయోనిరస్మి । మమైవసన్ వహహావ్యాన్యగ్నేపుత్రః పిత్రేలోకకృజ్జాతవేదః॥ అనెడి యజుర్వేదశ్రుతివలన, యజమానునికి అగ్నికిని కార్యకారణభావము చెప్పియున్నది. కాబట్టి యజమానుడు చచ్చేవరకు అగ్నిని వదలఁగూడదు.

(3) యజమానోవాఅగ్నేర్యోనిః స్వాయామేవైనం యోన్యాగ్ంసమారోహయతే॥ అనెడియజుర్వేదశ్రుతివలన, కారణభూతుడైనటువంటి యజమానునియందు, కార్యభూతమైన ఔపాసనాగ్నిని ఆరోపణచేసికోవలసినట్టుండియున్నది.

(౪) సంపత్నీపత్యాసుకృతేనగచ్ఛతామ్ । యజ్ఞస్యయుక్తౌధుర్యావభూతామ్ । సంజానానావిజహతామరాతీ । ద్దివిజ్యోతిరజరమారభేతామ్ ॥ అనెడి యజుర్వేదశ్రుతివలన పత్నికిగృహ్యాగ్ని లేకపోయినప్పటికిని యజమానుని యొక్క పాణిగ్రహణ సుకృతమువలన పత్నికిని అవుపాసనాగ్నిసిద్ధికలిగినది.

(౫) మృతాయామపిభార్యాయాం । వైదికాగ్నింనహిత్యజేత్ ।ఉపాధినాపితత్కుర్మ్య । యావజ్జీవంసమాచరేత్ ॥ అనేస్మృతిచంద్రికయందలి విష్ణువచనమునుబట్టి, పత్నిగతించినప్పటికిని అగ్నిహోత్రాదికర్మ యజమానుడు చేసికోవలసినట్టు, విధించియున్నది.

(౬) త్యక్తాగ్నేఃపార్వణంనైవ । నైకోద్దిష్టంసపిండనమ్ । అత్యక్తాగ్నేస్తు పిండోక్తిః । తస్మాత్సంకల్ప్యభోజయేత్ । అనెడి పరాశరస్మృతివచనమును

బట్టి అగ్నిత్యాగముచేసిన స్త్రీకిగాని పురుషునికిగాని పిండప్రదానముతో శ్రాద్ధముచేసెడి యధికారములేదు. సంకల్పశ్రాద్ధముమట్టుకు చేయవచ్చును.

(౭) విధవావిధురాభ్యాంచ । తథైవబ్రహ్మచారిభిః । నస్వీకార్యోన దాతవ్య । ఇత్యేవంమనురబ్రవీత్ । అనేమనువచనమునుబట్టి బ్రహ్మచారికెట్లు స్నాతకముచేసికొనకమునుపు కన్యాస్వీకారమున కధికారములేదో అట్లేఅగ్నిత్యాగముచేసినవిధవకును విధురునికిని స్వీకారాధికారములేదు.

(౫) ప్రతివాదులవల్లకనుపఱుపఁబడ్డ దృష్టాంతము లనేకములు. మఱియుం దాఖలుచేయఁబడినసాధనములు:—

(౧) అర్ధోవాఏషఆత్మనఃయత్పత్నీ॥ అనేయజుర్వేదశ్రుతివలన, భార్య భర్తలో సగభాగముగనుండికర్మనెరవేఱుచుచున్నది. కాఁబట్టి భార్యపోయిన తోడనే అవుపాసనాదికృత్యములు వదలుకొనవచ్చును.

(౨) గృహిణీగృహముచ్యతే ॥ అనెడిసాధువచనమునుబట్టి, గృహిణి గతించినతోడనే గృహసంబంధము వదలిపోవుచున్నయది.

(3) విధవావిధురంచైవ । దహేదుత్తపనాగ్నినా।అనెడి ధర్మశాస్త్ర వచనమునుబట్టి విధవవిధురులకు ఉత్తపనాగ్నివలన (దర్భనుకాల్చియగ్నిచేసి దానిచేతదహనాది) సంస్కారములు జరిగింపవలసినదేకాని అవుపాసనాగ్ని వలన దహనాది సంస్కారములుకలుగదు.

(౪) అథయదితేకర్మవిచికిత్సావా । వృత్తవిచికిత్సావా । స్యాత్ । యేతత్రబ్రాహ్మణాఃసమ్మర్శినః । యుక్తాఆయుక్తాఃఅలూక్షాధర్మకామాస్యుః । యథాతేతత్రవర్తేరన్ । తథాతత్రవర్తేథాః ।అథాభ్యాఖ్యాతేషు । యేతత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః । యుక్తాఆయుక్తాఃఅలూక్షాధర్మకామాస్యుః । యథా తేతేషువర్తేరన్ । తథాతేషువర్తేథాః ॥ అనెడి తైత్తిరీయోపనిషద్వాక్యమును బట్టి, పూర్వులు విమర్శించియేర్పఱచియున్న యాచారమే శిష్టాచారమని చెప్పబడియున్నది.

(౫) శ్రుతిశ్చభిన్నాః స్మృతయశ్చభిన్నాః । మహాఋషీణామ్ మత యశ్చభిన్నాః । ధర్మస్యతత్వం నిహితం గుహాయామ్ । మహాజనోయేన గత స్సపంథాః ॥ అనెడి లోకోక్తినిబట్టి శ్రుతులు నానావిధములు. స్మృతులు నానావిధములు. మహాఋషులయభిప్రాయములు నానావిధములు. ధర్మము యొక్కనిశ్చయ మెక్కడనో యున్నయది. పదిమందిపోయిన దారియేదో అదే మంచిదారి.

(౬) యథేష్టాచరణాంధర్మం॥ అనెడి భవిష్యోత్తరపురాణవచనమును బట్టి వారివారియిష్టప్రకారము జరుపుకొనవలసినదేగాని ఒకరి నిర్బంధమునకుగాని నిబంధనగ్రంథములకుగాని లోబడవలసినదిలేదు.

## ౬. తీర్మానము.

(౧) ఈ విషయములో ఉభయవాదులతరఫుసాక్షులను సాధనములను విమర్శించి యుభయులు జరిగించిన ప్రసంగములనువిని యోచింపగా వాది పక్షమున రాబడ్డసాక్షిసాధనములు సుప్రసిద్ధములయినవిగానున్ను అబాధితములయినవిగానున్ను సార్థకములయినవిగానున్ను ప్రయోజనకరమయినవిగానున్ను సాధ్యములయినవిగానున్ను అనుకూలమయినవిగానున్ను ఉండి యున్నవి.

(౨) ప్రతివాదులపక్షములో రాబడిన సాక్షిసాధనములు సందిగ్ధములయినవిగానున్ను ప్రకరణమునకు వేఱుగానున్ను తక్కువుగానున్ను అవ్యాపకములయినవిగానున్ను అసంగతము లయినవిగానున్ను ఉండియున్నవి.

(3) కాబట్టి సభాధ్యక్షులు చేసెడి తీర్మానమేమనగా, వారివాదమును స్థిరపఱచి ప్రతివాదుల యెదురువాదమును నిరాధారమయినదిగా దోసివేసి వాది వాదించెడిప్రకారము ప్రతివాదులు మొదలైనవారు విపత్నీకులైనప్పటికిని అవుపాసనము మొదలైన నిత్యకర్మములు జరుపుకొనుచుండవలసినదిగా

నున్ను లేనియెడల ధర్మశాస్త్రోక్తప్రాయశ్చిత్తమునకు బద్ధులయి యుండవలసి నదిగానున్ను సిద్ధాంతము చేయఁబడ్డమైనది.

సర్వధారినామ సం॥ ఆషాఢ బ ౮ లు శుక్రవారము.

## వివాహములనుగురించిన దుర్వ్యయము

మహారాజశ్రీ వృత్తాంతి యెడిటరుగారి సముఖానకు.

అయ్యా

యీ మాఘమాసము పుట్టినవెనక మనవారిలో పెద్దమనుష్యులుగా వుండే వారి యిండ్లలో కొన్ని పెండ్లిండ్లు జరిగినవి. వాటిలో రెండుమూడు యిండ్లకు ముహూర్తమునకున్ను కచ్చేరికిన్ని నేను వెళ్లివుంటిని. ఈరెండువేళల్లో ముహూర్తమునకు వెళ్లినప్పుడు నామనస్సుకు బహుసంతోషముగా వుండి నది. అప్పట్లో పెండ్లికుమారుడున్ను పెండ్లికుమార్తెయున్ను పందిట్లో కూర్చుండి వారివారికి తగినప్రకారము మంత్రోక్తులచేత దేవబ్రాహ్మణపూజ చేయడమున్ను వారివారికి కలిగినమట్టుకు దానాలు భూరిదక్షిణలు యివ్వడ మున్ను బ్రాహ్మణులచేతనున్ను తమతమవారిలో వృద్ధులుగానున్ను పెద్దలుగా నున్ను వుండేవారిచేతనున్ను ఆశీర్వచనములు పొందడమున్ను, యివి యావత్తు మన శాస్త్రసమ్మతిగానున్ను ఆయాకులాచారసమ్మతిగానున్ను వున్నదిగనుక మహాచక్కగా వుండినది. అయితే రాత్రులలో కచ్చేరీ యుంచవలెగదా. పందిలివేసి శృంగారించవలసి యున్నదిగదా అనే ఆలోచనమీద అందుకు పట్టబొయ్యే కలవు యెంతో అంతమాత్రము రూకలను ముహూర్తపువేళలో కలవయ్యేదానిలో లోపము చేసి విధిలేక మిగిలిస్తున్నారు. కచ్చేరీపందిలి నాట్యము వీటిని నిలిపితే యిందుకు వృథాకలవయ్యే మొత్తాన్ని దానధర్మ ములక్రింద అగత్యముగా కలవుచేతురనేదానికి నేను సందేహించలేదు. పెండ్లిండ్లలో కచ్చేరీ వుంచడములోవుండే గుణాగుణాలు యేమని యోచన

చేసిచూస్తే అనేకవిధాల దోషమే కనిపిస్తుంది గాని గుణలేశమున్ను లేదు. మొదలెత్తగానే యీవిషయమై వారివారి పరువుకుతగినట్టు 50 వరహాలు మొదలుకొని 1000 రూపాయలమట్టుకు శలవయ్యేరూకలు వృథాగా పోతున్నవి......రెండోది రాత్రులలో నిండాప్రొద్దుపొయ్యేవరకు మేలుకొనియుండడముచేత యింటి యజమానుడికిన్ని కచ్చేరికి వచ్చేవారికిన్ని నిద్రాభంగమై శరీరసౌఖ్యము తప్పిపోతున్నది.

మూడోది కచ్చేరికి వచ్చేవార్లలో వ్యవస్థలేక పిలవబడనివారున్ను సామాన్యులయినవారున్ను రావడమువల్ల యింటియజమానుడు వార్లను యెరగకపోయినప్పటికిన్ని తనవియ్యాలవారి విహితుడేమో అని భ్రమించి వీరికంతా మర్యాదలు చేసేటట్టు సంభవించినదిగదా? అని మనస్సులో నొచ్చుకొంటాడు. నాలుగోది కచ్చేరికి వొచ్చినవార్లలో నూటికి 99 మందికి భరతశాస్త్రములోగాని సంగీతములోగాని జ్ఞానములేదు. వీర్లు కచ్చేరికి రాగానే గంధము పుష్పము తాంబూలాలు ఇచ్చి కూర్చుండపెట్టితే వీరికి నాట్యములో రుచిలేదు గనక రవంతప్రొద్దు కూర్చుండియుండగానే నిద్రవస్తున్నది. అంతట యింటికిపోదామా అని తలచి మనసుముందర వచ్చినవారు యింకా వున్నారే మనములేస్తే మర్యాదా వుండదే అని యోచిస్తూవుండగా యింకా కొందరు కచ్చేరికి తమకు వెనకవచ్చినవారు వేరేతావులేకపోతే తమ్ము పృష్ఠభాగముతోతోసి తమకుముందరవచ్చి కూర్చుంటారు. వద్దని చెప్పచాలక దీనికిన్ని సహించుకొని యేల వొచ్చినామని తమలోతాము నొచ్చుకొంటారు. యిట్లా కొంతసేపు కూర్చుండి యెవరైనావొకరు లేస్తే ఆసమయముచూచి యీమట్టుకు బ్రతికినామని తాముకూడాలేచి వెళ్లిపోతున్నారు.

అయిదోది యిందులో యింటివారికైనా కచ్చేరికి వచ్చినవారికైనా యేమయినా సార్థకముకద్దా అని విచారిస్తే యెవరికిన్ని యేమీలేదు 15 సంవత్సరాలకు మునుపు కచ్చేరికి వచ్చేవారు నాట్యమాడుతూ వుండేదానికి రూపాయలువేసే మర్యాదకద్దు దానివలన యింటివారికి కొంచెము కూడుదల

యుండినది ఇప్పుడు వొక డబ్బుకూడా వేసే మర్యాదలేదు. కచ్చేరికి వొచ్చినవార్లలో యెవడో ఒకడియందు మోహించినట్టు వాణ్ణి లాగేకోరకై నటించేదాసి తన అభినయముచేత వాణ్ణిమాత్రమే రంజింపచేస్తున్నది. కడమ వారందరున్ను నిష్ప్రయోజకులై దాని రూపలావణ్యములను జూచి భ్రమించి యింటికి వెళ్లిన వెనక దాన్ని తలచుకొని నిద్రపట్టక వృథాగా చెడిపోతు న్నారు. నర్తనముచేసే దాసికయినా యేదయినా ప్రయోజనముకద్దా అని చూస్తే కచ్చేరీకి వచ్చినవారు రూపాయిలు వెయ్యడములేదు. నాలుగైదు రాత్రులు నిండా కష్టపడి నిద్రమాని తన అభినయములచేతనున్ను తానుబాడే పదాలచేతనున్ను స్త్రీలకున్ను పురుషులకున్ను వుండేమర్యాదలు తప్పి సభలో నిలుచుండి సంజ్ఞలచేతనున్ను యుక్తులచేతనున్ను కొన్ని రహస్యాలనంతా బయలువేసి లజ్జవిడిచి మానముచెడి యింతకష్టపడ్డ వెనక యింటియజమానుడి వద్దికి వెళ్లి దేహీ అని అడిగితే అతనికి యిష్టమువచ్చినమట్టుకు యేమి ఇచ్చినా తీసుకపోతున్నది. గనక దీనికిన్ని కష్టానికిన్ని తగినఫలప్రాప్తిలేదు.

ఆరోది యీకచ్చేరీ వుంచడంవల్ల సంభవించే ముఖ్యమయిన కీడు యేమంటే కచ్చేరీ చేస్తూవుండేటప్పుడు యిదివరకు స్త్రీలముఖము చూడని పిల్లకాయలు కొందరువచ్చి కూర్చుంటారు. వారు యీవరకున్ను విద్యార్థులై చదువుకొంటున్ను యీలోకవ్యాపారములు యేవిన్ని తెలియనటువంటివారుగా వుండినప్పటికిన్ని యీ కచ్చేరికి వచ్చినవెనక యిక్కడ నర్తనముచేస్తూవుండే దాసీకన్యకలున్ను నటిస్తూవుండేటప్పుడు దాని నానావిధ వ్యాపారములనున్ను చూచి అదిపాడే శృంగారపదాలనున్ను వినగా వీరికి యీవరకున్ను తెలిసి యుండని కొన్నివ్యాపారములు నేర్చుకొంటారు......... ..అవతల యీ విధమయిన సల్లాపములయందు చిన్నవాండ్లకు బుద్ధిపుట్టి చదువుమీద జ్ఞాప కముతప్పి యీ దాసీలయిండ్లకు పోవలెననే వొక ఆపేక్ష మనసులోకలిగి మహారాజులయిండ్ల చిన్నవాండ్లయితే ప్రామిసెరీనోట్లు వ్రాసియిచ్చి డిస్కౌం టుచేసి రూకలు సంపాదించుకొని వారియిండ్లకుపోతారు. బీదవాండ్లింటి చిన్న

వాండ్లయితే యెక్కడనైనా దొంగిలించి రూకలు జాగ్రత్తచేసుకొని వారి యిండ్లకు పోయి వ్యాధిని సంపాదించుకొని భ్రష్టులై చెడిపోతున్నారు.

దృష్టాంతానికి కావలసియుంటే అనేకుల పేర్లు వుదాహరించగలను. అయితే గడిచిపోయినవాటిని చెప్పినందువల్ల సార్థకములేదు గనక వారి పేర్లను చెప్పలేదు. యింకా అనేకదోషాలు వున్నవి. యిది అందరికీ తెలిసిన సంగతే గనక విస్తరించవలసిన నిమిత్తములేదు.

ఈవిషయమై నాయొక్క తాత్పర్యమేమంటే యీకచ్చేరీలను వుంచి దాసీలను రప్పించేటందువల్ల మనమే మనపిల్లకాయలకు దుష్టచేష్టలు నేర్పిస్తున్నాము. గనక యికమీద పెండ్లిండ్లు చేసేవారు కచ్చేరీపందిరివేసి అక్కడి దాసీలను రప్పించి నాట్యముచేయించేది మాని దానికిపట్టే శలవులను ముహూర్తమువేళలో దానధర్మాలుచేస్తూ బంధువులకున్ను బ్రాహ్మణులకున్ను అన్నము పెట్టించి తృప్తి చేయించవలసినది. బంధువులుగాక స్నేహితులుగానున్ను యిష్టులుగానున్ను వుండి పెండ్లికివచ్చేవారిని యెట్లా తృప్తిచేయవచ్చునని అడిగితే వారికి వొకనాటికి బ్రాహ్మణులనుకొని విందుచేసి అవిందు ప్రయుక్తమయి సంగీతములో విద్వాంసుడుగావుండే బ్రాహ్మణునిగాని యితర వర్ణస్థునిగాని రప్పించి కొంతసేపు భగవన్నామస్మరణము చేయిస్తే చేయించేవారికిన్ని వినేవారికిన్ని పరలోకసాధనముకద్దు. కాబట్టి తమరు నాయందు దయచేసి యీ కాకితాన్ని కడాకూ చదివిచూచి దీనిని తమ వృత్తాంతపత్రికలో ప్రచురము చేయించడము లోకోపకారముగా ఉండుననితోస్తే అలాగు తాము ప్రచురముచేయవలెనని కోరుతున్నాను. అయితే యీ కాకితము చదివేవారి తోడుతోనే తమయిండ్లలో పెండ్లిప్రయోజనాలు వస్తే కచ్చేరీవుంచడము మానుతారని నేను యెంచలేదు. గాని దినాల పేరటనయినా యిందులో వ్రాసియుండేసంగతులు యీూవత్తున్ను నిశ్చయమని బుద్ధిమంతులు యెంచుకొని కచ్చేరీయుంచక మానుదురనేయెడల నేను సందేహించలేదు.

# వ్యాసము.

## హితసూచని—పీఠిక.

(ఇది వచనగ్రంథము. వీనిలో ఎనిమిది 'ప్రమేయము'లనుగురించి రచించిన వ్యాసములున్నవి. గ్రంథకర్త, స్వామినేని ముద్దునరసింహనాయుడు డెబ్బదియేండ్లక్రిందట రాజమహేంద్రవరములో మొదటితరగతి డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా ఉండెను. ఆయనకొమారుడు రంగాప్రసాదనాయుడు 1862 వ సం॥న ఈగ్రంథము అచ్చువేయించెను. దీనిలో వాడిన భాష, పూర్వకాలమందు న్యాయస్థానములలో జడ్జీలు, మునసబులు, తహసీల్దార్లు, కోర్టుపండితులు, ప్లీడర్లు మొదలయినవిద్యావంతులు తీర్పులు మొదలయినవి వ్రాసేటప్పుడు ప్రాయికముగా వాడే వ్యావహారికభాష. ఇందుకు వ్యత్యస్తముగా ఆకాలమందు పరవస్తు చిన్నయసూరి మొదలయిన కొందరు చన్నపట్టణమువారు, ఇట్టివచనగ్రంథములు ప్రాచీనాంధ్రములో రచించడము చూచి కాబోలును, ఈవిషయమును పీఠికలో చివరను గ్రంథకర్త చర్చించినాడు. అతనిరచనకు మాదిరిగా ఆపీఠిక అంతా ఉదాహరించినాను.]

స్త్రీలకు విద్యలు సాధకము కాచున్నది. విద్యలు నేర్చుకొనుటకు హిందూదేశములో గ్రంథములు మిక్కిలీ సదుపాయముగా నేర్పడియున్నట్టు కొందరెంచుచుంచున్నారు కాని, యిదివరకు ఏర్పడియున్న గ్రంథములుఏమి, వాటిని బాలురకు చెప్పించె పద్ధతులుఏమి, యెవరెవరిచేత జరిగించబడుచున్న కృషికి తగినఫలములు ఇవ్వడములేనందుననున్ను, శరీరారోగ్యమునకు జరూరైన వైద్యాంశములను గ్రహించడము సర్వత్ర ముఖ్యకార్యమై యున్నప్పటి

కిన్ని హిందూజనులయందు అందునగురించి ఉపేక్ష చెయ్యబడుచున్నందున
నున్ను, సంభవించతగని కార్యములు కొన్ని సంభవించుచున్నట్టున్ను తెలియ
తగని సంగతులుకొన్ని తెలియుచున్నట్టున్ను న్యాయవిరుద్ధకార్యములుకొన్ని
న్యాయములుగానున్నట్టున్ను హిందూలలో చాలామంది నమ్ముచున్నందున
నున్ను, వారికి వ్యర్థవ్రయమున్ను వ్యర్థకాలక్షేపమున్ను అసౌఖ్యమున్ను హాని
యున్ను కలుగుచున్నవి. ఐతే గ్రంథములు బహుళః ఛందోబద్ధముగా
నేర్పడి యుండడమువల్లనున్ను, పురాణములయందు వాస్తవములైన సంగతు
లున్ను అవాస్తవములైన సంగతులున్ను సమస్థితిగా చేర్చబడి యుండడమువల్ల
నున్ను, వాటియందలి వాస్తవములను అవాస్తవములను విభజించే సదుపాయ
ములు లేకుండా నుండడమువల్లనున్ను ధర్మశాస్త్రసంబంధములయిన గ్రంథ
ములు కొన్ని కొన్ని యంశములయందు ఒకదానికొకటి భేదించియుండే
నిర్ణయములుగలిగి నానావిధములుగా పుట్టుచూవచ్చి, వాటిపద్ధతులు కొన్ని
తరువాత పుట్టినవాటిలో వాటిని రచించినవారి యిష్టానుసారముగా దిద్దుబాటు
చెయ్యబడుచూ అనేకగ్రంథములు ఏర్పడియున్నందుననున్ను, పురాణాదుల
నున్ను ధర్మశాస్త్రగ్రంథములనున్ను మరిన్ని చిక్కుపరచే యుద్దేశముగలవారు
కొందరు, వచనమునుగాని వచనములనుగాని కల్పించి, కొన్నిగ్రంథములలో
చేర్చియుండడమువల్లనున్ను—విద్యలు సులభముగా రాకపోవడమునకున్ను,
శరీరారోగ్యమునకు జరూరైన సంగతులు బాగా తెలుసుకొనేవాడిక లేకపో
వడమునకున్ను, అవాస్తవములైన సంగతులను కొన్నిటిని వాస్తవములైనవిగా
నున్ను అన్యాయములైన సంగతులను కొన్నిటిని న్యాయములైనవిగానున్ను
నమ్మడమునకున్ను హేతువులు కలుగుచున్నవి. 'ప్రబంధః కల్పనా కథా'
యనెడిన్ని, 'నిరంకుశాః కవయః' అనెడిన్ని వాడికెలుకూడా గ్రంథములలో
కల్పితములైన సంగతులుచేరి యున్నందుకున్ను, ఒకదానికొకటి భిన్నముగా
నుండే పద్ధతులతో గ్రంథములు పుట్టుచూ రావడమునకు వాటిని రచించిన
వారి యభిప్రాయములే కారణములైయున్నందుకున్ను దృష్టాంతములై

యున్నవి. గనుక సదరు అంశములనుగురించి నాకు కలుగుచున్న అభిప్రాయములను తగుమాత్రముగా సూచించుటకు అనుకూలముగా నుండునని తోచుచున్న యెనిమిది ప్రమేయములు, అనగా, విద్యాప్రమేయము, వైద్యప్రమేయము, సువర్ణప్రమేయము, మనుష్యేతర జంతుసంజ్ఞాప్రమేయము, రక్షఃప్రభృతిప్రమేయము, మంత్రప్రమేయము, పరోక్షాదిజ్ఞానప్రమేయము, వివాహప్రమేయమున్ను ఈపుస్తకమందు వివరింపబడుచున్నవి.

౨.—పదవ్యాపారమునకు ఏర్పరచబడే హద్దులు భాషనురచించడమునకున్ను లిఖించడమునకున్ను సాధ్యమైనంత సులభముగా నుండవలసినది అవశ్యమైయున్నది. ఆంధ్రభాషయందు కొన్నిపదములలో నొకానొకయక్షరమునకు అర్థానుస్వార(ము) చేరియుండడము జరూరైనట్టు లక్షణగ్రంథములయందు చెప్పబడియున్నది; కాని అటువంటి చాలా పదములు ఇప్పట్లో అర్థానుస్వారము లేకుండానే సాధారణమైనభాషయందు వాడిక చెయ్యబడుచున్నవి. పదవ్యాపారమందు హద్దులు ఏర్పరచడమునకు దేశముయొక్క వాడికయున్ను నీతియున్ను ఆధారములై యుండవలసినది గనుకనున్ను 'వాఁడు' 'వీఁడు' అనేపదములు ఉచ్చారణయందున్ను వాక్యగ్రంథములలిపియందున్ను 'వాడు', 'వీడు' అని వాడిక చెయ్యబడుచున్నవిగనుకనున్ను - అటువంటిపదములు వాడికకు అనుగుణముగానే యీపుస్తకనుందు వ్రాయబడుచున్నవి. శకటరేఫయనే యక్షరము కొన్నిపదములలో చేరియుండవలసినట్టు కూడా లక్షణగ్రంథములలో చెప్పబడియున్నది; కాని అటువంటి పదములలో రేఫనుచేర్చినా శకటరేఫనుచేర్చినా అర్థము ఒకటే ఐయుంటున్నది కనుకనున్ను - రేఫశకటరేఫములకు ఉచ్చారణయందు భేదమేమీ కనపడడము లేదు గనుకనున్ను - అటువంటి చాలాపదములు వాక్యగ్రంథములయందు ఇప్పట్లో శకటరేఫలేకుండానే రేఫను చేర్చి వ్రాయబడుచున్నవి గనుకనున్ను - 'అందఱు', 'కొందఱు', 'బొఱ్ఱ', 'గుఱ్ఱము' అనేపదములు ఈప్రకారము శకటరేఫతో వ్రాయడముకంటె 'అందరు', 'కొందరు', 'బొర్ర', 'గుర్రము'

అవి రేఫతో వ్రాయడము లిపికి సులభముగా నున్నది గనుకనున్ను - ఏకరీతిగా
పలుకవలసినపలుకులలో నొకదానికి ఒకయక్షరమున్ను మరియొకదానికి
ఇంకొకయక్షరమున్ను వ్రాయవలసియుండడము అధికమైన చికాకుకలుగడము
నకు కారణమౌచున్నది గనుకనున్ను - రేఫశకటరేఫలలో రేఫయనే వర్ణమే
రవర్ణోచ్చారణగల అన్నిపలుకులకున్ను చిహ్నమై యుండదగియున్నది గనుక
నున్ను - ఈపుస్తకములో అటువంటి పలుకులన్నీ రేఫతోనే వ్రాయబడుచున్నవి.
వాక్యగ్రంథములయందు కొందరు సంధి యశ్రుతి మొదలైనవాటినియమము
లను అనుసరించి వ్రాయుచున్నారు; కాని, ఆంధ్రదేశమందు ఆంధ్రభాషను
బహుళః సంధి మొదలైనవాటి నియమములేకుండానే భాషించడమున్ను,
వాక్యగ్రంథములయందు వ్రాయడమున్ను వాడికయై యున్నది. యీ పద్ధతి
సులభముగానున్ను రమ్యముగానున్ను భాషను రచించడమునకు సదుపాయమై
యున్నట్టు నాకు తోచుచున్నది. గ్రామ్యోక్తి ఆంధ్రభాషతాలూక్ అంశము
లలో నొకటిగా లక్షణగ్రంథములయందు చెప్పబడియున్నది. యీపదములు
ఛందోబద్ధములైన గ్రంథములయందు చేర్చడము అరుదైయున్నదిగాని, వాక్య
గ్రంథములయందున్ను భాషయందున్ను వీటివాడిక తరుచై యున్నది. యిందు
వల్ల భాషారచన మిక్కిలీ ధారాళముగా నుంచున్నది; గనుక సాధారణమైన
భాషయందు వాడికలోనున్న గ్రామ్యపదములు చాలామట్టుకు సరసమైన వాక్య
రచనలో నంగీకరించతగినవిగా నేను ఎంచుకుంటున్నాను.



೧೦

# టీక వ్యాఖ్యానము

## (a) సంస్కృతాది గ్రంథములకు.



## బాలసరస్వతీ ప్రణీతంబైన ఆంధ్రశబ్దచింతామణీ టీకాగ్రంథము.

(ఇది తాటాకులపుస్తకము. క్రియా పరిచ్ఛేదముమాత్రము ఉన్నది. అంతకుముందు ఉన్న గద్య:—ఇది శ్రీసకలకవితాస్వతంత్ర భట్టారక వెలకూచి బాలసరస్వతీమహోపాధ్యాయ ప్రణీతంబైన యాంధ్రశబ్దచింతామణీ టీకాగ్రంథంబునందు నయిదవ పరిచ్ఛేదము సంపూర్ణము.)

శ్లో॥ భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమో ణిచ్ఛ। అనుబంధప్రార్థనయోణౌ వ్యతిరాదికేచచోఽపస్స్యాత్। ౫। యివి రెండు సూత్రములు। త్రివిధానాః। మూడువిధములయినవంటి। క్రియాపదానాం। క్రియాపదములకున్ను। ణిచ్చ। ణిచ్ ప్రత్యయమునకు। ఇంచుగాగమం॥ ఇంచుక్ అనే ఆగమము। భవతి। అవుచున్నది। ఇంచుక్ లో। కకారము హలంత్యం అనే వ్యాకరణసూత్రముచేత లోపమైతే। ఇంచు అని ఉండెను। ఆద్యంతౌటకితౌ అనే సూత్రంచేత ఇంచుక్ ఇత్తుగనుక అంత్యపదమై వచ్చెను। ఉపకృత్యాది త్రివిధతత్సమక్రియలకు ఇంచుగాగమము వచ్చునని చెప్పుటచేతను దేశ్యక్రియలకు రానిది సిద్ధమాయెను। అయినా గానిన్ని ణిచ్చ అని ణిజంతానకు ప్రత్యేకించి ఇంచుగాగమము విధించినాడు గనక ఆ ణిచ్చు తత్సమక్రియలకు సమానము గనక ణిజంతమయిన తత్సమక్రియలకువలెనే ణిజంతమయిన దేశ్యక్రియలకును ఇంచుగాగమము

వచ్చును । సేయించెను బ్రతికించెను అనుబంధప్రార్థనాసయో। అనుబంధప్రార్థ నార్థనాములయందును । ణౌ । ణిచ్చుయందున్ను । వ్యతిరేకాదికేచ । వ్యతిరే కాద్యర్థనాములయందున్ను । చోః । ఇంచుక్ సంబంధి చకారమునకు । పస్సాన్యలీ త్। పవర్ణము ఆదేశముగావచ్చును। క్రియారూపతద్ధర్మార్థములకు ఉదాహరణ ములు । పుష్పుష్టా । ణుస్తుతౌ అన్న ధాతువులమీద । ఘఞ్ ప్రత్యయమున్ను। స్త్రియాం క్తిన్ అని క్తిన్ ప్రత్యయమున్ను కూడినాతే కృదంతములై ఉప కృతి పరిణతి సంవృతి సంజ్ఞలు గలవై పోషంతి అని ఉంటే ఆపయిని వర్త మానార్థన వివక్షకలిగితే । భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగ మః । అని ఇంచుగామము వస్తే । పోషించు అని ఉంటే చురితి క్రియాపదా నాం అనే ఉత్తరసూత్రముచేత చు అనే వర్ణము వస్తే ఆపయిని వసతిరను బంధకస్సాన్యద్యత్ర లడర్థోన వివక్షిత స్తత్ర । అని వసత్యర్థనకమైన ఆంధ్ర పదము ఉన్న అని ఉంటే పోషించుచున్న అని ఉండును । ఆపయిని వ్యతిరే కార్థేన లృటి లటి డుజ్ స్యాత్ । అనే వక్ష్యమాణసూత్రంచేత డుజ్ వస్తే । అనుక్త మన్యవత్ అనే న్యాయముచేత హాలంత్యం అనే వ్యాకరణ సూత్రముచేత జకారము ఇత్తయిపోతే సానునాసికోచ్చార్యమాణం జిత్ అనే ప్రాకృతసూత్రముచేత దాపలను అర్థన బిందువు వస్తే పోషించుచు న్నాడు నుతించుచున్నాడు అని లద్రూపములు ఉండును । అనుబంధన ప్రార్థనయోణౌన వ్యతిరేకాదికేచ చోఃపస్సాన్యలీత్ । అనే సూత్రముచేత ఒకవేళ అనుబంధకము పరమై వుంట్టే పకారము వచ్చునన్నాడు గనక పకా రము వస్తే పోషింపుచున్నాడు నుతింపుచున్నాడు అని కలదు. ఈలాగునే స్తుతింపుచున్నాడు ప్రస్తుతింపుచున్నాడు అనుమతించుచున్నాడు సంతో షించుచున్నాడు పరితోషించుచున్నాడు మొదలయినవి కృదంత క్రియాపదములుగా తెలుసుకునేది । సంతసింపుచున్నాడు మొదలయినవి సంస్కృతభవశబ్దములమీద పుట్టినవి అని తెలుసుకునేది । సంతసిల్లు చున్నాడు మొదలయినవి ప్రాకృతసమరూపములని తెలుసుకొనేది । ప్రాకృ

తమునందు షోసః । అనే సూత్రముచేత షకసాదేశము వచ్చెగనక సంతోసిలుచున్నాడు అనే రూపము వచ్చినది । యీలాగుననే కేవలాంధ్రములకుచూచుకునేది లెక్కించుచున్నాడు ఆలించుచున్నాడు తూలింపుచున్నాడు ఆరగించుచున్నాడు మొదలయిన క్రియాపదములు ప్రయోగవశమువలన గ్రహించుకునేది । మరిన్ని ఇదిత్తులు ఈదిత్తులు ఉదిత్తులు ఊదిత్తులు అయిన ధాతువులకును యీలాగే క్రియాపదములు ప్రయోగవశమువలన గ్రహించుకునేది । ఇదిత్తులు । చడికోపే । ఇదితోనుంధాతోః । అనేవ్యాకరణసూత్రముచేత నుమాగమము వస్తే। చెండింపుచున్నాడు। ఈలాగునే ఖండింపుచున్నాడు తుండింపుచున్నాడు ఆకంపింపుచున్నాడు । చుంబించు చున్నాడు మొదలయినవి చూచుకునేది । ఈదిత్తులకు ప్రయోగములు టునదీ అమృత్వా అనేధాతువుమీదను సంధింపుచున్నాడు ఉదిత్తులకు ప్రయోగములు । క్రముపాదవిక్షేపే । క్రమించుచున్నాడు శము ఉపశమించుచున్నాడు । భ్రము చలనే భ్రమించుచున్నాడు । ఊదిత్తులకు । గుపూ రక్షణే । భూసత్తాయాం । గోపించుచున్నాడు అనుభవించుచున్నాడు । ఇదిత్తులకు ఉదాహరణములు । షద్ల విశరణ గత్యవసాదనేషు । ఆసాదించుచున్నాడు । పద్ల గతౌ ఆపాదింపుచున్నాడు సంపాదింపుచున్నాడు । ఆదంతములకు ష్ఠా—గతినివృత్తౌ । ప్రతిష్ఠించుచున్నాడు । మ్నా అభ్యాసే। మానింపుచున్నాడు । ఈలాగున అజంతధాతువులు చూచునది । కేషాంచిదపి ధాతూనా మిల్లుకాన్స్వార్థే ప్రకీర్త్యతే । కేషాంచిదపి ధాతూనా మిల్లుక్ఛ్రికవి సమ్మతేః । అనే అథర్వణవచనమువలన । కొన్ని ధాతువులమీద ఇల్లుగాగమము గలదు । వాటికి ఉదాహరణములు ప్రణమిల్లుచున్నాడు రాజిల్లుచున్నాడు భాసిల్లుచున్నాడు రాగిల్లుచున్నాడు తేజరిల్లుచున్నాడు । కేషాంచిద్దేశ్యశబ్దానా మించురిల్లు గపీష్యతే । చరేవ వర్తమానార్థే కవిభల్లటసమ్మతేః అనే అథర్వణవచనమువలనను ఇంచుగాగమ ఇల్లుగాగమములు కొన్ని క్రియలకు లేకనేవే చు మాత్రమే వచ్చును । పలుకుచున్నాడు చూచు

చున్నాడు వినుచున్నాడు కనుచున్నాడు । అధర్వణాచార్యులున్ను అకర్మ కేషుతు స్వార్థేంచుకోలోపో విధీయతే అన్నారుగనక ఇంచుగాగమము అకర్మధాతువులమీద రాదు । ఇంక నేమంటే ఇల్లుగాగమము వచ్చును । భాసిల్లు ప్రవహిల్లు । త్రివిధానామించుగాగమః । అన్నాడు గనక । కొన్ని దేశ్యక్రియలమీదనున్ను ఇంచుగాగమము రాదు । వచ్చుచున్నాడు కను చున్నాడు చేయుచున్నాడు ఇత్యాదులు చూచుకునేది । ఇంక నేమంటే । ఉపకృతి పరిణతి సంవృతి రూపములయినటువంటి సంస్కృతపదములమీదనే ఇంచుగాగమము అనుట దేశ్యహేతుమతిచ అనే ఉత్తరసూత్రముచేత హేతు వర్ణిచులయందు ఆంధ్రక్రియలయందయినాగాని । ఇంచుగాగమము వచ్చు చున్నాది । పొనరె పొనరిచె అనే భూతార్థక్రియలు వున్నవి । గనక । పొ(న)రుచున్నాడు పొనరించుచున్నాడు అమరుచున్నాడు అమరించు చున్నాడు । పొదలుచున్నాడు పొదలించుచున్నాడు ఇగుర్చించుచున్నాడు ఇత్యాదిరూపములు చూచుకునేది । పఠింపించుచున్నాడు మొదలయినవి సంస్కృత ణిజంతములు ఈలాగునే చూచుకునేది । వినిపించుచున్నాడు మొదలయిన తెనుగు ణిజంతములు ఈలాగునే చూచుకునేది । ఇంక పరిణతి క్రియాపదములు చెప్పుచున్నాను । అథ భూవాద్యాదిః పరిణతిః । అన్నాడు గనక । భూసత్తాయాం । జి జయే । మొదలయిన అజంత హలంతధాతువులకు వర్తమానార్థవివక్ష గలుగుచుండగా వర్తమానే లట్ । అనే వ్యాకరణ సూత్రముచేత లట్ ప్రత్యయము వచ్చి । కర్తరి శప్ శప్రత్యయము వచ్చి । సార్వధాతుకార్ధధాతుకయోః । అని గుణము వచ్చి । ఏచోయవాయావః । అని అవాదేశము వస్తే । భవతి అని ఉంటే పరిణతి రయ వరన్విత్తైవ భవేత్ । అన్నసూత్రముచేత అవ్ అని అంతము గలది గనక పరిణతి సంజ్ఞ గలుగు చుండగా ఉపకృతి ధాతువులయందు బలేగే ఇంచుగాగమము చువర్ణాకము అనుబంధము డుజ్జు మొదలయినవి అన్నీవస్తే । ఉపసర్గపూర్వకమయితే । ప్రభవించుచున్నాడు ప్రభవింపుచున్నాడు అనుభవించుచున్నాడు అనే

రూపములాయెను । యీలాగునే జయింపుచున్నాడు నయింపుచున్నాడు క్షయించుచున్నాడు ఆశ్రయించుచున్నాడు సంశ్రయించుచున్నాడు మొదలయిన అయంతములున్ను అవహ్నావింపుచున్నాడు ద్రవింపుచున్నాడు మొదలయిన (అ) వంతములున్ను ఆలంకరింపుచున్నాడు సంస్కరింపుచున్నాడు సాక్షాత్కరింపుచున్నాడు మొదలయిన అరంతములున్ను । పరిణతిక్రియలు అని తెలుసుకునేది । సంవృతిక్రియలు చెప్పుచున్నాము । అన్యాతు రంజి వస్యాదిః । అన్నాడు గనక । రంజరాగే । వసనివాసే । అనే ధాతువులు పుట్టినక్రియాపదములు సంవృతిక్రియలు । అవి ఏమంటే సంవృతిరహితా కారా । అన్నాడు గనక యీధాతువుల ఆకారములు లుప్తములుగాక ఉండీవి గనక । యీలాగునే యేయే ధాతువులు వికృతిపొందక స్వరూపములచేతనే వుండునో ఆయాయి ధాతువుల బుట్టినక్రియ ల్లాసంవృతిక్రియ లనిపించుకొనును । రంజరాగే । వసనివాసే । అర్థయాచ్ఞాయాం । గర్వ దర్పే । గణసంఖ్యానే । గుణమంత్రే । చిత్రలేఖ్యే । నివాసస్థితౌ । రచ కృత్యాం । వర్ణస్తుతౌ । లిఖలేఖనే । వచపరిభాషణే । రాజృ దీప్తౌ । భజసేవాయాం । నటగతౌ । దీ దీప్తౌ । లపభాషణే । ఫలనిష్పత్తౌ । యివి మొదలయిన ధాతువులమీద ఉపకృతి పరిణతి క్రియలకుం బలెనె వర్తమానార్థవివక్షయందు ఇంచుగాగమము । చువర్ణాకము । ఉన్న అనే అనుబంధకము । దుజ్ఞు వస్తే రంజించుచున్నాడు వసించుచున్నాడు అర్థించుచున్నాడు......ఇటువంటి రూపములు అవును. యీ సంవృతియందు కొన్ని ధాతువులకు యిల్లుగాగమము వస్తే రాజిల్లుచున్నాడు భాసిల్లుచున్నాడు ప్రణమిల్లుచున్నాడు ప్రాపిల్లుచున్నాడు అని కలవు । వికృతి పదములు కొన్ని యీలాగునే రంపిల్లుచున్నాడు దురటిల్లుచున్నాడు ఓరసిల్లుచున్నాడు మొదలయిన శబ్దములు కలవు । యీ చెప్పిన ఉపకృతి పరిణతి సంవృతిక్రియలకు భేదము లేమంటే ఉపకృతిక్రియలు సకర్మధాతువులమీదగాని పుట్టవు । పరిణతి సంవృతిక్రియలు కొన్ని అకర్మ ధాతువులమీదనున్ను వచ్చునని తెలుసు

కునేది । యథా ప్రసిద్ధధాతూనాం ప్రయోగస్సమ్మతో భవేత్ । ఏవోపపద
భాజస్స్యస్సాదయోభ్వాదయః క్రియాః । అనే అథర్వణవచనమువలన
కొన్ని ధాతువులు ఉపపదములై ఉంటేనేకాని ఆంధ్రమునందు పలుకవు ।
అది గనక కరించుచున్నాడు బంధింపుచున్నాడు మొదలయినవి ప్రయోగించ
రాదు । చురాదులమీదను ఇంచుగాగమము కలదు విజ్ఞాపించుచున్నాడు
ఆజ్ఞాపించుచున్నాడు సంజ్ఞాపించుచున్నాడు కొన్ని ద్వికర్మధాతువులమీదను
ఈలాగే రూపములు కలవు । శిష్యుని వేదమున ధ్యాపించుచున్నాడు రిపుల
నాపదబెట్టుచున్నాడు । ఆపద బెట్టించుచున్నాడు । వికృతియందును కొడు
కుచేత పాట పాడింపుచున్నాడు । కొన్ని చోట్ల తృతీయ్యవచ్చును శిష్యుల
చేత వేదము చదివించుచున్నాడు । బంట్లచేత రిపుల పొడిపించుచున్నాడు ।
లఘుద్వ్యక్షరధాతూనా మించుగ్వాసంధిమిష్యతే । అనే విశేషవచనమువలన
లఘుద్వ్యక్షర ధాతువులమీద సంధి వికల్పమున వచ్చును హరించె హరియించె
... । యాంతానాం నవికల్పస్స్యా దితి శ్రీకవి సమ్మతేః । అనే వచనము
వలన యకారాంతధాతువులకు సంధి వికల్పము లేదు. నయించు జయించు
ఇత్యాదికము చూచుకొనేది । స్త్ర్యర్థే పున దుఃగాదిభవతః అనే వక్ష్య
మాణసూత్రముచేత డుజు నపవదించి స్త్రీవాచక క్రియలకు ది వచ్చును ।
ఘటించుచున్నది... । జడానాంచ దుదీస్యాతామితి శ్రీకవి మతే రితి జడా
దులకు దుది అని వచ్చును । వృక్షము ఫలియించుచున్నది । ...బహుత్వే
వర్తమానార్థే రుస్స్యా ద్విత్వే తథైవహి । స్త్రీ జడానాం రుపీస్యాతాం
ద్విత్వే చాపి తథైవహి । అనే విశేషవచనమువలన బహువచనములయితే రు
వచ్చును । పోషించుచున్నారు... । స్త్రీవాచకములకు ఈలాగునే రు
వచ్చును...లక్ష్మీ గౌరీ సరస్వతులు రక్షించుచున్నారు... । ద్వివచనములకు
ఈలాగునే రు వచ్చును । గౌరీసరస్వతులు పోషించుచున్నారు తిర్యగ్జడా
దులయితే వి వచ్చును । వృక్షములు ఫలియింపుచున్నవి । మధ్యమపురుష
అయితే వురు అని కిందచెప్పినాడు । అవుకార రుకారములే సిప్పుకు ధకున్న

వస్తే । నీవు పోషించుచున్నావు మీరు పోషింపుచున్నారు అని వచ్చును । ధస్సుకు ఈలాగునే రు వచ్చును । రామ లక్ష్మణులారా మీరు పోషింపుచున్నారు । ఉత్తమపురుషకయితే సజసోర్నా మూవురూ । అని కింద చెప్పినాడు గనక ఆ నుకార ముకారములే మిప్పుకు మస్సుకు వస్తే నేను పోషించుచున్నాను మేము ప్రకాశింపుచున్నాము అని వచ్చును వ్యతిరేకాదికేచ చోకిపస్సాస్యత్ చెప్పినాడు గనక యీ చెప్పిన క్రియలకు అన్నింటికి వ్యతిరేకార్థము వాచ్యమయితే పకారము వచ్చినప్పుడు వ్యతిరేకార్థేభానిచాత్స్యాత్ అని వక్ష్యమాణసూత్రముచేత అకారమువస్తే ఘటింపదు । అపి శబ్దముచేత ఘటింపలేదు ఘటింపవచ్చును ఘటింపగా । ఇత్యాది తుమున్నర్థాకము చూచుకునేది । ఎడింశ్చ వర్తమానార్థే ఇంచుశ్చాపి క్వచిద్భవేత్ । అని విశేష వచనమువలన వర్తమానార్థమందు ఒకవేళ ఎడిక్ అని కలదు । ఒకవేళ ఇంచుగాగమమున్ను కలదు । పోషించెడిక్ పోయెడిక్ ఒకవేళ ఇల్లుగాగమమున్ను గలదు । రంజిల్లెడిక్ యీలాగునే వర్తమానార్థమందు ఈ చెప్పిన మూడువిధాల క్రియాపదములు యోజనచేసుకునేది । యీచెప్పిన వర్తమానార్థములు ముందరసూత్రముచేత చెప్పుచున్నాడు. ధీమంతులు ఏకవాక్యము చేసుకునేది ।

## బాలసరస్వతీయము

## అజంతపరిచ్ఛేదము.

శ్లో. (౩౮) స్త్రీపశుజడాన్వినాన్యేమహదాఖ్యాస్తద్విశేషణానీహ
మహతోర్తటడుద్విభక్తౌమహతస్స్యాదుర్జనితోర్థ వేత్పుంసి.

టీక. స్త్రీపశుజడాన్వినా స్త్రీవాచకపశువాచకజడవాచకములైన శబ్దములువినాగా అన్యే యితరమైనశబ్దములు మహదాఖ్యాః మహత్తులనే పేరు గలవి. ఇహ యీయాంధ్రమందు తద్విశేషణాని ఆమహత్తులయొక్క విశేషణములున్ను మహత్తులనబడును. స్త్రీపశుజడవాచకశబ్దములు అమహత్తు లని

పించుకసును. ఉదాహరణ. కాంత భామ చాన చామ లేమ యివి స్త్రీవాచకము
లైన అమహత్తులు వనము ధనము రథము యివి జడవాచకములైన అమహ
త్తులు । సరససద్గుణనికురంబశారదాంబ । యీవనాంతము సకలతరులతా
క్రాంతము సంహతమృగజాలము శార్దూలము। యీరీతిని అమహత్తులయొక్క
విశేషణములున్ను అమహత్తులు రాముడు కృష్ణుడు యిట్టి పురుషవాచకశబ్దములు
మహత్తులని తెలిసేది. రాముడు నీలమేఘశ్యాముడు రఘునాయకుడానంద
సంధాయకుడు యీరీతిని మహత్తులయొక్క విశేషణములున్ను మహత్తులయి
వుండును యిదిగాక కొన్నిచోట్లను కవివివక్షచేతను అమహత్తులున్ను మహత్తు
లుగా ప్రయోగించబడుచు. ఉరగులాశీవిషులు విహగులతివేగులు ఘనుడతివర్ష
ఘనుడు గజేంద్రుడు మృగేంద్రుడు విహగేంద్రుడు, ఉరగము ఘనము గజేం
ద్రము యీరీతి అమహత్తులు రెండువిధములుగా ప్రయోగించబడును.
యిందుకు మహాకవిప్రయోగము శరణమని తెలిసేది. మహతోతఉద్విభక్తౌ
విభక్తౌ విభక్తిపరమౌచున్నుండగాను మహతః మహత్సంజ్ఞగలిగినశబ్దముయొక్క
అతః - అకారానకు ఉత్ ఉకారం వచ్చును మహతస్సోడుఃజనితోభవే
త్పుంసి పుంసి-పుంలింగమందు అనితః - ఇకారాంతముగానటువంటి మహతః-
మహత్తుయొక్క సోః - సుప్రత్యయమునకు డుజ్ - డుజాదేశంవచ్చును
యిందుకు ఉదాహరణము. అనుక్తమన్యతోగ్రాహ్య మితిన్యాయాత్ సంస్కృత
శాస్త్రప్రసిద్ధమైనషువంటి స్వాదిసూత్రముచేతను యీవికృతిశాస్త్రమందున్ను
స్వాదిసప్తవిభక్తులున్ను కలగజేసుకునేది ఆంధ్రశబ్దనిష్పత్తికాయవలె గనక
ఆరీతినే అజంతశబ్దములే నిర్ణయించేము. స్వాదిసంజ్ఞలు యిందు జెప్పలేదు.
అవియెట్లంటేను. అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికం ధాతుం ప్రత్యయం
ప్రత్యయాంతంచ వర్జయిత్వా అర్థవచ్ఛబ్దం రూపం ప్రాతిపదికసంజ్ఞం స్యాత్
భూసత్తాయాం డుకృఞ్ కరణె యివిమొదలైన ధాతువులున్ను ఢక్ ఢఞ్
మొదలయిన ప్రత్యయములున్నుగాక అర్థవత్తులయినవి ప్రాతిపదికలనబడును
జ్యాప్ప్రాతిపదికాత్ జ్యంతాదాబంతాత్ప్రాతిపదికాచ్చపరతః స్వాదయః

ప్రత్యయాః స్యుః పార్వతీగౌరీ మొదలయిన ఙప్రత్యయాంతాలమీదనున్ను
చండికా అంబికా మొదలయిన టాప్రత్యయాంతములమీదనున్ను రామ
కృష్ణ మొదలయిన ప్రాతిపదికలమీదనున్ను సు మొదలయిన యేడువిభక్తుల ప్రత్య
యములున్ను వచ్చును. అవియేవి అంటేను సు-ఔ-జస్-అమ్-సుప్ యివి
యేలాగునంటే అకారాంతపుంలింగమయినరామశబ్దము మహత్తు గనక
రామసు అనినిల్చుకొని మహతోత ఉద్విభక్తౌ అనేసూత్రముచేతను, ఏకవచన
మైన సుప్రత్యయము పరమౌచున్నుండగాను రామశబ్దంయొక్క అకారానకు
ఉకారం చేసుకుంటేను రాము సు అని నిలిచెను. మహతస్సోడుఙాజ్ అనే
సూత్రముచేతను సుప్రత్యయానకు డుజాదేశం వస్తేను రాముడు జ్ అని
నిల్చును. అనుక్తమన్యతో గ్రాహ్యమనే న్యాయంచాత హలంత్యం ఉపదేశేత్వం
హలిత్స్యాత్ అనేశబ్దసూత్రంచేత డుజ్ లోని జకారం పోయెను యీలా
గునే ఉపదేశేజనునాసికఇత్ అనేసూత్రంచేతను ఉకారముపోయెను. దాప
లను అర్ధబిందువువచ్చును. మహతోత ఉద్విభక్తౌ అని మహత్తుయొక్క అకా
రానకు ఉకారంవచ్చును యీలాగున ఉకారమున్ను అర్ధబిందువానున్నూ
వస్తే రాముఁడు అని నిలిచెను సర్వత్రానున్నూ మహచ్ఛబ్దనిష్పత్తియందు యిటు
వలెనే తెలిశేది. హ్రస్వముగనక హ్రస్వాత్పూర్ణోపి భవేత్ అనేసూత్రంచేత
రాముండు అనేరూపం వచ్చినది డుజ్ పూర్వమందు అనుస్వారతోగూడి
వుండును ఆ అనుస్వారహ్రస్వాక్షరముమీద ఉండేదిగనక పూర్ణమున్ను ఖండ
మున్ను రెండువిధముల కనుపించును అనుస్వారకు డుజ్ పూర్వస్థానప్రయో
గము మహాకవి ప్రయోగశరణమని తెలుసుకొనేది. సర్వత్రాను మహాకవి
ప్రయోగశరణమంటే ఏతద్వ్యాకరణము వ్యర్థమని చెప్పరాదు అదియేలాగంటే
మహాభాష్యమందు భాష్యకారులయిన శ్రీపతంజలిపాదాచార్యులవారు సిద్ధ
శబ్దానుశాసనమనే సూత్రవిచారకాలమందు సిద్ధశబ్దములకా అసిద్ధశబ్దములకా
అని విచారించే మొదట లోకసిద్ధములైన శబ్దములకే సుశబ్దాపశబ్దానుశాసన
మని నిశ్చయించినారు గనకనున్ను ప్రాకృతశాస్త్రమందు తచ్ఛాస్త్రకర్తలైన

వాల్మీకులున్ను సిద్ధిర్లోకాద్ద్వశ్యా అని సూత్రించి లోకసిద్ధములైన శబ్దములకే సుశబ్దాపశబ్దవివేకముకొరకై సిద్ధాంతసంస్కారయుక్తంచేశిరి గనక యీశాస్త్రము అవశ్యమున్ను అంగీకరించతగినవి అనిచెప్పినారు గనక అక్కడ అక్కడ మహాకవిప్రయోగము శరణమని చెప్పుట యిది శాస్త్రముకు హైన్యము కాదు. ప్రయోగశరణావైయాకరణా అనేన్యాయముచేతను కవిప్రయోగము శాస్త్రములకు అవినాభావసంబంధమని శాస్త్రత్రయవ్యవహారములయందున్ను అవశ్యముగా తెలిసేది స్యాదమహతాంవిభక్తౌసోశ్చము అనేసూత్రము చేతను మువస్తే వ్యాఘ్రము వృక్షము అనేరూపము వచ్చినవి పశుశబ్దము తిర్యగ్జాతుల కల్లా ఉపలక్షణము అటుగనకనే గృధ్రము కాకము అనేవిన్ని కలవు కొన్నిపదములు మహత్తులయినాగానిన్నీ జడాదులుగా వివక్షిస్తె సముద్రము మేఘము అనిన్నీ కలదు యీశబ్దములే అజడాదులుగా వివక్షిస్తె సముద్రుడు మేఘుడు అనిన్నీ కలదు యివి విశేషణములు అయినాగానిన్నీ విశేష్యములు యేలాగునో ఆలాగునే ఉండును. ఘనుడైనరాముడు ఘనమైనవ్యాఘ్రము. అనితః అనిపర్యుదాస చేసుటచేత ఇకారాంతములకు డుజాదులు లేవు రఘుపతి యదుపతి ఇకారాంతములకు సోర్లుగితః అనే ఉత్తరసూత్రంచేతను సులోపమైతె రఘుపతి యదుపతి హరిగిరి అని సులోపమువచ్చినది పుంసి అన్నాడు గనుక పుంలింగమందే కాని నపుంసకమందు యీరూపము లేదు దశరధాపత్యము బ్రహ్మము దిగంతవిశ్రాంతము నీయశము ఇత్యాది నపుంసకోదాహరణములు తెలిసేది.

శా॥ కర్ణాంతాయతచారునేత్రకమలాకర్పూరచూర్ణత్రపా
పర్ణశ్రీకరమంత్రసాధితవిభాస్వద్రూపచిద్రూపసా
వర్ణోదంచితమంచబిందుమయదీప్యద్దివ్యసింహాసనాం
తర్ణిష్యందవిహారహారకవితోద్యత్కాంతికాభూషణా.

ఇది శ్రీసకలభాషాకవితాస్వతంత్ర భట్టారక యెలకూచి బాలసరస్వతీ మహోపాధ్యాయ ప్రణీతంబయిన శబ్దానుశాసనటీకాగ్రంథంబునందు నజంత

పరిచ్ఛేదము సమాప్తము. ఇట్లు ప్రతిప్రకరణముయొక్క చివరను ఒక్కొక్క పద్యమున్నది.

## తాళ్లపాక తిరువేంగళనాథుని అమరవ్యాఖ్య.

అలోక్యదీక్షితీయాది టీకాబాలప్రబోధికామ్ టీకా మమరసింహస్య రచయత్యాంధ్రభావయా. టీ॥ ప్రారబ్ధమైన గ్రంథానకు విఘ్నము రాకుండా ముగిశేందుకు గ్రంథకర్త యిష్టదేవతానమస్కారము స్తుతిరూపాన జేస్తూ న్నాడు.

హేధీరాః వో విద్వాంసులారా జ్ఞా ధోః జ్ఞానజ్ఞానానకున్ను దయ దయకున్ను సింధోః ఆశ్రయభూతమైనవాండున్ను అప్యమమ్మయశబ్దాలు రెండున్ను జలవికారము పేళ్లు అది మూండులింగాల వలెండాచును. ఆపాం వికారః అప్యమమ్మయంచ అప్పులవికారము గాంగా అప్యమున్ను అమ్మయ మున్ను భంగశబ్దము మొదలుకొని నాలుగుకరుళ్లః పేర్లు.

అవర్ణాది శబ్దాలు యిటువలెనె నిందాధాణాలు అటువలెనే ఉపక్రోశా దులున్ను నిందాధాణాలు పర్యంతశబ్దాలు పుల్లింగాలు అనిన్నీ యెరంగబడీని వర్ణమనంగాను స్తుతి విపరీతమైన విపరీతమైనస్తుతి గాంగా అవ ర్ణము ఉపాలభ్యత ఇతి ఉపాలంభః అది మంచికులమందు బుట్టిన నీకు ఇటువంటిది ఉచితమా అనిగుణావిష్కరణపూర్వమైన ఉపలంభము గద్దు. వ్యభిచారిణీ పుత్రుండవైన నీకు......అటు తర్వాత కాండమును ముగియింప ఇచ్ఛయించినవాండై ఈ కాండమందు జెప్పంబడ్డ వగుణాపుల నల్లాను సంక్షేపాన జెప్పుచున్నాండు ఉక్తం అని స్వః స్వర్గమున్ను వియో (వ్యో) మ ఆకాశ మున్ను దిక్ దిక్కున్ను కాలః కాలమున్ను ధీ బుద్ధిన్ని వాక్ వాక్కులున్ను శబ్దాది శబ్దం మొదలైన గంధాదులున్ను సనాట్యకం నాట్యసహితమైన గీత వాద్యాదులున్ను పాతాళః పాతాళమున్ను భోగిసర్పాలున్ను నరక నరక మున్ను వారిజలమున్ను ఏషాం ఈ స్వర్గాదులయొక్క సంగతం సంబంధవస్తు

లున్ను అవియటువల్య (ల) నంట్టేను స్వర్గ త మైనవి దేవతాదులున్ను వ్యోమ సంగత మైనవి మేఘాదులున్ను దిక్సంగత మైనవి దిగ్గజాలున్ను కాలసంగత మైనవి గ్రహణాదులున్ను ధీసంగత మైనవి చారాలున్ను శబ్దసంగత మైన ఉదాత్తాదులున్ను నాట్యసంగత మైన బ్యాకంపాదికమున్ను పాతాళసంగత మైన కుమారాదులున్ను భోగిసంగత మైన కంచుకాదులున్ను నరకసంగత మైన బాధలున్ను వారిసంగత మైన నాకాదులున్ను చెప్పంబడెను ఇతి స్వరాది ప్రథమకాండః సమాప్తః.

## అమరము.

(ఇదితాటాకులపుస్తకం. ఆనందనామసం॥ వైశాఖ బ ౫ సోమవారం నాటికి జయంతి అమ్మయ్యప్రతినున్న క్రమాప్ను పానగంటి రామేశంవ్రాసి నది. ఇది ఇప్పుడు ఈరామేశంమనమలు 60 సంవత్సరములు వయస్సుగల బ్ర॥ శ్రీ॥ పార్నంది రామశాస్త్రిగారివద్ద నున్నది.)

కళా । చంద్రునిపదహారోభాగం । ఇల్వలాః । మృగశిరమీదనుండే నక్షత్రముపేళ్లు । నిమేషః । లఘువైన అక్షరముచ్చరించేకాలము । అది మాత్రాకాలముతో సమానము । మాత్ర అనంగా ౦ నిమేషాలు ౧౮న్ని కాష్టాసంజ్ఞా । క్షణములు ౧౨ న్ను ముహూర్తసంజ్ఞా॥ 3౬౦ దినములై తే నొకవర్షము మనుష్యులమాసము పితాళ్లకు అహోరాత్రము । అయః శుభము చేసే దైవంపేరు । శుక్లాదిశబ్దములు విశేష్యములై తే పుల్లింగములు విశేషణ ములై తే విశేష్యముయొక్క లింగములే అవును॥ వంశానుచరితం । పూర్వాన నుండిన్ని రాజులచరిత్ర చెప్పుట॥ అయలాపః । పరస్త్రీసంభోగనిమిత్తమై దూరు కోవడము ॥ సల్లాపః । అన్యోన్యమున్ను ప్రియమైన మాటలాడుట ॥ నిహ్నా వః । కికురించినమాట । కికురించడమనగా ధిక్కరించడము ॥ సుషిరం । పిల్లనగోరుమొదలయిన వాద్యంపేరు ॥ లాసికః । నాట్యం చేశే స్థలమందు ఉండేవారిపేరు ॥ చిచ్చోకః । ప్రియాగమనసమయమందు స్త్రీగర్వముచేతను

ఆదరించుట పేరు ॥ ఆమ్రేడితం । ఇనమాటు పలుకుట ॥ తమః చీకటిపేరు । నీకపాత్రం ఓడవోని నీల్లు పారవోసీపాత్ర పేరు । శణసూత్రం వలకట్టే తాటిపేరు ॥ శృంగీ । మద్గురుమత్స్యము పెల్లాముపేరు॥

## ఉత్తరగీతలు - తెలుగుటీక.

శ్లో॥ కాకిముఖ కకారాంతము కారశ్చేత సాకృతి,
మకారస్య తులుప్తస్య కొర్థః సంప్రతిపద్యతఇతి.

అర్థం॥ కాయనంగా సుఖమున్ను । అకాయనంగా దుఃఖమున్ను । యీసుఖదుఃఖాలురెండుంగలవాండు కాకి. యనంగా జీవుండు । జీవుడనంగా అవిద్యప్రతిబింబం । ముఖమనంగా బింబస్థానం । బ్రంహ్మముఖశబ్దం ఉత్తరానకు అన్వయించుకొంట్టే కాకిముఖమనిన్ని ముఖకకారాంత్త మనిన్ని ఉండును । ముఖకకారాంత్తమనంగాను మొదలి కకారానకు అంతమైనఅకారము । యీఅకారనకు స్థూలశరీరమున్ను । జాగ్రతవస్థాను తదుభయాభిమాని యైనవిరాట్టున్ను । విశ్వుండు అనిపించుకొనెపురుషుడున్ను అర్థము । ఉకారమనంగాను అకారానకు మొదలవుండెమకారం । యీమకారానకు ఆత్మజ్ఞానమున్ను సుషుప్తిన్ని ప్రాజ్ఞుడున్ను అర్థం అటుగనుక ఉకారమకారాలకు వరుసనె స్థూలసూక్ష్మకారణమైన శరీరాలున్ను జాగ్రత్స్వప్నసుషుప్తులున్ను । విశ్వతైజసప్రాజ్ఞులున్ను । ఆకారఅర్థమాయగనక । అకారము ఉకారమంద్దున్ను ఉకారము మకారమందున్ను మకారము ప్రణవమందున్ను । లుప్తమైతేను లక్ష్యరూపము । చైతన్యమాత్రము యొకమాయగనక అయిక్యం సిద్ధించును. కకారోపరిఉకారము విశ్వతైజసులకు వేరుగనక మకారంలోప మైతేను మూలవిద్యాను ప్రాజ్ఞావస్థాను నష్టమైతే అవికరణింగాగలిగిన విశ్వతైజసావస్థాలు నాశమై అన్నిటియందు అనువతిఇంచి వుండ్డె నిర్గుణబ్రహ్మను దచై చ్ఛతన్యమును బ్రహ్మోపాసకులైనవారు కలకురనుట. ౫.

శ్లో॥ గచ్ఛ న్తిష్ఠన్ యథా కాలా । వాయుంస్వీకరణం పరం ।
సార్వకాలప్రయోగేణ । సహస్రాయుం భవేన్నరః॥

అర్థం॥ పురుషునికి నూరేండ్లఆయుస్సు అని వెదము చెప్పుచున్నది. ప్రాణాయామపరులైనవారికి సహస్రాయుంవున్నూ అంత్తటా ముక్తిగలదని శాస్త్రాలుచెప్పుచున్నవి । ఆప్రాణాయామము । యెప్పుడుశాయవలెనంట్టెను త్రోవనడుస్తున్ను నిలుచుండిన్ని । నియమంచాతనున్ను యెప్పుడుంన్ని శాయవలెను అటువలెచేసినవారికి దీర్ఘాయుస్సున్నూ । బ్రహ్మోపాస్తిన్ని కలదు. ఓ.

## సాద్ధాంతికవిధివాక్యములు - తెలుగుటీక.

అనంచనేన కుండలిన్యా కవాట ముద్ఘాట్య మోక్షద్వారం విభేద యేత్॥ అణచడము చేతను కుండలినిచేతను కవాటము తెరచి మోక్షద్వారము భేదింపవలెను. ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః. తన్ను వీడు అయితినని తెలిసినట్టయితే పురుషుడు విజ్ఞేయోక్షరతన్మాత్రే జీవితం చాపి చంచలమ్॥ నాశయుంక్తమైనవి తన్మాత్ర శబ్దార్థమయిన విషయము జీవించడ మును చంచలము అని తెలియవలెను. సుప్తేరుద్ధాయ సుప్త్యంతం బ్రహ్మాకం ప్రవిచింత్యతామ్॥ నిద్రనుండి లేచి తిరుగా నిద్రవచ్చే పర్యంతము నొక్క బ్రహ్మాము నే విశేషముగా చింతింపవలెను.

## వేదాంతవార్తికము - తెలుగుటీక.

పుట 8. శ్లో 7.

అని మంత్రయోగమనిన్ని లయయోగమనిన్ని హఠయోగమనిన్ని రాజయోగమనిన్ని నాలుగువిధంబులైయుండు వీటిలో లయయోగమనగా నవనాథసిద్ధులలోన పెద్ద అయిన ఆదినాథసిద్ధునిచేతను లక్షాయిరువది అయిదు వేల ప్రకారంబులుగా చెప్పబడియున్నది.

## మహిమ్నస్తవ టీక.

"ఓయి సాంబశివుడా (నీయొక్క) సామర్థ్యముయొక్క ఉత్కృష్ట

మైన అంతమునుగుర్తెరుగనివానికి స్తోత్రము అయోగ్యమయినట్టాయెనా, అప్పుడు బ్రహ్మాదులయొక్కయున్ను వాక్యములు నీయందు క్షీణాలయినవి అటుతర్వాతను స్వబుద్ధియొక్క పరిపాకమానట్టుగాను స్తోత్రము చేస్తున్నటువంటిజనము పల్క శక్యము కానిది. నాకున్ను స్తోత్రమందు ఈసాధనసంపత్తి అపరాధము లేనిది..."

## శృంగారామరుకశతకము.

"వ॥ శృంగారరసప్రధాన మమరుకకావ్యము. శృంగారము సంభోగము, విప్రలంభము నని రెండువిధములు. అందులో సంభోగశృంగారము మొదలుగా నుద్యోగించి శృంగారరసానకు ఆలంబనవిభావమైన నాయికాస్వరూపమునే దేవతగా భావించి తృతీయపురుషార్థమునుగూర్చి ఆశీర్వచిస్తున్నాఁడు..."

## ఆళ్వందారు స్తోత్రము.

" 'యద్వాశ్రమావధి యథామతి వాప్యశక్త
స్తౌమ్యేవ మేవ ఖలు తేపి సదా స్తువంతః,
వేదాశ్చతుర్ముఖముఖాశ్చ మహార్ణవాంతః
కోమజ్జతోరణు కులాచలయో ర్విశేషః.'

యేలాగునైనాగాని శ్రమవచ్చే పర్యంతమును బుద్ధి గోచరించే పర్యంతమున్ను శక్తిలేనివాణ్ణి అయినాగానీ స్తోత్రం చేశేను. వేదములున్ను బ్రహ్మాదులైన దేవతలున్ను వారందరున్ను యీప్రకారమై స్తోత్రం చేస్తూ వున్నవారే కదా; అదేమంటే మహత్తైన సముద్రమధ్యమందున మునిగేటి అణువుకున్ను కులగిరికిన్ని తారతమ్యము యేమిటిది."

## భగవద్గీత.

భగవద్గీతకు శ్రీమత్తాళ్లపాక అన్నమాచార్యుల పుత్త్రుండు శ్రీ తిరుమలయ్యంగారు తెలుగుచేసి వ్రాయించిన టీకనుండి:—

(1) "నీయొక్క-శత్రువులు నీసామర్థ్యాం నిందిస్తున్నవారై ఆడరాని మాటలు ఆడుదురు. శత్రువులచేతను ఆరీతి ఆడించుకొనే అందుకంటెను ఘనమైన దుఃఖము మరే మున్నది."

(2) "చస్తేను స్వర్గము బొందేవు, గెలిస్తివా భూమియేలేవు అటుగనక క్షత్రియుండ వైననీవు స్వధర్మమైనయుద్ధానకు నిశ్చయించుకొని లెమ్ము."

(3) "ఆత్మజ్ఞానం గలిగిన సుఖదుఃఖాలున్ను లాభాలాభాలున్ను జయాజయాలున్ను సమం చేసుకుని అంతటమీద యుద్ధముకొరకు ఉద్యోగించుటైతే పాపము బొందవు.

ఈతాళపత్రగ్రంథము గరికెన సత్యప్పవ్రాసెను. కాళయుక్తినామసం॥ర మార్గశిర బ ౬ శుక్రవారం.........

## భాగవత వ్యాఖ్య.

"'అథైనమస్తౌ దవధార్యపూరుషం
పరంనతాంగః కృతధీః కృతాంజలిః,
స్వరోచిషా భారతసూతికాగృహాం
విరోచయంతం గతభీః ప్రభావవిత్.'"

ఓ పరీక్షిన్మహారాజా తనకాంతిచేత సూతికాగృహమును ప్రకాశింపచేస్తూవున్న యీపురుషుణ్ణి పరమపురుషుణ్ని నిర్ణయించి చెయ్యిబడ్డ అంజలి

గలవాడై కంసభయం లేనివాడై కుశలబుద్ధి గలవాడైన వసుదేవుడు ప్రభావము నెరిగినవాడై స్తోత్రం చేసెను."

## రామాయణ తెనుగుటీక.

"నార్యో నవిధవా శ్చాసన్ న చ వ్యాళకృతం భయం,
న వ్యాధి చ భయం చాపి రామే రాజ్యం ప్రశాసతి."

పెరుమాళ్లు రాజ్యం చేస్తూవుండగా స్త్రీల కందరికి సౌమంగళ్యమే కాని మరిఒక దశ లేదు. సర్పభయంలేదు. వ్యాధిభయంలేదు......

'దదృశు స్తే సమాయాంతం రాఘవం సపురస్సరం,
విరాజమానం వపుషా రథేన రథినాం వరం.'

"ఆలశోకవిజయాదులైన మంత్రులు రథారూఢులై వేంచేస్తూ వున్నట్టు వంటిన్ని రథికశ్రేష్ఠులైనట్టువంటిన్ని దివ్యమంగళ విగ్రహంచేత ప్రకాశిస్తూ వున్నట్టువంటి శ్రీ పెరుమాళ్లను సపరివారంగా సేవించిరి.

## అరవస్తోత్రపాఠపుస్తకములోని తెలుగుటీక.

"పరమపరంపరనై = మిక్కిలీ పరాత్పరుడైనట్టువంటి, మల్ = బలం కలిగినటువంటి, త్తిరోం=దృఢమైనటువంటి, త్తోళ్ = బాహువులు కలిగినటువంటి, మాలై=సర్వేశ్వరుణ్ని, పత్తెన్ను = రక్షకమని, పత్తి=పట్టి, వఱుదివళనాడన్ = తిరువఱుదినా డనే దేశమునకు నిర్వాహకులైన నమ్మాళ్వార్లు, శొన్నల్=సాయించినటువంటి, త్తొడై=శబ్దసందర్భంతో కూడుకున్నటువంటి, అందాది=అందాది రూపమైనటువంటి, ఓర్ = అద్వితీయ్యమైనట్టువంటి, ఆయిరత్తుళ్ = ఆయిరంలోపలను, యిప్పత్తుం = యీపదిపాశరములున్ను, కఱ్ఱార్కు = అనుసంధించినవారికి, కణ్ = కృష్ణుడియొక్క, కళలినై = తిరువడిద్వంద్వము, ఓర్=అద్వీయమైనట్టువంటి, పణ్హాగుం=రక్షకమౌను."

"కణ్=కృష్ణుడియొక్క, కఱలిణై = పాదద్వంద్వమును. నణ్ణుం = దగ్గిరంచేటటువంటి, మనముడైయార్ = మనస్సుకలవార్లు, ఎణ్ణుంతిరునామం=

అనుసంధించేటువంటి తిరునామము, నారణమే=నారాయణనామమె, తిణ్ణం = నిశ్చయము. ... ... ... "

"యిరువైవొకపాటందు ఆళవందారు తిరువడిఘళే సంబంధముల యెంబెరుమానారు నన్ను రక్షించినారు గనక యింకను క్షుద్రుల వాకిళ్లనిలిచి వాండ్లగుణాలు చెప్పి స్తోత్రం కాయగలవాండను కానంచున్నారు."

"యిరువైనాలుగోపాటందు సరిలేనిపాపిష్ఠులైన తమకు యీవిషయమును స్తోత్రంచేశేది యెట్లుకూడెను. తమయొక్క మునుపటి నిలుకడాను తమకు యీవుత్కృష్టం యిపుడు వచ్చిన మార్గమున్ను ఆనతిస్తున్నారు."

"యిరువైయేడోపాటందు యీప్రకారాన తమకు...దార్వాలైన శ్రీ వైష్ణవులయందు ప్రణతులై తేసే యెంబెరిమానారు వీరిమనస్సునందు నిలిచీరి, నిలిస్తేను పాపిష్ఠుడనైన నామనస్సునందు దేవర ప్రవేశిస్తేను, దేవరప్రభావానకు అవద్యం కాదా అని నామనస్సు చలిస్తున్నది, అంచున్నారు."

"ముప్పైవొయ్యోపాటందు యీప్రకారాన వీరు ప్రార్థించినది. విన్నవార్లు యిదేనా మీవంఅపేక్ష మోక్షం వద్దా అంటేను. యెంబెరుమానారు కైంకర్యమే చాలును తక్కినవాంటియందు అపేక్ష లేదంచున్నారు.

## తిరువాయ్మొళ్ళి టీక R 376.

తోళ్మాలె, భుజాలుం, మలువుకొని, అడిక్షైయెతిరువడికళ్లను ఉళ్లంతేటి, మనశుద్ధికలిగి, ఈరిల్, అంతయుంలేనటువంటి ఐశ్వర్యవ్యావృత్తి అత్తువ్యర్థ పదము, ఇన్పత్తిరువేళ్లం ఇరుఇరుర్యై, పెరుప్పై, ఉత్పన్న నవశప్పాడ్యమెన్ను బృందావనమెన్ను నపుంసకనిర్దేశం వనముకె నిర్దేశంస్త్రీలింగప్పె నపుంసకంచేసి, నాఁడు తత్త్వంకళై చిదచిదీశ్వతతత్వాలను కూఱట్టరవిలెసంసర్గమందు అఱి విలెజ్ఞానమందు...వళర్త్తు=వృద్ధిబొందించి, కండుకొల్=చూచుకొమ్మి, ఇన్నుపుక్కవనోటు నేనుప్రవేశించినవానితోఁగూడ, నిన్ననిన్ను, తడబడివున్నాడు. ముళుక్కసాకల్యంగాను, మిఱుక్క=క్లేశపడి, తరుం సామ్యాప్యం అష్టగుణావిర్భావం అయ్.

## బృహదారణ్యకోపనిషత్.

బ్ర. సోమయాజుల వేంకటశివశాస్త్రులవారిచేత వ్రాయఁబడిన పదవిభాగ ప్రతిపదార్థ తాత్పర్యములు. 1893.

P 192. ఏసూత్రముచేత ఈజన్మమున్ను పరజన్మమున్ను బ్రహ్మాదిస్తంబపర్యంతముండెడి సమస్తభూతములున్ను దారముతో పుష్పమాలికలువలెనే కూర్చబడియున్నవో ఆసూత్రములను ఓపతంజలుఁడా నీవు తెలిసికొంటివా?

P 197. ఓగౌతముఁడా, అధిదైవతములగుభూమి, ఉదకము, అగ్ని, అన్తరిక్షలోకము, వాయువు, ద్యులోకము, వీటిలోపలనుండి వాటినన్నిటిని నియమించుచు వాటిచేఁ దెలిసికొనఁబడక విలక్షణముగా నుండెడి నాశనరహితమగు అంతర్యామస్వరూపమే నీయాత్మ.

## సంస్కృతశబ్దార్థకల్పతరువు 1872.

అర్ధోరుకం - వేశ్యలు సగముతొడలదాక తొడుగుకొనే చల్లాడము.
అవచూలకః - జెండానువ్రేలుచుండేకుచ్చులు.
అసిధేనుకా - మొలనుపెట్టుకొనే సూరకత్తి.
అగ్నిష్ఠః - సువర్ణాదిలోహములుకరిగే మూస.
అక్షశౌండః - పొగటాలు బాగాఆడేవాఁడు.
అభిక్ష్ణం - మరిన్ని మాటిమాటికిన్ని.
అంగారితం - మోదుగుచెట్టు మొగ్గతొడగడము.
అనవధానత - తప్పడము.
అపస్నాతః - చచ్చినవాండ్లకు స్నానముచేసినవాఁడు.
అథ-కార్త్స్న్యే - అంతాయనుట.
అంగమర్దః - శరీరముపిసికే జెట్టివాఁడు.
అప్యర్భ్యః - ఆఁబోతుకుఁదగినదొడ్డ.
చటకః - పోఁతుడూరపిచ్చుక.

పక్షః - సహాయే - తోట్పాటు.

యుగ్మం - కవలవాండ్లు.

రశ్మిః - గుఱ్ఱపుకళ్లెమునుగ్రుచ్చి కాతుపట్టెడు కళ్లెపుత్రాడు.

(a) తెలుగుగ్రంథములు.

## భారతము ఉద్యోగపర్వము కూలంకషవ్యాఖ్య.

by భారతం లక్ష్మీపతి పండితుడు (I 304 ff ఆనంద)

సెయ్యముకాకుండా మఱివక వాక్యమువింటివా ।౧। అనికి నెమ్మెయిన క్కొదు యుద్ధానకు యేల జడియుచున్నావు ।౨। మాకు యుద్ధములేకుండా బ్రతుకుట కార్యముగాదా।3। పోరులేనికార్యము వైరివాండ్రైనాబల్లడా ।౪। కచ్చిన్నువాచరిసంజయ మెళ్ళుణోషి యుద్ధేషిణీంయేన యుద్ధాద్బిభేషి । అయుద్ధంవై తాతయుద్ధోద్గరీయః । కస్తల్లబ్ధ్వాజాతయుంద్యేతసూతేత్యుక్తం ॥

॥302॥ జనులకు పత్యములున్నా । ।ధర్మానుగతములున్నా ॥ అయిన పనులుచేసె భీమార్జునులు । ఏదుష్కర్మనుమునకు । రోయనివారలే । యే పాపమునకు రోయరు । కాకుస్వరము । సమస్తమైన పాపకర్మకున్నూ రో యుందురనుట । అనగా యుద్ధములేకుండా । కార్యము సిద్ధించుచుండగా యుద్ధముసేయరనుట ।3। మదియందు । సుఖముకోరి । దురాశకలిగి । చదురు లేని । చాతుర్యములేని । జనులు।దుఃఖప్రదకార్యములకు ప్రయత్నముచేయుం చున్నారు ॥ దుర్యోధనాదులు అటువంటివారనుట । యోగ్యతృష్ణవారు । తగిన ఆశగలవారు । ఉచితప్రవర్తనులున్నూ । బెడిదములకు । హింసాకృత్య ములకు । మిక్కిలి ప్రవేశించరు । యుద్ధములు దుఃఖకరములుగాని । సుఖ కరములా । భీమాదులు యిటువంటివారనుట ।౫। భోగములువలదా అంటే ।౬। వస్త్రమాల్యానులేపన తూర్యత్రయకాలములయందు । ధృతరాష్ట్రునకు । ఇంచునట్లు । ఇష్టమైనట్లు । కొడుకులనేపట్టుకొని । మమ్మెల్ల । మమ్ము అందరి నిన్ని । పోవద్రోచు । లేకుండాచేయును । అనగా రాజ్యభాగములేకపోయినా

తనయింట్లోవుంటే వస్త్రాదికములు కలుగజేయడనుట ।౭।౮। తానైతేవక్రుడై
నీతిమార్గము విడిచెను । మనమైతే అవక్రమార్గమున నడువుడని బుద్ధులు
చెప్పెన్ ।౯। ఎదిరిని । ఎదుటివానిని । తనవలెనే చూచుకుంటె పొందుకలు
గునుగాని । మాకు । కడుము మోదకము । ఇండు । పెట్టుండు । మీకు
ప్రక్కపూరణముతీసినడోలక । కొనుడని । చదురు ॥ చదురు । చాతుర్య
మును । అణచివేసితే । మనస్సుకు పొందుకలుగునా । అనగా । నేను సర్వ
రాజ్యమును చేయుచున్నాను । నీవు మాయింట్లో కడుపుకూటికి వుండుమంటే।
సంధికలుగునా అనుట । నీయందు సామోపాయము నిరస్తమైనది ।౧౦॥౧౧॥
సంపద । రాజ్యలక్ష్మి । స్వాధీనమైవుండగా । అశక్తులవలెనేవున్న మమ్ము
గొప్పచేయుటకు ధృతరాష్ట్రుడు వెఱ్ఱివాండా చెప్పేవారిబుద్ధిమునుపే విన్నా
డుకాడే । ఇటుపైని । ఏలవినును । నీవు అడియాసల । అసత్యకామములచేత
వ్యర్థముగా మమ్ము ఆయాసపెట్టకుము । ధృతరాష్ట్రుని మనోధర్మము।మీకును।
విదురులకున్నా । మాకును వింతరో । వింతకాదు ।౧౨। తగుమాటలు చెప్పి
డైనవినునా । వినడనుట । దుర్యోధనుడువిషముతిన్నా వీడుచావడు । శౌర్య
ముకలవాండు అనే । నమ్మిగ । నమ్మికచేత । చూచుచుండుమ ।౧౩। జూదపు
సిరి కోరకూడదని విదురుడుచెప్పినమాటవింటె ।అంతమాత్రముచేతనే । తీరున్
కార్యముఅవును ।౧౪।౧౫। కార్యము తెఱగిట్టిది । ముందుకార్యాంశము
పుత్రాధీనముగా జర్గబోవుచున్నది ।౧। నీవు పెద్దతనానకు చెప్పుచున్నావు।౨।
నీకుదుర్యోధనుని । దుర్ణయముమళ్లింప శక్యముకాదని తెలియకుండుట ।
వలనో । నేర్పో । వెడగో । వెఱ్ఱియేమో । నాకు తెలియదు ।౧౬। చక్ర
ధరు । కృష్ణుని । గణనసేయడు । పరాక్రమనిధిఅనే । ప్రథమ । అర్జునునకు
అనేషష్టికి విశేషణము ।౧౭।౧౮। చాపాచార్యాదులు । అరుగురున్నా ।
మున్ను । గోగ్రహణాదికమందు । పోరెటికయ్యంబులు । ఎఱగరా । పోట్లా
టకయ్యంబులు । పోరాటకయ్యంబులు । పోట్లాడుకయ్యంబులు । పోటిలం
కయ్యంబులు । గొట్టెపోటేలు యుద్ధములుఅనుట । యీలాగుపాతములు

కలవు । కామబంధములు చుట్టుకొని । బలాబలజ్ఞానము లేకుండుటచేత । బాలెండి । బావలేండి । మారొక్కందురు । దీపశలభన్యాయముచేత యెదురు కొందురు । ఇంతె । పోఇంతె । చూడుమా । తమ్ము । చాపాచార్యాదులకు । కపిధ్వజప్రభల కపికేతనకొంతులే అకారము । ఏవకారజ్యోతకము । ముందు లనుగాచేయవా ।౧౯। మును । ముందుగా । మమ్ము । బొగడి । ఆతరువాత యుద్ధమందు । వారిని గెలుచుటకు । అరడి । అద్భుతము అని । పొత్తుగ । పొందుగా । చెప్పిన । నీవేదో క్తికి । వొప్పను । పక్షపాతమును విడువుమీ । దీనియందు భేదోపాయము నిరస్తమైనది ।౨౦। గాండీవగుణధ్వని మిక్కిలిన్ని క్రమ్ముకోగా ।౧। భీముబాహుగదాదండము । ప్రకాశించగా ।౨। నకులసహ దేవులుతాకగా ।౩। చావకుండవళమా ।౧। పోవకుండవళమా ।౨। మూర్ఛిల్లకుండవళమా ।౩। దీనియందు దండోపాయము సూచించబడ్డది ।౨౧।౨౨।౨౩। ఇంకను । అకురమొత్త । మొలవగా ॥ అక్కటికంబోలయుంగ । దయపుట్టగా। ఏవంకకు । యేదిక్కునకున్నూ । ౨౪ । రండు । రండీ । అని పిలిపించి । పాలింపు । రాజ్యభాగము యిప్పించండి । అని దుర్యోధనాదులకుచెప్పి । ఇంద్రప్రస్థమైనా । మరివొకటైనా । మాంచి । ఉంచుట । ఉచితమేకదా । దీనియందు దానోపాయము సూచించబడ్డది । ౨౫ । నావిని । అనగా । విని । తనిపోవక । తృప్తిలేక । నీవచనంబు రాజ్యభాగముయిచ్చుట । మంచిదిగాక । తక్కువదా । ౨౬ । పావక । నఖెద్భాగం కురువో న్యత్రయుద్ధా త్ప్రియచ్ఛేదం తుభ్యమజాతశత్రో । భైక్షచర్యామంధక వృష్ణిరాజ్యే క్షేమోమన్యేన తు యుద్ధేన రాజ్యమిత్యుక్తం ।౨౭।౨౮ । రాజసూయముచేసి పుణ్యాత్ముడవైన నీచరితము హింసాదూషితము కావచ్చునా ।౧ । జూదమా అవకారములుచేసినవారికి గర్వము చెల్లించి తిట్టులుబడేలాగు యేలచేసితివి ।౨ । వనవాసాయాసము యేల పొందితివి ।౩ । తాల్మియుం । శాంతియొతే । తొడవుగా । అలంకారముగా । యేల దుఃఖపడితివి । హింసకు ఒప్పుకుంటే అప్పుడే చంపరాదా అనుట ।౨౯ । తుదిబోయి । చివరకువచ్చి । బంధువులనున్నూ ।

గురువులనున్నూ । వెదకి వధియించు సౌఖ్యముయెందుకు । అర్యునింద్యమురము గాదు । ౩౦ । అల్పులకు మ్రింగుటకు । శక్యముగాని । హాలహాలము । సముద్ర విషము । హాలహాలం హాలాహాలం హాలాహాలం హాలాహాల మితి ద్విరూపకోశః । దానివలెనే వున్నకోపమున్ను । మ్రింగుటకు । రుద్రుని । ఎన్ని । గణన చేసి । నిన్ను గణనచేయవలసినది । అటువంటి నీవు అందుకు చాలితేగాని । అజాత శత్రుడు అనే పేరుఎందుకు । చెల్లుచున్నది । ౩౧ । అనవుకు । ఇదియెల్ల నీపలికి నట్టిద । కోపము మంచిదికాకుండుట నీవు చెప్పినటువంటిదివే । ధర్మముల వలెనేవుండి సూక్ష్మదృష్టిగలబుధులు విచారించగా కొన్ని అధర్మములై చెడు చున్నవి । కర్ణపరోక్షోక్తచోరమరణకారణకౌశిక సత్యసంభాషణాదులు । అని తెలియవలసినది । ౧ ।

## ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము

### పద్యములు 202_215.

(భారతం లక్ష్మీపతిగారు రచించినటీక. వ్రాతప్రతి. ఆంధ్రపరిశోధక మండలివారి పుస్తకభాండాగారములో ఉన్నది. శిద్ధార్థి కార్తీక శు ౪ స్థిర వారం తటవర్తి సుబ్బయ్య వ్రాసెను.)

హోయీ । నీ చేవత్తురువారు వీరి చేటోపుదు రేఅంటివి । ఇదియేలాగంటే । వారు దిగ్విజయము చేసిన్ని ఆరాజ్యము నీకిచ్చివెళ్లినారుకారా । పోరో । యుద్ధమువిషయమైతే । తారు । తమరు । వనవాసదుఃఖమునుపొందిన్ని । దుర్యోధనుని గంధర్వులచెఱ తప్పించినారుకారా । ౩ । ౪ । రావించి । సంభా వింపవేకాక । వారిపాలు వారికి యిచ్చినావుకావేకాని । యిచ్చినట్లైతే ఆ దినమందే పాండవులు కోపముపు విడువరా । నీఆజ్ఞ దాటుదురా । ఇప్పుడైనా పిలిచి వారిని వారిరాజ్యమందు నిలుపుము । ౫ । అనిన విని । ఇటువయిని తాను ఊరకుంటే కార్యము మిగులుచున్నదని తెలిసి । అనుట । ౬ । అడవులయందు । కొండలంబడి । పర్వతములయందున్నవుండి । రూపుచెడివున్న వారిని । కూటువ

మాకగూర్చిన । ముక్కడిమాకపోగుచేయగానే । అల్లరిసైన్యము గుంపు
గూర్చగానే । పాండవులు గెల్తురా । అనగా కృష్ణుడే యీలాగు చేయుం
చున్నాడుగాని । పాండవసేనలో పేరుగలవాళ్లు లేరనుట । మావిక్రమబల
ములునీవు । అనదుగా । తక్కువగా । లెక్కబెట్టకుము । యేఉపాయముచేతనో
గెల్తుము । ౭ । పరశు...బల్లిదుండు । బలవంతుడు । అలిగెనేని । నిజముగా
కోపించెనేని । ౮ । కృపగురుల యోనిసంభవులు । అనగా అశ్వత్థామ అయో
నిజుడు కాడనుట । అయోనిజాస్త్రయో హ్యేతే పితా మాతాచ మాతులః ।
అశ్వత్థామ్నా మహారాజేత్యుక్తం । ౯ । ఈశ్వరవరజనితుడు । రుద్రవరమువల్లను
కృపియందు ద్రోణునకు పుట్టినాడు । కృపుచెలియలు కృపి యనుదాని వివా
హంబై దానియం దశ్వత్థామ యనుకొడుకుం బడసియున్నంత నొక్కనాడు ।
అని ఆదిపర్వమందు । అలఘుడు గామక్రోధాదుల యేకత్వమునబుట్టె ద్రోణు
నకు మహాబలుం డశ్వత్థామ రిపుప్రళయాంతకు డస్త్రశస్త్రపరిణతుడుర్విన్ ।
అనిన్ని ఆదిపర్వమందు । ఇటువంటి సూర్యసమతేజుడైన అశ్వత్థామవుండగా
మనకు యుద్ధభయమెందుకు । అశ్వత్ అశ్వవదాచరమాణం । ఆచారార్థేక్విచ్ ।
స్థామఽస్యేతివివక్షితం । శౌర్యమిత్యర్థః । ద్రవిణం తరస్సహో బలశౌర్యాణి
స్థేనశుష్మాణీత్యమరః । తద్యస్యాస్య ఇతి అశ్వత్థామా । జన్మవేళన యీతడుచ్చై
శ్రవంబుభంగిఘోషించె బృథివి గంపంబుబొందె నప్పు డితని కశ్వత్థామయని
యొనర్చె పేరుజనములువినన శరీరవాణి । అనిద్రోణపర్వమునందు । అశ్వస్యేవా
స్యాయుద్ధామనదతః ప్రతిశోగతం అశ్వత్థామైవ బాలోయం తస్మాన్నామ్నా భవి
ష్యతీతి । అశ్వత్ స్థామేత్యత్ర సమాసేస కారలోపః । ఉత్ స్థానం ఉత్థానమితి
వత్ ।౧౦।౧౧।౧౨। వీరలు బాహ్లీకాదులు భీష్మాదులకంటెనున్ను బలవంతులు
మిగిలిన రాజులున్ను సహాయార్థమై వచ్చినవారున్ను అగ్నియందైనా ఉఱు
కుటకున్ను సముద్రమైనా యీదుటకున్ను । తెంపుచేసి । సాహసముచేసి ।
పొంచిగిపోవుచున్నవారు । పొంగుచున్నవారు । పాండవులకు మాదిక్కుచూడ
శక్యము కాదు । అదిగాక మాకెవ్వరున్ను లేక వారికే అందఱున్ను వున్నపక్ష

మందు । ఇదిమాకుప్రాప్తకాలము । ఇంతేకాని। మేము వారికాళ్లుగుద్దుటకున్ను పారిపోవుటకున్ను వొప్పము।సమస్తప్రకారములచేతనున్ను యుద్ధముచేతుము। నాఅభిప్రాయముయిది । నాఅభిప్రాయమైనా । కృష్ణాభిప్రాయమైనా మే లేవే ॥

ఇతి శ్రీమదుభయకవితాశూర సూరమాలక్ష్మీనృసింహ సూరికుమార । భారతాన్వయధీర । కైశోరప్రభృతిసమారాధితశ్రీమతి । లక్ష్మీపతి ప్రణీతం బైన శ్రీమహాభారత కూలంకషవ్యాఖ్యానంబునం దుద్యోగపర్వంబున సర్వం బును జతుర్థాశ్వాసము ।

## ఆముక్తమాల్యద గుడిపాటి వెంకటకవి.

### ఆముక్తమాల్యదటీకకు అవతారిక.

(గుడిపాటి వెంకట (కవి) ఆముక్తమాల్యదకు టీకరచించి కృష్ణిపాటి వెంకటాగ్రణికి కృతి ఇచ్చినాడు. ఈకృతికి అవతారిక రచించినాడు. ఇష్ట దేవతాప్రార్థనము, కృతిపతివంశావళి షష్ఠ్యంతములు కలిసి 32 పద్యములు ఉన్నవి. చివర గద్యకూడా ఉన్నది. నేటిపండితులు ఈకృత్యాది పద్యాలు తీసివేస్తున్నారు.)

ఉ. శ్రీకమనీయహారమణి చెన్నుగ దానును గౌస్తుభంబునం
దా కమలావధూటియును దారతదోప బరస్పరాత్మలం
దాకలితంబులైన తమయాకృతులచ్ఛతబైకిదోపన
స్తోకతనందు దోచెననశోభిలు వేంకట భర్తగొల్చెదన్. అ I. i.

టీక. వెంకటభర్త=వెంకటపతిని, కొల్చెదు = సేవించెదు. యీలాగు అన్వయం. యిదినమస్కారరూపమంగళం. నమస్కారమనంగా మత్తత్వ ముత్కృష్టస్త్వత్తోహమపకృష్ట ఇతి మానసిక జ్ఞానవిశేషా నమస్కారం కాబట్టి కొలిచెదనంగా నేనమస్కరించెదననుట. యిందుకు సంమ్మతి ॥ కృతిముఖమున దైవనమస్కృతియొండె నభీష్టవస్తుకీర్తనయొండ్డెన్ వితతాశీఃపదమొండెను

ప్రతివాదింపంగవలయుం భద్రా పేషన్॥ అనేలక్షణం. ఆవేంకటభర్త యెటువంటి వాడని ఆకాంక్షరాగా శోభిలు ప్రకాశించేవాడని విశేషణమిచ్చినాడు యెమనగా ప్రకాశించ్చెనంటె ॥ఉ॥ లక్ష్మియొక్క కమనియ్యవా ప్పేటషువంటి హారా=ముత్యాలహారంయొక్క, మణినాయకరత్నమంద్దు చెన్నగు వొప్పె టషువంటి, తాను=వెంకటపతిన్ని, కౌస్తుభంబునందు=శనకౌస్తుభరత్నమందు, ఆకమలావధూటియు=ఆలక్ష్మిదేవిన్ని, ఉదారత=అతిశయంచాతను, తోప= నీడలుగానరాగా, పరస్పరాత్మలంద్దు = వకరివకరి మనస్సులయెంద్దు, ఆకలితంబులైన ప్రేమాతిశయంచాతను నిలిచినషువంటి, తమతమయిద్దరియొక్క ఆకృతులు, ఆకారాల అచ్చత శరీరస్వచ్ఛత్వంచేత పైకిదోచి, బహుప్రకాశాలై అస్తోకత ఆధిక్యంచాత, అందు=ఆరత్నాలయందు, తోచెనన = కానవస్తున్నవో అనివర్ణించగా, స్వామికి, అలమేలుమంగా సమేతత్వము సూచితమాయ గనక యీలాగుకాగా శోభిల్లునన అన్వయము. శ్రీకమనియ్యం మొదలుకొని అందుతో చెనన తుదగా పూర్వసందర్భము. శోభిలుననే విశేషణముతో అన్వయించుగనుక వెంకటపతికి ప్రాధాన్యము చెప్పంబడెను. యిందుక్కసమ్మతి శ్రీభూత్తిఅనే పద్యమం.

## ఆముక్తమాల్యద

(పరవస్తువారి లైబ్రరిలోని తాళపత్రగ్రంథము.)

శా॥ సైరంధ్రుల్పాయికెత్తికజ్జలము పక్ష్మశ్రేణికందీర్ప వా
లారుం గన్నులమీదుజాచుతరి ఘాలాంచచ్చతుర్థీనిశా
స్ఫారేందుంగను వక్త్రమక్కనుటగా పర్వేందుడాత్మప్రభా
చోరుండుండగ తన్నుతద్గతవిభాచోరంబనుంలోకముల్ ॥

టీక. సైరంధ్రుల్=గెచేసేస్త్రీలు నిరంధ్రిపరవేశ్మస్థావశా శిల్పికారికే త్యమరః పైకెత్తి=మీదికియెత్తి, కజ్జలము=కాటుకను, పక్ష్మశ్రేణిం రెప్పలయందు, దీర్ప=దిద్దగా, వాలారుంగన్నుల, నిడువాలుకన్నులచేతను మీదు

చూచుతరి, మీదు చూచేసమయమందు, వక్త్రము=ముఖము, ఫాలాంచచ్చతుర్థనిశాస్ఫారేందుంగను, ఫాల=నుదురు అనేటి అంచతో వొప్పుచున్న, చతుర్థనిశా=చవితినాటిరాత్రియందలి, స్ఫారేందుం=ప్రకాశిస్తూవున్న, చంద్రుణ్ణి=చవితిచంద్రుణ్ణిఅనుట, గను=చూచును, అకన్నానుటగా=అచూచినందువల్ల నేకదా లోకమందు చతుర్థీచంద్రదర్శనము, అభిశాపహేతువగనుక, పర్వేందుడు = పూర్ణిమనాటిచంద్రుడు, ఆత్మప్రభాచోరుండుండగ తనకాంతిని చౌర్యం చేసినవాడైవున్నప్పటికిన్ని లోకములు జనములు తన్ను ఆముఖమును, తద్గత విభాచోరంబునన్, తత్ ఆపూర్ణచంద్రుణ్ణి, గత, పొందినటువంటి, విభాచోరంబనన్, కాంతినిహరించినదాన్నిగాను అవును.

చంద్రుడు తనముఖాకాంతిని హరించి పూర్ణచంద్రుడౌటవుండగా లోకము పౌర్ణమినాటి చంద్రకళలన్నీ యీచిన్నదానిముఖము దొంగలి పుచ్చుకొన్నదిరా అని అందురు యిందుచేతనంటే లోకమందు చతుర్థిచంద్రదర్శనంవల్లను నీలాపనిందలురావడం ప్రసిద్ధంగనక కాటుకపెట్టేటప్పుడు మీదుగాచూడడంవల్ల తనముఖమందు చతుర్థీచంద్రమాత్రదర్శనంవల్ల యీలాగనిరనుట రూపకాపహ్నవహేత్వపహ్నువోన్సంకరః.

## విష్ణుచిత్తీయవ్యాఖ్యానము.

మొదట ఉదయగిరి దుర్గమనేటి చెకముకిరాతితో నీఖడ్గమనే చెకముకి తగిలేటప్పటికి ప్రతాపమనేవహ్ని కొంచెముగాజనించి తరువాత కొండవీటి దుర్గముమీద ఆపట్టణమందుండే గజపతివెరచి పారిపొయ్యేటట్టుగాను కటకమనగాను కొండచరి గనక దానియందుగజశ్రేష్ఠము కారుచిచ్చుకువెరచి పారిపొయ్యేవిధముగా ననిధ్వని యీప్రకారముగా నీప్రతాపాగ్ని తోకచిచ్చనేటట్లు సమస్తశత్రువులకున్నూ ప్రవేశించరానుండా వుండెను. కృష్ణరాయా.

ద్రాక్షారామ కోమలారామ శ్యామలారామములనే గ్రామత్రయమందున్నూ లింగప్రతిష్ఠచేశేటప్పుడు ఇంద్రునిపేర రాజమహేంద్రవరము కట్టి

నాపుగనక అక్కడ ఇంద్రునితోకూడా రంభాద్యప్సరసలు వచ్చివుండిరిగనక కొండవీటిలోవుండే క్షత్రియులు పారిపోయి.

అతిప్రమత్తతచేతను స్వామియొక్క ఆజ్ఞను జగత్తులయొక్క సృష్టిస్థితిసంహారాలు చెయ్యమనేటిఆజ్ఞను కనుబొమ్మసకాంచి భూవిక్షేపసంజ్ఞచేతనే తెలిసి బ్రహ్మాండములనే మృత్పాత్రములను సృజించేటందుకున్నూ కొనెదన్ననవేత్రదండమైన తన్నువిష్వక్సేనుడు గ్రహించెననేటట్టుగానున్ను కులాలుడు త్రిప్పేటప్పుడు అగ్రములిరిగేదిన్నీ వాడుత్రిప్పకుండెనా మొదలు తిరిగినాకానిన్నీ కొన తిరుగకుండేదిన్నీ ప్రసిద్ధముగనక......

వ్యాఖ్యాగద్య. శ్రీకరఘట్టపల్లికులసింధుసుధాకరుడన్ గురూపదే
శాకలితోరుశాస్త్రహృదయప్రథితుండను శ్రీనివాసుడన్
లోకహితంబిదౌననుచు లోగుణియించిరచించితిన్ మహా
టీక మనీషికోటికి పఠించువిధం బొనగూడునట్లుగన్.

## మనుచరిత్ర సవ్యాఖ్య.

జూలూరి అప్పయ్యపంతులు. ఆ I. 3

1851 లో అచ్చుపడ్డది.

ఉ॥ నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలం బ్రచండ వా
తూలహతిన్ జనించు రొదతోడిగుహావళి నొప్పు మేరువుం
బోలె పయోజపీఠిమునిముఖ్యులు గొల్వగ వాణిగూడి పే
రోలగమున్నధాత విభవోజ్వలుజేయుత గృష్ణరాయనిన్॥

టీక॥ నాలుగు=నాలుగైనటువంటి, మోములన్=ముఖములయందున్ను, నిగమ=వేదములయొక్క, నాదములు=ధ్వనులు, ఉప్పతిలన్=పుట్టుతూనుండగా, ప్రచండవాతూలహతిన్=ప్రచండ=మిక్కిలివడిగలిగినటువంటి, వాతూల=వాయువులయొక్క, హతిన్=తాకుడుచేతను, జనించు=పుట్టుతున్నటువంటి, రొదతోడి=ఘోషముతోగూడిన, గుహావళినొప్పు=కొండగవులచేత ప్రకాశిస్తూ

నుండే, మేరువుంబోలె=స్వర్ణపర్వతమువలెనే, పయోజపీఠి = పద్మపీఠమందు, మునిముఖ్యులుగొల్వగ=మునిశ్రేష్ఠులు కొలువుసేయగాను, వాణిగూడి=సరస్వతీదేవితోగూడుకొని, పేరోలగమున్న=పెద్దకొలువుదీర్చియున్నటువంటి, ధాత=బ్రహ్మదేవుడు, కృష్ణరాయనిన్=కృష్ణరాయలను, విభవోజ్జ్వలు=ఐశ్వర్యముచేత ప్రకాశించేవాణ్ని గాను, చేయుత=చేసుగాక.

అనగా బ్రహ్మదేవుడు నాలుగుముఖములయందున్న వేదములు మ్రోస్తూనుంటే ఏలాగుండెనంటే వాయువుయొక్క తాకుడుచేతను ఘోరమని మ్రోస్తూనుండే గుహలుగల మేరుపర్వతమువలెనే వుండెనని తాత్పర్యము.

## మనుచరిత్రవ్యాఖ్యానం. ఆ. I. 3.

నాలుగైనటువంటి, ముఖములయందు, వేదములయొక్క, ధ్వనులు, పుటుతుండగా, మిక్కిలి వడిగలిగినటువంటి, వాయువుయొక్క, తాకుడు చేతను, పుట్టుచున్నటువంటి, ఘోషముతోగూడిన గుహలచేత ప్రకాశిస్తూనుండే మేరుపర్వతమువలెనె పద్మపీఠమందు మునిశ్రేష్ఠులు కొల్వుసేయగాను సరస్వతీదేవితోగూడుకొని పెద్దకొలువు తీర్చియున్నటువంటి బ్రహ్మదేవుడు, కృష్ణదేవరాయలను ఐశ్వర్యముచేత ప్రకాశించేవాణ్నిగాను చేసుగాక.

## వసుచరిత్ర వ్యాఖ్యానము

### (పరవస్తువారి లైబ్రరీలోనిది) ఆ. I. 1.

శా॥ శ్రీభూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్థలీ
లాభివ్యక్తవరాంఘ్రిరేణుభవకన్యాలీలయుంచున్మదిం
దా భావింప శుభక్రమాకలనచే దద్రత్నముం గప్పు సీ
తాభామాపతిప్రోవుతన్ దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్॥

టీక॥ శ్రీ=లక్ష్మీస్వరూపురాలయిన, భూపుత్రి=సీతాదేవి, వివాహవేళ=పెండ్లికాలమందు, అనగా వరుడున్నూ తానున్నూ ఒకచోట గూర్చున్నసమయమందనుట, నిజ=తనయొక్క, మంజీర = కాలిఅందియొక్క, అగ్రరత్న =

శ్రేష్ఠమైన నాయకరత్నమందలి, స్వకేళా = స్వకీయమైన విలాసాకృతి యొక్క, అభివ్యక్తి = ప్రతిబింబమున్ను, వర = పెనిమిటియైన రామస్వామి యొక్క, అంఘ్రిరేణుభవ = పాదరేణువులవలన పుట్టినటువంటి, కన్యాలీల యంచున్ = కన్యకయొక్క విలాసమని, మదిన్ దాభావింప = మనస్సుయందు తాను ఊహించుచూనుండంగాను - ఇక్కడ శ్రీరామపాదరేణువవలన అహల్యాదేవి పాషాణరూపము విడిచి స్త్రీరూపము వహించినందున మంజీరాగ్రరత్నమున్ను పాషాణజాతే గనుక తత్పాదరేణుస్పర్శచేతను యీరత్నమున్ను స్త్రీరూపము వహించెనాయేమి అనేటట్లుగా నూహించెనని - శుభక్రమాకలనచే = శుభలీలచేతను, తద్రత్నమున్ గప్పు = ఆరత్నమును గప్పి పెట్టినటువంటి, సీతాభామాపతి = సీతాంగనకు నాథుడైన శ్రీరామస్వామి, తిరుమలేంద్రశ్రీమహారాయునిన్ = తిరుమలదేవరాయశ్రేష్ఠునిని, ప్రోవుత్ = రక్షించుగాక అని కృతిపతికి ఆశీర్వచనము.

ఇందులో శుభక్రమాకలనచే అన్నచోట క్రమ్ పాదవిక్షేపే అను ధాతువువలన సన్నికల్లు దొక్కించడమనే వ్యాజముచేతను రత్నముగప్పెనను ప్రకారాంతరముచేత నర్థము చెప్పుచున్నారుగాని సన్నికల్లు దొక్కించువేళ సీతాదేవి నిలిచియుండవలసినది. అలాగున నిలిచియున్నప్పుడు నిజమంజీరాగ్రరత్నమందు నిజాకారప్రతిఫలము లెస్సగా సంభవించదు. ఇంతేకాకుండా శుభక్రమాకలనయనగా శుభపాదవిక్షేపణాకలనమని చెప్పితే క్లిష్టనామదోషమున్ను ప్రకటమగుచున్నది. పాదవిక్షేపణాకలన రూపార్థమే కవిహృదయమైనట్టైతే పదక్రమాకలనమని రచించును అలాగునలేదు. కనక ప్రకారాంతము గలిగించదలచినదికాదు యిక్కడ సీతాదేవికి స్వాధీనపతికాత్వమున్ను శ్రీరాములకు అనుకూలనాయకత్వమున్ను తెలియబడుచున్నది. ప్రియోపలాలితానిత్యం స్వాధీన పతికామతా ఏకాయత్తోను కూలస్స్యాదితి తల్లక్షణం అనగా వివాహసమయమందు సీతాదేవి సిగ్గుచేత తలవంచుకొని పాదముల వంక నే చూచుతున్నయెడల కాలి అందెయొక్క నాయకమణియందు ప్రతి

ఫలించిన తనరూపమును తానేచూచి యితడిపరకు పాషాణాదులను స్త్రీనిగా చేసి నటువంటి శ్రీరాములవారి పాదరేణువవలన యీరత్నమున్ను పాషాణమేకనక స్త్రీ అయినదా యేమి అనేటట్టుగా భ్రాంతినిబొందుచూ నుండగాను ఆభావము తెలిసి విలాసగతిగాను ఆరత్నముమీద చేయివేసి కప్పినవాడై ఆమెయొక్క భ్రాంతిని బోగొట్టెనని తాత్పర్యము.

## శిష్టు కృష్ణమూర్తిగారి వ్యాఖ్యానమునుండి. ఆ I. 1.

శ్రీభూపుత్రి = శీతాదేవి-యీపె భావింపన్ అనేటి పదమునందలి క్రియకు కర్త్రి - వివాహవేళ=పెండ్లిసమయమున, పాణిగ్రహణాది కంకణ మోక్షాంతములయిన యావత్క్రియాపుంజము పాకశబ్దమునకు నధిశ్రయణా ద్యధశ్రయణాంత యావత్క్రియాకలాపమున్నర్థమైనట్టుగా నఃపను గావున నసెకల్ ద్రొక్కించుటయు నర్థమగును. ఆక్రియ జరుగుచున్నసమయమున ననుట; నిజమంజీరాగ్రరత్నస్వలీలాభివ్యక్తిన్ - నిజ - స్వకీయో యోమం జీరః నూపురనామకః పాదభూషణవిశేషః నిజౌ స్వీయావినాశినావితి నానార్థరత్నమాలాయాం మంజీరో నూపురో స్త్రియా మిత్యమరః తత్రాగ్రం శ్రేష్ఠం - పరార్థ్యాగ్రప్రాగ్రహో రప్రాగ్ర్యాగ్రీయమగ్రియ మిత్యమరః - యద్రత్నం తస్మిన్ స్వలీలాయా స్వవిలాసస్య అత్రలీలాశబ్దేన తదాధార ఆకృతిర్లక్ష్యతే తస్య అభివ్యక్తిః. ప్రతిబింబం తాం. తన పాదభూషణము నందలి శ్రేష్ఠమగు వజ్రమునం గానవగు తనప్రతిబింబముననుట. వరాంఘ్రి రేణుభవ కన్యాలీలయుంచున్ వరస్యాంఘ్రి ర్వరాంఘ్రిః - తస్య రేణుః తస్మా ద్భవతి తద్భవా కన్యాయా లీలా ఆకృతిః సేతి వరునియొక్క పాదరజస్సు వలన జనించిన కన్యయొక్క యాకృతియనుచున్ అనగా రాయైపడియుంన్న యహల్యను విశ్వామిత్ర ప్రేరితుడై గౌతమాశ్రమమునకువచ్చి స్త్రీనిచేసిన పాదరేణువుగల మహాత్ము డన్నవాడికగన్న రాముని యాపాదరేణువువలననే నూపురరత్నమునుపలజాతిగాన స్త్రీయాయననిభ్రాంతిజెంది తనవలెనె మరియొక

కన్యయుం వచ్చెగదా రాముడు తదాయత్తుడగునేమోయని భ్రాంతిజెంది కోపము జెందెననుట యీతాత్పర్యమును శీతాభామాపతియను ప్రధానవిశేష్య వాచకశబ్దమునకున్న భామాశబ్దముచేత సూచనచేసెను - భామ్యతీతి భామా యని - భామక్రోధయిత్యాకారక ధాతువువలన కర్తరిఘు ఇయంతమయి యాయి నను పచాద్యజంతమై యైనను నిష్పన్నమైనదని తెలియవలయుం - శీతయనే కోపవతియగు స్త్రీకి పతియని తెలియవలయుం. శీతయనే కోపవతియగుస్త్రీకి పతియని తెలియవచ్చును. గావున యిక్కడ భావించి కోపగింపగానని యను షంగము జేశికొనదగు శుభక్రమాకలనచే - శుభాశ్చతే క్రమాశ్చ శుభ క్రమాః శుభకరాః పాదక్షేపాః తేషామాకలనంరచనా తస్య కుశాదిగణ పతితత్వాన్మలుక్ ఆకలనేతి స్త్రీలింగోవా. సమాసాంతరమాంధ్రత్వేదీర్ఘాణాం హ్రస్వస్స్యాదితి హ్రస్వత్వే ఆకలనేతిసిద్ధం. శుభక్రమాకలనయొక్క - చే - చేతిచేతను ఇతి షష్ఠిసమాసే తత్కారణహస్తే నేత్యర్థః. శుభకరములైన సప్తపద ప్రక్షేపణములను చేయించడమునకు సాధనమైన తనహస్తముచే నని తాత్ప ర్యము. తద్రత్నమున్ తత్ -ఆభ్రాంతిపుట్టించిన వజ్రమును, గప్పు - ఆచ్ఛా దించుచున్నయనుట. అత్ర తద్రత్నమున్ గప్పు నిత్యుభయత్రాపి పరుషా ద్రుత ప్రకృతికాత్సరళా స్యుస్తద్రుతంచ బిందుస్స్యాత్ - ఇతి సూత్రద్వయేన దకారగకారౌ ఖండపూర్ణబిందూచ దీర్ఘాత్పరత్వేన ప్రథమస్యార్థబిందుతా ద్వితీయస్య పూర్ణబింసుతాచ హ్రస్వాత్పూర్ణోపి భవేత్ దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ సజ్ఞేయ ఇతి సూత్రద్వయేణ వ్యత్క్రమేణ విజ్ఞేయం తద్రత్నముల్ గప్పు ఇతి సంశ్లేషపక్షే పాఠాంతరంచ శీతాభామాపతి శీతాంగనారమణుడగు శ్రీరామమూర్తి తిరుమలేంద్ర శ్రీమహారాయనిన్ ఇంద్రుసితో తుల్యుడయ్యి శోభాయుక్తుండయ్యి తిరుమల మహారాయని యని భావము సమాసస్తు తిరు మల ఇతి ఇంద్రః. తిరుమలేంద్రః శ్రియా మహాన్ శ్రీమాన్ శ్రీమహాం శ్చాసౌరాయశ్చ శ్రీమహారాయః తిరుమలేంద్ర ఇతివిజ్ఞేయం. ద్రవిడాంధ్ర ప్రాకృతశబ్దానాం మేళనేపి విశిష్టస్య సంజ్ఞాత్వేన దోషఇతి విజ్ఞేయం - దిన

వెచ్చము - రాయభారము భూతపిల్లి కపిలగడ్డము కరకంతుకు ఇత్యాదుల వలెనని యూహించునది. ప్రోపుతన్ రక్షించుగాత అత్ర ప్రోపుతన్ శబ్దః.

వసుచరిత్ర సప్రతిపదటీక—

జూలూరి అప్పయ్యపంతులవారిచేత వ్రాయబడ్డది

1834 అచ్చుపడ్డది.

I. 100 శా. యాదోరాశి గభీరమూర్తి రఘునాథాధీశుడుద్దండబా। హాదర్పాంధసపాద మల్కి కనిజా మానీకముల్ ద్రుంపజ।న్యాదూరక్షితి బారు కృష్ణకును గృష్ణాంకంబునాడబ్బెబి। బ్బీదీవ్యన్నయనాబ్జ కజ్జలజలాభీల ప్రవాహంబునన్.

టీక॥ యాదోరాశిగభీరమూర్తి - యాదోరాశిసముద్రునివలెనే - గభీరమూర్తి గంభీరుడైనటువంటి - రఘునాథాధీశుడు రఘునాథరాజు - ఉద్దండ... ద్రుంప - ఉద్దండ ఉత్కటమైనటువంటి-బాహాదర్ప భుజగర్వము చేతను - అంధకన్నుగానక యున్నటువంటి - సపాద సపాదులయొక్కనున్ను - నిజాదు నిజామునయొక్కనున్ను - అనీకముల్ సైన్యములను - త్రుంప సంహారించగాను - జన్యాదూరక్షితిబారు - జన్యయుద్ధమునకు-అదూరక్షిత సమీప భూమియందు పారు ప్రవహించుచున్నటువంటి - కృష్ణకు - కృష్ణానదికి - బిబ్బీ...హాంబునన్ - బిబ్బీ మ్లేచ్ఛ స్త్రీలయొక్క, అనగా బూబులయొక్క - దీవ్యత్ ప్రకాశిస్తున్నటువంటి - నయనాబ్జపద్మములవంటి కన్నులయందలి - కజ్జల జలకాటుక నీళ్లయొక్క - అభీల ప్రవాంబునన్ - భయంకరప్రవాహముచేతను - కృష్ణాంకంబు కృష్ణయనేపేరు - నాడబ్బె నాడు గలిగెను.

అనగా రఘునాథరాయనిచేత యుద్ధమందు హతులైన తురకలభార్యా లంతా యేడవగాను వాండ్లకాటుక కన్నీళ్లయొక్క ప్రవాహము కృష్ణలో గలసి నదీజలమంతా నల్లబడినందున నాటనుండిన్ని కృష్ణకు కృష్ణయనేపేరు

గలిగెనని యర్థము। కృష్ణానదీజలమంతా నల్లబడుటకు తగిన కాటుక కన్నీళ్లు ప్రవాహమై పారుతూ నుండడమునకు యెంతమంది స్త్రీలు యేడవవలసి యుండునో అంతమంది తురకలను రఘునాధరాయుడు వధించినాడని తాత్పర్యము.

I. 3. పద్యమునకు తాత్పర్యము:—

అనగా విష్ణుమూర్తికి వర్షర్తువుయందు నిద్రయున్ను శరదృతువుయందు మెలకువయున్ను గనక। యీరామప్రభువు చేస్తూనుండే దానములనుగురించి విడువబడిన ఉదకము నదులై ప్రవహించి క్షీరసముద్రమందు ప్రవేశిస్తూ నుండగా అప్పుడే యితనియొక్క శుభ్ర యశస్సుచేత మేఘములన్నీ తెల్లబడుచూ నుండడముకూడా అయ్యేవరకు అక్కడ శయనించి యుండే విష్ణుమూర్తి నదులు సముద్రమందు ప్రవేశించుటచేత వర్షాకాలమని నిద్రనున్ను మేఘములు తెల్లగా నుండుటచేత శరత్కాలమని జాగ్రతనున్ను కూడా పొందుచూనుండెనని యర్థము.

## రాఘవపాండవీయాదర్శము.

### పెద్దరామధీమణి.

వెలయు నఖిలభువనములలోనవారణ। నగరిపురమతల్లి నాదలర్చి।
రాజ్యలక్ష్మిమిగుల ప్రబలెనయోధ్యనా। రాజవినుతిగనిన రాజధాని॥

ఈపద్యానకు రామాయణార్థం:—అఖిల...ను, సకలజగత్తులలోపలను. విష్టపం భువనం జగ దిత్యమరః; అనావరణ - అనర్గళమైన, నగరిపు - ఇంద్రుని యొక్క, రమ-సంపదకు, అవారణపదము రమావిశేషణము, మతల్లి పోషించేది నా-అనంగాను, శ్రీయను గౌరినాబరగుచెల్వల అని సోమయాజిప్రయోగము, తనర్చి ప్రకాశించినదై, రాజ్యలక్ష్మి మిగుల ప్రబలగాను, అత్యుక్తి, ఇందుకు లక్షణం. చంద్రాలోకమందు - అత్యుక్తి రద్భుతాత్యర్థ శౌర్యాదా

ర్యాదివర్ణనం। త్వయిదాతరి రాజేంద్ర యాచకాః కల్పశాఖినః భువనముల లోను అవారణ అనేదిక్కున సంధికి ఆంధ్రభాషాభూషణమందు-మానుగ... అనే లక్షణంవల్లను ఉకారలోపము రమతల్లి అనేదిక్కున

రమపల్కు తరువుశాఖ్ము అనేలక్షణం షష్ఠ్యర్థమందు ప్రథమాంత రూపం అయోధ్యనా అయోధ్యనే పేరుకలదై రాజవినుతిగనిన రాజధాని వెలయును సర్వోత్కృష్టమై వర్తించును. కృతిముఖమున దైవనమస్కృతి యుండె నభీష్టవస్తు కీర్తనమొండెన్. వితతాశీః పదమొండెను ప్రతిపాదిం పంగవలయుం భద్రాపేక్షనూ। అనేన్యాయాన వస్తునిర్దేశరూపమంగళము శుభ ఋక్షయ...మల్లయరేచా అని భీమునిఛందమందు జెప్పినదిగనక ఆదియందున గణప్రయోగము వెలయుం అనేది శుభపదము వకారము అమృతబీజమున్ను భావార్థం:——వారణనగరిహాస్తి నగరము పురమతల్లి పురశ్రేష్ఠమయినది. నా అనగాను అని అనంతుని ఛందమందును చెప్పినలక్షణంవల్లను పకారానకు వకారము రావలసినందుకు తాతంభట్టుగారు కవిలోకచింతామణియందు... అని విశేషవిధులుగా చెప్పి...అని పిల్లలమఱ్ఱి వీరమరాజుగారి ప్రయోగ

భా॥ జనవరుడు పాండురాజు అదిరొల్లవిని అవరప్రకారమునంతా విని సౌభాగ్యంపునడకలకు వికయనంగాను అంచితపూజితమై అనంతభావమున బాహుల్యంచాతను పర్వ వొప్పుచుండగాను పరమనియతి మంచినియమానను అని ముందటిఅన్వయం దౌహృదోదయానకు నిమిత్తంబులైన చిహ్నాలైన

## హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక చిత్రకవి అనంతుడు

ఇది చిత్రకవి పెద్దిరాజుకొడుకు అనంతుడువ్రాసిన వ్యాఖ్యానము. పద హారోశతాబ్దములోనివాడని వీరేశలింగం పంతులుగారు కవులచరిత్రలో చెప్పి నారు. వీరు వుభయులున్ను అనంతుని కుమారుడు రమణకవిన్ని గొప్పపండి తులు; లాక్షణికులు, కవులు అనంతుడు వ్రాసినవ్యాఖ్యానము పూర్వప్రతిని చూచి రమారమి 60 సం॥ముల కిందట రేకులగెడ్డ సాంబయ్య అనేఆయన

స్వంతంగావ్రాసుకొన్నాడు. ఇది ఆయన కొడుకువద్దనుంటే కవిపురపు జగన్నాథ రావు పంతులుంగారు తెప్పించి నాకిచ్చినారు.

అనంతకవివంటి పండితులు మూడు నాలుగువందల సంవత్సరముల కిందట కావ్యవిమర్శ చేసేటప్పుడు ఎటువంటి తెలుగువాడేవారో దీనినిబట్టి తెలుసుకోవచ్చును. ఇంగ్లీషులో షేక్స్పియర్, మిల్టన్ వంటికవులు వ్రాసిన గ్రంథములు జాన్సన్ వంటి పండితులు విమర్శచేసి వాటికివ్యాఖ్యానములు చేసినప్పుడు గ్రామ్యభాషవాడలేదే. అనంతుని వ్యాఖ్యానములోనిభాష గ్రామ్య మనటంకన్న ఎక్కువభ్రమ నాకుకనబడదు. జాన్సన్ పెద్దపెద్దలాటిన్ మాటలు ప్రయోగించినా విభక్తులు, వచనములు, పురుషలు కాలము మొదలయిన రూపములు నిత్యవ్యవహారములో ఉండేవేవాడినాడు. అలాగే తెలుగు కావ్యాలకు వ్యాఖ్యానాలు వ్రాసినవారున్ను లక్షణము బోధించే లాక్షణికులున్ను గద్యాలలో సంస్కృతశబ్దములు సమాసములువాడుతూ క్రియారూపములు విభక్తులు మొదలయినవిషయములలో లోకవ్యవహారమునే అనుసరించినారు.

వసంతవర్ణన—ఈపద్యమందు చమత్కారము గాను చైత్రాదివసం తాదివాచక శబ్దాలచేతనే వసంతునియందు అన్యత్వారోపణముచేసి స్వధ ర్మముగలుగ జెప్పినాడు. చైత్రికుడైన రాగ అనురాగాలనేటి రాసగవస్నెల యొక్కసామగ్రిని తపస్యాంతమయి, తపస్య తపస్సులయొక్క అంతమై తుదయై ఫలప్రాప్తియనేటి యిష్టఫలప్రాప్తిచాతను మధువై ఆసవమై మద్యమై ఆమోదపరిమళమనేటి, ఆమోద సంతోషముయొక్క మహిమను కాలగురు వయి సూర్యుండును అయి ఆశేహాధ్వనులనేటి అశ్వగులను త్రోవర్తను మనః ప్రసూనుండై పద్వత్కుమారుండై శుకలీలయనేటి శుకునియొక్క లీలచాతను మాధవుండై విష్ణుండై పలాశమోదుగయొక్కభేదన విరసనమనేటి పలాశ భేదనము రాక్షసంహారణము అమనిర్యై అమనికాలమై భూజవృక్షాలయొక్క సైక అధికమైపదుర్గతి దైన్యమనేటి భూజన భూజనులయొక్క వీరదుర్గతి కేవలదారిద్ర్యమును, సురభియై కామధేనువై హరిహాయ మన్మథుండనేటి

హరిహయ యింద్రునియొక్క సారసదన ప్రయోక్తియై సారమైనవప్రయొక్క ప్రయోక్తమై సకలమైన విప్రవరపక్షిప్రవరాలనేటి విప్రవర బ్రాహ్మణులకు శుభప్రదమై నానా ఆసవములనేటి మకరందాలనేటి స్ఫురణలు రసములు యజ్ఞాలచేతను వసంతము అత్యంతమధురమైన పంచమస్వరకోకిల స్వరము యొక్క పూర్ణంచాత భవ్యమగుచు అలరెనని అన్వయము (16 వ పత్రం)

## కాళిందీకల్యాణము.

పాపనకవి - (నిడుదవోలు సుందరంపంతులుగారి వద్దనున్న తాటాకుపుస్తకం.)

మాపురంబులోన మణిమయకాంతుల । రవికమీఱి యంబరంబునోరసి। యున్నతంబులగుచునొప్పు మాపాలిండ్లు । జేరగలవు ఋష్యశృంగ యికను ॥

టీక॥ మాపురంబులోన=మాపట్టణమందు, మణిమయకాంతుల=కాంతులచాతను, రవిక=సూర్యునికయ్యేవే, మీఱి=మించి, అంబరంబునోరసి - ఆకాశమునోరసి ఒప్పుచున్న, మాపాలి=మాయొక్క, ఇండ్లను చేరగలవు-మాపు = రాత్రి, ఉరంబులోన=వక్షమునందు, మణిమయకాంతులచేతను, రవికమీరి = రవికనుమించి, అంబరంబునోరసియున్న వస్త్రమునోరుస్తున్న, మాపాలిండ్లు = మాకుచములను చేరగలవని భావము.

## విజయవిలాసము.

జూలూరి అప్పయ్యపండితుడు చేసిన టీక.

భు-అరాతిక్షమాభృ...

టీక. అరాతి...పాణ-అరాతి శత్రువులైనటువంటి, క్షమాభృత్ = రాజులయొక్క, భిదా = భేదనమందు, అంచత్ = ప్రకాశిస్తున్నటువంటి, కృపాణ=ఖడ్గముగలవాడు, నరాధీ బాణ-నరాధీశ్వర = నరులకు ప్రభువైన రాజుయొక్క,ఆకార=రూపమువహించినటువంటి, నాళీకబాణా=కమలనుయ్యో

వేబాణముగలిగినటువంటి మన్మథుడు అనగా మన్మథునితో సమానమైనచక్క దనముగలవాడు అని అర్థము. స్థిరానంద...రణా-స్థిరా=భూమియందలి నంద నారామసేవా నందనవనమును సేవించడమందు ధురీణ ధురంధరుడైన యింద్రు డవైనవాడా అనగా భూమియందు । యింద్రునివలె । ప్రకాశిస్తున్నవాడా। అని అర్థము - విరాజ...వీణా విరాజత్ మిక్కిలి ప్రకాశిస్తున్నటువంటి, చతుష్షష్టి - అరువదినాలుగైనటువంటి, విద్యా విద్యలయందు ప్రవీణ-సమర్థు డైనవాడు.

## వైజయంతీవిలాసము.

### ఆరణిమఠం వీరభద్రయ్యగారి టీక.

క॥ పెరుమాళులకాగిన్నెయుం నిరుబర్వుల పసిండికాన్కయిడి తనకదియే
తిరువారాధన గాఁగొని సిరివరురంగేశ్వరుక్ భజింపుచునుండెన్.

టీక॥ పెరుమాళ్లకు=శ్రీరంగస్వామివారికి, ఆగిన్నెయుం అబంగారు గిన్నెనున్నూ, ఇరుబరువులపసిడి = ఇద్దరిమోత బంగారమునున్నూ, కాన్క యిడి= కానుకయిచ్చి, తనకదియే=తనకు అవిసమర్పించడమే తిరుమారాధనగా గొని=దేవపూజగా విచారించుకొని సిరివరు లక్ష్మీదేవికి పెనిమిటి అయినటువంటి రంగేశ్వరుక్ శీరంగస్వామివారినిగూర్చి భజింపుచునుండెక్ = సేవించుతూ నుండెను.

## శ్రీప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

(560 వ పద్యం)

సీ॥ గోపికా గోపనాటోపభాగభిరామ గ్రీష్మర్తుమిహిరభాభీష్మధామ
యాతపోద్ధారి మహాకౌస్తుభ సువక్షఃభలవిభుండు దశిరోదళనచక్ర
సాంకవమృగమద పంకమేచకదేహ ఫాలాక్షసన్నుత పదసరోజ
మానిమకుంభినసానల్పతల్పక యతులితవజ్రహాస్తానుజన్మ

యను చెలికరాత్రీవచన ముఖానిలములు, గాంచికిసలయోత్పలశుకగంధపవన
ములఁదలఁచి మధువిధుమార మలయములును, దనదు కన్నులఁగట్టిన
వారినుండ.

టీక. గోపికాకోపనా అనేటప్పుడు పికశబ్దముమీఁద సూర్యునివంటి తేజముగలవాఁడనే టప్పుడువలెనే అనేపదము లేదు గనుక మిహిరభాభీష్మ ధామ అనేది లుప్తోపమ. ఆతపోద్ధారి అనేది రూపకాలిశయోక్తి, మృగ మదముచేత మేచకమయినదనేచే హేతువు, పదసరోజ ముపమారూపక సందేహాసంకరము, అను చెలికరాత్రీవచన ముఖానిలములు యిది యథా సంఖ్యము, పవనములఁ దలఁచి యిది స్మృతి, మత్త శత్రుబలము పలాయన ముగాఁ బోవలయునని శత్రువును విడిచి తత్పక్షము పలాయనముచేస్తే ప్రత్య నీకము, అందుకుఁ జెప్పేది అను అని హేతువు.

(ఈ గ్రంథము అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతి పరిష్క రించి ప్రకటించినది.)

## రామకృష్ణోపాఖ్యానము.

### అచ్చుప్రతి 1876

(శ్రీపాద వేంకటాచలకవి రచించిన ద్వ్యర్థికావ్యము. ఈకవిన్ని వారణాశి లక్ష్మీపతికవిన్ని దీనికి వ్యాఖ్యానము రచించినారు. వేపా లక్ష్మీనరసింహంపంతులుగారున్ను రామ మూర్తిపంతులుగారున్ను అచ్చువేయించినారు.)

ఆ ౧ । ఉ॥ మ॥ సుతులం గాంచక యున్న మాన్యసతిజోఁ సొంపొం దగా నెప్పుడుం । సుతులంగాంచగ వేరుమానవులటంచు స్బల్కు వేరీతులం । శ్రుతులంచద్గుణ దేవకీరమణి విస్ఫూర్తిం దగన్సద్వచో । వృతమేపారగ వీనులం నినుపవే యేతద్విముక్త్యాప్తికై.

వ॥ సుతులం॥ టీ॥ సుతులం గాంచగయుండ్న । పుత్రసంతతిని పొంద కుండావుంటేను । మాన్యతతిలో । తగినవారిలో । సుతులంగాంచగ వేరుమాన వులు । మంచి సామ్యమును జెందలేరు మనుష్యులు । అటంచున్ । ఆలాగు నని । జెల్పువేరీతులన్ । శ్రుతులు । వేదములు । శ్రుతి స్త్రీ వేద అమ్నాయ ఇత్యమరః అంచద్గుణ । తగినగుణములుకలవాడా । దేవ దేవతాస్వరూపుడవగు వసిష్ఠుడా । కీరమణి విస్ఫూర్తిందగన్ । శుకరాజముయొక్క విస్ఫూర్తిని దగు నట్టుగా । కడమసులభము॥ యూ॥ అంచద్గుణ! దేవకీరమణి యివి సంబోధ నలు । కడమ సమము॥

ర॥ క॥ కరమొప్పగ గనవాణీ । వరవర్ణ నియతి సదాధి వర్ధన మధురే । నరమాహారికులసుతుల । దిరముగ గనుటెట్లుధాత్రి తెల్లమిగాగన్॥

కరమొప్ప॥ టీ॥ రా॥ కరమొప్పగగన । అత్యంతమును । వొప్పునట్టు చూడగా । వాణీచర । బ్రహ్మయొక్క । వర్ణ । అక్షరములయొక్క । నియతి। కట్టడిచేతను । అనగా బ్రహ్మవ్రాసిన ప్రకారముగానని । సదా । యెల్లప్పుడును అధివర్ధన । వృద్ధినొందుచున్నటువంటియును । మధుర । ఇష్టమైనయట్టి యును స్వాదుప్రియౌతు మధురానిత్యమరః । ఇనరమ । సూర్యశోభచేతను॥ హారి । మనోహరమయిన । హారిశబ్దమునకు మనోహరము అర్థమయినందుకు॥ చంద్రాలోకె । వినాపితన్విహారేణదత్తో జాతవహారిణావితి ॥ కుల । వంశము నందున । సుతుల । మంచిసామ్యమును । తిరముగగనుటెట్లు ధాత్రి తెల్లమి గాఁగన్ ॥ ధాత్రిలో నేనేలాగున పొందుదునని దశరథవాక్యము । ఇనరమా హారికులయిన । సుతుల । కుమారులనని ప్రకారాంతరము జెప్పవచ్చును॥ యూ॥ గగనవాణి । ఆకాశవాణియొక్క । వరవర్ణములయొక్క । నియతి చేతను । అష్టమగర్భంబు నిన్ను హరియించుజుమీ యని గగనవాణి పల్కిన వర్ణనియతిచేత ననితాత్పర్యము॥ సదాధివర్ధన । నిరంతరమున్ను వ్యాధితో వృద్ధినొందుచున్న । పుంస్యాధిర్మానసవ్యథేత్యమరః । మధురా । మధురయను పురమునకు । ఇన । నాయకుడైన కంసునియొక్క । ఇనస్సూర్యేప్రభావపీత్య

మరి । రమాహారికుల । శోభనుహరించెడి । సుతుల । కుమారులను । కడమ సమము ॥౯॥ క॥ అనసాయతి వరమణియిట్లనె శాంతాతి ప్రియరచితాఘహార సమాధినియతి తనుజా తేష్టవిధిని జేయుము దాన సంతతి దనరువేగ॥

అసాయతి ॥ టీ ॥ రా ॥ అనను।ఈలాగున దశరథమహారాజు పల్కగానే । ఆయతివరమణి । యతి శ్రేష్ఠుడగు వసిష్ఠుడు ॥ యిట్లనె । ఈరీతిన నెను. ఇచటఅని అనియెనని ప్రయోగములుంచుచుండగా వణలోపగ్రామ్యముగా ననెనని యెట్టుగా ప్రయోగమనవలదు । యీలాగున వాగనుశాసనుడే ప్రయోగించినాడు ॥

## కళాపూర్ణోదయము టీక.

వ్రాతప్రతి, విరోధికృతు, ఆశ్వ బ ౧౩.

(వంగిపురం నరసింహాచార్యులు రచించినది. ఈ ప్రతి కొమర్రాజు లక్ష్మణ రావుగారు సంపాదించి ఆంధ్రసాహిత్యపరిషత్తువారి కిచ్చినారు.)

సీ. విశ్రామవిహాతిగావింపక సారవత్సాహిత్య సౌమనస్యంబు తెలిసి
సమయంబుదప్పక శ్రవణకఠోరంబులైనశబ్దముల నత్యాసులాత్మఁ
జేయకసత్పరిచిత సుకుమారవాక్సరళితాభిప్రాయగా నొనర్చి
పదబంధశిథిలత బాటిల్లఁగానీక యేచందములయందు నేమరిలక
పరగుకవియం డోహాకరుఁడును యశముదుగ్ధమును బడయుంనట్టుగాని నాఁడు
గృతిదురాప మొదవుఁ గీర్తియుఁ బాలునీకుంటగాదు హాసయోగ్యుఁ జేయు.

టీక. విశ్రామవిహాతిగావింపక-యతిభంగము కాకుండా చేసి, సార...గి సారవత్-అర్థగౌరవము కల్గినటువంటి, సాహిత - పదపదార్థములయొక్క, సౌమనస్యంబులు-సుమనోభావములను, ఎరిగి-ఇది కవిపరమైనఅర్థము, విశ్రామ విహాతి-స్వేచ్ఛావిహారభంగమును, కావింపక-చేయకను, సార...గి. సారవత్-మంచిబలకరమైనటువంటి, సాహిత్య-గ్రాసము మొదలయినవాటియొక్క, సౌమనస్యంబులు-మంచిమనస్సులు కల్గినసమయములు, ఎరిగి-తెలుసుకొని—

ఇది దోషాకరపరమైన అర్థము. సమయంబుతప్పక - పూర్వకవినిబంధనలను తప్పక. శ్రవణకఠోరంబులైన-వినడమునకు కఠినములైనటువంటి, శబ్దములను-వర్ణసముదాయముల చేతను. అత్యాకులాత్మఁజేయక-మిక్కిలిన్ని సంకీర్ణమైనట్టి స్వరూపముగల్గునట్టుగాను, చేయక-రచించక-ఇదికవిపరము, సమయంబుదప్పక-పాలుపిదికే వేళతప్పకుండాను, శ్రవణకఠోరంబులైన-వినసహింపకూడని శబ్దములను-గొప్పఅరుపులచేతను, అత్యాకులాత్మజేయక-మిక్కిలిన్ని కలతపడిన మనస్సుగలదానిగాను-చేయక-ఇది దోషాకపరము సత్పరి...నర్చి. సత్-పెద్దల చేతను, పరిచిత-అలవాటుచెయ్యబడినటువంటి, సుకుమారవాక్-మృదుపదముల చేతను. సరళిత-సరసమైనటువంటి. అభిప్రాయముగాను - ఆశయముగలదాని గాను-చేసి-ఇదికవిపరము. సత్పరిచిత - బాగుగా అభ్యస్తమైనటువంటి, సుకుమారవాక్-మంచిమాటలచేతను, సరళిత-కోపరహితమైనటువంటి, అభిప్రాయముగానొనర్చి ఆశయముగలదానిగాచేసి-ఇది దోషాకపరము పద...క. పదబంధ-ప్రతిపదసంధులయొక్క, శిథిలత-సంమంధరాహిత్యము, పాటిల్లగానీక-సంమంధించకయుండునట్లుగాచేసి, ఏచందములయందు-ఏవిధములయందున్ను-ఏమరిలక-మోసపోక—ఇదికవిపరము. పదబంధశిథిలత-దాయికట్టిన తాటి యొక్క, శిథిలతను-వీసుటను, పాటిల్లగానీక-సంభవించకుండాచేసి, యేచంద ములయందును-యేఉపచారములయందున్ను, ఏమరిలక - మరువకను. (ఇది) దోషాకపరము. పరగుకవియు-ఒప్పుచున్నకవిత్వము చెప్పేవాడున్ను, దోషాకరుడును-ఆవులకాపరిన్ని, యశము-కీర్తినిన్ని, దుగ్ధమును - క్షీరమున్ను, వడయును-పొందును, అట్లుగానినాడు-పయిని చెప్పినతీరుగా జరిగించనినాడు, కృతి-గ్రంథమున్ను, దురాపమొదవు - అసాధ్యపుగోవున్ను, కీర్తియు-యశమున్ను, పాలును - క్షీరములున్ను, ఈకుంటగాదు - ఇవ్వకయుండడము మాత్రమేకాదు, హాసయోగ్యజేయు - పదిమంది నవ్వడమునకు తగినవానిగా చేసును.

యీపద్యమందు కవికిన్ని ఆలకాపరికిన్ని, కవితకున్ను, గోవృకున్ను, యశమునకున్ను క్షీరమునకున్ను, ఉపమానోపమేయభావమున్ను, విశేషణములు శ్లిష్టములుగానున్ను చెప్పియున్నాడు గనుక శ్లేషానుప్రాణితోపమాలంకార మని తెలియవలెను.

ఉ. ఆడితెనీదుపందెమని హస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
  మ్రేడితపాండురద్యుతి సమృద్ధిగరంబమరంగఁబాచికల్
  వేడుకతోడఁబుచ్చుకొనివ్రేళ్లను నిట్టునటుఙ్ బొరల్చివి
  భ్రాడకలంక కంకణవిరావము మీఱఁ గదల్చివైచుచున్. ఆ VI. 119.

టీక. ఆడితె-ఆడినావా, నీదుపందెము-నీపందెము, అనగా పాచికల దొర్లికవల్ల లభించిన సంఖ్యయని తాత్పర్యము. అని - యీలాగనిపలికి, హస్త...గఙ్-హస్త-కరముయొక్క, నఖ-గోరులవల్లను, ప్రసరత్ - వ్యాపిస్తూనుండే, ఛవి-కాంతులయొక్క, ఛటా-పరంపరలచేతను, ఆమ్రేడిత-ద్విగుణీభూతమైన, పాండురద్యుతి-శ్వేతకాంతియొక్క, సమృద్ధి - ఆధిక్యము. కరంబు-మిక్కిలిన్ని, అమరంగఙ్-ఒప్పగాను, పాచికల్-అక్షములు, వేడుకతోడఙ్-వినోదమునను, పుచ్చుకొని-గ్రహించి, వ్రేళ్లఙ్-అంగుళములచేతను, ఇట్టునటుంబొరల్చి-కిందుమీదుగానుపొర్లించి, వి...ము - విభ్రాట్-మిక్కిలిన్ని ప్రకాశిస్తూనుండే, అకళంక - మాలిన్యరహితములైన, కంకణ-హస్తభూషణములయొక్క, విరావము-ధ్వని, మీరగఙ్-అతిశయింపగాను, కదల్చి-కదిలించి, వైచుచుఙ్-వేయుచున్ను.

# ౧౧
# లక్షణగ్రంథములు

## అప్పకవీయము.

[అది మిక్కిలి ప్రసిద్ధినొందిన లక్షణగ్రంథము. అప్పకవి దీనిని క్రీ. శ. 1656 వ సం. రచించినాడు. తనకు పూర్వులయిన బాలసరస్వతి ముద్దరాజు రామన్న మొదలయిన లాక్షణికు లవలంబించిన పూర్వసంప్రదాయము చొప్పున టీక, అవతారిక, తెలివిడి, తాత్పర్యము మొదలయినవి రచించినప్పుడెల్లా తన కాలపువ్యవహారికభాషే ఆయన వాడినట్టు వ్రాతప్రతులన్నిటిలోనూ స్పష్టముగా కనబడుతున్నది. అయితే 1853 వ సం. న ఈగ్రంథము మొట్టమొదట అచ్చువేయించినప్పుడు పరిష్కర్త శ్రీ రేకము రామానుజసూరి అనే ఆయన బుద్ధిపూర్వకముగా గ్రంథములోని వ్యావహారికభాష "గ్రాంథికభాష" గా మార్చివేసినాడు. ఈయన పరవస్తు చిన్నయసూరి వియ్యంకుడట. చెన్నపట్టణమందు ఆకాలములో సాతానులయిన తెలుగుపండితులు అచ్చుకూటములలో గ్రంథపరిష్కర్తలుగాను పాఠశాలలలో ఉపాధ్యాయులుగాను ఉండేవారు. తెలుగుదేశమందు శిష్టవ్యవహారసిద్ధమైన లౌకికభాష వారికి సుపరిచితమైనది కాకపోవుటచేతను గాబోలును, వారు అభ్యసించిన ఆంధ్రప్రబంధములలోని కావ్యభాషే దేశభాషగా నెలకొల్పవలెనని సంకల్పించి శిశుబోధలు మొదలుకొని బడిపుస్తకములన్నీ ప్రాచీనాంధ్రభాషలో రచించినారు. ఇట్టి రచన సత్సంప్రదాయవిరుద్ధమని ఆకాలమందు తెలుగువారనేకులు నిరసించినారు, కాని, అంతకంతకు ఈసాతానులు తెచ్చిపెట్టిన దురాచారము దేశమంతా వ్యాపించినది. అప్పకవీయము అనేకసార్లు పునర్ముద్రితమైనది; గాని,

అన్నికూర్పులకున్ను రామానుజసూరి మొదటికూర్పే మూలమయినది. 1922 వ సం॥ న "వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు" వారు క్రొత్త కూర్పు ముద్రించినారు. అది నేనున్ను నా పెద్దకొమారుడు వేంకటసీతాపతిన్ని అనేకవ్రాతప్రతులనుచూచి, సాధ్యమయినంతమట్టుకు పూర్వపాఠముల చొప్పున గ్రంథము అంతా సరిచూచి పరిష్కరించి, సవిస్తరముగా విషయ విచారణచేస్తూ ఉపోద్ఘాతమువ్రాసి మా అభిప్రాయములు ప్రకటించినాము. అయితే ఈకూర్పుతోపాటు మరి ఒకకూర్పుకూడా వావిళ్లవారు మాకు తెలియజేయకుండానే ప్రకటించినారు. దానికి మా ఉపోద్ఘాతము చేర్చ లేదు; దానిలోని గ్రంథమంతా మేము పరిష్కరించినదే అయినా, వ్యావహారికభాషలో అప్పకవి రచించినవచనములన్నీ మేము పరిష్కరించినట్టు లేవు; అవి అన్నీ కనబడేటట్టు "గ్రాంథికభాష"లో రచించినట్టుగా ఈకూర్పులో మార్పుపొందినవి. ఇట్లు జరిగినందుకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు చాలా నొచ్చుకొన్నారు. గనుక, నిజము తెలుసుకోవలెనన్న కోరికగలవారు మా ఉపోద్ఘాతముతోనున్న గ్రంథము తెప్పించి చదివిచూడవలెను. దీనివెల రు 3 లు. రెండవకూర్పులోని పాఠములు కృత్రిమములు. వ్యావహారికభాషలో రచించిన వచనములు మొదలయినవి అనేకముగా మొదటి నాలుగాశ్వాసములలో ఉన్నవి. చూడండి: ఆ I. పుటలు 30 మొదలు 37 వరకు; ఆ II-50 మొదలు 56, 65, 72, 74, 79 మొదలు 82, 86 మొదలు 93; ఆ III-పు 154, 164, 165, 166, 174; ఆ IV-185 మొదలు 187, 199 మొదలు 216, 253 మొదలు 257. మాదిరిగా ప్రథమాశ్వాసములోనిది ఒక్క వచనము మాత్రము ఉదాహరిస్తాను. క అనేపాఠము 1859 వ సం॥ రామానుజసూరి గారికూర్పులోనిది; గ అనేపాఠము వావిళ్లవారి సౌమ్యసంవత్సరపుకూర్పు లోనిది; చ అనేపాఠము నేనున్ను నాకొమారుడున్ను పరిష్కరించినది. (వావిళ్లవారు 1924 వ సం॥ లో క్రొత్తగా ముద్రించిన మొదటికూర్పులోనిది జ అనేపాఠము చ లోని పాఠము గ్రాంథికీకరణముచేసి మార్చినది-వావిళ్ల

వారు 1922 లోనే క్రొత్తగా ముద్రించిన రెండవకూర్పులోనిది-ఇరవైచోట్ల మార్పులు ఉన్నవి చూడండి.

క. ఇందుకుఁ దార్కాణముగాఁ గొన్ని తద్భవములు లోకమునం దాద్య ప్రకృతివలననే యయినవిగాని ద్వితీయప్రకృతినయినవిగావందులోపల సముద్ర శబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతియందు లోపమయ్యెడు దకారము క్రిందటిరేఫము లోపముగాక నిలిచినందుచేతను, సంద్రశబ్దము ప్రథమప్రకృతినైన తద్భవముగాని ద్వితీయప్రకృతినైనదిగాదు. అది తత్స మముచేయ సంద్రమయినది. రెండవప్రకృతినైన ॥క గ చ జ ట డ త ద ప బ మః కః పశోరుపర్యద్రే॥ అన్నందునఁ జంద్రశబ్దమునకువలెనే సముద్ర శబ్దమునందలి ధకారమునకు లోపమురాఁగా ॥న తు ద్రశబ్దే॥ అనుటవలన లోపమురాదాయెను. ॥రవలామథశ్చ॥ అని మునుపుచెప్పినసూత్రముచేత దకా రము క్రిందిరేఫము లోపింప సముద్ద అని నిలువ॥ శేషాదేశస్యాప్రోచోఖోః॥ అనుదానివలనను మునుపటివలెనే దకారమునకు జడ్డవచ్చెఁ గనుక సముద్ద యాయెను. అది తత్సమముచేసిన సముద్దము అని యుండవలెను ఈమాట సాదిమకవులు ప్రబంధములను వాడినవారుకారు. సంద్రమనే చెప్పిరి. అటు గాన నిట్టివెల్లను శుద్ధసంస్కృతమునసైన తద్భవములని తెలిసికొనునదు.

గ. ఇందులకు దార్కాణముగాఁ గొన్ని పద్యములు లోకమునం దాద్య ప్రకృతివలననే యయినవిగాని ద్వితీయప్రకృతినయినవిగా వందులోపల సముద్రశబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతియందు లోప మయ్యెడు దకారము క్రిందటిరేఫము లోపముగాక నిలిచినందుచేతను సంద్ర శబ్దము ప్రథమప్రకృతినైన తద్భవముగాని ద్వితీయప్రకృతినైనదిగాదు. అది తత్సమముచేయ సంద్రమయినది రెండవప్రకృతినైన "కగచజటడతదపబమః కఃపశోరుపర్యద్రే" అన్నందునఁ జంద్రశబ్దమునకువలెనే సముద్రశబ్దమునందలి దకారమునకు లోపమురాఁగా "నతుద్రశబ్దే" అనుటవలన లోపమురాదా యెను. "రవలామథశ్చ" అని మునుపుచెప్పిన సూత్రముచేత దకారముక్రింది

రేఫము లోపింప సముద్ద అని నిలువ "శేషాదేశస్యాప్రోచోఖ్యోః" అను దానివలన మునుపటివలెనే దకారమునకు జడ్డవచ్చెఁ గనుక సముద్దయాయెను. అది తత్సమముచేసిన సముద్దము అని యుండవలెను. ఈ మాట నాదిమకవులు ప్రబంధములను వాడినవారు కారు సంద్రమనియే చెప్పిరి. అటుగాన నిట్టివెల్లను శుద్ధసంస్కృతమునకైన తద్భవములని తెలిసికొనుఁడు.

చ. ఇందునకు తెలివిడి. కొన్ని తద్భవములు లోకమునం దాద్యప్రకృతి వలననే యయినవిగాని ద్వితీయప్రకృతినయినవిగావు. అవి యెటువంటివంటేను అందులోపల సముద్రశబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతి యందు లోపమయ్యేటి దకారము క్రిందటిరేఫము లోపముగాక నిలిచినందు చేతను సంద్రశబ్దము ప్రథమప్రకృతికైన తద్భవముగాని ద్వితీయప్రకృతికైనది గాదు. అది తత్సమముచేస్తేను సంద్రమైనది. రెండవప్రకృతికి అయితే "కగచజటడతదపబమశషసాం రుపర్యద్రే" అన్నందున చంద్రశబ్దమునకు వలెనే సముద్రశబ్దమునందలి దకారమునకు లోపముగా వస్తేను "నతుద్రశబ్దే" అనుటవలన లోపము రాదాయెను. "రవలాసామధశ్చ" అని మునుపుచెప్పిన సూత్రముచేత దకారము క్రింది రేఫము లోపమైతేను సముద అని నిలిస్తేను "శేషాదేశస్యాప్రోచోఖ్యోః" అనుదానివలనను మునుపటివలెనే దకారము నకు జడ్డవచ్చె. గనక సముద్దమాయెను. అది తత్సమముచేస్తేను సముద్దము అని యుండవలెను. ఈ మాట ఆదిమకవులు ప్రబంధములను వాడినవారు కారు. సంద్రమనే చెప్పుకొన్నారు. అటుగనక నిటువంటివెల్లా శుద్ధ సంస్కృతమునకైన తద్భవములని తెలుసుకొనేది.

జ. ఇందునకు తెలివిడి కొని తద్భవములు లోకమునం దాద్యప్రకృతి వలననే యయినవిగాని ద్వితీయప్రకృతినయినవిగావు. అవియెటువంటివనఁగా; అందులోపల సముద్రశబ్దమున కొక్కటికిఁ జెప్పుచున్నాము. మొదలిప్రకృతి యందు లోపమయ్యెడు దకారము క్రిందటి రేఫము లోపముగాక నిలిచి నందుచేతను, సంద్రశబ్దము ప్రథమప్రకృతికైన తద్భవముగాని ద్వితీయ

ప్రకృతియైనది గాదు. అది తత్సమము చేయఁగా సంద్రమయినది. రెండవ ప్రకృతినే అయిన "కగచజటడతదపబమయలవశషసాం రుపర్యద్రే" అన్నందునఁ జంద్రశబ్దమునకువలెనే సముద్రశబ్దమునందలి దకారమునకు లోపముగా రాఁగా "నసముద్రశబ్దే" అనుటవలన లోపము రాదాయెను. "రవలామధశ్చ" అని మునుపు చెప్పిన సూత్రముచేత దకారము క్రిందిరేఫము లోపముగాఁగా సముద అని నిలువఁగా "శేషాదేశస్యావర్గో ప్రోచా యాన్తే శిక్షాః" అనుదానివలనను మునుపటివలెనే దకారమునకు జడ్డ వచ్చెఁ గనుక సముద్దయాయెను. అది తత్సమము చేసిన సముద్దము అని యుండవలెను. ఈమాట ఆదిమకవులు ప్రబంధములను వాడినవారు కారు. సంద్రమనియే చెప్పికొన్నారు. అటుగనుక నిటువంటి వెల్లను శుద్ధసంస్కృతమునవైన తద్భవములని తెలిసికొనునది.

## ఆనందరంగరాట్ఛందము.

ఇది వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు 1922 వ సంవత్సరమున ముద్రించినారు. కస్తూరి రంగకవి దీనిని రచించి డూప్లెక్సువద్ద దుబాషుగానుండిన ఆనందరంగపిళ్లకు అంకితముచేసినాడు. ఈగ్రంథమందు వివరణవచనములు చిన్నచిన్నవి కొంచెముగా ఉన్నవి. వీటిలో వ్యావహారిక భాష తరుచుగా కనబడుతుంది. వ్రాతప్రతులలోని శబ్దములు కొన్ని పరిష్కర్తలు మార్చివేసినా, అచ్చులో కావలసినన్ని నిలిచి ఉన్నది. మూడవ ఆశ్వాసములో, ఇంచుమించుగా ప్రతిపద్యముక్రిందను, తాత్పర్యములో ఇట్టివి కనబడును.]

9 వ పద్యము క్రింద—'అని పది యతులున్ను', 10 వ దానిక్రింద—"అని పదాఱుయతులున్ను. మఱిన్ని", 12—'చెప్పివున్నవి', 15 వ దాని క్రింద—'లలితమై చెవికింపుగానుండే అక్షరము ప్రాసస్థానమందుంచితే అది సుకరప్రాసము,' 18—'చెవికింపుగాక, నోటమెదుగక దుస్తరముగా నుండే అక్షరములు ప్రాసచెప్పితే నది దుష్కరప్రాస మనఁబడును', 24—"చరణాదిని

మొదటి అక్షరముగాక అవతలి రెండక్షరములు చెప్పిన అక్షరములే నాలుగు చరణాలకు ప్రాసములు వస్తే అది ద్వంద్వప్రాసమగును. ఆరీతిగా మూఁడేసి అక్షరములు వస్తే అది త్రిప్రాసమగును.' 31-'ఈ యీఱువిధములగు ప్రాసములు నిండా వాడుక అయినందుచేత లక్ష్యాలు ప్రబంధాదులనుండేవి యెత్తి వ్రాయలేదు. తక్కిన ప్రాసములకు వ్రాయవలెను గనుక వ్రాస్తున్నాను;' 101-శకారములు మూఁడు ఒక సకారమయినా, సకారములు మూఁడు ఒకశవర్ణమయినా ప్రాసములుంచి పద్యములు చెప్పవచ్చుననుట.' 112-'అని...ఉదాహారణములున్నవి గనుక సూచనగా వ్రాయడమయినది.' 112-'అని వున్నది గనుక ఈజాడను అన్నిటికీ తెలుసుకోనేది.' 128-'ఈ జాడను అన్నీ తెలుసుకోనేది.' 170-'వానియం దచ్చుకు హల్లుకు రెంటికి యతి చెల్లును' 194-'వాటికి యతి చెప్పితే వికల్పయతి అని పేరు.' 201-'ట, ఠ, డ, ఢ, త, థ, ద, ధ, ప, ఫ, బ, భ యీ పండ్రెండక్షరములకు దాపల సున్నలుంటే ణకార నకార మకారములకు వరుసగా యతులు చెల్లును.' 217-'అని యనేక ప్రబంధములయందుఁ జాలా చెప్పియున్నది గనుక సూచనవ్రాసినాను.' 232-'అలాపశబ్దమధ్యవర్ణమగు లకారమునందు స్వరముకూడా గలసియుండుటచేత అలకారము యతి వచ్చుతావున అచ్చుకు హల్లుకు యతి చెల్లును.' 240-అక్షరానికి సావత్తు హావత్తు మావత్తు వలపలగిలుక క్రారవడి యివి మొదలైన వర్ణము లేవికూడియుండినా ఆజాతియక్షరములుకూడా యతులు చెప్పవచ్చును."

## శ్రీకృష్ణభూపాలీయము.

[ఇది మైసూరురాజ్యంలోని కోలారు వాస్తవ్యుడయిన చంద్రకవి రచించి నూరేండ్లక్రిందట మైసూరుమహారాజా శ్రీకృష్ణరాజ వొడయరు వారికి అంకితముచేసిన లక్షణగ్రంథము. ఈసంవత్సరము (1924) మైసూరు మహారాజావారికళాశాలలో తెలుగుపండితులు విద్వాన్ అనంతకృష్ణశర్మగారు

దీనిని పరిష్కరించి అచ్చువేయించినారు. ఈగ్రంథమందు అవతారికలు, వివరణములు మొదలుగాగలవచనముల సంఖ్యకొంచెము; అవి మిక్కిలి చిన్నవి. వాటిలో గ్రంథకర్త వాడినవ్యవహారికభాషకు ఉదాహరణములు:]

(1) 59 వ పుటలో—"అన్నన్న మొగము వెన్నుని, యన్నన్న జయించు...అను నీపద్యమునందు వెన్నుని అన్న అన్న అనేటప్పుడు నుగా మను రావలయును గావున విచారించఁదగినది."

(2) 75 వ పుటలో—"వీటియందు ఛందోవిరోధంబు గనుక లోపంబు నిత్యంబు."

(3) 81 వ పుటలో—"మఱియును 'ఆదంతేసాదిశబ్దే' అని నియ మము నంగీకరించునప్పుడు 'సంతోషము పెట్టి' అనేరూపము సమముగాదు."

(4) 82 వ పుటలో—"ప్రియంపడి అనేటందుకు అరణ్యపర్వము నందు 'భూసురకోటి'."

(5) 104 వ పుటలో—"ఈపద్యమునందు కొందఱు 'రోలంబాలక' యని చదువుదురు; అయితే నేమి..."

## ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము

పుదూరి సీతారామశాస్త్రిరచించినది - అచ్చుప్రతి - 1834 సం॥

### హలంతప్రకరణము.

౧. ప్ర—హలంతశబ్దంబు లెన్నివిధంబులు.

ఉ—అగుణవర్ణప్రవిష్టంబులు - గుణవర్ణప్రవిష్టంబులు - ఉభయ గణప్రవిష్టంబులని - మూడువిధంబులు.

౨. ప్ర—వాఁటికి నజంతంబులకుం బలె మహదమహద్భేదంబులున్ విభక్త్యాది కార్యంబులుంగలవా.

ఉ—కలవు.

౩. ప్ర — అగుణవర్ణన ప్రవిష్టంబులు తెనుఁగు విభక్తులకు ముందుగా నేలాగున నిల్చియుండును.

ఉ — సంస్కృత ప్రథమైక వచనాంతంబులతో సమంబులుగా నిల్చియుండును.

౪. ప్ర — వాఁటికిసన్ని విభక్తులయందు నేమివిశేష కార్యంబు వచ్చును.

ఉ — వాటితుదనున్న హల్లులకు నన్నిటికి న్నన్ని విభక్తులయందుఁ ద్విత్వోత్వంబులుం వచ్చును - దీర్ఘముమీఁదనున్న యాహల్లులకే ద్విత్వము మాత్రము కొన్ని యెడలరాదు.

౫. ప్ర — వాఁటిలో ద్విత్వముగల వాఁటికిన్ని ద్విత్వములేని వాఁటికిన్ని యేమి విశేషకార్యంబు.

ఉ — ద్విత్వముగలవాఁటికి ప్రథమైకవచనలోపము వచ్చును - ద్విత్వము లేనివాఁటికి ప్రథమైకవచనలోపము రాదు.

౬. ప్ర — వాఁటికి నుదాహరణంబు లేలాగు.

ఉ — ఇంద్రజిత్తు - భూభృత్తు - ఉపానత్తు - విరాట్టు - కకుప్పు - మరుత్తు ఇవి మొదలైనవి ద్విత్వముగలవాఁటికి నుదహరణంబులు - ప్రశానుఁడు - భగవానుఁడు - హనుమానుఁడు ఇవి మొదలయినవి ద్విత్వముంలాని వాఁటికి నుదహరణంబులు.

౭. ప్ర — గుణవర్ణన ప్రవిష్టంబులు తెనుంగు విభక్తులకు ముందుగా నేలాగునిల్చియుండును.

ఉ — సంస్కృత ద్వితీయైక వచనాంతంబులతో సమంబుగా నిల్చియుండును.

౮. ప్ర — వాఁటికి కార్యంబులుఁ రూపంబులుం న్నేలాగు.

ఉ — వాఁటికి నజంతంబులకుంవలె మహాత్వా మహాత్వాభేదముచేత డుపర్ణకము వణ్ణకాది కార్యంబులుఁ రూపంబులుఁ వచ్చును.

౯. ప్ర — వాఁటికి నుదహరణంబు లేలాగు.

ఉ—అనడ్వాహము - అనడ్వాహములు - గుణవంతుడు - గుణవంతులు - ఇత్యాదు లుదాహరణంబులు.

## గురుమూర్తివ్యాకరణము, 1836.

### సంధిప్రకరణము.

31. ఈ తెలుఁగుభాషయందు సకలమైనశబ్దములును కళలనియుం - ద్రుతప్రకృతులనియుం - రెండువిధములు॥

### కళలు

32. నేను తాను - అనుశబ్దములుతప్ప - కడమసమస్తమైన ప్రథమాంతశబ్దములున్ను - ఇప్పుడు - తటము అని క్రొత్తగా పేరుపెట్టఁబడ్డ తృతీయాదివిభక్తులకు పూర్వమునందలి రూపమున్ను - సమాసమునందు పూర్వపదమున్ను

కూర్చి-గురించి-కై-కొరకు-కొరకును-పట్టి-పట్టుఁడి-చేసి - నుండి - నుంచి-యొక్క-యొక-నిమిత్తము-విషయము-ఈవిభక్తులున్ను.

శబ్దములతుదనుండి - నీవు చూచితివా - నీవు చూచితివె - నీవు చూచితివే - ఇత్యాదులయందు ప్రశ్నార్థకములైన అకార ఎకార ఏకారములున్ను నేనచూచితి-ఇతఁడె కొట్టెను - అప్పుడే పోయెను - ఇత్యాదులయందు ఏవకారార్థకములైన-అకార ఎకార ఏకారములున్ను। అతఁడు వచ్చునో రాఁడో - అతడు వచ్చునోరాఁడో ఇత్యాదులయందు సందేహార్థకములైన ఒకార ఓకారములున్ను।

విభక్తులను జేరఁగూడని - అట - కడ-మటీ-వీలా-ఊరక-ఇంచుక-అంత-ఇవి మొదలుగాఁగలమాటలున్ను।

ఔరా ఓహో ఇత్యాదులైన ఆశ్చర్యార్థకశబ్దములున్ను - భళి - శాబాసు - ఇత్యాదులైన ప్రశంసార్థకశబ్దములున్ను - అకట అయ్యో -

ఇత్యాదులైన సంతాపార్థకశబ్దములున్ను సంబోధనప్రథమాంతములున్ను అపుడు-ఇపుడు-ఎపుడు అనేమాటలున్ను।

ఁడు-దు-ది-వు-వి-రు-రి-ము-మి-మో-ఁడీ-అనువర్ణములు అంతమందు గల క్రియాపదములున్ను। వర్తమానభూతార్థములయందు కొట్టుచున్నాను కొట్టినాను-అనునవి మొదలుగాఁగల ఉత్తమపురుషైకవచనాంతములున్ను। కొట్టి-చేసి-అనునవి మొదలుగాఁగల క్త్వాప్రత్యయాంతములున్ను। కొట్టుచున్న-చేయుచున్న-అనునవి మొదలుగాఁగల వర్తమానార్థవిశేషణములున్ను-కొట్టిన-చేసిన-అనునవి మొదలుగాఁగల భూతార్థవిశేషణములున్ను కొట్టని-చేయని-అనునవి మొదలుగాఁగల వ్యతిరేకతద్ధర్మవిశేషణములున్ను-హల్లుపరమైనప్పుడు కొట్టెడి-కొట్టెడు-కొట్టు-అనునవి మొదలుగాఁగల తద్ధర్మవిశేషణములున్ను ఇవి అన్నియున్ని కళలు - అని చెప్పఁబడుచున్నవి॥

## ద్రుతప్రకృతులు

33. కళలు అనేతరగతిలోఁ చేరని - ఈభాషయందలి సమస్తశబ్దములున్ను-ద్రుతప్రకృతులనఁబడును। ద్రుతమనఁగా నకారము-అది కొనయందుఁ గలిగినశబ్దములు ద్రుతప్రకృతులు॥

34. కొట్టక-చేయక - అనునవి మొదలుగాఁగల వ్యతిరేక క్త్వా ప్రత్యయాంతములు - కళలలోను ద్రుతప్రకృతులలోనుం జేరుచున్నవి।

35. తెలుఁగుభాషయందు రెండచ్చులు - అవ్యవహితములుగానుండవు కాఁబట్టి అజంతశబ్దమునకు అజాదిశబ్దము పరమైనప్పుడు సంధియైనావచ్చును-సంధిరానిపక్షమందు రెండుశబ్దములనడుమను యకారమైనా ద్రుతమైనా వచ్చును - అనఁగా ఆరెండుశబ్దములలోఁ పూర్వశబ్దము కళలలోఁ చేరియున్నట్టయితే యకారమున్ను ద్రుతప్రకృతులలో చేరియున్నట్టయితే నకారమున్ను - వచ్చును। ఉదహారణ। హరి - అతఁడు-హరియతఁడు। చూచె - ఇతడు - చూచెనితడు.

36. సంధియనఁగా పూర్వశబ్దముయొక్క తుదనుండెడు నచ్చుకున్ను - పరశబ్దముయొక్క మొదటనుండెడు నచ్చుకున్ను లోపమువచ్చి - ఆరెంటి స్థానమునందు పరశబ్దాదియందుండెడు నచ్చు ఆదేశముగా రావడము.

37. ద్రుతప్రకృతికశబ్దమునకును - హ్రస్వములైన వక్రములకును - అనఁగా ఎ-ఒ-అనువర్ణములకును - దీర్ఘాచ్చులకును - అచ్చుపరమగు నప్పుడు సాధారణముగా సంధిరాదు - విశేషవిధియున్నచోట వచ్చును॥ ఉ॥ నాచేతనయ్యె। హరిసీత్తుంచె॥ రాముసీత్తుంచె । ఇతఁడెయేమొ యీశ్వరుఁడు । నేజాయది । గాడీయిది । శాలాయిచ్చె । ఇతఁడే యేమో యింద్రుఁడు । చైయిచ్చెగ్గాయుందయిరచె ॥

## శేషయ్యవ్యాకరణము

### 1857. విద్యాధికారులే అచ్చువేయించినారు.

### (దీనిలోని వ్యావహారికభాష 1875 వ సం॥ కూర్పులో గ్రాంథికభాషగా మార్చివేసినారు)

### సంధిప్రకరణము

౧౨. తెలుగుభాషయందు సమస్తశబ్దములు - కళలు అనిన్ని-ద్రుత ప్రకృతులనిన్ని రెండువిధములుగా ఉన్నవి.

౧౩. నేను తాను అనేశబ్దములుతప్ప తక్కినసమస్తప్రథమా విభక్తులున్ను - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అనేమాటలున్ను - కొట్టుచున్న - చేయుచున్న - కొట్టిన - చేసిన - మొదలైన వర్తమానభూతార్థకవిశేషణములున్న కళలు।

౧౪. తక్కినవి ద్రుతప్రకృతులు-అనగా నకారము కొనయందుగల శబ్దములు - ఉ। కొట్టితిన్-అడిగెన్-ఇత్యాదులు.

౧౫. సంధి అనగా పూర్వశబ్దముయొక్క చివరనుఉండే అచ్చు లోపించి ఆస్థానమునందు పరశబ్దముయొక్క మొదటవుండే అచ్చురావడము.

౧౬. అ-ఇ-ఉ-అనే అచ్చులు అంతమునందుగల శబ్దములకే సంధి వచ్చును-తక్కిన శబ్దములకు సాధారణముగారాదు.

## శేషయ్యవ్యాకరణము 1875.

(1857 సం. మొదటికూర్పులో గ్రంథకర్త తనగ్రంథము వ్యవహారిక భాషలోరచించినట్టు స్పష్టముగా కనబడుతున్నది. ఈకూర్పులో అభాష "గ్రాంథికముగా" మారిపోయినది. తైషాదువేసి చూడవచ్చును)

### సంధిప్రకరణము

౧౨. తెనుగుభాషయందు సమస్తశబ్దములు కళలు - అనియు-ద్రుతప్రకృతులు అనియు రెండువిధములుగా ఉన్నవి.

౧౩. నేను-తాను అనుశబ్దములుతప్ప తక్కినసమస్తప్రథమావిభక్తులును-అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు అనుమాటలును - కొట్టుచున్న-చేయుచున్న-కొట్టిన-చేసిన - మొదలైనవర్తమానభూతార్థకవిశేషణములును కళలు.

౧౪. తక్కినవి దృతప్రకృతులు-అనగా నకారము కొనయందుగల శబ్దములు. ఉ. కొట్టితిన్. అడిగెన్ ఇత్యాదులు.

౧౫. సంధి అనగా పూర్వశబ్దముయొక్క చివరను ఉండు అచ్చు లోపించుట.

౧౬. అ-ఇ-ఉ-అనెడిఅచ్చులు అంతమునందుగలశబ్దములకే సంధి వచ్చును. తక్కినశబ్దములకు సాధారణముగారాదు.

సంధిరానిచోట ద్రుతప్రకృతికముమీఁదిఅచ్చునకు నకారమును కల మీఁదిఅచ్చునకు యకారమును కూడివచ్చును.

## ౧౨

# బడిపుస్తకములు

## పెద్దబాలశిక్ష

[ఇది ఇంచుమించుగా 90 సంవత్సరములక్రిందట పుదూరి సీతారామ శాస్త్రిగారు చిన్నపిల్లలకు లోకవ్యవహారానుసారముగా తెలుగు నేర్పుటకుగాను రచించినారు. ఇది ఇప్పటివారు ఇష్టమువచ్చినట్టూ మార్చివేసినారు. వీరే ప్రశ్నోత్తరవ్యాకరణము 1834 వ సం॥లో వ్యావహారికభాషలో రచించినారు - చిన్నయసూరికి పూర్వమందు ఇదే సంప్రదాయము. మాదిరికి పెద్ద బాలశిక్షలోనివి కొన్నివాక్యము లుదాహరిస్తాను.]

అంకెతప్పవేయవద్దు. అన్నమాటతప్పవద్దు. కొండెముచెప్పువానితో పగచేసుకొనరాదు. కోటివరహాలువచ్చినా హీనుని కొలువరాదు. హరిశ్చంద్రుడు ఇక్ష్వాకువంశపురాజు సత్యముపలికేవాడు. కామధేనువు సమస్తము నిచ్చేది. విషము జీవులచంపేవస్తువు. అన్నదానముచేసేవారికి ఉపద్రవము చేయడము, చెరువులు తెగగొట్టడము, బిడ్డలకు చదువునేర్పకపోవడము, ఇవి ద్రోహకార్యములు. సముద్రముమీద వర్షముకురియడము, ఆకలిలేనివానికి భోజనముపెట్టడము, కలిగినవారికి దానముచేయడము వ్యర్థము. విద్యవచ్చిన వానికిన్ని విద్యరానివారికిన్ని రూపమొకటిగానున్నను విద్యవచ్చినవాడే మేలు. హంసకున్ను కొంగకున్ను రూపమొకటిగానున్నను నీళ్లతోగలసినపాలు వేరుపరచే హంస మేలుగదా.

పురుషసాముద్రికలక్షణము—పురుషులకు నేత్రలలాటవక్షములు విశాలముగానుంటే భాగ్యవంతుడగును. బాలురకు ప్రశ్నలెక్కలు: ఒక మని

షికి ఒకదినమునకు కూలి ౩ అణా ౮ పై వంతున ౧౯ మనుష్యులకు కూలి మొత్తమెంత. ఒక ప్రభువునకు ౧౨౦౦౦ రూ ఆస్తి వుండెను. అందొక కూతురు పెండ్లికి ౩౩౨ రూ లున్ను మరియొక కూతురికి ౭౮౮ రూ సెలవుచేసి తనకొమాళ్లు ౯ మందికి యిచ్చిన ఒకని కెంతవచ్చును. జాబులువ్రాయుం పక్కణము:— శ్రీమతు ఫలానివారు నాపుత్రుడగు చిరంజీవి ఫలానివారికి సకల శ్రేయస్సులు కలుగునటుల ఆశీర్వదించి వ్రాయడమేమన్నను—శ్రీమదఖండ... మహారాజశ్రీ – సంపన్నులగు ఫలానివారికి...ఫలానివారు...అనేక వేదోక్తాశీర్వచనములు చేసి చేయంగల విన్నపములు. మేమున్ను యిచ్చట...క్షేమము అచ్చట తమ సకలసామ్రాజ్యలక్ష్మీవిభవాతిశయములు వ్రాయించి పంపుతురావలెను. వైష్ణవులు వ్రాసుకొను క్రమము: శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంతప్రవర్తకులైన...అస్మత్స్వాములై అడియేనికి ప్రాప్యప్రాపకభూతులై వేంచేసియుండే శ్రీమాన్ ఫలానివారి తిరువడితామరలసన్నిధి దాసన్ దాసానదాసన్...ఫలానివాడు...అనంతదండములు సమర్పించి—

## మహమ్మదుచరిత్ర. 1. అధ్యాయము.

### మహమ్మదుయొక్క పుట్టుక మొదలు ఖాదిజాను పెండ్లి చేసుకొనువరకు.

[ఇది M. R. T. & B. S. Series లో సెం 23 రు – మహా పురుషులజీవితములు పిల్లలకోసము వ్యావహారికభాషలో రచించేవారు. అందుకు మాదిరి ఈచరిత్రలోని రెండధ్యాయములు ఉదాహరిస్తున్నాను.]

ఆసియాఖండములో పశ్చిమదిక్కునవున్న అరబ్బీదేశమందు ఒక మైలు వెడల్పును రెండుమైళ్లు నిడుపుగల మక్కా అనుపట్టణ మొకటి గలదు. ఈపట్టణము మహమ్మదుయొక్క జన్మభూమి. దీనిలో ఈయన క్రీస్తు పుట్టినతరువాత 570-వ సంవత్సరమందు పుట్టెను. ఈయన కొరేషీయుల

గోత్రమువాడు. ఈగోత్రమువారు అరబ్బీదేశస్థులందరిలో గొప్పవారు. వీరు మక్కాయందున్నట్టి కాబా అనెడి అరబ్బీలగుడికి పూజారులును సంరక్షకులును అయియుండిరి. వీరిలో ముఖ్యుడు హాషేమనువాడు. హాషేము చనిపోయినతరువాత, అతని కొడుకైన అబ్దుల్మతలబు అనువాడు కాబాయొక్క సంరక్షణకు వారసుడాయెను. ఈయనకు కుమారులు అనేకులు ఉండిరి. వారిలో అబుతలేబు, హంజా, అబ్దొల్లా అనువారు ముఖ్యులు. అబ్దొల్లా కొరేషు గోత్రస్థురాలే అయిన అమీనాను వివాహముచేసికొనెను. అబ్దొల్లా బహు సౌందర్యవంతుడు గనుక ఆయన అమీనాను పెండ్లాడినప్పుడు కొరేషు గోత్రములో 200 కన్యకలు ప్రేమాభంగముచేత చనిపోయిరని మహమ్మదీయులు చెప్పెదరు. వీరిద్దరికి మహమ్మదు అను ఒక్కడే కొడుకుపుట్టెను. మహమ్మదు చిన్నవాడైయున్నప్పుడే అతని తలిదండ్రులు చనిపోయినందున అతడు తనతాతయైన అబ్దుల్మతలబువల్ల పెంపబడెను. అయితే ఈయన ముసలివాడైనందున త్వరగానే చనిపోయెను గనుక, తన పెత్తండ్రియైన అబుతలేబు ఇంటిలో మహమ్మదు ఉండేవాడు.

కాబాకు పూజకులైనవారివల్ల మహమ్మదు పెంపబడినందున, చిన్నప్పటినుండి మతసంబంధములైన సంగతులను చక్కగా తెలిసికొనెను. ఈయనకు వ్రాయుటేగాని చదువుటేగాని చేతగాకపోయినప్పటికిని, సూక్ష్మబుద్ధిగలవాడైయుండుటచేత ఇతడు చాలాసంగతులను చూచుటవల్లను వినుటవల్లను నేర్చుకొనెను. అబుతలేబు వర్తకవ్యాపారములనుగురించి దమస్కు, బాగ్దాదు, బాస్రా అనుపట్టణములకు వెళ్లినప్పుడు 12 ఏండ్లవాడైన మహమ్మదుకూడా ఆయనతో వెళ్లేవాడు. ఒకసారి బాస్రా అనుఊరికి వారు వెళ్లినప్పుడు, బహైరా అను ఒక క్రైస్తవుడు మహమ్మదుతో సంభాషించి, మహమ్మదు చాలా తెలివిగల చిన్నవాడని తెలిసికొని, అతడు ముందుకు గొప్పవాడగునని అబుతలేబుతో చెప్పెను.

తరువాతను మహమ్మదు వర్తకముచేయుటకు అనేకపట్టణములకు వెళ్లుచును, కొన్నిసారులు తన పెత్తండ్రియొక్క విరోధులమదమును అణచుచును ఉండేవాడు.

మహమ్మదు 25-ఏండ్లవాడైయున్నప్పుడు, ఈయననుగురించి ఖాదిజా అను ఒక భాగ్యవంతురాలైన విధవరాలువిని, ఈయనను తనవ్యాపారమును జరిపేవానినిగా చేసికొనెను. తన యజమానురాలిపనిని, మహమ్మదు చక్కగా నెరవేర్చేవాడు గనుకను, అతడు మిక్కిలి చక్కనివాడు గనుకను, ఖాదిజా ఆయనను పెండ్లిచేసికొనగోరెను. అయితే ఆయన బహు బీదవాడైనందున కొందరికి ఈసంగతి ఇష్టములేకపోయెను. అయినను ఆమె తన ఇష్టముచొప్పుననే ఆయనను పెండ్లాడెను. పెండ్లియైనప్పుడు ఆమెకు 40-సంవత్సరములవయస్సు ఉండెను. ఈవివాహమువల్ల మహమ్మదు చాలా భాగ్యవంతుడయ్యెను.

## మహమ్మదుచరిత్ర. 6 వ అధ్యాయము.

## మహమ్మదుయొక్క స్వభావము.

మహమ్మదు సాధారణమైన పొడుగుగలవాడును మంచిదండపుష్టిగలవాడును పెద్దచేతులును పెద్దపాదములునుగలవాడును అయియుండెను. యౌవనమందు ఆయన అపరిమితమైనబలముగలవాడు. పెత్తనమందుస్థూలదేహి అయ్యెను. ఆయనరొమ్ము విశాలమైనది. ఆయనతల పెద్దదియును చక్కనిదియును అయియుండెను. ఆయన గుండ్రనిముఖమును చక్కని ముఖవైరియును గరుడముక్కును నల్లనికండ్లును ముడిపడే కనుబొమ్మలును వాగ్ధాటిని తెలిపే పెద్దనోరును కొంచెము ఎడఎడముగా నుండేటటువంటివిన్ని ఎగుడుదిగుడుగా నుండేటటువంటివిన్ని తెల్లనిపండ్లవరుసయును భుజములమీదపడుచుండెడి నల్లని తలవెంట్రుకలును నిండయినటువంటివిన్ని పొడుగయినటువంటివిన్ని దాడియునుగలవాడై యుండెను.

ఆయన చాలా నింపాదియైన మనిషి; గంభీరమైన చూపుగలవాడు; ఆయనకు దివ్యమైన ముఖవర్చస్సు ఉండెను.

ఆయనయొక్క మనో (శక్తి) పటుత్వము ఇంతంతకాదు. ఒక్కక్షణములో సంగతిని గ్రహించేవాడు. అద్భుతమైన జ్ఞాపకశక్తిగలవాడు; కల్పనాశక్తియందు కుశాగ్రబుద్ధిగలవాడు. విస్తారము చదువుకొనకపోయినప్పటికిని తాను అనేకసంగతులను స్వతహాగా నేర్చుకొనెను. అతడు చక్కని ప్రసంగము చేసేవాడు. ఆ ప్రసంగములయందు అరబ్బీసామెతలను విస్తారముగా నుపయోగించేవాడు. ఆయనకు రమ్యమైన కంఠస్వరముండేది.

ఆయనమితాహారి; తరుచుగా ఉపవాసము చేసేవాడు; సాధారణమైన బట్టలు కట్టుకొనేవాడు; పాగాచుట్టుకొనేవాడు; దానిని చుట్టుకొనడములో ఒకకొంగును వీపుమీదుగా జారవిడిచేవాడు. దూతలుకూడా పాగాలుచుట్టుకొందురనిన్ని ఆయనయొక్క తాత్పర్యమై యుండెను.

అచ్చుపట్టువస్త్రములను ఎర్రబట్టలను కట్టుకొనకూడదనిన్ని బంగారు ఉంగరములను పెట్టుకొనకూడదనిన్ని ఆయన చెప్పెను. ఆయన బహుశుభ్రముగా నుండేవాడు. "స్త్రీలును సుగంధద్రవ్యములునుమాత్రమే నాకు ఈ లోకములో సంతోషకరములు. ఈరెండును నాకండ్లను ఆనందపరుచుచున్నవి. నాభక్తిశ్రద్ధలయందు నేను మిక్కిలి ఆసక్తికలిగియుండేటట్టుగా చేయుచున్నవి." అని ఆయనచెప్పెను. ఆయన భార్యలందరు ఎందరో నిశ్చయముగా తెలియదు; 25 గురు అని కొందరు చెప్పుదురు. 15-గురు అని అబుల్ఫేదా అనే అరబ్బీచరిత్రకారకుడు వ్రాసియున్నాడు. మహమ్మదు చనిపోయినప్పుడు ఆయన భార్యలలో తొమ్మిదిగురు జీవించియుండిరి. ఆయన బిడ్డలందరిలో అలి భార్యయైన ఫతీమా అనేకూతురు మాత్రము ఆయన చనిపోయినకాలమందు బ్రతికియుండెను. మహమ్మదుయొక్క సంతతివారిలో ఆమెయొక్క పెద్దకొడుకైన హుస్సేనుమాత్రము తర్వాత కలీఫా అయ్యెను.

మహామ్మదు మిక్కిలి న్యాయస్థుడు. స్నేహితులు, అన్యులు, భాగ్యవంతులు, బీదలు, బలాఢ్యులు, బలహీనులు మొదలైనవారందరియెడలను ఆయన బహున్యాయముగా నుండేవాడు; గనుక, అనేకులు ఆయనను ప్రేమించిరి. ఆయన స్వాభావికముగా కోపిష్టియైనను తనకోపమును ఎల్లప్పుడును అణచివేసెను.

## భూగోళము.

(ఇది ఉపయుక్త గ్రంథకరణసభవారిచేత ప్రచురము చేయబడెను. మూడవకూర్పు 1856.)

### తురష్కము.

రోమకసంస్థానము క్షీణించుచుండగా దానిచక్రవర్తులలో ఒకడయిన కనస్టాన్టైన్ దిగ్రేటు అనువాడు రోమకపురినివిడిచి కనస్టాన్టినోపిలు అనుపట్టణమును తనరాజధానిగా చేసుకొనెను. అదిమొదలు బహుకాలము వరకు రోమకమహారాజ్యముయొక్క తూర్పుదేశముల చక్రవర్తిత్వము అక్కడ ఉండినది. పిదప క్రీ. శ. ౧౪౫౦ వ సంవత్సరములో తురుష్క మహామ్మదీయులు ఈదేశమున చొరబడి దీని స్వాధీనపరుచుకొని అదిమొదలు దీని ఏలుచున్నారు. వీరిచక్రవర్తి సుల్తాను గ్రాండుసీనియరు అనేగొప్పనామమును వహించుచున్నాడు.

### గ్రీసు.

ఇది పూర్వమునందు విద్య నాగరికము మొదలయినవాటిచేత ప్రసిద్ధి చెందిన దేశములుకలదిగా ఉండెను. ఇది బహుకాలమువరకు రోమకరాజ్యమునకును తురుష్కరాచరికమునకును లోబడిఉండి సుమారు ౨౫ సంవత్సరములకుముందు ఇంగ్లాండు ఫ్రాన్సు మొదలైనదేశస్థులసహాయముచేత స్వతంత్ర రాచరికముకలదిగా చేయబడినది.

# భూగోళశాస్త్రము 1852.

(ఇది నరసాపురము పాఠశాలోపాధ్యాయుఁడు 1840 సం. రచించినది బడిపిల్లలు తాటాకులమీద వ్రాసుకొని చదివేవారట. 1852 సం. న అచ్చు పడ్డది.)

## పీ ఠి క.

భూగోళవివరము యితరమైన విద్యలలో విశేషమైన విద్యయైయుండ్గా మనము దాని శ్రద్ధగాబోధపఱచుకొనడము యుక్తముగానున్నది. మనముండే ఈభూగోళముయొక్క సృష్టినిన్ని, వాటియొక్క పోషణయున్ను, దాని మీదనుండే సముద్రములు, నదులు, మడుగులు, పర్వతములు, కొండలు, లంకలు మొదలయినవాటియొక్క మూలమున్ను, దానియందంతటా కలిగిన వేరేవేరేమనుష్యులున్ను, వారియొక్క విద్యలున్ను మతములున్ను యాచారములున్ను, వాటియొక్క భేదములున్ను, యివిమొదలైనవాటినిగురించి విచారించుకొనడము యుక్తముగానున్నది. ఏదేశస్థులు, యితరమైన విద్యలతో, నీ విద్యను బాగానెరిగియున్నారో, వారు యీభూగోళముమీద గొప్పవారని యనిపించుకొంటున్నారు; యేదేశస్థులు దీని నెరుగకుండానున్నారో, వారన్ని విషయములయందు హీనులనిపించుకొంటున్నారు. అయితే భూగోళవివరముతో కూడా లోకచరిత్రను విచారించుకొనవలసినది. అన్ని కార్యములకు నొకకర్త యుండవలెనని యేలాగు తెలిసినదో, యీభూగోళముయొక్క సృష్టినిగురించిన్ని, దానిమీదనుండే సమస్తజీవరాశులయొక్క సృష్టిపోషణలనుగురించిన్ని విచారిస్తే, నీయావత్సృష్టికి నొకసృష్టిపోషణలకర్త యుండవలసినదని మనకు బోధపడుతున్నది. ఈభూగోళముయొక్క ప్రమాణమునుగురించిన్ని, దీనికి వెలుగునిచ్చే సూర్యచంద్రనక్షత్రముల ప్రమాణమునుగురించిన్ని, భూగోళము చుట్టుకలిగిన యాకాశమందుపుట్టేగాలి మేఘము వర్షము మొదలయినవాటిని

గురించిన్ని విచారిస్తే యీసృష్టిపోషణలకర్త యపరిమితశక్తి జ్ఞానదయలు గల వాడైయున్నాడని కనపడుతున్నది.

## RAILWAYS AND THE STEAM ENGINES (1856)

౧ పటముచూస్తే—పొగయంత్రముచేత అనేకమైనబండ్లు కమ్మితోవమీద లాగబడుతూవున్నవి. కుడిపక్కను నె ౧ పొగయంత్రమువున్నది. దానిమీద బండివాడునిలిచి అక్కరకొద్దీ దాని నిలుపుటకైనా తోయుటకైనా సిద్ధముగా వున్నాడు.

నె ౨. ఆవిపుట్టించుటకు బొగ్గునీళ్లుగల బండివున్నది. దానిమీద వొక నౌకరు నిలుస్తున్నాడు.

నె ౩. ఇది సామానుగల పెద్దబండి—దానికి హానిరాకుండా అది బాగా కప్పబడియున్నది.

నె ౪. పశువులగలబండి. అది కమ్మితోవమీద కష్టములేకుండా శీఘ్రముగా దూరమైనసంతలకు తీసుకపోబడుతున్నది.

నె ౫. ఇదితక్కువకూలి యిచ్చేవారికొరకైన వొకబండి పొగయంత్రముదగ్గిరవుండేవి రెండో మూడో రకములబండ్లు అంటారు.

నె ౬. ఇదియెక్కువకూలియిచ్చే గొప్పదొరలకు పసందుగా చేయు వొకబండి. యంత్రమునకు దూరముగా వుండేవాటిలో బహుసుఖముగా కూర్చుండవచ్చును.

నె ౭. ఈబండిలో ప్రయాణస్తుల సామానులున్ను యితరమైన చిన్న పెట్టెలు మొదలైనవిన్నివుండును. దానిమీద నిలిచేవాడు కావలివాడు—అదంతా ఆయనవశములో వుండును.

౨ పటము.

బండ్లు ఆవియొక్కశక్తివల్ల నడిపించబడేవిధము తెలిపేకొరకు ఆవియంత్రము యీపటములో వ్రాయబడియున్నది. దిగువ వ్రాయబడుతున్న వివరము

శ్రద్ధగా చదివితే ఆవింత సుళువుగాగ్రహించవచ్చును. దానిమీద వ్రాయ బడిన అంకెలు చూడవలెను.

౧ అనేది నీళ్లుకాచి ఆవిపుట్టించే అగ్నికొలిమి.

౨, ౨, ౨, అనేది నీళ్లుగల గొప్ప యినుపబాణ- అది బండి అంత పొడుగున్ను వెడల్పున్ను గలది.

3, 3, 3 అనేవి యినుపగొట్టములు. వాటివల్ల వేడిమిన్ని పొగయున్ను అగ్ని కొలిమినుంచి బానలోబడి ౧౨, ౧౨ అనే పొగగూడుకు వస్తవి.

౪. అనేది బానమీదవున్న ఆవిగుమ్మటము. కాచేనీళ్లవల్ల పుట్టేఆవి అంతా దానిలో ప్రవేశిస్తున్నది.

౫, ౫, ౫ అనేది పొడుగైననాళము. బాణములు చూస్తిరా వాటి లాగున ఆవి ఆనాళములోబడి, ౬, ౬ అనే చిమ్మనగొట్టమువంటి పెద్దగొట్ట ములో ప్రవేశిస్తున్నది.

౬. అనేది (Cylinder ) పెద్దగొట్టము దానిలో ౭ అనేది గజము తల (Piston) నీళ్లు చిమ్మేదానివలె ఆడుతున్నది. ఆవి దానియెడమపక్కకు చేరితే ఆవిశక్తివల్ల అదికుడిపక్కకు తెప్పున కొట్టబడును.

౮. అనేది వొకమూత. అదియినుపగజమువల్ల యిటు అటు జారు తున్నది దాని దగ్గిరవున్న రెండుబానలు నాళమునుంచి చూపించే చిన్నతో వలు వున్నవే, వాటివల్ల ౫, ౫, ౫ అనేచిమ్మనగొట్టములో ఆవిచేరి గజము తలను ఆడించును. యేలాగంటే కుడిపక్కకువుండే తోవవల్ల ఆవిచేరే టప్పుడు దాని వ్యాపకగుణమువల్ల గజము యెడమపక్కకు తెప్పున కొట్టబడును. అయితే ఆవి ఆయెడమపక్కకు చేరగానే యంత్రసాధన వల్ల కుడితోవమూతవల్ల కప్పబడి యెడమతోవ తెరవబడును గనుక ఆవి యెడమపక్కనుచేరి గజముతలను కుడిపక్కకు తెప్పున తోసివేసును. మూత వల్ల వొకతోవ కప్పబడునప్పుడు రెండోది తెరవబడును గనుక ఆవి వొకసారి

యెడమపక్కనుచేరి కుడిపక్కకున్ను తరువాత కుడిపక్కనుచేరి యెడమపక్కకున్ను గజముతలను వెనుక ముందు కొట్టుటవల్ల అది పొగతరహాపిడిచేత పెద్ద చక్రమును తిప్పుతున్నది.

౯. అనేది యినుపగజము. అది పొగతలకు అతకబడి ౧౦ అనేపిడిచేత ౧౬ అనే పెద్దచక్రము తిప్పుతున్నది.

౧౦. అనేది క్రాంక్ (Crank) అంటారు. అదివల్ల వెనుకముందు కొట్టబడే యినుపగజము దీనివల్ల పెద్దచక్రము త్రిప్పుతున్నది.

౧౧. అనేనాళమువల్ల అక్కరలేని ఆవి వెళ్లిపోవును.

౧౨. అనేది పొగగూడు. పొగధూళి మొదలైనవి ౧ అనే అగ్ని కొలిమిలోనుంచి ౩, ౩ ౩ అనేనాళములలోబడివచ్చి దీనివల్ల వెళ్లి పోవును.

౧౩ అనే రెగ్యులేటర్ (Regulator) అని చెప్పబడిన పొగపిడి. దీనివల్ల బండివాడు కావలసినప్రకారము ఆవి విడువవచ్చును కట్టవచ్చును. దానికిందికొనసువున్న పొగముడి ౫ అనే ఆవినాళమును కావలసినప్పుడు తెరుచును కావలసినప్పుడు మూసివేసును.

౧౪. అనేది రక్షకమైనమూత (safty value) అంటారు. వేడిమి అధికమైతే ఆవి అధికమైనశక్తితో వ్యాపించును గనుక పెద్దచక్రము తిప్పుటకు కావలసినదానికంటే యెక్కువశక్తి గొప్పవేడిమిచేత పుట్టితే ఆయెక్కువ ఆవిని వదలవలెను. లేనిపక్షమందు బానపిగిలి దగ్గిరవున్నవారందరు చచ్చిపోదురు. కాబట్టి మరిగేనీళ్లుగలబానలో పొగతోవవున్నది. దానిమీద నిర్ణయించబడిన గొప్పబరువైనా లేక మీటైనాగల మూతవున్నది. ఆవికి కావలసినంతబలము మాత్రమేవుంటే ఆబరువువల్ల మూత అదమబడును. అయితే ఆవి యెక్కువైతే ఆబరువునైనా మీటనైనా యెత్తి ఆతోవవల్లపోవును.

౧౫. అనేది పొగతరహాపిల్లంగ్రోవి. దానికింద అగుపడే పిడివల్ల బండివాడు దానిలోకి ఆవిని చేరనివ్వవచ్చును. అప్పుడు కొన్నిక్రోసులదూరముగా

వినబడేధ్వని దానివల్లపుట్టును. యెవరైనా కమ్మితోవనువుంటే పొగబండ్లు వస్తూవున్నవని ఆధ్వనివల్ల తెలుసుకొని పారిపోవచ్చును.

౧౬. అనేది పైనచెప్పినప్రకారము ౬ అనే నాళములోవున్న ౭ అనే గజముతలవల్ల తిప్పబడేగొప్పచక్రము. అది తిప్పబడితే బండ్లన్నిన్ని నడుచును. ఈపటములో రెండుబండ్లచక్రములు అగుపడుతున్నవి అయితే వాటికి యంత్రముతో సంబంధ మేమిన్ని లేదు.

౧౭. అనేది బఫర్స్ (Buffers) అంటారు. ఇవివొకతరహా దిండు. బండ్లు వొకదానికి వొకటి సరిగాతగలకుండా ఆతంకపరుచును.

౧౮. అనేవి యినుపకమ్ములు. వాటికి 3 అంగుళములు వెడల్పున్ను ౬ అంగుళ పొడుగున్ను వుండవచ్చును. చక్రములు కమ్ములమీదనుంచి జారకుండా అవి చక్రములకైవారములో వున్నగాడికి సరిపరచబడును.

౧౯. ఇవి చేర్స్ లేక క్లాంప్స్ (Chairs or Clamps) అనగా గట్టిబందులు అంటారు. వీటివల్ల కమ్ములు కలుపబడును.

౨౦. ఇవి నేలమీదనున్నరాళ్లు వాటిమీద కర్రపాసములున్ను కమ్ములున్ను వుంచబడును.

## ELECTRIC TELEGRAPH

## ఎలెక్ట్రిక్ టెలెగ్రాపు అనగా మెరుపుటప్పా.

మెరుపుటప్పా అనగా పిడుగువలె వేగముగా వర్తమానములు దూరమునకుపంపించే యంత్రము ఈయంత్రమందు జరిగేశక్తిన్ని ఆకాశమందుఅగుపడే మెరుపున్ను యేకగుణముగలవి గనుక దానిని మెరుపుటప్పా అంటాము. ఇంగ్లీషులో దాని పేరు (Electricity) ఎలెక్ట్రిసిటి.

ఇనుము-భూమి-నీళ్లు మొదలైనవాటిమీద మెరుపు సులువుగా నడుచును. అయితే గాజు యెండినకర్రలు మొదలైనవస్తువులు దానితోవకు అడ్డముగావుంటే అవి దాని బలమువల్ల బద్ధలు చేయబడును. గొప్ప యినుపతీగె

రైనా గొలుసుఅయినా వొకగోపురముయొక్క శిఖరమునకు తగిలించబడి
అక్కడినుంచి భూమికి ప్రేలగట్టబడినట్టయితే పిడుగు - అనగా మేఘములో
నుంచి వచ్చే మెరుపు ఆగోపురముమీద పడేటప్పుడు అది ఆతీగెవెంబడి
భూమికివచ్చి దేనికిన్ని హానిచేయక భూమిలో వ్యాపించును. అయితే
మెరుపు గోపురముమీద పడునప్పుడు భూమికిపోయే అలాటి యినుపతోవ
దానికి లేకపోతే యిటికలు-రాళ్లు-సున్నము మొదలైనవి బద్దలైపోయి గొప్ప
నష్టము చేయబడును.

ఉప్పుతోనైనా గొంచెము గంధకపు అరకుతోనైనా కలిసిననీళ్లలో
సత్తుపలకనున్ను రాగిపలకనున్ను వొకదానికొకటి కొంతదూరముగా వుంచి
వాటిమీది అంచులకు యినుపతీగె తగిలిస్తే ఆతీగెవల్ల మెరుపు గొట్టములో
పారే నీళ్లవలె రాగిపలకయొద్దనుంచి సత్తుపలకయొద్దికి నడుచును. ఆతీగె
తెంపి రెండుకొనలు వొకదానికొకటి సమీపముగావుంచితే పటపటధ్వనితో
మెరుపు కనిపించును. ఆరెండుతీగెలు పదిఅంగుళములేగాని పదిక్రోసులేగాని
యెంతపొడుగు చేసినప్పటికిన్ని కొనలు కలుసుకొనిన లేక వాటిని మరి
రెండు లోహపు పలకలకు అతికించి ఆపలకలను అంతదూరముగా భూమిలో
పాతిపెట్టిన మెరుపురాగిపలకయొద్దనుంచి దానికి అతికించబడిన తీగెవెంబడి
పిడుగువలె యెగిరిపోయి భూమిద్వారా రెండోతీగెయొద్ద ప్రవేశించి దాని
వల్ల సత్తుయొద్దికి వెళ్లును. ఆతీగెలు మెరుపుతీగెలు అంటారు. ఆతీగెలు
మిక్కిలి పొడుగైనవైతే మెరుపు మిక్కిలి సత్తువగా నడువదు. అయితే
అనేకమైన సత్తురాగిపలకలు వొకపెట్టిలో వొకదానికివొకటి యినుపబద్దలతో
బంధించితే మరీ యెక్కువైనసత్తువగల మెరుపు పుట్టును. అప్పుడు దానిని
బట్టరి (Battery) మెరుపుపెట్టె అంటారు.

ఈదేశములో సత్తువగల కర్ర స్తంభములమీదవేయబడిన యినుప
తీగెలవల్ల మెరుపు వొకస్థలమునుంచి మరియొక్కస్థలమునకు కొంచుపోబడు
తున్నది.

అయితే తీగెలవెంబడి రప్పించబడే మెరుపు యేలాగు వాక్యములు తెలియచేసునని అడిగితే దాని గ్రహించుటకు దిగువ వ్రాయబడేసంగతులు శ్రద్ధగా చదువవలెను.

ఇనుము దాని ఆకర్షించే సూదంటురాతితో వొక యినుపముంటి మీదనైనా చిన్న ఉక్కుకమ్మిమీదనైనా రాయిబడితే ఆరాతిగుణము ఆ ముంటికిన్ని కమ్మికిన్ని అబ్బి అవికూడా యినుపవస్తువులను ఆకర్షించును. అంతేకాకుండా ఆరాతిని అంటినముల్లు వొకమొన సరిగా తూగి తిరిగేటట్టు వేస్తే అది వుత్తర దక్షిణలకు నిలుచును. ఇది (Mariner's Compass) నావికులకంపాసు అంటారు యెందుకంటే నావికులు దానివల్ల వుత్తరదిక్కు సులభముగా కనుగొంటారు.

మరియొకసంగతి జ్ఞాపకమందు వుంచుకొనవలెను. అది యేదంటే— పైని చెప్పబడిన మెరుపుకున్ను ఈసూదంటురాతి గుణశక్తికిన్ని వొకసంబంధము వున్నది యేమంటే మెరుపు వొకలాగున వెళ్లుతూవున్నప్పుడు యీరాతి గుణశక్తి దానికి అడ్డముగా నడచును. కాబట్టి పైన చెప్పినప్రకారము వొక ముల్లు వుత్తరదిక్కువైపువున్నప్పుడు మెరుపువచ్చేతీగె దానిమీద దానితో సరిగావేస్తే ఆముల్లు తక్షణమే తిరిగీ తూర్పుపడమరలవైపు నిలుచును. అయితే ఆతీగె మెరుపుపెట్టెను అంటకుండా వదలితే సూది తక్షణమే వుత్తరదక్షిణములవైపు తిరుగును. మెరుపువచ్చే తీగెవల్ల ముల్లు చాలామార్లు చుట్టబడితే దాని తిప్పేగుణము యెక్కువచేయబడును.

మరిన్ని సూదంటురాతిలో మరియొకగుణము అగుపడును. అది యేదంటే—సూదంటురాతిగుణముగల ముంటిమీదనున్న తీగెలవెంబడి మెరుపురాగిపలక యొద్దనుంచి సత్తుపలక యొద్దికి వస్తూవుండగా రాగివైపున వున్న కొన తూర్పు వైపున్ను సత్తువైపునవున్న కొన పడమటివైపున్ను తిరుగును. యేలాగంటే-రా-స-అనేది వుప్పునీళ్లలో వున్నరాగి-సత్తుపలకలు -

ఉ-వ-అనేది సూదంటురాతిగుణముగల వొకముల్లు-క-ప-ర-ఫ-ఖ-అనేది వొక యినుపతీగె.

అది రాగియొద్దనుంచి ఆముల్లుమీద వుత్తరదిక్కునుంచి దక్షిణ దిక్కుకు (వచ్చి) సత్తుపలకయొద్దికివచ్చి దానికి తగిలించబడును గనుక ముల్లు వుత్తరదిక్కునుంచి తూర్పువైపు అనగా కుడిపక్కవైపు తిరుగును. అయితే ఆతీగెలు వదలించి క-ప-అనేది చుక్కలవరసగా సత్తుకున్ను ఖ-వ అనేది చుక్కలవరసగా రాగికిన్ని తగిలిస్తే ముల్లు పడమటివైపు - అనగా యెడమ వైపుకు తిరుగును.

కాబట్టి అలాటియంత్రమువల్ల వాక్యములుపంపుటకు రెండుస్థలము లందు - అనగా చెన్నపట్టణము విశాఖపట్టణమనే వాటియందు ఉత్తరదక్షిణ ములవైపు తిరిగే సూదంటురాతి గుణముగల రెండుముళ్లున్ను పైన చెప్పిన ప్రకారము రెండు మెరుపుపెట్టెలున్ను వుండవలెను. మరిన్ని చెన్నపట్టణమం దున్న మెరుపుపెట్టెయొద్దనుంచి అక్కడవున్న ముల్లు చుట్టబడిన యినుపతీగె స్తంభములమీదుగా విశాఖపట్టణమునకు వెళ్లి అక్కడవున్న ముంటికి చుట్టబడి ఆపెట్టెయొద్దికి చేరవలెను. అలాగువుండగా చెన్నపట్టణమందున్నవాడు తగిన వుపాయమువల్ల ఉ-వ-అనేతీగె రాగికిన్ని వ-ఫ అనే సత్తుకున్ను తగిలిస్తే వెంటనే తనముల్లున్ను విశాఖపట్టణమందున్న ముల్లున్ను వుత్తరమునుంచి తూర్పువైపుకు యేకవిధముగా తిప్పబడును. అయితే తీగెలుమార్చి తారు మారుగా రెండుస్థలములలో వున్న ముళ్లు వుత్తరమునుంచి పడమటికి తిప్ప బడును. విశాఖపట్టములో వున్నవాడున్ను అలాగేచేసి ముండ్లను తిప్పవచ్చును గనుక వొకస్థలమందు యేసంజ్ఞ చేయబడునో ఆసంజ్ఞ రెండోస్థలమందున్ను అగుపడును.

ముల్లు తిరుగుటవల్ల అక్షరములు యేలాగు తెలియబడునంటే—అది కుడివైపు వొకసారి తిప్పబడితే అదివొక అక్షరము తెలుపును. రెండుసారెలు తిప్పితే వేరొక అక్షరము - మూడుసారెలుతిప్పితే మరియొకదానిని తెలు

పుడు. తర్వాత పైనిచెప్పిన ఉపాయముచేత యెడమవైపు ౧,౨,౩ సారెలు తిప్పితే అది అక్షరములు తెలుపును మరిన్ని కుడివైపు వొకసారి యెడమవైపు వొకసారి ముల్లు తిప్పవచ్చును. లేక కుడివైపు వొకసారి యెడమవైపు ౨,౩ సారులు తిప్పవచ్చును. ఆలాగు ముల్లు యిటు అటు తిరుగుటవల్ల అక్షరములన్నిటికిన్ని తగినసంజ్ఞలు చేసి సులభముగా వృత్తాంతములు పంపవచ్చును.

తీగెలు యెంత పొడుగైనప్పటికిన్ని భూమిమీదనేగాని సముద్రపు అడుగునేగాని యెంతదూరముగా వెళ్లినప్పటికిన్ని అవి తగిన వస్తువులచేత కప్పబడితే వాటివల్ల మెరుపు యెగిరి చెప్పబడిన యంత్రమువల్ల సంజ్ఞలుచేసును, ఈలాటి మెరుపుటపాలు యూరోపు అమెరిక అనేదేశములయందు వాడికెలో వున్నవి.

## చిన్నవాండ్లకు తెలివిపుట్టగలందులకున్ను నడవడి తెలియగలందులకున్ను యేర్పఱచఁబడ్డ వేడుకకథలు.

Madras, Reprinted for the Madras school Book society 1821

### విద్యతరగనిధనము.

విద్యయొక్కగుణములు విను. ఆవిద్యచెప్పేవాణ్నిన్ని గ్రహించేవాణ్నిన్ని వృద్ధిచేస్తున్నది. మీరు యేవస్తువయినా అన్యులకు యిస్తే అది మీది కాకపోతుంది. యీవిద్యామాహాత్మ్యం యేమంటే విద్వాంసుడయినవాడు తన విద్యను పోగొట్టుకోకుండా విద్యాదానం పూరాగా చేయనున్ను వచ్చును; ఒకరు గ్రహించనున్ను వచ్చును. వెండి బంగారము నిరంతరము యిస్తూవుంటే రాశిఅయినా తరిగిపోతున్నది. అన్యులకు చెప్పడంవల్ల విద్య దినదినానికి అభివృద్ధిఅవును గాని తక్కువగాదు. విద్య యేవిధముగానయినా ద్రవ్యముపోయినట్టు పోను; వ్యయముగాదు.

దొంగిలించబడదు. మంచి ఆలోచనకర్తవలె మనకు వచ్చే అపాయమును తెలియచేసి అందులఫలమును అగుపరుస్తుంది. గ్రహచారవశాత్తు యెప్పు

డైనా కొందరవస్తే విద్య మనకు ఆలోచన చెప్పును. జనులకు విద్య చెలికా
డున్ను ప్రాణస్నేహితుడున్ను.

చీకట్లో దివిటీ ప్రకాశించినట్టు జనులలో విద్య ప్రకాశించును. దీప
మున దీపము ముట్టిస్తే మొదటిది ఆరిపోనివిధమున విద్యచెప్పడముచేత మూఢు
డనే అంధునియొక్క మూఢత్వమనేచీకటి పోతున్నది గాని చెప్పేవానికి
తక్కువబడదు. కాబట్టి విద్యాధనము కలిగినవాడు అజాగ్రతవల్ల దానినీ
పోగొట్టుకోనూకూడదు తనకు శక్తికల్గినమట్టుకు వకరికి చెప్పడమునకు అసమ్మత
ముగానూ వుండకూడదు.

## పంచతంత్రము 1834, 1861, 1870.

(ఇది రావిపాటి గురుమూర్తిశాస్త్రి బడులలో పిల్లలు చదువుకొను
టకు రచించినది. మొదటికూర్పులో ఉన్నట్టి వ్యావహారికభాషలో అనేక
సార్లు ఇదిఅచ్చుపడి 40 సం. విద్యార్థికోర్ల ఆమోదమును పొందినది. 1870
వ సం. కు పిమ్మట ఎవరో ఈ గ్రంథములోని వ్యావహారికభాష "గ్రాంధిక
భాష"గా మార్చివేసినారు. 1018 వ సం॥ కూర్పులో కృత్రిమభాష కనబడు
తున్నది. దానిలోని వాక్యములుకూడా మాదిరికి ఉదాహరిస్తున్నాను.)

పాటలీపురమను ప్రసిద్ధంబైన యొకపట్టణముగలదు అది వేదశాస్త్ర
పురాణాదిచతుర్దశవిద్యలు నేర్చిన బ్రాహ్మణోత్తములచేతనున్ను మిక్కిలి బల
పరాక్రమశాలులయిన రాజశ్రేష్ఠులచేతనున్ను క్రయవిక్రయములయందు
ప్రసిద్ధులైన వైశ్యులచేతనున్ను - దేవబ్రాహ్మణ విశ్వాసముగలిగియుండెడు
శూద్రులచేతనున్ను - నానావిధములయిన ఆయుధముల నభ్యసించుటయందు
నేర్పుగల వీరభటులచేతనున్ను - అనేక దేవాలయములచేతనున్ను ప్రకాశింపు
చుండును.

ఆపట్టణమును - సుదర్శనుండనురాజు - ఏలుచుండును - అతడు
పరాక్రమమున కుమారస్వామితోనున్ను బుద్ధియందు బృహస్పతితోనున్ను

ధైర్యంబున హిమవంతునితోనున్ను - దాతృత్వమునందు శిబికర్ణాదధీచులతో నున్ను సమానుడై యిజ్జగంబున ప్రసిద్ధికెక్కియుండెను.

ఆరాజశ్రేష్ఠుండొక్కనాడు మంత్రులు - పురోహితులు-విద్వజ్జనంబులు-సామంతరాజులు - బంధువులు - మిత్రులు - మొదలయినవారు పరివేష్టించియుండగా సభలో నిండుకొలువుండి - దుర్మార్గులై నీతిశాస్త్రము తెలియని తనకొడుకులం జూచి - మిక్కిలి చింతాక్రాంతుడై - సభలోనున్న మంత్రులంజూచి యిట్లనియె.

విద్వాంసుడున్ను-ధార్మికుడున్ను - కానికొడుకుపుట్టితే ఫలమేమి - చూడిపాడిలేని గోవును పెట్టుకొని యేమి సేయవచ్చును. బహుమంది కొడుకులు గలరని లెక్కపెట్టుకొనుటచేత కొంచమైనా ప్రయోజనము కద్దా - వంశమునకు కీర్తితెచ్చినకుమారుడు ఒక్కడే చాలును - రూపమున్ను-ధనమున్ను-బలమున్ను-కలిగినా శాస్త్రజ్ఞానము లేనికొడుకెందుకు అటువంటి కొడుకును గనుటకంటే తల్లి గొడ్రాలైనా మేలు - కడుపు దిగబడినా మంచిదే - పుట్టినవాడు చచ్చినా బాగు-ఆడదిగా బుట్టినా వాసి - పూర్వజన్మములయందు తండ్రి చేసిన పుణ్యకర్మములచేత ఉదారుండును-ధర్మాత్ముండును - తలిదండ్రుల మాట జవదాటనివాడును - మంచినడతగలవాడును - సర్వజనులకు హితుండును - విద్వాంసుండును - సమర్థుండును - ఒకరు తనకు చేసిన మేలు మరవనివాడును ఆడితప్పనివాడు నైనపుత్రుండు గలుగును - పాపకర్మముచేత పాలసముద్రములో విషముపుట్టినట్టు - మంచివంశములో దుర్మార్గుడు పుట్టి - కులము చెరుచును-యవ్వనము - ధనము - దొరతనము - అవివేకము - అనే యీనాలుగింటిలో ఒకటొకటే అనర్థమును పుట్టించును - ఈనాలుగున్ను కలిగినచోట చెప్పవలసినదేమి - కాబట్టి వివేకము లేనందున దుర్మార్గులైన నాకొడుకులకు నీతిశాస్త్రము - చదివించి - వివేకము - కలుగజేసుట వలన - వారిని పునర్జన్మసంభూతులుగా నేర్పరచగల పుణ్యాత్ములెవరైనా యీసభయందు గలరా.

అని రాజు చెప్పగా దేవగురువైన బృహస్పతివలె - సమస్తనీతిశాస్త్రములు - తెలిసిన-విష్ణుశర్మయను బ్రాహ్మణుడు లేచి-రాజుం జూచి - ఓమహారాజా - మీరీలాగున చింతచేయవలసినది యేమి - మీరు తలచినపని చక్కసేయుట యెంతమాత్రము-నేను-మీకొడుకులనందరిని - ఆరునెలలలో - సకలనీతిశాస్త్రములు - తెలిసిన - వారినిగా జేసి మీకు సమర్పించకపోతే ధనధాన్యాదులతో నాయిల్లు విడిచి మీరాజ్యమునకు దూరమై పోగలవాడను అని ప్రతిజ్ఞ చేసెను.

అందుకు రాజు చాలాసంతోషించి ఆవిష్ణుశర్మకు యేనుగులు గుఱ్ఱములు తేరులు పల్లకీలు గొప్ప వెలగలిగిన వస్త్రములు సొమ్ములు ధనము మొదలుగాగలవస్తువులు ప్రీతితో బహుమానముచేసి తనకొడుకులను పిలుపించి అయ్యా యిదుగో వీండ్లు మీకొమాళ్లుగాని నాకొమాళ్లుగారు మీరు వీండ్లను చదివించి బుద్ధిమంతులను చేసేభారము మీది అని వారిని విష్ణుశర్మవశముచేసెను.

అంతట విష్ణుశర్మ రాజపుత్రులను పిలుచుకొనిపోయి - తనమనస్సులో ఆలోచనచేసి - మిత్రభేదము - సుహృల్లాభము - సంధివిగ్రహము-లబ్ధనాశనము - అసంప్రేక్ష్యకారిత్వము-అని అయిదు తంత్రములుగల - పంచతంత్రమనే-గ్రంథముచేసి-వారితో నిట్లనియె.

మిత్రభేదమనగా-స్నేహితులకు-విరోధము పుట్టించడము సుహృల్లాభమనగా స్నేహితులను సంపాదించుకోవడము - సంధివిగ్రహమనగా ముందుగా స్నేహముచేసి తర్వాత విరోధించడము - లబ్ధనాశమనగా దొరికినధనమును పోగొట్టుకోవడము - అసంప్రేక్ష్యకారిత్వమనగా ఏకార్యమునైనా చక్కగా విచారించక సేయడము.

పంచతంత్రమనగా ఈఅయిదుతంత్రములుగల గ్రంథము.

# పంచతంత్రము.

## క్రొత్తకూర్పు 1918

## ఉపోద్ఘాతము.

పాటలీపురమను ప్రసిద్ధంబైన యొక పట్టణముగలదు. అది వేదశాస్త్ర పురాణాది చతుర్దశవిద్యలు నేర్చిన బ్రాహ్మణోత్తములచేతను, మిక్కిలి బల పరాక్రమశాలులైన రాజశ్రేష్ఠులచేతను, క్రయవిక్రయములయందు ప్రసిద్ధులైన వైశ్యులచేతను, దేవబ్రాహ్మణ విశ్వాసము గలిగియుండెడు శూద్రుల చేతను, నానావిధములైన యాయుధవిద్యల నభ్యసించుటయందు నేర్పుగల వీరభటులచేతను ననేక దేవాలయములచేతను బ్రకాశించుచుండును. ఆపట్టణమును సుదర్శనుం డనురాజు పాలించుచుండును. అతఁడు పరాక్రమమునఁ గుమారస్వామితోను, బుద్ధియందు బృహస్పతితోను, ధైర్యంబున హిమవంతునితోను, దాతృత్వమునందు శిబికర్ణదధీచులతోను సమానుఁడై జగంబున ప్రసిద్ధికెక్కియుండెను. ఆరాజశ్రేష్ఠుఁ డొకనాఁడు మంత్రులు, పురోహితులు, విద్వజ్జనంబులు, సామంతరాజులు, బంధువులు, మిత్రులును పరివేష్టించి యుండఁగా సభలో నిండుకొలువుండి దుర్మార్గులై నీతిశాస్త్రము తెలియని తన కొడుకులం జూచి మిక్కిలి చింతాక్రాంతుఁడై సభలో నున్నవారితో నిట్లనియె. విద్వాంసుఁడును ధార్మికుఁడును కాని కొడుకు పుట్టిన ఫలమేమి. చూఁడిపాఁడి లేని గోవును బెట్టుకొని యేమిచేయవచ్చును. కొడుకులనేకులు గలరని లెక్క పెట్టుకొనుటచేతఁ గొంచమైనను బ్రయోజనము కలదా? వంశమునకు గీర్తితెచ్చు కుమారుఁ డొక్కఁడే చాలును. రూపమును ధనమును బలమును గలిగినను శాస్త్రజ్ఞానములేని కొడుకేల? అటువంటి కొడుకును గనుటకంటె తల్లి గొడ్రాలైనను మేలు. పుట్టినవాఁడు చచ్చినను బాగు. పూర్వజన్మములయందు తండ్రి చేసిన పుణ్యకర్మములచేత ధీరుండును, ధర్మాత్ముండును, తల్లిదండ్రులమాట జవదాఁటనివాఁడును, మంచినడతకలవాఁడును, సర్వజనులకు హితుండును, విద్వాం

సుండును, సమర్థుండును, ఇతరులు తనకుఁ జేసిన మేలును మఱవనివాఁడును, ఆడితప్పనివాఁడు నైన పుత్త్రుఁడు గలుగును. పాపకర్మముచేతఁ బాలసముద్రములో విషముపుట్టినట్టు మంచివంశములో దుర్మార్గుఁడు పుట్టిన కులముచెఱుచును. యౌవనము, ధనము, దొరతనము, అవివేకము అను నీనాలుగింటిలో నొకటొకటే యనర్థమును బుట్టించును. ఈనాలుగు కలిగినచోటఁ జెప్పవలసినదేమి? కాఁబట్టి వివేకములేనందున దుర్మార్గులైన నాకొడుకుల నీతిశాస్త్రము చదివించి, వివేకముఁ గలుగజేయుటవలన వారినిఁ బునర్జన్మసంభూతులుగా నేర్పఱుపఁగల పుణ్యాత్ము లెవ్వరైన నీసభయందుఁ గలరా? అని రాజు చెప్పగానే దేవగురువైన బృహస్పతివలె సమస్త నీతిశాస్త్రములఁ దెలిసిన విష్ణుశర్మ యను బ్రాహ్మణుఁడు లేచి, రాజుం జూచి యోమహారాజా! మీరీలాగునఁ జింతచేయవలసిన పనియేమి? మీరు తలఁచినపని చక్కఁజేయుట యెంతమాత్రము? నేను మీకొడుకులనందఱిని ఆఱునెలలో సకల నీతిశాస్త్రములు తెలిసినవారినిగాఁజేసి మీకు సమర్పింపకపోతినేని ధనధాన్యములతో నాయిల్లు విడిచిపెట్టి మీరాజ్యమునకు దూరముగాఁ బోఁగలవాఁడనని ప్రతిజ్ఞచేసెను. అందులకు రాజు మిగుల సంతోషించి యావిష్ణుశర్మకు నేనుఁగులు, గుఱ్ఱములు, తేరులు, పల్లకీలు, గొప్పవెలగలిగిన వస్త్రములు, సొమ్ములు మొదలుగాఁగల వస్తువులు బహుప్రీతితో బహుమానముచేసి తనకొడుకులఁ బిలువనంపించి యయ్యా! ఇదిగో వీండ్రు మీకొమారులు గాని నాకొమారులుగారు, మీరు వీండ్రను జదివించి బుద్ధిమంతులఁ జేసెడుభారము మీది యని వారిని విష్ణుశర్మవశము చేసెను. అంతట నావిష్ణుశర్మ యారాజపుత్త్రులను బిలుచుకొని పోయి తనమనస్సులో నాలోచనచేసి మిత్త్రభేదము, సుహృల్లాభము, సంధివిగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము అని యయిదుతంత్త్రములుగల పంచతంత్త్రమను గ్రంథముచేసి వారితో నిట్లనియె. మిత్త్రభేదమనఁగా స్నేహితులకు విరోధముఁ బుట్టించుట. సుహృల్లాభమనఁగా స్నేహితులను సంపాదించుకొనుట. సంధివిగ్రహమనఁగా ముందుగా స్నేహముచేసి తరువాత విరో

ధించుట. లబ్ధనాశమనఁగా దొరకిన ధనమును బోఁగొట్టుకొనుట. అసంప్రేక్ష కారిత్వమనఁగా ఏ కార్యమునైనను జక్కఁగా విచారింపక చేయుట. పంచ తంత్రమనఁగా నీయైదు తంత్రములుగల గ్రంథము.

## ఇంగ్లాండుదేశ చరిత్రము

(ఇది "ఉపయుక్త గ్రంథకరణసభవారిచేత ప్రచురము చేయబడినది. 1855)

### ౨ వ ఉల్లియము.

ఇవి ఇట్లుండగా, ఫ్రాన్సుదేశస్థుడైన పీటరు (Peter) అనువాడు ఒకడు, క్రీస్తుమతస్థులచేత ఆకాలమందు దివ్యస్థలము అని ఎంచబడిన జెరూసలము(Jerusalem)నగరమునకు యాత్ర చేయపోయెను. ఆదినములలో ఆపట్టణము మహమ్మదీయులకు వశమైఉన్నందున, వారు అక్కడనుండు దేవాలయమునకువచ్చు క్రిస్తువులను ఉపద్రవించుచు ఉండిరి. మతాభిమానియును ధైర్యశాలియును అయినపీటరు, దానినూచి వ్యసనపడి, అతడు అచ్చటినుంచి స్వదేశమునకురాగానే పోపువద్దికిపోయి, ఈవృత్తాంతమునుచెప్పి, అతని అనుమతి పొంది, యూరోపుఖండమునందుఉన్న అనేకవూళ్లలో ప్రవేశించి, అచ్చటచ్చట, జరూసలముపట్టణమును, క్రూరులును దుర్మార్గులును అయిన మహమ్మదీయులవద్దనుంచి స్వాధీనము చేసుకొనుటకుగాను ప్రయత్నము చేయుట క్రిస్తువులకుముఖ్యధర్మముగాఉన్నది అని ప్రసంగముచేసెను. దాని వినగానే యూరోపులో ఉన్న రాజులును, పెద్దమనుష్యులును ఒకటిగాచేరి, ఆమహమ్మదీయులమీద దండెత్తిపోయిరి. అట్లు యుద్ధసన్నద్ధులైపోయినవారు అందరు క్రీస్తుయొక్కభటులు అనిపించునట్లు చిలువ అను క్రీస్తుమతగురుతును భుజములలో ధరించుకొని పోయిరి. కావున ఆయుద్ధమునకు క్రూసేడు (Crusade) అను నామముకలిగెను. రాబర్టుకూ ఆక్రూసేడు అనుయుద్ధమునకు తాను పోవలయును అని ఇచ్ఛయించెను. ఆయాత్రకు కావలసినద్రవ్యము తనవద్దలేనం

దున, తాను పాలించుచున్న నార్మండీని, ఇంగ్లాండుకు రాజును తనకు తమ్ము
డును అయిన ఉల్లియమువద్ద కుదువపఉంచి, కొంత ద్రవ్యము తీసుకొని పోయెను.
ఇదియునుగాక, ఫ్రాన్సు దేశమందు అల్పరాజ్యములను ఏలుచున్న కొందరు
పెద్దమనుష్యులు, ఆయుద్ధమునకు పోవుటకుగాను తమతమరాజ్యములను ఈ
ఉల్లియమువద్ద కుదువగాఉంచి, తమకు కావలసిన ద్రవ్యములను తీసుకొని
పోయిరి. అటుతరువాత ఉల్లియము తాను ఆరాజ్యములను అన్నిటిని స్వాధీన
పరుచుకొనుటకయి ఆయాస్థలములకు పోవలయును అని సేనలకు ఓడలను
సిద్ధముచేయుచుండగా, ఒకనాడు ఒక అడవికి తనపరివారమును చేర్చుకొని
వేటాడపోయెను. అచ్చట సరు వాల్టరు టిరలు (Sir Walter Tyrrel) అను
వాడు ఒకజింకమీద వేసినబాణము, గురితప్పి ఒకచెట్టుచాటునఉన్న రాజు
యొక్క రొమ్మున తగలగానే అతడు మృతిపొందెను. టిరలు భయపడి, పరు
గెత్తిపోయి క్రూసేడు యుద్ధమునకుపోవువారితో తానును చేరిపోయెను.
ఉల్లియము మిగుల క్రూరుడు అయినందున వీనిమరణమునుగురించి ఎవ్వడును
వ్యసనపడలేదు. వీడు పండ్రెండుసంవత్సరములు రాజ్యపాలనము చేసెను. వీడు
ఎర్రని తలవెంట్రుకలు కలవాడు అయినందున ఉల్లియము రూఫసు (Rufus)
అని పేరు కలిగిఉండెను. ఉల్లియమురూఫసు మృతిపొందినపుడు రాబర్టు
అను వీనిసహోదరుడు క్రూసేడుయుద్ధము జరుగుచున్న పాలస్టయిను
(Palestine) అను దేశమునందు ఉన్నందున, ఆరాజునకు తమ్ముడైన
హెన్రీ వెంటనే రాజ్యమును వశపరుచుకొనెను. రాబర్టు అచ్చటనుంచి
వచ్చినపిదప, ఇంగ్లాండుదేశము తనకు రావలసినది అని తగవు పెట్టెను. అటు
వెనుక, ఇంగ్లాండురాజ్యము హెన్రీపొందవలసినది అనియును, రాబర్టు
వానివలన ఇంతమాత్రము ద్రవ్యమును తీసుకొనవలసినది అనియును, వీరు
ఇరువురిలో ఎవరైనను సంతతిలేక మరణమునుపొందినయెడల వానిరాజ్యమును
రెండవవాడు పొందవలసినది అనియును, వారు ఇరువురును ఒడంబడికచేసు
కొనిరి. దీనివలన రాబర్టు తృప్తిపొంది, నార్మండీని పోయిచేరెను. రాబర్టు

అధిక ధైర్యమును ఉదారతయును కలవాడయినను, మిక్కిలి ఒళ్లుబంగనితనము కలవాడై ఉన్నందున, వీడుఆరంభించిన పనులుఅన్నియును నెరవేరడములేదు. నవుకరులు వీనిపైబట్టలను కొన్నిసమయములలో గ్రహించుకొనిపోవుచుండిరి. అట్టిసమయములయందు ఆదినమంతయును పడకలోనేపడియుండును. వీడు రాచకార్యములను ఖండితముగా విచారించక ఉండుటవలన, వీనిచేతిక్రింది అధికారులు కాపులను మిగుల పీడించుచుండిరి. అందువలన, ఆకాపులు వీని మీద అసూయపడి, వీనికి సహోదరుడును ఇంగ్లాండుదేశమునకు రాజును అయిన హెన్రివద్ద మొరబెట్టుకొనిరి. దానిపై హెన్రిగొప్ప సేనను చేర్చుకొని నార్మండికిపోయి, రాబర్టునుపట్టుకొని, ఇంగ్లాండుకుతీసుకొనివచ్చి, కార్డిఫ (Cardiff) అను పట్టణమునందు ఉన్నచెరసాలలో ఉంచెను. రాబర్టు ఆచెరసాలయందే ఇరువదియెనిమిది సంవత్సరములుఉండి, అచ్చటనే మృతి పొందెను. కొందరుగ్రంథకర్తలు హెన్రి అనువాడు ఎర్రగాకాల్చిన తామ్ర గిన్నెలను రాబర్టుయొక్క కండ్లలోఉంచి చిత్రవధచేసెను అని చెప్పుకొనుచున్నారు.

## మచిలీబందరు చరిత్రము 1879.

(ఇది సారంగపాణి అనేవైశ్యుడున్ను మతుకుమల్లి కృష్ణశాస్త్రిన్ని రచించినది.)

### ఇ ను గు దు రు.

ఇప్పటికి నాలుగువందల సంవత్సరముల క్రిందట షియాసున్నీమతస్థుల వైరములచే తటస్థించిన యుపద్రవములలో కాషార్ దేశమునుంచి మీర్ యిస్మాయిల్ సముదాని మొదలుగాగల సైదులుకొందరు బారాహిమామను గొప్ప పీరును తీసుకొనివచ్చి యదివర కిచ్చటనున్న ఈరాక్ దేశస్థులగు షీయావతర్కుల సహాయమునుబట్టి యిచ్చట కొద్దిపాటిజోపిడీని యేర్పరుచుకొని యుంటూనుండగా దీనిమహాత్మ్యమునుబట్టి డిల్లీపాదుషా అయిన ఆలమ్‌గీర్ ఫాదుషాచే

దూపనివేదములకున్ను ముజావరుల జీవనమునకున్ను ౩౦ కత్తుల జాగీరు యివ్వబడెను. ఇందుకుతగిన ఆస్తానాలేకనుండిన కాలములో మీర్ జాఅబ్దుల్ కరీమ్ అనుగరీబువత్సలుడు కొన్నివేలరూప్యములు ఖర్చుపెట్టి గొప్పఆస్తానాను ౧౮౧౭ సంవత్సరంలో కట్టించెను. అయితే నిప్పుడు ౧౨ కత్తులమాన్యము మాత్రము నిలచెను.

ఇట్లుండగ నిచ్చటకు అల్లాఖోల్లీఖాన్ గరకెయిరార్ అనునతడు ఫౌజుదారుగావచ్చి కొన్నాళ్లు వ్యవహరించి పిమ్మటిచ్చటనే మృతినొందెను.

ఆయనకు తరువాత ఖుతుబద్దౌలా అనవల్లీ ఖాన్ బహాద రిచ్చటకు ఫౌజ్ దార్ గావచ్చి తానున్ను షియామతస్థుడవుటంబట్టి యీప్రాంతములందుండుటకే నిశ్చయించుకొని చతుర్వింశ దుత్తరశతసంఖ్యాక భావసంవత్సరమనగ నిప్పటికి ౧౨౪ సం॥ల క్రిందట ఇనుగుదురుకు సామీప్యమందున్న మడయడవి యీవత్తుకొట్టించి తాను కాపురముండుటకు దివాన్ ఖానా మొనలగువాటిని గట్టుటకు వ్యాపారు లగ్రహారమువల్ల నభ్యంతరముకలిగినట్లున్ను యందుచేవారు కోరినంతసొమ్మునిచ్చి యాస్థలము తానుపుచ్చుకొనినట్టు చెప్పుదురు. అందులో నొకవృద్ధస్త్రీ తనకాలూను కొద్దిపాటిస్థలమును నెంతకు నివ్వక చాలాకాలమువరకు నవాబు ఏర్పరచిన ఆవరణములోనేయుండి చివరకువినికి జీవనార్థము నెలకు రు ౧౫ నిచ్చేటట్లున్ను తానుచనిపోయినతరువాత తనదినవారక్రియలు చేయించేటట్లున్ను ప్రతిసాలున ఆబ్ధికములుపెట్టించేటట్లు నిర్ణయించుకొని ఆచోటనుంచి వెళ్లిపోయెను.

పిమ్మట ఆమెయున్నంతవరకు ఆప్రకారమేయిచ్చి దినవారక్రియలు జరిపి రజాలుసాహెబు జీవించియున్నంతవరకు ఆబ్ధికము పెట్టించుచుండువాడని వాడుకయున్నది.

మరియు సర్కారులుపట్టణమనగ కరపట్టణ మంతరించినతరువాత గొప్పగొప్పగరీబుకోశీదాలుగా గొప్పసౌధములను మహాళ్లనుగట్టుకొని యత్యంత

భాగ్యవైభవములతో కలంకారీ మొదలగువ్యవహారములు జరుపుచుండుటచే నిది ప్రసిద్ధికెక్కిన స్థానమైయున్నది.

అందు నీబస్తీనవాబుయొక్క కోటయున్ను, వారు నివసించతగిన దివాన్ ఖానా మొదలగునవియున్ను, వారు దర్బారుచేయతగిన సింహాసనాధిష్ఠానములతోకూడియుండు హర్మ్యాదివిశేషములతో రంజిల్లుచూ రాంత్రిం బగళ్లు నవబతునగారా ధ్వనులచేతనున్ను, వేళలను తెలియజేయు ఘంటానాదములచేతనున్ను, మరియు నింకనుండవలసిన రాజవైభవములన్నియుం గలిగి వెలయుచున్నందువలన ఈనగరమునకు ప్రధానస్థానమనియుం ఇనకుదురనగ ఇనప్రభువునకు, కుదురుస్థానమని సార్థకనామము వహించుటచే దానియంత బహిర్గ్రామ సముదాయమునకంతయుం ఇనకుదురు పరగణాయని పేరువచ్చినట్లు తెలియంబడుచున్నది.

ఇందు కింకొకపక్షాంతరమున్న దదేమనగ ఆవ్యాపార్య గ్రహారము చింతగుంటపాలెములోనిదనియుం ఎన్ గుదురను నామమునకు టర్కీభాషలో ఎన్ నూతనముగాకుదురు అబాదుఅయిన చోటాటంబట్టి అట్టిపేరువచ్చినదనియుం చెప్పుచున్నారు.

మరియు నిది తురకలవల్ల నొనర్చబడిన నగరమైనందుకు మ్లేచ్ఛవ్యాపకమచ్చట విశేషముగానుండడమే సాక్ష్యమనియుం మొదట నీప్రాంతములకు టర్కీస్తాన్ దేశస్థులు వచ్చియున్న హేతువుచే వారికి తురకయనునామము ఈదేశస్థులచే పెట్టబడినట్లు చెప్పుచున్నారు. బస్తీలో చాలాసుప్రసిద్ధులైతమపేటలో వాస్తవ్యులయియున్నారు. మరియు నిచ్చట సంస్కృత సంగీత సాహిత్య మల్లాది విద్యారశికుడున్ను మేచ్ఛహుణభాషానిపుణుడున్ను, అట్టి విద్యావంతులను మిగులనాదరించి విత్తసన్మానము చేయువారున్నగు కృత్తివెన్ను పత్రైటరగు రాజా వెల్గూరి బుచ్చివెంకటరెడ్డినాయుండుగారు విశేషప్రసిద్ధులుగా నుండెడివారు. ఆయనగారు గతించడమనేది బస్తీకి చాలానష్టమైయున్నది.

డూపనివేదములకున్ను ముజావరులకు జీవనమునకున్ను ౩౬ కత్తుల జాగీరు యివ్వ బడెను. ఇందుకుతగిన ఆస్తానాలేకనుండిన కాలములో మీర్ జా అబ్దుల్ కరీమ్ అనుగరీబువర్తకుడు కొన్నివేలరూప్యములు ఖర్చుపెట్టి గొప్పఆస్తానాను ౧౮౧౬ సంవత్సరంలో కట్టించెను. అయితే నిప్పుడు ౧౨ కత్తులమాన్యము మాత్రము నిలచెను.

ఇట్లుండగ నిచ్చటకు అల్లాఖులీఖాన్ గరెకెయిరార్ అనునతడు ఫౌజుదారుగావచ్చి కొన్నాళ్లు వ్యవహరించి పిమ్మటిచ్చటనే మృతినొందెను.

ఆయనకు తరువాత ఖుతుబద్దౌలా అనవల్లీ ఖాన్ బహాద రిచ్చటకు ఫౌజ్ దార్ గావచ్చి తానున్ను షియామతస్థుడవుటంబట్టి యీప్రాంతములం దుండుటకే నిశ్చయించుకొని చతుర్వింశ దుత్తరశతసంఖ్యాక భావసంవత్సర మనగ నిప్పటికి ౧౨౮ సం॥ ల క్రిందట ఇనుగుదురుకు సామీప్యమందున్న మడయడవి యీవత్తుకొట్టించి తాను కాపురముండుటకు దివాన్ ఖానా మొద లగువాటిని గట్టుటకు వ్యాపారు ల గ్రహారమువల్ల నభ్యంతరముకలిగినట్టున్ను యందుచేవారు కోరినంతసొమ్మునిచ్చి యీస్థలము తానుపుచ్చుకొనినట్టు చెప్పు దురు. అందులో నొకవృద్ధస్త్రీ తన తాలూకు కొద్దిపాటిస్థలమును సెంతకు నివ్వక చాలా కాలమువరకు నవాబు ఏర్పరచిన ఆవరణములోనేయుండి చివ రకువిసికి జీవనార్థము నెలకు రు ౧౫ నిచ్చేటట్టున్ను తానుచనిపోయినతరు వాత తనదినవారక్రియలు చేయించేటట్టున్ను ప్రతిసాలున ఆబ్దికములుపెట్టిం చేటట్టు నిర్నయించుకొని ఆచోటనుంచి వెళ్లిపోయెను.

పిమ్మట ఆమెయున్నంతవరకు ఆప్రకారమేయిచ్చి దినవారక్రియలు జరిపి రజాలుసాహేబు జీవించియున్నంతవరకు ఆబ్దికముపెట్టించుచుండువాడని వాడుకయున్నది.

మరియు నరోక్కలుపట్టణమనగ కరపట్టణ మంతరించినతరువాత గొప్పగొప్పగరీబుకోతీదారులు గొప్పసౌధములను మహాళ్లనుగట్టుకొని యత్యంత

భాగ్యవైభవములతో కలంకారీ మొదలగువ్యవహారములు జరుపుచుండుటచే నిది ప్రసిద్ధికెక్కిన స్థానమైయున్నది.

అందు నీబస్తీనవాబుయొక్క కోటయున్ను, వారు నివసించతగిన దివాన్‌ఖానా మొదలగునవియున్ను, వారు దర్బారుచేయతగిన సింహాసనాధిస్థానములతోకూడియుండు హర్మ్యాదివిశేషములతో రంజిల్లుచూ రాంత్రిం బగళ్లు నవబతునగారా ధ్వనులచేతనున్ను, వేళలను తెలియజేయు ఘంటానాదములచేతనున్ను, మరియు నింకనుండవలసిన రాజవైభవములన్నియుం గలిగి వెలయుచున్నందువలన ఈనగరమునకు ప్రధానస్థానమనియు ఇనకుదురనగ ఇనప్రభువునకు, కుదురుస్థానమని సార్థకనామము వహించుటచే దానియంత బహిర్గ్రామ సముదాయమునకంతయు ఇనకుదురు పరగణాయని పేరువచ్చినట్టు తెలియంబడుచున్నది.

ఇందు కింకొకపక్షాంతరమున్న దదేమనగ ఆవ్యాపార్య గ్రహారము చింతగుంటపాలెములోనిదనియు ఎన్‌గుదురను నామమునకు టర్కీభాషలో ఎన్ నూతనముగాకుదురు ఆబాదుఅయిన చోటౌటంబట్టి అట్టిపేరువచ్చినదనియుం చెప్పుచున్నారు.

మరియు నిది తురకలవల్ల నొనర్చబడిన నగరమైనందుకు మ్లేచ్ఛవ్యాపక మచ్చట విశేషముగానుండడమే సాక్ష్యమనియు మొదట నీప్రాంతములకు టర్కీస్తాన్ దేశస్థులు వచ్చియున్నహేతువుచే వారికి తురకయనునామము ఈదేశస్థులచే పెట్టబడినట్టు చెప్పుచున్నారు. బస్తీలో చాలాసుప్రసిద్ధులైతమపేటలో వాస్తవ్యులయియున్నారు. మరియు నిచ్చట సంస్కృత సంగీత సాహిత్య మల్లాది విద్యారళికుడున్ను మేచ్ఛహుణభాషానిపుణుడున్ను, అట్టి విద్యావంతులను మిగులనాదరించి విత్తసన్మానము చేయువారున్నగు కృత్తివెన్ను పప్రైటరగు రాజా వెల్లూరి బుచ్చివెంకటరెడ్డినాయుడుగారు విశేష ప్రసిద్ధులుగా నుండెడివారు. ఆయనగారు గతించడమనేది బస్తీకి చాలానష్టమైయున్నది.

ఈ (బుట్టయ్య) పేటలో యేతములని బహువాడుకగా చెప్పుదురు. అదేమనగా ఫ్రెంచిప్రభుత్వకాలములో కోటలో మంచినీళ్లులేకపోవడమువల్ల నిచ్చట గొప్పయిటుకనూతులు గట్టించి యచ్చటికి తూములుపెట్టుకొని యేతముతో నీళ్లుతోడుటవల్ల దానికి నాపేరువచ్చినది. పిమ్మట వాటిని ఇంగ్లీషువారున్నూ చాలాఅభివృద్ధిపొందించినారు. మరియు నా ఫ్రెంచిప్రభుత్వకాలములో కోటనుగట్టుటకు కావలసినయిటుక, సున్నము, నల్లరాయి మొదలగు సరంజామాచేసుకొనుటకు వీలుగా చిన్నాపురపుకాలువ త్రవ్వించియున్నారు. ఆకాలువ కొద్దిపాటి తెలుగుఓడలువెళ్లుటకు తగినలోతు వెడల్పులు కలిగియున్నది. అదియప్పుడు చాలావర్తకాభివృద్ధికికూడ తగియుండేది. ఈగౌర్నమెంటువారు దానిని నిర్లక్ష్యముచేయడమువల్ల పూడిపోయి కొంతవర్తకాభివృద్ధికి లోపమైయున్నదని లేటు మేస్టర్ అట్టెండెంటు రిచార్సన్ మొదలగు వారలు సూచనచేసియున్నారు.

ఈయేతములయొద్ద డ్రెస్సరగు ఉమావేంకటస్వామినాయుడుగారు ప్రసిద్ధులైయున్నారు మరియు ఉమావంశోద్భవుండైన యీయన లోకులకు మానసికానందంబు గావించుటకు నూతనముగా నాటలపాటలనేర్పించి వ్యాపకముచేయువారలైయున్నారు. మరియు నీయన సర్వజనులకు స్నేహపాత్రులై ఇదివరకువచ్చిన యనేకులగు డ్రెస్సర్లలో విశేషప్రావీణ్యుడును సుప్రసిద్ధవాచ్యులైయున్నారు. తత్స్వామియొక్క సహోదరులు ఈపట్టణమునకు పురుషార్థముల నొసంగురంగైన నాయకులుగనున్నారు. ఏమనగ నాయనగారిచేత ప్రచురింపబడుచున్న పురుషార్థప్రదాయనీ పత్రికయే లేకపోయిన లేటుకలెక్టరు జీ.డీ. లెమర్ గారియుద్దేశ్యప్రకారము ఇచ్చటినుంచి డిస్ట్రిక్టు హెడ్ క్వార్టరు తప్పించుటకు గవర్నమెంటువా రంగీకరించి జరగవలసిన యావదంశములు పరిష్కృతములైయుండగ నందుకు ఎవరుయేమిచేయలేక నుపేక్షచేసియున్నసంగతిలో నీపత్రికాసాధనముచే నిరోధింపబడుటచేతనే గదా నార్తర్ సర్కారు యావత్తుకు పూర్వమున్న హెడ్ క్వార్టరును తప్పిం

చుటచేపోగా మిగిలియున్న ఈక్కొద్దిజన మైన నిచ్చటనుండడమున కాస్పద మైనది. లేనియడల విదేశస్థులు కావలసివచ్చునే. మరియు నిది నిరర్థకములైన మతదురభిమానమువల్ల గలుగు చెరుపులను వెల్లడిపరచడమును పూనుకొనుట చేతనే క్రిష్టియన్ మతస్థులు నోబిల్ స్కూల్ మేగ్జిన్ అను నూతనపత్రికో ద్ధారణను చేయుటకునుపోయిన హితవాదిని పునరుద్ధారణను గావించుటకును కారణంబైనది. మరియు నీహేతువుచేతనే స్వధర్మప్రకాశినికూడ వెలసిన ట్లెంచవచ్చును. అయితే మేగ్జిన్ అనునది యెట్లుద్భవించినదో యట్లస్తమించి నది. హితవాదైతే తమమతహితముతో పాటు యితరమతహితమును జూచు కొనుచునుండెనే నింక నింకవృద్ధికాదగియున్నది. మరియు స్వధర్మప్రకాశిని గూడ ఐహికసంబంధమగు అర్థవత్తయిన ధర్మములను తెలుపకపోవడమువల్ల నభివృద్ధికిరానట్టు గనిపించుచున్నది. ప్రస్తుతము పురుషార్థప్రదానియు నభి వృద్ధిగనుండక వెర్రిధోరణిగలిగియుండెను. ఇందుకు కారణము తగినసహా యము లేకపోవుటచేతనో లేక కేవలము శ్రోత్రియచ్ఛాందసు సాంగత్యదోషము చేతనో తెలియదు, కాబట్టి యీపురజనులందరును ఈపత్రికచే నిదివరకుగలిగిన మేలులనుగూరించి కృతజ్ఞులగనుండి తదభివృద్ధికి మిగులసహాయము చేయుం కెడల పునరభివృద్ధికి రాదగును, అయితే ఈపత్రికాధిపతులందరు సార్వజనీన మైన సంగతులను సామాన్యముగా తెలిసేభాషచే రచియించి యందరిని ప్రోత్సాహపరిచెడివై యుండిన తమకును చదువరులకును మిగుల మేలుగలుగును.

## ముస్తాఫాఖాన్ పేట.

ముస్తాఫాఖానను పఠాను సరదారుడు చాలా ప్రసిద్ధికుడైయుండి జమీన్ దార్లు మొదలగువారిమీద ధాటీచేస్తూ వారివల్ల కొంతరుసుము పుచ్చుకొంటూ తనపరివారముతో విశేషవైభవములనుబొందుచు నివాసస్థులైయుండుటవల్ల నాప్రాంతమంతకు ముస్తాఫాఖాన్ పేటయని పేరువచ్చినట్టును ఆగ్రామము పూర్వపుఉప్పెనలో పోయినట్టును పూర్వీకులవల్ల కనబడుచున్నది. ఇప్పుడది

హిందువులవల్ల నాక్రమించుకొనబడినప్పటికీ తురకలదైనందుకు చిహ్నాగా జుమ్మామసీదొకటి యందుగనిపించుచున్నది.

## తెనుగుదేశములోవున్న యింగిలీషుబరులకొరకైన బాలబోధ 1852 అఖరుపాఠము.

### ధైర్యముగల వొక చిన్నవానినిన్ని పిరికితనముగల యింకొక చిన్నవానినిన్ని గురించినది.

ఒకనాడు యిద్దరు చిన్నవాండ్లు బరిలోనుంచి యింటికి వెళ్లుతూ వుండగా వీధికొనను తిరిగినప్పుడు ఆయిద్దరిలో పెద్దవాడు అదుగో జగడము జగడము వెళ్లి చూతామనెను. అందుకు రెండోవాడు వద్దు యింటికి వెళ్లుదాము ఆజగడముతో మనకు యేమీ పనిలేదు అందువల్ల యేదైనా హాని పొందగలమని చెప్పితే నీవు పిరికివి గనుక వెళ్లుటకు జడుస్తున్నావని పెద్దచిన్నవాడు పలికి పరిగెత్తివెళ్లెను.

రెండోచిన్నవాడు తిన్నగా యింటికి వెళ్లెను. మధ్యాహ్నము అయిన తరువాత అతడు యెప్పటివలెనే బరికి వెళ్లినప్పుడు జగడము చూచుటకు వెళ్లనందున చిన్నవాండ్లు అతని మిక్కిలీ హాస్యముచేసిరి. అయితే నేరమునకు తాను అర్హుడు కాకపోయినప్పుడు నేరము మోసుటచేతనే నిజమైన ధైర్యము అధికముగా కనపరచబడుననిన్ని పాపమునకేగాని మరి దేనికయినా తాను భయపడ నిమిత్తములేదనిన్ని అతడు నేర్చివుండెను.

కొన్నిదినములయినతరువాత యీచిన్నవాండ్లందరూ చెరువులో స్నానముచేసుకొంటూవుండగా వారిలో వొకడు లోతుకు వెళ్లినందుచేత మునుగుటకు ఆరంభించెను. చిన్నవాండ్లందరూ అతని దగ్గిరకు వెళ్లుటకు భయపడి అతివేగముగా నీటిలోనుంచి బయటికి వచ్చిరి.

జగడమునకు వెళ్లనొప్పనటువంటిన్ని పిరికి అని కడమ చిన్నవాండ్ల చేత హాస్యము చేయబడినటువంటిన్ని చిన్నవాడు ఆసమయమునకు అక్కడికి రాకపోయివుంటే ఆచిన్నవాడు యింకా కొంతసేపటికి చచ్చిపోవును. అతడు ఆ క్షణమందు తన బట్టలను తీసి నీటిలో దుమికి మునిగిపోతూవున్న చిన్నవానిదగ్గిరికి సమయోచితముగా వెళ్లి మిక్కిలీ కష్టముతో అతని దరికి తీసుక వచ్చెను.

కడమ చిన్నవాండ్లందరున్ను అప్పుడు బహుగా సిగ్గుపడి తమకంటె అతడు ధైర్యవంతుడని వొప్పుకొనిరి.

## బాలమనోరంజని

### వాచకపుస్తకము, పాఠము 37.

### మంచివాయువును గురించి.

I ప్రపంచమునందు అనేకవిధములగు విషములు ఉన్నవి. అయితే అనేకులను చంపేవిషము చెడుగాలే. జీవము కాపాడుటకు అహారముకంటె గాలి మిక్కిలి అగత్యము. మనము అన్నము తినకుండా కొన్ని దినములు ఉండగలము కాని, రెండుమూడు నిమిషములు వాయువు లేకపోతే మనము జీవించి ఉండలేము. II మీరు నిర్మలమైన ఉదకమును మురికిచెంబులో పోసి కడిగితే, ఆనీళ్లు కింద పారపోసినయడల స్వచ్ఛముగా నుండవు. వాటిని మీరు త్రాగుటకు నిశ్చయించరు. కొంచెము ఎచ్చుతగ్గు ఈరీతినె మన నిస్వాసములు ఉండును. మంచిఉదకము చెంబును ఏలాగు పరిశుద్ధపరుచునో, అలాగే గాలి మనశరీరములందు చొచ్చి వాటిని పరిశుద్ధపరుచును, కాని చెంబుకడుగుటకు ఉపయోగించిన నీళ్లవలె గాలికూడా చెడిపోవును. మననిస్వాసములు ఒకవిధమైన విషముతో కూడికొని ఉన్నవి. ఈవిషమే ఉరిదీయబడ్డ మనుష్యుని చంపేది, తీవ్రమైనవిషము తక్షణమే చంపును. జబ్బువిషము మనుష్యునికి

జాడ్యముమాత్రమే కలుగచేయును. మనము గాలిలేని చిన్నగదిలో ఉండిన యెడల ప్రొద్దుటివరకే చత్తుము. కొంచముగాలి తలుపుప్రక్కలనుంచిన్ని, తాళపుచెవు రంధ్రములనుంచిన్ని లోపలికి వచ్చుటవల్ల జనులు గాలిలేక తత్‌క్షణమే చావరు కాని అనేకులు బలహీనులయిఉండి మంచిగాలిని నిగ్రహించకపోయినందున కొంచెము త్వరగా చత్తురు. పట్టణములలో అనేకమంది ఊపిరి విడుచుటవల్ల గాలి పల్లిటెదిక్కునఉన్నట్టు స్వచ్ఛముగా నుండదు. గనుక పల్లిటెదిక్కునుండే వారు పట్టణవాసులకంటె ఎక్కువ ఆరోగ్యము కలవారున్ను ఎక్కువగా జీవించేవారున్ను అయి ఉందురు. ఇళ్లలోనున్న గదులలోనున్న బహుజనులు చేరకూడదు. చెడ్డదైన మనఊపిరి పొగబైలుదేరినట్టు బైలుదేరును. ప్రతిగదికి చెడుగాలిపోవుటకు కప్పుదగ్గిర ఒకకిటికీయున్ను, మంచిగాలి లోపలికివచ్చుటకు దానికింద ఒక కిటికీయున్ను ఉండవలసినది. ముఖము కప్పుకొని నిద్రపోవుట మంచిదికాదు. ఎందుకంటె అట్లా నిద్రపోవుటవల్ల మంచిగాలిని మనము గ్రహించలేము.

## వాచకపుస్తకము, పాఠము 57

## నులిపురుగును, కురుపునుగురించి.

ఉలికిపడుట............దద్దిరిల్లుట.

కృసించుట............చిక్కుట.

దివ్యౌషధము.........మంచిమందు.

ఒకపిల్ల నులిపురుగులవల్ల బాధనొందుచున్నప్పుడు దీనివల్లనే బాధపడుచున్నదని చెప్పలేము. ఎందుకంటె ఈరోగమునకున్ను ఇంకా కొన్ని ఇతర జాడ్యములకున్ను యేకచిహ్నములు కనబడుచున్నవి. పల్లుకొరుకుటయున్ను నిద్రలో ఉలికిపడి లేచుటయున్ను నిశ్చయింపతగని ఆకలియున్ను కడుపుపుబ్బుటయున్ను శరీరము కృశించుటయున్ను ఈరోగమునకు సాధారణమైన చిహ్నములు. చెడిపోయినఆహారము తినుటయున్ను ఉప్పు తినకపోవుట

యున్ను దీనికి సామాన్యకారణములు. కొన్నిసంగతులలో పరగడుపున, కొంచెముఉప్పు నీళ్లలో కలిపి పుచ్చుకుంటే ఈపురుగులు చచ్చును. ఈరోగమునకు టీ గరిటెడు చిట్లాముదమున్ను, టీ గరిటెడు కర్పూరతైలమున్ను దివ్యౌషధము. నులిపురుగులకు దానిమ్మవేరు బెరడుయొక్క కషాయము యిచ్చి కొంచెము చిట్లాముదముకూడా యివ్వవలసినది. అనేకవిధములైన కురుపులు కలవు. పిల్లలకు పళ్లువచ్చేటప్పుడు అవి వచ్చును. వాటివల్ల హానిలేదు. వాటికి మందువేయకపోతె మంచిది. తరుచుగా వాటివల్ల శరీరమునకు విశ్రాంతికలుగును. గజ్జి చర్మమునకు వచ్చెడు సర్వసాధారణమైనరోగము. చర్మమందు పుట్టు పురుగువల్ల ఇది కలుగుచున్నదని ఊహించుచున్నారు. తరుచుగా స్నానము చేయకపోయినా మురికిగుడ్డలు వేసికొన్న మురికిపరుపులమీద పండుకొన్న గజ్జివచ్చును. గంధకము నూనెతో కలిపి శరీరమునకువ్రాయుట దీనికి దివ్యౌషధము. సుమారు పావుఘంటసేపు ఒంటికి యిముకునట్లు రాయవలసినది. రాత్రివేళ నిప్పుదగ్గర రాస్తే చాలా మంచిది. రాత్రియంతా ఉంచి ప్రొద్దున్న వేడనీళ్లతోనున్నూ సోపుతోనున్ను కడగవలసినది. ఈరోగము కుదురువరకు ప్రతిరాత్రియందున్ను రాస్తూ వుండవలసినది. గజ్జిపురుగులను చంపుటకై ఉడుకునీళ్లు, పైన వేసుకొన్న బట్టలమీద పోయవలసినది. పుండ్లు కుదుర్చుటకు నీళ్లు మంచిసాధనము. మెత్తనిబట్టలు చాలా మడతలుపెట్టి వేణ్నీళ్లలో ముంచి పిండినతర్వాత పుండ్లులేచినస్థలమును పొడిగానున్న పెద్దరుమాలుతో కప్పి, ఒకమడత, తర్వాతఒకటి దానిమీద వేస్తూ ఉండవలసినది.

వ్రణముమీద ఏకధారగా నీళ్లుపోస్తే చాలామంచిది. ఒకటి రెండు అడుగులయెత్తునుంచి పావుఘంటకంటె ఎక్కువగా నీళ్లుపోయవలసినది. మధ్యమధ్య కల్లుతో ఉడకపెట్టినపిండి వాటికి కట్టితే మిగుల ఉపయోగించును.

## గణితశాస్త్రబోధ

అచ్చుప్రతి. 1848.

[ఇది విద్యార్థులకు సులభముగా తెలిసేకొరకు కల్పించబడ్డది. సంఖ్యాస్థానవివేచనము, సంకలనము, వ్యవకలనము, గుణకారము, భాగహారము, భిన్నప్రకరణము మొదలుగాగల ౧ భాగము ౧౮౪౮ సం॥.]

## గణితశాస్త్రము

అనగా

### లెక్కింపడమును తెలియజేసే శాస్త్రము.

దీనియందు ముఖ్యమయిన పద్ధతులు ఐదు అవియేవంటే.

౧ సంఖ్యాస్థానవివేచనము...అనగా...సంఖ్యలు చదవడమును న్ను వ్రాయడమున్ను తెలియజేసేది.

౨ సంకలనము...అనగా సంఖ్యలుకలిపి కూడడమును తెలియజేసేది.

3 వ్యవకలనము...అనగా ఒకసంఖ్యలో నొకసంఖ్యను తీసివేసేక్రమము తెలియజేసేది.

౪ గుణకారము...అనగా ఒకసంఖ్యచేత నొకసంఖ్యను హెచ్చువేయడమును తెలియజేసేది. ఇదే సంక్షేపముగా నొకసంఖ్యనే కొన్ని అవృత్తులు కలపడమును తెలియజేసేది.

౫ భాగహారము...అనగా ఒకసంఖ్యలో నొకసంఖ్యను యెన్ని అవృత్తులు తీసివేయవచ్చునో ఆక్రమమును సంక్షేపముగా తెలియజేసేది.

పుట ౧౦—ప్రశ్న ౧౦

హిందూదేశపు గణితము ౧౧౫౧ సంవత్సరమునందు సీమలో తెలసినది. ప్రకృతము జరుగుచున్న ౧౮౪౨ సంవత్సరమువరకు యెన్నిసంవత్సరములబట్టి తెలసియున్నది?

పు ౧౬—ప్రశ్న ౨

యిరవైమంది చిన్నవాండ్లలో ప్రతిచిన్నవానియొద్దనున్ను అయిదేసి లక్కకాయలుంటే అందరిదగ్గిరవుండేవాటి మొత్తమెంత?

పుట ౧౭—ప్రశ్న ౧౩.

ఒకమనుష్యుడు దినమొక్కంటికి పదిహేను క్రోసులు నడిచితే యీ భూమిచుట్టూ తిరిగిరావడమునకు యెన్నిదినములవును? ఆధారము ౧౨౫౦౦ క్రోసులు.

## శబ్దమంజరి.

నీడామంగల మునిపల్యవిశ్వంభరశాస్త్రి.

కాలేజి శెకటేరియైన మహారాజరాజశ్రీ హెన్రి హాకినెస్సుదొరగారి సముఖమునకు.

కాలేజీలో కార్యదర్శి సంస్కృతపండితుడైన అహోబలాచార్యులున్ను యోగ్యతాపత్రికనుబొందిన ముద్దు రామశాస్త్రులున్ను, భీమసేనాచార్యులున్ను - ఆంధ్రప్రధానపండితుడయిన గురుమూర్తిశాస్త్రులున్ను - వ్రాశియిచ్చినదేమంటే,

తమరు అబద్ధములులేకుండా శోధించుమని మావద్దయిచ్చిన శబ్దమంజరి యొక్క ప్రథమద్వితీయభాగములయిన అక్షరగుచ్ఛము-సంధివృంతము - ఈ రెంటినిన్ని మేము నలుగురమున్ను బాగాశోధించితిమి. ఇందులో మాకు చూడగా అబద్ధములులేవనిన్ని యిది బాలులకు చదవనుపయోగించుననిన్ని తోచుచున్నది.

ఈప్రకారముగా
అహోబలాచార్యులు
ముద్దు రామశాస్త్రి
భీమసేనాచార్యులు
గురుమూర్తిశాస్త్రి

1827 సంవ్వత్సరం
అగస్టునెల 27 తేది

తమరు నాపద్దికి పంపినపుస్తకము నాచేతచూడబడెను. దీనిచేత సంస్కృతము చదువుకొనేబాలులకు ఉపయోగము కావచ్చునని తోచుచున్నది.

ఈప్రకారముగా
1827 అగష్టు 14 తేది. సదరదాలతుకోటుకు పండితుడైన వెంకటరాయశాస్త్రి.]

యీపైన వ్రాశినందుకన్నా అధికహల్లులనుగూడి వ్రాస్తే అవి అన్ని హల్లులుగూడిన సంయుక్తాక్షరము లనబడును. రెండుహల్లులుగూడిన సంయుక్తాక్షరము మొదలయిన అక్షరములమీదనున్ను వకహల్లుమీదనువచ్చినట్టె పద్నాలుగు అచ్చులున్ను వచ్చును. ఇంకా ఇక్కడ అంతటా వ్రాయతగ్గవర్ణములను ఇప్పుడు వ్రాయబడిన వర్ణములయొక్క జ్ఞానసహాయముచేతనే ప్రయోగముల యిందు తెలుసుకోవచ్చును. గనుకనున్ను తెనుగుఅక్షరములలో వివరణము చాయతగిన హాకార ణకారములమీదను ఆకారము మొదలయ్ను వాటి లక్షణములున్ను మ్, య్, న్, ఇత్యాదులమీదను ఓకారాదివర్ణరూపభేదములున్ను యీపైనవ్రాశినందుకంటె ప్రకారాంతరముగా వ్రాశేరీతులున్ను తెనుగుకె ముఖ్యములుగనుకనున్ను - యిక్కడ విశేషముగా విస్తరించి వ్రాయబడలేవు - అయితె - యివి మొదలయిన వర్ణభేదాంతరములు - తెనుగువర్ణక్రమమును దెలియజెశే పుస్తకములవల్ల - తెలుసుకోతగినవి - సంస్కృతమందు - ప్లుతము - యమములు - అనేటి వర్ణములక్కు రేఖారూపములు కనుబడలేవు లోకప్రయోగముల యిందు అవిశేషప్రయుక్తములు కావుగనుక్కు యిప్పుడు వాటికి రేఖారూపాంతరములు యేర్పర్చపడలేవు - యింకా వర్ణములను విస్తరించకపోయినప్పటికిన్ని - యింతమాత్రముచేతనె సంస్కృత పుస్తకముల (లు) ను చదువను జ్ఞానముగలుగును - యిది అక్షరగచ్ఛము.

## శబ్దమంజరిలోని ప్రథమభాగము.

## Page ౧౬ సంస్కృత సంధిగ్రంథము.

ఒకటితో నొకటిచేర్చుట సంధి అనబడును. యీపైన వ్రాయబడిన వర్ణంబులు - ఒకటితో ఒకటి చేరేటప్పుడున్ను - కొన్ని భేదములుగలవు - ఆ భేదములక్కు సవర్ణదీర్ఘము - గుణము - వృద్ధి - పూర్వరూపము పర రూపము ఇత్యాదులు పేళ్లు - ఆ పేళ్లనున్ను ఇంకా యీ భేదములయొక్క యావత్కార్యములనున్ను తెలియచేశే గ్రంథములకు సంధిగ్రంథములని పేళ్లు సంధులు అచ్ సంధియనిన్ని - హల్ సంధియనిన్ని విసర్గసంధి యనిన్ని ద్విత్వసంధియనిన్ని నాలుగువిధములు. ఆసంధులు బాలులకు తెలిశే నిమిత్తమయి-సిద్ధాంతకౌముదినిన్ని బాలబోధ ముఖ్యప్రయోజనముగాగల కాతంత్రరూపమాలా అనే వ్యాకరణమునున్ను చూచి వీట్లలోనున్ను బాలులకు యెంతమాత్రము ముఖ్యముగా ఉపయోగము కాతగ్గదో సులభముగానున్ను వుంటున్నదో అంతమాత్రమే నిష్కర్షగా వ్రాయబడుచున్నది. దీనివల్ల చదివే వారియొక్క వాగ్ధోరణియందు తప్పులేకపోవడమున్ను - శ్లోకములునున్ను వాక్యములునున్ను - పదములుగాచేయవలశ్చినప్పుడు తదనుకూల జ్ఞానమున్ను కలుగును.

వాటిలో మొదట అచ్చుసంధి వ్రాయబడుచున్నది.



౧౩

# జాబులు

## కందాళ కేశవాచార్యులవారికి పరవస్తు రామానుజాచార్యులు

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులయి శమదమాద్యనంతకల్యాణగుణపరిపూర్ణులయి అడియేనికి ప్రాప్యప్రాపకభూతులయి అస్మత్స్వాములయి వేంచేసియుండే శ్రీమత్ కందాళ కేశవాచార్యులమ్మంజీగారి తేనేమరుల తిరువడిత్తామరల సన్నిధికి

పరవస్తు రామానుజదాసన్ అనంతములయ్యిన దణ్ణములు సమర్పించి చాయంగ్గ విజ్ఞాపనములు.

విశ్వావసు సం॥ మార్గశిర శు 15 స్థిరవాసరముపర్యన్ విశాఖపట్నం దాసవర్గం కుశలం. దేవరవారి నిత్యతదీయారాధనోభయ వేదాంతగ్రంథకాలక్షేపాతిశయములున్ను శ్రీముఖం ప్రసాదించగలకర్తలు త॥ శ్రీఅమ్మగారున్ను చిన్నవాళ్లున్ను అక్కడ ప్రవేశించినట్టు వుత్తరం వ్రాయించినారు. అంద్లుసంగతులు విశదమైనవి. సౌభాగ్యవతియగు అమ్మాయి చిన్నవాణ్ణిమాచి శాన రోజులు అయ్యినదని దిగులు పెట్టుకొనివున్నది. గనక్క అమ్మగారు కొన్ని రోజులు వున్నప్పటిక్కి ముందు చిన్నవాళ్లను పంపించివేయవలెను. దేవరవారిక్కిన్ని మమ్ముల్ని కటాక్షించవలెనని వున్నది. దాసులకున్ను దేవరవార్ని సేవించవలెనని వున్నది. మాప్రాప్తం యెప్పుడు ఘటిస్తుందో తెలియదు. నాలుగుమాసములకిందట గూటాలలో సామవేదం చెప్పుకోవలెనని మిషకల్పించి దేవరవారిని సేవించవలెనని ప్రయాణమైనాము. ప్రభువువారు శల్యూకూడా యిప్పిస్తామన్నారు. యింతట ప్రాప్తకాలం సమకూడనందున్ను కొన్ని విఘ్నముల

చేతను సర్వసిద్ధమయిన ప్రయాణం నిలిచిపోయినది. అయితే సమీపమందు
న్నప్పుడే పరస్పరం అవశ్యకంగా రావలశ్ని శుభములు తటస్థించవలెనని కోరు
తున్నాను. యిక్కడ మన కోవిలలో రేపటనుండి ధనుర్మాసమున్ను అధ్యాయ
నోత్సవమున్ను వస్తుంది గనక అమ్మగారు యిక్కడ లేకుంటే ఆవుత్సవము సర
ఫరాలే చేసుకోవడమున్ను కొంచెం యిబ్బందిగావుంటుంది. కాబట్టి అమ్మ
గార్నిన్ని త్వరగానే పంపించవలెనని మావిన్నపం. అటువయిని తిరుమళ్లం
అమ్మగారు అనకాపిల్లిదార్ని వచ్చేపక్షమందు అక్కడ కొక్కుల శీతన్నగారి
కొమారుడయ్ని సాంబన్నగారివద్ద మురారి వ్యాఖ్యానమున్ను సాహిత్యరత్నా
కరమున్ను నీలకంఠీయమున్ను మూడుపుస్తకములు మనవి వున్నవిగనక
జ్ఞాపకార్థం యీపేర్లు చిన్నచీటిమీద వ్రాశియిచ్చి ఘట్టిగా అడిగి మరచి
పోకుండా పట్టుకోవెళ్లవలెనని అమ్మగారితో చెప్పవలెను. వ్రాయించవలశ్ని
సంగతులు వ్రాయిస్తు వుండవలెను. చి॥ తమ్ముడు అనంతములయిన దణ్ణాములు
సమర్పించినానని వ్రాయమన్నాడు. గ్నా తిరుమళ్లె పెట్టవలెను.

అనేక విన్నపములు

శ్రీ శ్రీ శ్రీ నాచాదోషశ్శంతవ్యః.

శ్రీమదుభయ వేదాంతప్రవర్తకులయ్ని పరవస్తు
వెంకటరంగాచార్యులుగార్కి దాట్ల విజయరామరాజు
నమస్కారము.

సాధారణసం॥ జ్యేష్ఠ శుద్ధ 13 స్థిరవారంవరకు మజ్జివల్సలో క్షేమము.
అక్కడి యోగక్షేమములువ్రాయించ్చి పంపిస్తూవుండవలెను. త॥ మీవద్దవున్న
బ్రహ్మవిద్యాభరణం ప్రథమపాదం పుస్తకం వ్రాయించగలందులకు శ్రీవేద
మూర్తులయ్ని శ్రీధర రామస్వామిశాస్త్రిగారు లోకైనం మిమ్ము అడిగి
వున్నారు. యిప్పుడు ఆపుస్తకం మజ్జివల్సలో వ్రాయించడమునకు సంపుటం
తయారు చేయించడమైనది. లేఖరిన్ని యిక్కడే వుండడమయ్నిది. యీ

మనిషి మారీభత్తున సదరుపుస్తకం యిప్పిస్తే ఆపుస్తకం యిక్కడ మేము వ్రాయించి తిరిగి మీపుస్తకం జాగ్రత్తగా మీకు అందేలాగున మేము పంపిస్తున్నాము గనక్క ముఖ్యంగా యీమనిషి మారీభత్తున యిప్పించవలెను. శ్రీవేదమూర్తులయ్ని బెందులవారి జానకిరామశాస్త్రిగారు లోవైనం మీవద్దపుచ్చుకొన్న రసగంగాధరం సంచ్చిక పది పత్రములు పంపించడమయినది. తరువాయి సంచికలు పంపించ............శాస్త్రిగారివద్దవున్న చిత్రమీమాంసపుస్తకం మీరు చూడగలందులకు పంపించినాము గనక్క ప్రవేశమయిన సంగతి వ్రాయించవలెను. అంత్తగ్యమునకు లేవలెను.

## ముడుంబ రాఘవాచార్యులవారికి పరవస్తు వెంకటరంగనాథాచార్యులు

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంత ప్రవర్తకులైన అస్మత్స్వాములై అస్మత్పాదిష్యప్రాపకులై శాంతిశమదమాద్యనంతకల్యాణగుణపరిపూర్ణులై వేంచేసిఉండే శ్రీమాన్ ముడుంబ రాఘవాచార్యులు మామగారి తేనేమరుల తిరువడిత్తామరల సన్నిధికి.

దాసానుదాస చరమావధిదాసన్ పరవస్తు శ్రీవేంకటరంగనాథదాసన్ అనంతదండప్రణామము సమర్పించి చేయంగల విజ్ఞాపనములు. సాధారణ సం॥ర చైత్ర శు 15 సోమవారంవరకు విశాఖపట్టణంలో దాసవర్గం కుశలం. అక్కడ దేవరవారి నిత్యతదీయారాధనోభయవేదాంత కాలక్షేపాతిశయము లున్ను పదేపదే శ్రీముఖం ప్రసాదించగల కర్తలు.

త॥ యీవిరోధికృత్సంవత్సర చైత్ర శు 5 ఆదివారం రోజున చిరంజీవియగు మన శ్రీనివాసభట్టనాథాచార్యులకు ఉపనయనం చేయించగలందులకు నిర్ణయించడమయినదిగనక్క దేవరవారు మాకు ఆప్తబంధువులున్ను చిన్నవానియొక్క ఉపనయనోత్సవం దగ్గిరవుండి జరిగించడం దేవరవారికి అవశ్యకముగనకనున్ను దేవరవారి సకుటుంబ సపరివారముగా వేంచేయగలందు

లకు ప్రార్థిస్తున్నాను. యీసుముహూర్తమునకు మీరు వేంచేయడము అవ్యవధానమూటచేత శక్యంకానియెడల యీచైత్ర బ. 2 గురువారం రోజున ఉపనయనం చేయడమవుతుంది. గనక పౌర్ణమిలోగానైనా వేంచేయవలెను. యీ బ 3 శుక్రవారంరోజుననే రాత్రి చిరంజీవినియగు శ్రీవేంకటరంగమ్మను బొబ్బిలిరాజగురువులయ్ని శ్రీమాన్ నిడాతూర్ శ్రీనివాసాచార్యులుగారి చిన్నకుమారునికి వివాహం చేయగలందులకు నిర్ణయించడమయినదిగనక రెండు త్సవములున్ను దగ్గిరవుండి జరిగించి మంగళాశాసనం చేయగలందులకు ప్రార్థిస్తున్నాను. చిన్నవాడికి ఉపనయనం చేయించగలందులకు అనంతపల్లిలో వాధ్యారు వేంచేసి ఉన్నారని ఆనతిచ్చిఉన్నారు.

## పరవస్తు రామానుజాచార్యులవారికి బహదరుషా శ్రీరంగనాయకుల మహాపాత్రుడు.

శ్రీమదుభయవేదాంతప్రవర్తకేత్యాది శ్రీమాన్ పరవస్తు రామానుజాచార్యులయ్యవార్లగారి దివ్యసన్నిధికి.

దా॥ బహదరుషా శ్రీరంగనాయకుల మహాపాత్రుడు అనేక సేవింపులు సేవించ్చి శాయంగల విజ్ఞాపనం॥ త॥ విజయనగరమునుంచి ప్రశస్తమున్ను వక వీణె ఖరీదుక్కు మాబసవద్దను వచ్చియున్నది. తమరు వీణెనుగు॥ నాతో శెలవుయిచ్చియున్నారు. గనుక్కు యీ పురోణి జరూరుగా వ్రాయించడమయినది. సొమ్ముగలవాడు త్వరపడితే 12 ఘుంటలపర్యంతం నిలుపు శాయడమైనది. కాబట్టి మేళముతో సిద్ధమయివున్నవీణె తమరుకూడా వాయించ్చి నాదం విచారించ్చుకోవచ్చును. తీరుబడైవుంటే త్వరగా వేంచెయ్యవలెనని కోరుతున్నాను. 1844 సం॥ జులాయి తే 21 ది.

## మహారాజశ్రీ మేష్టరు బ్రౌన్ దొరవారి సముఖమునకు.

తమపండితుడు పత్యేం అద్వైత బ్రహ్మశాస్త్రులు అనేకసలాములు చేసి వ్రాసుకొన్న విన్నపము. నిన్నటిదినము తమకు చిత్తూరుజిల్లా జడ్జీ వహోదాకు

కయింటి అయినదని సమాచారపత్రికవల్ల నాకు తెలిసినది; గనుక తమరు గొప్పహోదాలో ప్రవేశించినందుకు అపారమైన సంతోషాన్ని పొందినాను గాని దూరదేశానికి తమరు విజయము చెయ్యడముచేత అప్పటప్పటికి తమ దర్శనలాభము దొరకదుగదా అని నామనస్సుకు సంకోచముగా నున్నది. అయితే శ్రీపరమేశ్వరీ కటాక్షమువల్ల తాము త్వరగా కలక్టరు హోదాలో నైనా జడ్జీహోదాలోనయినా ప్రవేశించి యీదేశానికే రావాలని సదా కోరుతూవున్నాను పదకొండుసంవత్సరములనుంచి తమయొక్క అపారమయిన దయనిండా నేను సంపాదించుకొన్నాను. తమవిషయమై నేను ప్రవర్తించిన ప్రవర్తన తమ చిత్తానికే విశదమై యున్నది. యీభూచక్రములో తమకన్న నాకు ముఖ్యప్రాపకులు లేరని నమ్మివున్నాను. యింతకాలములో మావంటి వారిని అనేకమందిని పోషించే గొప్ప హోదాలలో తమరు ప్రవేశించి అనేక మందిని బాగుచేసినారు గాని నాయొక్క దుర్గ్రహాచారముచేత మావాండ్లకు యెవరికీ పనులు దయచేయించినారుకారు. చిరంజీవులగు మారామలింగశాస్త్రు లకు తమరు నాయందు వుంచిన అనుగ్రహమువల్ల జుజ్జూరు మునసబుపని ఖాయంగా దయచేస్తారనే నమ్మకముచేత పూర్వమందు అతనికిఉండిన పోల యిసు పనికికూడా రిసైన్ దాఖలు చేయించినాను. అతనికి పోలయిసు ఉద్యోగభ్రంశంకూడా సంభవించినది. సంవత్సరముపైన రెండుమాసములనుంచి ఉద్యోగములేక శ్రమపడుతున్నాడు. యిదిఅంతా నాయొక్క గ్రహాచారము గాని మరివొకటికాదు. యీలాటి నాగ్రహాచారమును తమవంటివారు తీసి వెయ్యకపోతే మరియెవరు తీసివేస్తారు? గనుక తమమనుష్యులమని సర్వత్రా ఖ్యాతినిపొందిన మమ్మును సంరక్షించవలెనని తాము చిత్తమందు దయవుంచి జూపూడి అమరయ్యగారికి హేడ్డు మునిషీ హోదా దయచేసి కూరపాటి ఠాణా అమీనుపని చిరంజీవులగు రామలింగశాస్త్రులకు దయచేయించవలెనని మిక్కిలి వినయపూర్వకముగా కోరుతున్నాను. తమ్మున ఆశ్రయించినవారు అందరూ బాగుపడ్డారు. గనుకనున్ను యిప్పుడు తమరు దూరదేశము విజ

యముచేస్తారు గనుకనున్ను మాయందు సంపూర్ణానుగ్రహము వుంచి ఆప్రకారము కూరపాటిరాణా ఆమీనుపని చిరంజీవి రామలింగశాస్త్రులకు దయ చేయించి కుటుంబపోషణ చెయ్యవలెనని మిక్కిలి వినయపూర్వకముగా తమ యొక్క ఘనాన్ని ప్రార్థిస్తున్నాను. మొదటినుంచి తమ్మున నేను కోరినపని యిదే గనుక యింతగా మనవి వ్రాసుకొన్నాను. కాబట్టి తాము దయచేసి నా మనోరథ పూర్తి చెయ్యవలెను. రామలింగశాస్త్రులను సముఖములోకి అంపించుమని తాము శలవు వ్రాస్తే అంపిస్తున్నాను. దివ్యచిత్తానకు తేవలెను. యిదే అనేకసలాములు.

## రాజాధిరాజ మహారాజరాజశ్రీ రాజా వెంక్కటసూర్య మహీపతిరాయ ప్రభువుగారికి—

ముఖ్యాశ్రితుడు తణికెళ్ల సుబ్రహ్మణ్యశాస్త్రులు సకలశ్రేయస్కరానేకాశీర్వచనములు చేసి వ్రాసుకున్న విజ్ఞాపనపత్రిక—కురుగంటి వెంకటరాయశాస్త్రులుగారివల్ల వక పూర్వపక్షమును సంగ్రహించుకుని మొదట రాజమహేంద్రవరపుసభలోనూ తరువాత తమసభలోనూ నాయెదట నుపన్యసిస్తూ వచ్చి అందుకు నేను మొదటచేశిన ఖండనను సవరణ చేసుకోలేకున్నా సభ్యానుమతివల్ల ఆసభలోనున్న అపూర్వపక్షముపైనే నేను సిద్ధాంతముల కూడా చేస్తూ వచ్చినందున పరాజితులయిన్ని యీముఖవాదములో పత్రికావాదమును కోరడ మసంప్రదాయమైనప్పటికీ ఆయనేకోరి తమరుకోరి శల విచ్చినట్టు పత్రికలో వ్రాయడమేకాకుండా పూర్వపక్షమునుమాత్రమే వ్రాయగలందుక్కు తమయెదట చేసుకున్న కరారుకు వ్యతిరేకముగా పైగ్రంథవిస్తరమునుకూడా వ్రాశి అందులో పూర్వపక్షముకు నావల్ల సదుత్తరమును వ్రాయించి పుచ్చుకుని చిత్తగిస్తే ఆయనకూ నాకూవుండే వ్యాప్యవ్యాపకభావము తమకు తేటబడబోతున్నదనిన్ని ఆమీదట త్వరగా అనదుత్తర పత్రికనూ శలవునూ దయచేస్తే విజయనగరం బొబ్బిలి సంస్థానములలోకి లేచి వెళుచున్నాననిన్ని

వ్రాస్కుని దాఖలుచేశినందున నాకు దయచేసినారు. అవి నేను చూచుకున్నంతలో వాస్తవగోపనార్థక గ్రంథకల్పనాచాతుర్యము విశేషముగా కనబడి వ్రాసుకునే మనవి యేమంట్టే రాజమహేంద్రవరమునుంచి - తమసముఖములోకి వచ్చిన ఉత్తరమువల్లనున్ను జనప్రతీతివల్లనున్ను సముఖమునందు ఆయన ముఖవచనముల రుజువువల్లనున్ను తరువాత ముఖవాదమునకు రమ్మని పిలిచినా రాక పత్రికావాదమును కోరడమువల్లనున్ను మావుభయుంల వ్యాప్యవ్యాపకభావము తమకున్ను సర్వత్రా పండిత పామర సాధారణముగా తెలియబడుతూ వుండగా ఆయనకుమాత్రము ముఖవాదంవల్ల తెలియనందునే పత్రికాద్వారా తిర్గీ అప్రచారమే చేశినారు గనక యీపర్యాయము ఆయనకుకూడా పూరాగా వ్యాప్యవ్యాపకభావము బోధపడి యీపూర్వపక్షప్రచారము యిన్నడూ తిర్గీ రాయకుండా వుండేలాగు యీపీటీని ప్రతిపత్రిక వ్రాస్తున్నాను. తమరు చిత్తగించి యీఅసలుపత్రిక యిప్పుడే ఆయనకు ఇప్పిస్తే ఆయన వ్రాస్కున్నప్రకారం త్వరగా లేచివెళ్లకమానరు. అట్లా వెళితే న్యాయప్రకారమున్ను తమరు శెలవిచ్చిన రామవాక్యప్రకారమున్ను నాచేతకూడా ఆయనను అడిగించడము సంభవించదు. అట్లా సంభవించకుంటే ఆయనతోకూడా అన్యసంస్థానములకు వెళ్లి అయినా అడగవలశివస్తున్నది గనక ఆయనకు యిందుకు నకలు దయచేయించి తమ ముఖ్యాశ్రితుడనైన నాకు తాదృశాయాసము సంభవించకుండా తమ సముఖములోనే ముఖవాదమునందు నాచాత ఆయననుకూడా అడిగించి యిటువలెనే పత్రికలున్ను దాఖలుచేయించుకుని చిత్తగించి ఆమీదట మాలోవుండే వ్యాప్యవ్యాపకభావముకు తగినట్లు యెవరికి యెవరివల్ల యేపత్రికలు యిప్పించవచ్చునో అట్లా యిప్పించి అంద్దుకనుకూలముగానే శెలవులున్ను దయచేయించవలెనని ప్రార్థించుచున్నాను. దివ్యచిత్తానకు తేవలయును. సాధారణసం॥ అధికవైశాఖ శు 3 సో.

మహారాజశ్రీ బళ్లారిజిల్లా కలెక్టరుగారయిన
ఏ. యస్. ఫీజుదొరగారి సముఖానకు:—

బళ్లారిజిల్లా కుసుబా బళ్లారితాలూకా తహశ్శీలుదారుడయిన
భీమారావు వ్రాసుకొన్న అర్జీ......

యీ తాలూకాలో 17 మంది రయితులు ర్పూ 207-4-3 వరకు బకాయపడి వుండేటందున అందునిమిత్తం అమ్మవలసివుండేవారి భూములకు వకపట్టి యిందులో మలుపూవు చేసుకొన్నాను. వీరిలో ముగ్గురు వక అణా అయినా చెల్లించలేదు. అయిదుగురుమాత్రం అరవాశి చెల్లించివున్నారు. గనుక యితరులున్ను యీప్రకారం చేయకుండా వుండేనిమిత్తము వారి భూములు అమ్మితే మంచిదని నాకు తోస్తున్నది. యెందుకు బాకీ చెల్లించ లేదని అడిగితే రెండుసంవత్సరములుగా పయిర్లు బాగా ఫలించనందునన్ను తమ పశువులు నష్టమయిపోయినందునన్ను యీరెండు కారణములవల్ల తాము చాలా కష్టపడుతున్నామనిన్ని చెప్పుతున్నారు. యీరెండు సంవత్సరములుగా వర్షములు తక్కువ అయినవనిన్ని అందువల్ల పంటలు కమ్మి అయిన వనిన్ని చెప్పడం నిజమేకాని అప్పుడంతా ధాన్యము ధరలు నిండా హెచ్చినందున పంటనష్టమును యెత్తివేస్తున్నది. గనుక యీవిషయములో యెట్లా నడవగలందులకున్ను హుకుం దయచేయించవలెనని మిక్కిలి ప్రార్థిస్తున్నాను.

చిత్తగించవలెను.

1860 సంll
ఫిబ్రవరి. 20 తేది

భీమారావు,
తహశ్శీలుదారు.

౧౪

# శాస్త్రములు.

## (a) ధర్మశాస్త్రము.



# JOHN FRYER THOMAS BHUPALIUM

or

# VYAVAHARA DURPANAM.

being

A compilation of Vijnanaswareyum, Smruti-chendrika and several other works on Hindu Law.

Relating to the Territories of the East India Company carefully revised and dedicted to the Honorable J. F. Thomas Esq., third member of Council, Madras by Vuttyum Vasoodeva Para Brumma Sastrooloo Madras.

Printed by Reuben Twigg, at the Christian knowledge Society's Press, Church Street, Vepery.

1851.

శ్రీపరాంబాయైనమః.

జాన్ ప్రైయ ట్రామ స్ట్ర్యాపాలీయ మనే

# వ్యవహార దర్పణము.

ది ఆనరేబిల్ జాన్ ప్రైయ ట్రామను ధొరగారి సెలవుప్రకారం

వత్యం వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రులవారిచేత

మిక్కిలీ స్పష్టముగా తెలిసేట్టు రచించబడ్డది.

యీ గ్రంథమును రచించియుండే మేమే

చెన్నపట్ణం వేపేరి మిషన్ ప్రెస్సులో అచ్చువేయించి

ప్రసిద్ధపరచడ మయినది.

విరోధికృన్నామసం॥ ఆశ్వయుజమాసం

ఆన ౧౮౫౧ సం॥ అక్టోబరు నెల. ఇందుల క్రయం రూ. ౫.

## పీ ఠి క.

ఘనమును వహించి యుండే యింగిలీషువారి ధొరతనముకు లోబడ్డ హిందూరాజ్యములో ఉండే ఆంధ్రులు ద్రావిడ్లు మొదలయిన వారు విభాగము మొదలయిన సకలవ్యవహారములనూ విజ్ఞానేశ్వరీయం - స్మృతిచంద్రిక - సరస్వతీవిలాసం - మాధవీయం-వరదరాజీయం - భగవద్భాస్కరం - నందపండితీయం - దత్తకచంద్రిక - మొదలయిన ధర్మశాస్త్రగ్రంథములలో చెప్పి ఉండే ప్రకారం ఆచరిస్తున్నారు. అయితే ఆగ్రంథములు యావత్తూ సంపూర్ణంగా చూస్తేనే కాని అన్నివ్యవహారముల యొక్క రీతిన్ని, తెలియదు. మరిన్ని యిప్పుడు వాడుకలో లేకుండా వుండే సంగతులు కూడా ఆ గ్రంథములలో చాలాగా చెప్పబడి యున్నవి. ఆ రెండు హేతువులచేతనూ ప్రసక్తమయిన వ్యవహారముయొక్క స్వరూపాన్ని తెలుసుకోవటము వ్యవహారస్తుల

కేమి ప్రజలకేమి సులభసాధ్యమై ఉండలేదు. కాబట్టి ఆ గ్రంథములను అను
సరించి యిప్పటి వ్యవహారములకు మాత్రమే మిక్కిలీ ఉపయుక్తంగా ఉండే
యావదంశములనూ సంగ్రహించి జాన్ ఫ్రైయర్ ట్రామ స్మ్యాపాలీయ మనే
వ్యవహారదర్పణము ది ఆనరేబిల్ జాన్ ఫ్రైయర్ ట్రామను థారగారి సెలవు
ప్రకారం వత్యం వాసుదేవపరబ్రహ్మశాస్త్రులవారిచేత మిక్కిలీ స్పష్టముగా
తెలిసేటట్టు గీర్వాణభాషలో రచించబడ్డది - మరిన్నీ అందులోని దాయభాగ
బింబమునకూ పుత్రప్రతినిధిబింబమునకూ తెలుగువాక్యములు కూడా రచించ
బడ్డవి.

శ్రీపరాంబాయైనమః.

## జాన్ ఫ్రైయర్ ట్రామ స్మ్యాపాలీయ మనే వ్యవహారదర్పణములోని దాయభాగబింబమునకు సరిఅయిన తెలుగుతాత్పర్యము.

౧ దాయభాగశబ్దార్థము. సంస్కృతములో యీ ప్రకరణము
యొక్క ఆరంభము యెక్కడ నంటే- పేజీ-౦౧-పంక్తి ౧-౨.

వకనికి హక్కు కలిగిన సొమ్ముయందు పారంపర్యమువల్ల వచ్చిన
సంబంధములచాత - మరివకరికి కూడా హక్కు కలిగెనా - ఆలాటి స్థావర
జంగమాత్మకమయిన ఆస్తి - దాయ మనపడును.

॥౧॥ శాస్త్రానుసారముగా పంచుకోవటము-భాగ మనపడును.

॥౨॥ సమీపబాధ్యస్థులు - ఆరెయొక్క దాయమును యీ చెప్పినప్రకా
రము భాగించుకోవటము దాయభాగ మనపడును.

॥3॥ ఇది దాయభాగశబ్దార్థము. యీప్రకరణమును యేయే
మునులయొక్క వచనములు సాధకములంటే - నారద - విష్ణు-వచనాలు - ఆ
వచనాలు యేగ్రంథములలో ఉదాహరించపడ్డవంటే-విజ్ఞానేశ్వరీయ-సరస్వతీ
విలాసములలోవి.

౨. పంచుకోవలశిన సమయములు. పేజీ ౧౨-పంక్తి-౧.

తండ్రి చనిపోయిన పిమ్మట కొమాళ్లు అతని ఆస్తిని పంచుకోవలశి నది॥ ౧॥

తండ్రి జీవించి వుండగా కొమాళ్లకు అతని ఆస్తియందు దానము చెయ్యటానకూ-తాకట్టు పెట్టటానకూ-అమ్మటానుకూ - అధికారము లేదు॥ ౨॥

తండ్రి జీవించి వున్నప్పటికీ తాము ఆర్జించిన సొమ్ముయందు కొమాళ్లకు యథేష్టవినియోగాధికారము కద్దు॥ 3॥

తండ్రిచాత తమకు యివ్వపడ్డ సొమ్ములు వగయిరాలయందు అవిభక్తుడయిన తండ్రిజీవించివుండగా కొమాళ్లకు యథేష్టవినియోగాధికారము సిద్ధించదు॥ ౪॥

తండ్రి పిచ్చివాడై కాని - ముసలివాడై కాని - పెద్దరోగముకలవాడై కాని - జీవించివున్నప్పటికీ అతని ఆస్తియందు కొమాళ్లకు యథేష్టవినియోగాధికారము కద్దు॥ ౫॥

పక్షపాతముకాని-కోపముకాని - యీలాటి మరివకదోషము కాని-లేక జీవించి వుండే తండ్రి-తానే ఆస్తిని పంచవలెనని యిచ్ఛ యిస్తే అప్పుడు విభాగము సిద్ధిస్తుంది॥ ౬॥

వైరాగ్యము కాని-పిచ్చి కాని-యింకా బలవత్తరమయిన యే దోషమయినా కాని-కలిగి తండ్రి జీవించి వున్నప్పటికీ - కొమాళ్లు అతని ఆస్తిని పంచుకోవచ్చును॥ ౭॥

యీలాటి దోషములు లేక జీవించి వుండే తండ్రికి సంతానమును కనే సామర్థ్యాము నశించినట్టయితే అతని ఆస్తిని కొమాళ్లు పంచవచ్చును॥౮॥

జీవించి వుండే తండ్రియొక్క భార్యలకు నెలనెలకూ కలిగే బహిష్ఠ అవుట నివర్తించినట్టయితే అప్పుడు మరివక చిన్నదాన్ని తిరిగీ వివాహము చేసుకోవటముకు తండ్రి ఆయత్తపడనట్టయితే - అతడు రతిసామర్థ్యాము కలవాడైనప్పటికీ అతని ఆస్తిని పంచేటందుకు కొమాళ్లకు అధికారము కద్దు॥౯॥

పెండ్లి కాని ఆడచిన్నవాండ్లకు పెండ్లికి యెంత ఖర్చు కావలెనో అంతసొమ్మును పంచుకోవటముకు మునుపే యెత్తి యివ్వవలశినది. ॥౧౦॥

హక్కును గురించిన సంగతి యింకా ముందు విస్తరించి చెప్పబడు తుంది. ॥౧౧॥

ఇవి పంచుకోవలశిన సమయములు. నా. మను. శంఖ. హారీత. దేవలనా. బోధాయన. శం. నా. బృహస్పతి. వచనాలు. విజ్ఞా. స్మృతిచం ద్రి కా. స. వివాదరత్నాకరములలోవి-వివాదరత్నాకర మనే గ్రంథములో నుంచి తీసుకోబడ్డ వచనము యీ దేశగ్రంథములయొక్క సిద్ధాంతముకు ఉప ష్టంభక మయినదే కాని మరివకటి కాదు. యీలాగే అన్యదేశీయగ్రంథముల పేర్లు యెక్కడ వచ్చినా తెలుసుకోవలశినది. అందుకు 'వక ఉదాహరణను యిక్కడ వ్రాస్తున్నాము. ౧౭ డో ప్రకరణములో భ్రాతుర్భార్యాణాం స్నుషాణాంచ న్యాయ్యావృత్తానా మనపత్యానాం పిండమాత్రం గురుదద్యా జ్జీణవాసాంస్య వికృతాని. అనే శంఖ లిఖితవచనము వివాదభంగార్ణవ ములోనుంచి తేబడి వ్రాయబడ్డది. అయినప్పటికీ యీదేశగ్రంథములలో చెప్ప వుండే ప్రకారమే అవిభక్తుడయి చనిపోయిన వాడియొక్క భార్యలకు భరణ మివ్వవలశినదని ఆ వచనముకు అర్థము గనుక యేమీ విరోధము లేదు. ఆ వచనము ౧౫౪ గో ఫేజీలో వ్రాయబడి వునది. యీ దేశగ్రంథములలో వుండే సిద్ధాంతములకు విరుద్ధంగా వుండే నిర్ణయములను అన్యదేశగ్రంథము లలోనుంచి బొత్తుగా తీసుకోకూడదు.

3. తండ్రి కానీ అతనియెదుటకొమాళ్లు కానీ. చేశే విభాగము ౧౫౪ పం ౨ యెందరు కొమాళ్లో అందరిలో తాను కూడా కలిస్తే యెంత లెఖ్ఖ అవు తుందో అన్నింటిచాత తన యావదాస్తినీ యెచ్చుతగ్గు లేకుండా పాళ్లుచేశి అందులో వొక్కొక్క పాలును ఒక్కొక్క కుమారుడికి యిచ్చి తండ్రి తాను వకపాలు పుచ్చుకోవలశినది. ॥౧॥

కొమాళ్లు అందరూ సమ్మతించినట్టయితె తండ్రి తనకు యెవరిమీద నిండా విశ్వాసము కలదో ఆ కొమారుడికి కొంచం అధికంగా సొమ్ము యియ్య వచ్చును. ॥౨॥

అందరు కొమాళ్లూ తమశక్తివల్ల తండ్రి ఆస్తిని వృద్ధిపొందించి వున్నట్టయితే అప్పుడు కొమాళ్లందరూ సమ్మతించినా తండ్రి వకరికి యెక్కువా మరివకరికి తక్కువా యివ్వ కూడదు. ॥3॥

కొందరు కొమాళ్లు మిక్కిలీ సామర్థ్యముకలవారై పాళ్లు పుచ్చుకొనే టందుకు బొత్తుగా అపేక్ష లేని వారయినట్టయితే అప్పుడు వారి సంతానము వారితో ముందు వివాదరాకుండా వుండుటకై వారిలో వొక్కొక్కరికీ వొక్కొక్కటిగా కొద్ది ఖరీజు గల వస్తువలను ఆస్తిలోనుంచి యెత్తియిచ్చి అంతటితో వారి హక్కును నివర్తించిన దాన్నిగా తెలుసుకొని మిగిలిన కొమాళ్లతో కూడా తండ్రి విభాగం చేసుకోవలశినది. ॥౪॥

అందరు కొమాళ్లూ అలాటివారే అయినట్టయితే అందరినీ ఆభాగేహక్కు లేని వారిని చేశి తండ్రివక్కడే యావదాస్తినీ పుచ్చుకో వచ్చును॥ ౫॥

ఉత్తరకాలమందు యింకా సంతానము కలగవచ్చు ననే ఊహ దృఢముగా కలిగివున్న సమయములో వొక్కడే అయిన తనకొమారుణ్ణి యేదో వక హేతువచాత వేరుపెట్టవలె నని తండ్రి తనంతటతా నేయిచ్ఛయించినట్టయితే అప్పుడు యావదాస్తినీ మూడు పాళ్లు చేశి అందులో వక పాలుకొమారుడికి యిచ్చి రెండుపాళ్లు తండ్రి పుచ్చుకోవలశినది. ॥౬॥

తండ్రియెదట అతని ఆస్తిని పంచేటందుకు వచ్చినకొమాళ్లు యెందరవుతున్నారో అందరిలో తండ్రిని కూడా కలిపితే యెంత లెఖ్ఖ అవుతుందో అన్నింటిచాత యావదాస్తినీ యెచ్చుతగ్గులేకుండా పాళ్లుచేశి అందులో వక పాలును తండ్రికి యిచ్చి వొక్కొక్కపాలును వొక్కొక్కకుమారుడు పుచ్చుకోవలశినది. ॥౭॥

కొందరు భ్రాతలు తమకు పాళ్లు అక్కరలే దన్నట్టయితే వారల పాళ్ళను వెనకటివలెనే నివర్తింప చెయ్యవలశినది. ॥౮॥

ఉపనయనముకాకుండా ఉండే కొమాళ్లకు ఉపనయనము యెంత ఖర్చుతో సిద్ధించునో అంతసొమ్మును పంచుకొనే టందుకు పూర్వమే ఆస్తిలో నుంచి యెత్తి యివ్వవలశినది. ॥౯॥

కొందరు కొమాళ్లు పెండ్లి అయినవారూ కొందరు కొమాళ్లు పెండ్లి కానివారూ, ఉన్నట్టయితే అప్పుడు పెండ్లి కాకుండా వుండే కొమాళ్లకు పెండ్లికి కావలశిన సొమ్మును పయిన చెప్పిన ప్రకారము ముందుగా యెత్తి యివ్వవలశినది. ॥౧౦॥

బ్రాహ్మణులలోనూ, క్షత్రియులలోనూ, తండ్రిఆస్తి కొమాళ్లకు చెందే యెడల తల్లులవల్ల కలిగే విశేషము యేమీ లేదు. ॥౧౧॥

మిగిలిన కులస్థులలో యెప్పుడు తల్లులు చాలా మందీ తండ్రి వక్కడూ కల అన్నతమ్ములు తండ్రితో కూడా ఆస్తిని పంచుకొనే టందుకు తటస్థిస్తారో అప్పుడు కొమాళ్లు కల భార్యలు యెందరో అందరిలో తానుకూడా కలిస్తే యెంతలెఖ్ఖ అవుతుందో అన్నింటిచాత తనరూవదాస్తినీ యెచ్చు తగ్గు లేకుండా పాళ్లుచేశి అందులో వొక్కొక్క పాలును, వొక్కొక్క భార్యాకొమాళ్లకు యిచ్చి తండ్రి తాను వకపాలు పుచ్చుకోవలశినది. ॥౧౨॥

వైశ్యులు మొదలయిన వారిలో కొమాళ్లు పంచేటప్పుడూ యీలాటి స్థలములో యిదేమార్గము. ॥౧౩॥

ఇది తండ్రికానీ. అతని యెదట కొమాళ్లుకానీ. చేశే విభాగము నా. యాజ్ఞవల్క్య. ఆపస్తంబ. కాత్యాయన. వచన. ఆప. మ. యా. హా. శంఖ లిఖితవచనాలు. విజ్ఞా. ఉజ్జ్వలా. స్మృచం విర. ములలోవి.

౪. తండ్రి చనిపోయినపిమ్మట అన్నతమ్ములు చేసుకొనే విభాగము పే. ౮౦ పం. ౨౨. భ్రాతలు యెందరో అన్నింటిచాత యెచ్చుతగ్గులేకుండా చని

పోయిన తండ్రియొక్క ఆస్తిని పాళ్లుచేసి వొక్కొక్క భ్రాత వొక్కొక్క పాలును పుచ్చుకోవలసినది. ॥౧॥

తండ్రిచేసిన అప్పునూ, అలాగే పంచుకోవలసినది. ॥౨॥

కుటుంబసంరక్షణకొరకై అవిభక్తుడయిన మరివకడు చేసిన అప్పునూ అలాగే పంచుకోవలసినది. ॥౩॥

కొందరుభ్రాతలు తమకు పాళ్లు అక్కరలేదన్నట్టయితె వారల హక్కును వెనకటివలెనే నివర్తింప చేసి తక్కినవారే యావదాస్తినీ పంచుకోవలసినది. ॥౪॥

తల్లి గర్భిణి అయివున్నట్టయితే - ప్రసవమయ్యేదాకా ఆగి కలిగినసంతానము మొగదో ఆడదో కనుక్కొని ఆపయిననే పంచుకోవలసినది॥౫॥

తల్లి కడుపుతో వున్న సంగతి స్పష్టముగా తెలియక వున్నప్పుడు ఆస్తిని భ్రాతలు పంచుకొంనట్టయితే తర్వాత ఆమెకు ఆ గర్భమువలన కొమారుడు కలిగినట్టయితే వారలు తమపాళ్లలోనుంచి ఆ చిన్నవాడికి క్రమంగా రావలసిన పాలును యెత్తి యివ్వవలసినది. ॥౬॥

యీలాటిస్థలమందు కొమార్తెగలిగినట్టయితే వారలు పెండ్లికి కావలసిన సొమ్మును యెత్తి ఆ చిన్నదానికి యివ్వవలసినది ॥౭॥

గర్భిణిని గురించి చెప్పిన సంగతి యావత్తూ భ్రాత మొదలయినవారి భార్యలకు కూడా యుక్తం చొప్పున ఊహించుకోవలసినది. ॥౮॥

తండ్రి వక్కడూ తల్లులు యిద్దరు మొదలుగా గలవారూ కల అన్నతమ్ములు పంచుకొనే యెడల వెనకచెప్పినవిశేషము యిక్కడా తెలుసుకోవలసినది. ॥౯॥

ఉపనయనము. వివాహము మొదలయిన కులమునుపట్టిన సంస్కారములు కొందరికి అయి కొందరు భ్రాతలకు కాకుండా వున్నట్టయితే-అప్పుడు ఆ సంస్కారములకు కావలసిన సొమ్మును ఆస్తిలోనుంచి యెత్తి యివ్వ

సంస్కారములు కావలశివున్నవో వారికి మిగిలిన భ్రాతలు పంచుకొనే టందుకు పూర్వమే యివ్వవలశినది. ॥౧౦॥

ఆస్తి లేనట్టయితే అంనలు తాము సంపాదించి అయినా తమ్ములకు ఉపనయనము చెయ్యవలశినది. ॥౧౧॥

ఇది తండ్రి చనిపోయిన పింమట అంనతమ్ములు చేసుకొనే విభాగము. వా. పైఠీనసి-బృ. మ. మ. మ. ఆప. శ్రుతి. యా. కా. కా. మ. వసిష్ఠ. యా. నా. బృ. వ్యాస. వ్యా. వచనాలు. విజ్ఞా - స్మృచం. ఉ. లలోవి.

౫. తండ్రులు చనిపోయిన పింమట అంనతమ్ముల కొమాళ్లు చేసుకొనే విభాగము పే. ౯౪. పం. ౯.

యిద్దరు మొదలుగాగల భ్రాతలు కొమాళ్లు కలవారై చనిపోయినట్ట యితే అప్పుడు వారల ఆస్తిని పంచుకొనే టందుకు వచ్చినటువంటి పినతండ్రి పెత్తండ్రి కొమాళ్లు తమ అందరియొక్క తండ్రులు యెందరో అన్నింటి చొప యెచ్చుతగ్గు లేకుండా ఆస్తిని పాళ్లు చేశి వొక్కొక్క పాలును వొక్కొక్క చనిపోయిన భ్రాత కొమాళ్లు పుచ్చుకోవలశినది. ॥౧॥

పెండ్లి కాకుండా వుండే ఆడచిన్నవాళ్లు కొందరు వున్నట్టయితే వాళ్లకు పెండ్లికి కావలశిన సొమ్మును వాళ్లతోడబుట్టినవాళ్లే యివ్వవలశినది.౨

వకతండ్రి పాలునుపుచ్చుకొనే భ్రాతలలో వకభ్రాత కొమాళ్లు కల వాడై చనిపోయినట్టయితే అతనికి కావలశిన సొమ్మును అతనికొమాళ్లకు యివ్వ వలశినది. ॥3॥

తమ తాతఆస్తిలోనుంచి తమ తండ్రి ద్వారా తమకు వచ్చిన సొమ్మును మనమలయిన తమరు యెచ్చుతగ్గు లేకుండా పంచుకోవలశినది. ॥४॥

తమలో వకడు కొమాళ్లు కలవాడై చనిపోయినట్టయితే అతని పాలును అతని కొమాళ్లకు యివ్వవలశినది. ॥౫॥

ముత్తాత ఆస్తిలోనుంచి తండ్రి తాతల ద్వారా తమకు వచ్చినసొమ్మును మునిమనమలు సమంగా పంచుకోవలశినది. ॥౬॥

ముత్తాత తండ్రి మొదలయిన వారి ఆస్తి యందు మునిమనమడికొడు కు మొదలయినవారికి హక్కులేదు. ॥౭॥

వేరుపడకుండా ఉండే మునిమనమడు మొదలయిన వారికికలిగే హక్కు ముందు చెప్పబడుతుంది. ॥౮॥

తక్కినవారికి వేరుపడ్డా వేరుపడకపోయినా తండ్రితాతముత్తాతల యొక్క ఆస్తియందు హక్కుకలదు. ॥౯॥

ఇది తండ్రులు చనిపోయినపిమ్మట అన్నతమ్ముల కొమాళ్లు చేసుకొనే విభాగము యా. బృ. కా. కా. కా. కా. దే. దే. దే. కా. వచనాలు విజ్ఞా. స్మృచం. లలోవి.

## ప ద్యా లు.

అఖిలలోకోపకారార్థము మట్టి ధర్మవాక్యతతి తెల్గుభాషచే బల్కబడి యె. గాన నన్నయసూత్రసంస్కారములను విడిచిపెట్టుట దోషమై తెలయ దచట. ॥౧॥

శ్రీ జాక్ ఫ్రైయ ర్గామ స్యూఖానీ పురందరుడు ప్రభూతయశముచే భోజ నల విక్రమాదిత్యాజి సుతుల బోలు ననియె నార్యతతి గడున్. ॥౨॥

వాను దేవపర బ్రహ్మ పండితకవి తను రచించిన వ్యవహారదర్పణంబులోని పుత్ర ప్రతినిధిబింబాన కెలమి తెలుగు తాత్పర్యమును వ్రాసె లలితముగను.॥ 3॥

జాక్ ఫ్రైయర్గా మ స్యూఖపాలీయను నే వ్యవహారదర్పణములోని, పుత్ర ప్రతినిధిబింబముయొక్క తెలుగు తాత్పర్యము సంపూర్ణమాయెను.

K. 2. 54 1916 & 17] Pages 59-63

[వి జ్ఞా నే శ్వ ర ము.]

## స్వార్జిత ద్రవ్య విషయము.

తండ్రైన వాడు తా సంపాదించిన పదార్థము కొడుకులకు పంచిపెట్టే ప్పుడు విషమ విభాగముగా పంచిపెట్టవచ్చును. తండ్రి తాతలు సంపాదిం

చిన ద్రవ్యమంతైతేను అన్నదమ్ములకందరికిన్ని స్వాతంత్ర్యము సరిగనుక విషమ విభాగము......కూడదు తండ్రి తా నార్జించిన ద్రవ్యమందు ఆశ లేక భాగమందు యిచ్ఛలేక యున్నప్పుడు తల్లికి ముట్లు వుడిగి వున్నప్పుడు తండ్రి ద్రవ్యవిభాగానికి వొప్పక వున్నప్పటికిన్ని కొడుకులే విభాగానికి స్వతంత్రులు. తండ్రి చనిపోయినతరువాత పంచుకొనేటప్పుడు సమవిభాగము తల్లి ముట్లుడిగినప్పుడు తండ్రివిభాగానికి చెప్పక పోయినప్పటికిన్ని తండ్రి రోగస్థుడైనా, అధార్మికుడైనా కొడుకులకు విభాగము చెల్లును. సమవిషమ భాగాలు రెంటిలోనున్నూ సమవిభాగ పక్షమందు తండ్రి కొడుకులలో సరిగా తన స్త్రీలకు భాగమియ్యవలెను, స్త్రీ ధనము కలిగి వుంటే వారికి సమవిభాగ మియ్య పనిలేదు. స్త్రీ ధన మనంగా మొగుడైనా మామైనా గాని యిచ్చిన సొమ్ము. స్త్రీ ధనం కలిగి వున్నట్టయినా కొడుకులకుయిచ్చే భాగమును బట్టి అర్ధభాగ మియ్యతగినది. విషమ విభాగ పక్షమందు తండ్రియైనవాడు జేష్ఠ కనిష్ఠ భాగాంశములచాత పంచేటప్పుడు కొంత ద్రవ్యమెత్తి అవల వుంచి మిగిలిన ద్రవ్యము కొమాంళ్లకు విషమవిభాగముగ పంచి ఆ వెనక మధ్య తాంశ మెత్తి స్త్రీలకు సమభాగముగా పంచదగినది. తండ్రి కొమాంళ్లకు ద్రవ్యము పంచిపెట్టవలసినప్పుడు యే కొమారుడైనా తండ్రిసొమ్ము ఆసించక స్వతహా ద్రవ్యార్జన సమర్థుడు అయి వున్నప్పుడు వానికి పుట్టిన కొమాంళ్లు వ్యాజ్యము పట్టకుండా యెంతమాత్రమయినా భాగము వచ్చెననిపించి తక్కిన కొమాంళ్లకు సమభాగంగా యియ్యతగినది. తండ్రి అయినవాడు ధర్మప్రకారంగా విషమ విభాగము చేస్తే తిరుగదు. లేకపోయెనా తిరుగును. అధర్మమనంగా కోపముచాత వ్యాధిచాత విషయాసక్తిచాత మార్గం తప్పించిపెట్టుట. అందువల్ల వ్యవహారం తిరుగును. తల్లిదండ్రులు చనిపోయినపిమ్మట కొడుకులు సరిగా ధనరుణాదులు పంచుకోవలెను. కొన్ని శాస్త్రములయందు తండ్రి సంపాదించినసొమ్మంతా జేష్ఠుడు పుచ్చుకొనేది. తక్కిన తమ్ములు తండ్రిని అనుసరించినట్టు అన్నను అనుసరించుకుని బ్రతికేది. అట్లాగే వున్నసొమ్ములో

యిరువయియింట ఒకపాలున్నూ మేలిమైన సొమ్మున్నూ జేష్ఠునిది మధ్యమునికి నలభైయింట ఒకపాలున్నూ నడీతర సొమ్ములున్నూ కనిష్ఠునికి యెనభైయింట ఒకపాలున్నూ బోనద్రవ్యము పాలికి వచ్చును. మరి ఒక పక్షమందు జేష్ఠునికి రెండు భాగాలున్నూ ఆ వెనకటివానికి ఒక భాగమున్నూ ఆ వెనకటివానికి అంతా ఒక భాగమున్నూ అని వుద్ధారం వెనకనే విషమవిభాగము వున్నదిం తండ్రి చనిపోక మునుపైనాగానిన్ని ఈ విషమవిభాగము లోకవిద్విష్టము గనుక అశ్వాలంబ గవాలంబాదులవలెనే ఆచారానుకు రానేరదు. తల్లికి వున్న సొమ్ము అప్పు తోయగా మిగిలినది కూతుండ్లకు వచ్చును. తల్లిసొమ్ము కూతుళ్లకు భాగాన వచ్చేటప్పుడు ఒక విశేషం. పెండ్లిఅయిన పడుచులున్నూ పెండ్లిగాని పడుచులున్నూ వున్నప్పుడు పెండ్లిగాని పడుచులకు భాగం అందరూ పెండ్లి అయినప్పుడు కాపురము కుదరనివారికి భాగం. పాలికిరాని సొమ్ము వివరం తల్లిదండ్రుల సొమ్ము......చేసుకోక తనచేపడి ఆర్జించిన సొమ్మున్ను స్నేహావిషయముగా ఆర్జించిన ద్రవ్యమున్ను వివాహాలబ్ధమయిన ద్రవ్యమున్నూ అన్నదమ్ములకు పాలికి రాదు. తండ్రి తాతలవల్ల వచ్చినవాటిని తీసుకోవలెను. భూమివిషయమయినట్టాయనా వుద్ధరించినవానికి నాలగో భాగము మిగిలినది అన్నదమ్ములకు సరిగా భాగము కద్దు. విద్యచాత ఆర్జించిన ద్రవ్యము భాగానికి రాదు. పితృద్రవ్య విరోధములేక ఆర్జించినసొమ్ము అనే మాట యిన్నిటికి సరి. అటు గనుక తండ్రి సొమ్ముకు విరోధములేక తండ్రి చేసిన వుపకారమువల్ల వచ్చిన ద్రవ్యమున్ను అనుసరాది వివాహాదులయందు దొరికిన ద్రవ్యమున్ను పితృద్రవ్య విరోధమువల్ల నుద్ధరింపబడ్డ క్రమాయాత ద్రవ్యమున్నూ తండ్రిసొమ్ము వ్రయంచేసి లబ్ధమయిన ద్రవ్యమున్నూ విద్యార్జిత ద్రవ్యమున్నూ అన్నదమ్ములందరూ సరిగా పుచ్చుకుందురు. పితృద్రవ్య విరోధముచాతనైనా ప్రతిగ్రహాలబ్ధ ద్రవ్యమున్ను అన్నదమ్ములందరూ సరిగా పంచుకుందురు. అన్నదమ్ములలో ఒకడు విద్యాభ్యాసము చాయకపోయియున్నప్పుడు యెవ్వరైనా సంసారభరణం చేస్తూ వుండును. ఆ పిమ్మట ఆచదు

వుకున్న విద్యవల్ల సంపాదించిన ద్రవ్యమందు ఆ కుటుంబమును పోషించిన యతడు భాగమును పొందును. వూరివారి అన్నం దిని చదువుకున్న విద్యచాత గణించిన సొమ్ము పాలికి రాదు. శ్రమచేత సార్జించిన ద్రవ్యమున్ను పాలికి రాదు. యివి లోకసిద్ధనువాదము. తండ్రి వున్నప్పటికిన్ని చనిపోయినప్పటికిన్ని అన్నదమ్ములలోను చిన్నవాండ్లచేత దొరికిన ద్రవ్యమైనా పెద్దవాండ్లచేత దొరికిన ద్రవ్యమైనా పాలికి వచ్చును. యికను విభాగానికి రాని ద్రవ్యము॥——

Note. విజ్ఞానేశ్వరీయము - వ్యవహారకాండ - పూర్వార్థము దీనిలోని ప్రకరణాలో ౧ మొదటి వ్యవహారమాతృకా ప్రకరణం । ౨ భుక్తిలక్షణము । 3 నిక్షేపహారణము । ౪ సాక్షిప్రకరణము । ౫ లేఖ్యలక్షణము । ౬ దివ్యస్వరూపకథనము । ౭ దాయవిభాగము । ౮ సీమావివాదము । ౯ స్వామిపాలనవివాదము । ౧౦ అస్వామివిక్రయము । ౧౧ దత్తప్రదానికము । ౧౨ కృత్యానుశయము । ౧3 అభ్యుపేత్య శుశ్రూష । ౧౪ సంవిద్వ్యతిక్రమము । ౧౫ వేతనాదానము । ౧౬ ద్యూతసమాహ్వయవ్యాఖ్య । ౧౭ వాక్పారుష్యము । ౧౮ దండపారుష్యము । ౧౯ సాహసము । ౨౦ విక్రీయాసంప్రదాయము । ౨౧ సంభూయసముద్థానము । ౨౨ స్తేయప్రకరణము । ౨3 స్త్రీసంగ్రహణము । ౨౪ ప్రకీర్ణసమితి । .

తారణనామ సం॥ భాద్రపద శు ౫ శుక్రవారమువరకు వేమూరి గోపాలసోమయాజులు విజ్ఞానేశ్వరము వ్యవహారకాండ ౨౪ ప్రకరణాలు మాతృకలోవున్న క్రమాన సంపూర్ణంగా వ్రాసెను.

## ప్రాయశ్చిత్తేందుశేఖరమ్

[ముఖపత్రమునందు "ఈగ్రంథము సులభముగా తెలియుటకై ఎల్లంభట్లు శీతారామశాస్త్రులవారిచేత టీకింపబడి, వె. సో. సుబ్బయ్యగారివలన పరిష్కరింపబడి, బెంగుళూరు కంటోన్మెంటు పటాల బజారులో స్థాపించి

యుండెడి శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు, వె. సో. సుబ్బయ్యగారి కొరకు అచ్చువేయించి ప్రకటింపబడెను. ఈగ్రంథము గౌరమ్మెంటువారి చట్టప్రకారము కాపీరైట్ చేయబడినది. ౧౮౭౬ సం. మార్చినెల ౨౫ తేది" అని ఉన్నది.]

అవతరణిక: శ్రీసచ్చిదానంద గురవేనమః. శుభమస్తు. ప్రాయశ్చిత్తేందు శేఖరమనెడిగ్రంథము జనుల అజ్ఞానజన్యమైన పాపములను బోధించును. లోకములో సుఖకరమైన కార్యమును చేయవలె, దుఃఖకరమైన కార్యమును విడువవలెనని యేరీతిగా నీతివుండునో అటువంటి మంచివికానివి అని నిశ్చయింపచేయునది శాస్త్రమేకాని మనుష్యబుద్ధి కానేరదు. మితమైన బుద్ధిగల జనులలో వకరిబుద్ధిరీతిగా మరివకరిది వుండనేరదు. యెటువంటిమనిషి అయినప్పటికిన్ని, తనబుద్ధిలో తెలియకనేవుండిన సంగతులను శాస్త్రమువల్లనే తెలుసును. పరలోకము లేనియెడల మనుష్యులు పశువులరీతిగా వుండవచ్చును గదా. యెటువంటి ప్రాణియయినా మృతినిపొందకనేవుండదు. అయినప్పటికిన్ని విశేషద్రవ్యార్జనాదులనుచేసి స్వసుఖాన్ని పొందకనేవుండడము అజ్ఞానమేగదా. మనిషికి స్వాతంత్ర్యమేగలిగియుంటే నిద్రాద్యవస్థలనుపొందుట ఆశ్చర్యముగదా. యిటువంటి సర్వజనమోహాకరమయిన అజ్ఞానమును యేమతస్థుడూ చెప్పజాలడు. అటువంటి అజ్ఞానమును భగవచ్ఛక్తినిగా శాస్త్రము చెప్పుచున్నది. పుణ్యపాపములు లేనియెడల లోకమునందు తారతమ్యము యేరీతిగా సంభవించునో, బుద్ధిమంతులు దాన్ని ఆలోచించగా భాగ్యదారిద్ర్యములకు పుణ్యపాపములే కారణములని యెంచవచ్చును, రాజు కావడము దరిద్రుడు కావడము మనిషియత్నము కాదు. భగవంతుడైనప్పటికిన్ని కారణము లేనట్టుగా జనులను హెచ్చుతక్కువగా సృష్టిచేయడు. ఆరీతిగా సృష్టిచేసిన యెడల అటువంటిదేవుడు పక్షపాతి అవునుగదా. ఇత్యాది కారణములను ఆలోచించగా అనాదిగా మనుష్యుల సుఖదుఃఖ కారణ భూతములయిన పుణ్యపాపములు శాస్త్రసిద్ధములైయున్నవి. ఆరెంటిలో పాపమును పోగొట్టుటే

ప్రాయశ్చిత్తము - లేతబిడ్డలు తెలియకనే నిప్పునుముట్టితే, దానికి చికిత్సకలిగి నట్టు, అజ్ఞానకృతమైనపాపమునకు నివర్తకమయిన ఉపాయమున్ను శాస్త్రము నుంచి తెలియవలెను. గనుక యీగ్రంథము సులభముగా తెలియడానికై టీక చేయడానికి కారణమైనది. యీగ్రంథమునందు హస్తదోషములు కలిగి యున్నట్టైతే విద్వాంసులు క్షమించవలెనని ప్రార్థిస్తున్నాను. ఎల్లంభట్ల శీతా రామశాస్త్రి.

మూ. ప్రాయశ్చిత్తలక్షణం: యద్యథా విధ్యననుష్ఠానాద్యుపచితాశుభ నాశకమేవత త్ప్రాయశ్చిత్త...అన్యథా ప్రత్యవైతి.

టీక. ధర్మశాస్త్రమునందు చెప్పినరీతిగా చేయకనే ఉండుటచేత కలి గిన పాపమును పోగొట్టుట ప్రాయశ్చిత్తము. పాపమును నశింపచేయుట ధర్మమే ప్రాయశ్చిత్తమని ధర్మశాస్త్రసంకేతము. యీప్రాయశ్చిత్తము నిత్య నైమిత్తికకామ్యములని మూడు పేర్లను పొందును. నిత్యమనగా అవశ్యకముగా చేయతగినది. నైమిత్తికమనగా కొన్నికార్యములయందు చేయతగినది. కామ్య మనగా కోరికతో చేయతగినది. రోగికి ఔషధసేవనవలె పాపికి ప్రాయశ్చి త్తము నిత్యము. రోగసంభవకాలమునందు ఔషధసేవనవలె నైమిత్తికము. రోగమును పోగొట్టుకోవలెనని కోరికచాత ఔషధసేవనవలె కామ్యము. యేస్థలమునందు వకప్రాయశ్చిత్తముచేత అనేకపాపములు నశించును అని ధర్మశాస్త్రమునందుచెప్పివుండునో ఆస్థలమునందు వకేప్రాయశ్చిత్తము. గొప్ప పాపమును పోగొట్టెడు ప్రాయశ్చిత్తముచేతనే స్వల్పపాపములు నశించును. పాపమునకు తక్కువకాకనే ప్రాయశ్చిత్తము చేయించవలెను. పాపిష్ఠులకు ప్రాయశ్చిత్తము చప్పడము పుణ్యమే సరి అని చెప్పడమున్ను ధర్మశాస్త్రములను తెలిశిన విద్వాంసుడే అడిగినవానికి సభయందు చెప్పవలెను.

మూ. సంసచ్చతుర్భిస్త్రిభిర్వా...బోధ్యం;

టీక. సభ అనగా ధర్మశాస్త్రమును తెలిశిన ముగ్గురు నలుగురు చేరి వుండడము. అథవా బ్రహ్మజ్ఞానియైన వకడైనాసరే. సన్యాసికాడదు. వకడు

మొదలుకొని వెయ్యిజనము చేరినా ప్రాజ్ఞులుగావుండడమే సభ. సభాదక్షిణ లక్షగోవులపర్యంతము, వానిశక్తికొద్ది ముందరచెప్పబోయ్యే కృఛ్రసంఖ్యగా యివ్వవలెను. సభాసంతోషమును యేరీతిగానైనా చేయించడము, అవునైనా యెద్దునైనా యివ్వడము సభాదక్షిణయని చెప్పబడును. సభలో చెప్పబడిన దోషమునకు సభాసమ్మతిచాత ప్రాయశ్చిత్తము చేయవలెను.

మూ. మహాపాతకాని.

టీక. మహాపాతకములనగా బ్రాంహ్మణులను చంపడము, బ్రాంహ్మణుల బంగారును దొంగలించడము, గురుస్త్రీగమనము, మద్యపానము, యీనలుగురితో వకసంవత్సరము స్నేహంచేయడము. బ్రాంహ్మణుడు సురాపానంచేయడము—యీరెండూసమం.

మూ. మహాపాతకసదృశాని... గురుతల్పగసమః ।

టీక. మహాపాతకములతో సమానములైన అనుపాతకములను చెప్పుచునాడు. యజ్ఞంచేస్తూవుండిన క్షత్రియవైశ్యులసంహారము, సంరక్షించమని వేడిన మనిష్షిని సంహారించడము, రజస్వలాసంహారము, గర్భిణీసంహారము, ఆత్రేయసగోత్రస్త్రీసంహారము, తెలియకనే గర్భచ్ఛేదము, మిత్రవధ, గురువిషయములో వ్యర్థముగా తిట్టడము, కోపంపుట్టించడము, అవమానంచేయడము, మాటిమాటికి తొందరచేయడము, రోజుకుశూన్యంచేయడము, గురువుయందు మహాద్వేషము, వేదమును నిందించడము, వేదవిరుద్ధములైన మతములను ఆశ్రయించి దురుక్తులచాత వైదికమతమును నాశంచాయడము, వేదములను మరవడము—యివి బ్రంహ్మహత్యతో సమానములు...

మూ. పాపినఃపంచధా...

టీక. పాపముచేసినవారలు అయిదువిధములుగావుందురు. స్వయంచేశినవాడు, పాపముచేశినవాణికి అనుగ్రహించినవాడు చేయమని అజ్ఞచాయడము, ప్రార్థించడము, ఉపదేశంచాయడము, ప్రయోజకుణిదని చెప్ప

బడును. తననిమిత్తమైనా, యితరనిమిత్తమైనా సమ్మతించినవాడు. నిర్నిమిత్తీగా బెదిరించడము, కొట్టడము, దోచుకోపోవడము, వీట్లచాత మరణము కలిగితే వాడే నిమిత్తమవును. యీరీతిగా కర్తృవని, అనుగ్రహీతృవని, ప్రయోజకుడని, అనమంతృఅని, నిమిత్తుడని, అయిదువిధముల పాపులలో మొదటివాణికంటె రెండోవాణిది తక్కువతక్కువగా ప్రాయశ్చిత్తముచు తెలియతగినది.

## క్రీస్తుపుట్టిన ౧౮౦౨ సంవత్సరం రెండోచట్టం.

చన్నపట్నపు దొరతనంతో చేరిన యింగ్లీషు దేశములలో సీవిల్ స్యూట్సు అనే వ్యవహారములను మొదటిపరిశోధించ్చేటందుకు కోర్టుస్ ఆఫ్ జ్యూడికేట్యూర్ అనే అదాలతుకోటులనుస్థాపించి వాటియొక్క అధికారపు సరహద్దులను యేర్పాటచేటందుకు చేసినచట్టం।

మహాసూళ్లును వసూలు చేశే కలెక్టరులనే వుద్యోగస్థులకు న్యాయ విచారణ వుద్యోగమున్ను యిచ్చివున్నందువల్ల యిదివరకు మిక్కిలి తొందరలు కలిగివుండ్డెను - యెందువల్లనంటె వకవుద్యోగములో చేశిన కార్యములను మరివక వుద్యోగంలో మొట్టమొదట మళ్లీచూచి తీర్చేటట్టుగా అనేకమాట్లు సంభవించ్చెను. మరిన్ని ఆవుద్యోగస్థులు వారిక్కవుండ్డె యితరకార్యములవల్ల న్యాయవిచారణ వుద్యోగములను చేశేటందుకు శక్తులుగాకనున్ను వుండ్డిరి కాబట్టి గౌనరువారు ఆలోచనలో నిష్కర్షచేశినది యేమంట్టే వ్యవహారములను విచారించ్చేజడ్జి అనే వుద్యోగమున్ను నేరములను విచారించ్చే మేజిస్త్రేట్ అనే వుద్యోగమున్ను మహాసూళ్లును వసూలు చేశే కలక్టరనే వుద్యోగమున్ను యికమీద వేరే వేరే మనుష్యులు చేయవలశినది. మరిన్ని న్యాయం చక్కగా నడిపించ్చేటందుకుగాను యీచట్టములోవుండ్డే నిర్ణయముల చొప్పుననున్ను నిబంధనల చొప్పుననున్ను యిక మీద చెప్పబొయ్యే కాలాకాలలో జిల్లాకోటులు స్థాపించ్చబడవలశినది॥

సివిల్ అనే వ్యవహారములను మొట్ట మొదట విచారించ్చేటంద్దుకు అదాలతు కోటులను స్థాపించ్చడం॥

౨ యికమీద విశదముగా చెప్పబొయ్యే జిల్లాలలో అదాలతుకోటులు స్థాపించ్చబడవలసినది - యేయేజిల్లాలో వుండే కోటుకు ఆయాజిల్లా పెరే యీకింద్దవచ్చే ప్రకారముగా పెట్టవలసినది ॥

## 1860 వ సంవత్సరపు 45 వ ఆక్టు.

ఇండియా లెజిస్లేటివ్ కౌన్సిలువారివలన జారీ చేయఁబడినది.

(1860 వ సంవత్సరము ఆక్టోబరు 6 వ తేదిన గవర్నర్ జెనరలుగారి యనుమతి పొందినది)

## ఇండియన్ పీనల్ కోడ్ అనగా ఇండియాదేశపు శిక్షాస్మృతి

(1896 వ సంవత్సరము మేనెల 1 టి తేది పఱకు సవరింపఁబడినప్రకారము)

ఉపోద్ఘాతం

బ్రిటిష్ ఇండియాలో అంతటా వ్యాపించే ఒక సాధారణమయిన శిక్షాస్మృతి యేర్పాటు చెయ్యడము యుక్తముగా వున్నందున నిర్ణయించడము యేమంటే:—

### 1 టి అధ్యాయము.

### ప్రారంభము.

శిక్షాస్మృతి పేరున్ను అందుల వ్యాప్తిన్ని.

1. ఈ శాసనము ఇండియన్ పీనల్ కోడ్ అనగా, ఇండియాదేశపు శిక్షాస్మృతి అని చెప్పబడి "ఇండియాదేశము యిప్పటికంటె బాగా యేలడముకుగాను పుట్టిన శాసనము" అని చెప్పబడ్డ శ్రీవిక్టోరియారాణిగారి ప్రభుత్వపు 21, 22 సంవత్సరములలో నిర్ణయించబడ్డ స్టాట్యూటు తాలూకు 106 వ చాప్టరువల్ల శ్రీహార్మెజస్టీరాణిగారి అధికారములో వుంచబడివుండే, లేక వుంచబడే దరోబస్తుదేశములలో అంతటా అమలులోకి రావలసినది.

సదరహీదేశములకు లోవల జరిగించబడ్డ నేరములను గురించి శిక్షించడము

2. సదరహీ దేశములకు లోపుగా ప్రతిమనిషిన్ని తాను యీస్మృతి తాలూకు నిబంధనలకు విరోధమయిన ప్రతి కార్యము, లేక లోపము జరిగించడమును గురించి యీస్మృతి ప్రకారము మాత్రము శిక్షలకు పాత్రుడు కావలసినదేగాని మరివకతరహాను పాత్రుడు కాకూడదు.

సదరహీ దేశములకు వెలపల జరిగించబడ్డ వృటికిన్ని న్యాయ శాస్త్రమును పట్టి అదేశములకు లోవల విచారణ చెయ్యబడ కూడిన నేరములను గురించి శిక్షించడము

3. సదరహీదేశములకు వెలపల జరిగించబడ్డ నేరములగురించి ఇండియా దేశపు గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ వారివల్ల నిర్ణయించబడ్డ యే న్యాయశాస్త్రమువల్లనయినా విచారణ చెయ్యబడడముకు పాత్రుడయిన యేమనిషియెడలనయినా సదరహీ దేశములకు వెలపల జరిగించబడ్డ యేవయినా నేరములనుగురించి అట్టి నేరములు సదరహీ దేశములకు లోపుగా జరిగించబడి వున్నట్టయితే యేలాగో ఆలాగే యీస్మృతి తాలూకు నిబంధనలప్రకారము జరిగించవలసినది.

స్నేహాబందుకట్టుగా వుండే వరాయి రాజాగారి దేశముకు లోపుగా శ్రీరాణి గారి వుద్యోగస్థుని వల్ల జరిగించబడ్డ నేరములను గురించి శిక్షించడము

4. శ్రీ రాణిగారితాలూకు ప్రతి వుద్యోగస్థుడున్ను శ్రీరాణిగారి వుద్యోగములో వుండగా యిదివరలో ఈస్టిండియా కంపెనీవారితోటి జరిగించబడివుండే, లేక ఇండియా దేశముతాలూకు యేగవర్నమెంటు వారివల్లనైనా శ్రీరాణిగారి తరఫున జరిగించబడివుండే, లేక యికముందు జరిగించబడే యేదయినా సమాధానపత్రికయొక్క లేక ఒడంబడికయొక్క బలమునుబట్టి శ్రీ రాణిగారితోటి స్నేహాబందుకట్టుగా వుండే యేరాజాగారియొక్క అయినా సంస్థానముయొక్క అయినా రాజ్యములకులోపుగా యీస్మృతి తాలూకు నిబంధనలకు విరోధముగా అతనివల్ల జరిగించబడే ప్రతి కార్యమును, లేక లోపమునుగురించి యీస్మృతిప్రకారము శిక్షకు పాత్రుడు కావలసినది.

5. ఈ శాసనములో వుండేది యేదిన్ని, శ్రీ 4 వ ఉల్లియం రాజుగారి ప్రభుత్వపు 3, 4 సంవత్సరములలో నిర్నయించబడ్డ స్టాట్యూట్లతాలూకు 85 వ అధ్యాయములో వుండే నిబంధనలనుగాని యేతరహాగానైనా ఈస్టిండియా కంపెనీవారితోటి, సదరహీ దేశములతోటి, లేక అందుల కాపులతోటి సంబంధము కలిగివుండే అస్టాట్యూట్లకు తర్వార నిర్నయించబడ్డ పార్లమెంటువారి తాలూకు యేదయినా శాసనములోని నిబంధనలలో వేటినయినా గాని; శ్రీమార్ మేజస్టీ రాణిగారి వుద్యోగములో వున్న ఆఫీసర్లు, సోల్జర్లు తిరుగుబాటు చెయ్యడమును గురించిన్ని వదలిపెట్టి పారిపోవడమును గురించిన్ని వారిని శిక్షించగలందులకయి పుట్టిన యేదయినా శాసనముయొక్క నిబంధనలనుగాని, లేక యేదయినా విశేషమయిన, లేక ప్రదేశసంబంధమయిన న్యాయశాస్త్రముయొక్క నిబంధనలలో వేటినయినా గాని రద్దుచేసేలాగున, భేదపరచేలాగున, నిలిపివుంచేలాగున లేక వాటికి హాని కలగ చేసేలాగున వుద్దేశించబడివుండలేదు.

ఈ శాసనమువల్ల కొన్ని న్యాయశాస్త్రములకు హాని కలగ కూడదు

Guide to Legal Practitioners part II by
Atmury Lakshminarasimham garu B. A. & B. L. 1882.

శిక్షలు.

27. ప్లీడరుగా ప్రవేశపెట్టుకొనబడుటకున్ను, పట్టీలో చేర్చుకొనబడుటకున్ను అర్హత కలుగజేసే పరీక్షయిచ్చి మెప్పించిన యేమనిషియయినా అట్టి పరీక్షకాలమునుంచి వకసంవత్సరపు కాలమువరకున్ను అలా ప్రవేశపెట్టుకొనబడుటకున్ను, పట్టీలో చేర్చుకొనబడుటకున్ను దరఖాస్తు చేయకుండా తప్పిపోయినయెడల హాయికోర్టువారి విశేషఉత్తరువువలన అట్టి దరఖాస్తుల కాలము వ్యాపింపచేయబడితేనే తప్ప ఆయనను ప్రవేశపెట్టుకొని పట్టీలో చేర్చుకొనకూడదు.

28. ప్లీడరుగా ప్రవేశపెట్టుకొనబడి పట్టీలో చేర్చుకొనబడిన యేమనిషియయినా సటిఫికెట్టు పుచ్చుకొనుటకు ఉపేక్షచేసినా, లేక సర్టిఫి

కెట్టు పుచ్చుకొని మూడుసంవత్సరముల కాలమువరకు ఆసర్టిఫికెట్టు తాజాగా పుచ్చుకొనుటకు తప్పిపోయినా, ఆయన సస్పెండుచేయబడి హైకోర్టువారి దిగరు ఉత్తరువులు లేనిదే సర్టిఫికెట్టు పుచ్చుకొనుటకుగాని, అది క్రొత్తగా చేయించుకొనుటకుగాని అనర్హుడై యుండవలసినది.

29. యేమనిషియయినా ప్లీడరుగా ప్రవేశపెట్టుకొనబడుటకు దరఖాస్తు చేసేకాలమందు గవర్నమెంటు యిలాకా యేయుద్యోగమునందు నయినా ఉన్నయెడలగాని యేదయినా నొక వ్యాపారము లేక యితరమయిన పని జరిగించుకొనుచున్నయెడల గాని ప్రవేశపెట్టుకొనబడుటకు తానుచేసే దరఖాస్తులో యీ యంశము వివరించవలసినది. మరిన్ని హైకోర్టువారు అట్టిమనిషిని ప్రవేశపెట్టుకొనుటకు నిరాకరించవచ్చును లేదా వారికి క్రమమనితోచే వుత్తరువులను జారీచేయవచ్చును.

30. ప్లీడరుగా ప్రవేశపెట్టుకొనబడిన యేమనిషియయినా గవర్నమెంటువారి యిలాకాను యేయుద్యోగమునయినా అంగీకరించిన యెడలగాని యేదయినా వ్యాపారము లేక యితరపనిలో ప్రవేశించినయెడలగాని ఆయన అట్టిసంగతి హైకోర్టువారికి తెలియపరచవలసినది. వారు అందుపైని అట్టి ప్లీడరును పని చేయకుండా నిలిపివేయుదురు, లేదా సదరుకోర్టువారికి అనుకూలమని తోచే ఉత్తరువులను జారీచేయుదురు.

31. పయి నిబంధనలలో యేనిబంధనయయినా కావలెనని యతిక్రమించే ప్లీడరు నిలిపివేయబడుటకుగాని - బరతరపు చేయబడుటకుగాని లోబడియుంటాడు.

1879 సంవత్సరము 18వ చట్టముయొక్క 27 సెక్షన్ప్రకారము హాయికోర్టు అప్పీలు పక్షముననున్ను, సబార్డయినేటు కోర్టులలోనున్ను ఉండే ప్రతికక్షిదారుని అడ్వొకేటు, వకీలు, ఆటర్నీ లేక ప్లీడరులవిషయములో యివ్వవలసిన ఫీజు.

32. కోర్టువారి విశేషశలవువలన తప్ప తాను అట్టిఫీజు తీర్పున్ను
నని అడ్వోకేటు, వకీలు, అటర్నీ లేక ప్లీడరువద్దినుంచి సర్టిఫికెట్టు కనుపరు
స్తేనేగాని తీర్పులో లేక ఉత్తరువులో యేఫీజున్ను యేవిషయములోనున్ను
వసూలుచేసుకొనతగ్గదిగా నమోదుచేయబడకూడదు.

33. సొమ్ము, సొత్తు, లేక యితర చరాస్తినిగురించిగాని, భూమిలేక
యేవివరముగల యితరస్థిరాస్తినిగురించిగాని, తేబడిన వ్యాజ్యములలోగాని,
అసలు వ్యాజ్యములలో లేక అప్పీలు వ్యాజ్యములలో డిక్రీలపయిన చేయ
బడిన అప్పీళ్లలోగాని, యీక్రిందిపద్ధతులప్రకారము ఫీజు ఉండవలసినది.

## (b) జ్యోతిషము.

## మాధవరాజీయము. P. 4. No. 490.

కుటుంబ సప్తమాష్టమ చతుర్థ వ్యయస్థానములయందు కుజుడువుండి
శుక్రుడు బలహీనుడైవుంటే ద్వికళత్రయోగము. ఈచెప్పిన స్థానములయందు
కుజుడువుంనా ద్వితియ్యమందు గురుడువుంటే ఆలస్యానకు ద్వికళత్రయోగ
ము. ద్వితియ్యమందు శనివుండి సప్తమమందు రాహువుంటే ద్వికళత్రయో
గము. ద్వితియ్యాధిపతి సప్తమాధిపతి అయ్ని శుక్రుడున్ను ద్వితియ్య సప్తమ
స్థానములు చూస్తూవున్నప్పుడు (యెందరు గ్రహములతోటి వుంటున్నారో
అన్ని వివాహములు చెప్పవలశినది. ఈచెప్పిన గ్రహసంబంధంలోను పాపగ్రహ
సంబంధం వీక్షణములులేక కేవల శుభులైరట్టాయనా జీవకళత్రములు అవు
తున్నవి.

P. 5 మారకనిర్ణయం । వ్యయాధిపతిలో ద్వితియ్యాధిపతి మారకుడు.
ద్వితియ్యాధిపతిలో వ్యయాధిపతి మారకుడు. వ్యయమందువున్న గ్రహాలలో
ద్వితియ్యాధిపతి మారకుడు. ద్వితియ్యమందున్న గ్రహాలలో వ్యయాధిపతిమార
కుడు. ద్వితియ్యసప్తమలాభాధిపత్యాలు సర్వగ్రహాలకున్ను దోషము.

వ్యయాధిపతితో ద్వితీయాధిపతి సంబంధులున్ను ద్వితీయాధిపతి చేత వీక్షితులున్ను ప్రబలమారకులు ద్వితీయాధిపతితో వ్యయాధిపతిసంబంధులున్ను వ్యయాధిపతి చేత వీక్షితులున్ను ప్రబలమారకులు. ద్వితీయమందు పాపులువుంటే వ్యయమందువున్న గ్రహాలు మారకులు. ద్వితీయాధిసంబంధులైనవారున్ను షష్ఠాధిపతి చేత వీక్షితులున్ను ప్రబలమారకులు. షష్ఠాధిపతితో అష్టమాధిపతితో సంబంధులున్ను అష్టమాధిపతి చేత వీక్షితులున్ను ప్రబలమారకులు. అష్టమమందువున్న పాపుని మహాదశలో షష్ఠాధిపతి అంతర్దశ మారకము షష్ఠమందున్న పాపునిలో అష్టమమందున్న పాపుని అంతర్దశ మారకము. అష్టమమందున్న పాపుని మహాదశలో పాపుడైన అష్టమాధిపతి అంతర్దశ మారకం. బుధశుక్రులు పంచమమందు వున్నప్పుడు బుధునిలో శుక్రుడున్ను మారకులు. కుజుడు పంచమమందు పాపుడైవుంటే కుజదశలో మారకము. ఆధిపత్యము చేతను శని శుభుడైనప్పటికిన్ని మారకసంబంధం వుంటేగా ప్రబలమారకుడు.

## గోపాలరత్నాకరము.

[ఇది ప్రఖ్యాతమయిన జ్యోతిషగ్రంథము. అచ్చుపడ్డది. మాదిరికి పంచమభావము.]

ద్వితీయపంచమసప్తమాధిపతులలో నొకరయినను షష్ఠాష్టమ ద్వాదశ స్థానములలోనుండి యుభయపార్శ్వములయందు శత్రుగ్రహములుంటేను గొడ్డువాడౌను. పంచమాధిపతి షష్ఠాష్టమములో గాని శత్రునీచరాశులలోనుండినను పుత్రహీనమవును. నవమమందు క్రూరగ్రహమువున్నా పుత్రహీనము. పంచమాధిపతి పాపయుక్తుడయితేను పిండములు జారిపోవును. పంచమనవమాధిపతులు పరస్పర దృష్టివంతులయితేను గొడ్డువాడవును. పుత్రస్థానమున శనియుంటె సంతానము కలిగిపోవును. అయిదింట రవియుంటె నొక కొమారుడు కలుగును. కుజుడుంటె యిద్దరుకొమాలుగా మృతార్భులయి పుట్టుదురు.

గురువుంటె సుగుణమైనవాలుగా గల్గుదురు. రాహువుంటె అన్యవీర్యసంతానము కలుగును. తనవీర్యము నష్టమవునని తాత్పర్యము. కేతువుంటె స్త్రీసంతానవృద్ధి. పంచమాధిపతి పురుషగ్రహమయితె ప్రథమమందు పుత్రజననము. పంచమాధిపతి శుక్ర, చంద్ర, శని, రాహువులలో నెవరితోగలసినా స్త్రీసంతానము కలుగును. బుధయుక్తమయితె కొమాలుగా, కొమాతెలు గలుగుదురు. గురువు నవమమందున్నా చూచిన బహుమంది కొమాలుగా గలుగుదురు. పంచమాధిపతి సప్తమమందున్నా నవమాధిపతితోగలసినా కటక తుల వృషభములలోవున్నా ప్రథమమందు ఆడశిశువు కలుగును. పంచమాధిపతి పురుషక్షేత్ర పురుషగ్రహయుక్తమయినా లేక చూడబడినా పురుష సంతానము కలుగును. గురువు లగ్నపంచమాలలో నెక్కడనున్నా పుత్రజననము పంచమాధిపతి లగ్నాధిపతికలిసి పంచమంలోవున్నా - చంద్రుడు కలసినా చూచినా నొక కొమారుడు కలుగును. వారిద్దరిలో బుధుడుకలసినా యిద్దరుకొమాళ్లు కలుగుదురు. వారిద్దరిలో శుక్రుడుకలిసినా చూచినా కొమారులు, కొమాత్తెలు కలుగుదురు. కేతువుకలిసినా చూచినా కొమారులు కొమాత్తెలు కలుగుదురు. కేతువుకలిసినా చూచినా ఆడశిశువులు కలుగుదురు. పంచమాదిపతి కేంద్రోచ్చమిత్రక్షేత్రములలోనుండి శుభునిచే చూడబడినా కూడబడినా సంతానవృద్ధియవును. నవమమందు శుభుడుంటె సంతానవృద్ధియవును. నవమమందు కుజుడుంటె స్ఫోటకభయము. రాహువుంటె దేశాంతరసంచారి. శనివుంటె వాతరోగి. రవిచంద్రులలో నొకరైనా పంచమములోనున్నా లాభస్థానంలోవున్నా బంధకమవును. లగ్నపంచమాధిపతులలో నొకరిని శత్రుగ్రహముచూస్తే బంధకుడగును. పంచమసప్తములలో క్రూరగ్రహమున్నా పంచమనవమాదిపతులలో నొకరైనను శత్రుగ్రహముతో చేరియుండినను క్రూరగ్రహరాసులయందుండినను గుండెనొప్పి - శూలనొప్పి కడుపునొప్పి కల్గును. యిట్లని పంచమభావము సంపూర్ణము.

## గోపాలరత్నాకరమునకు వచనకావ్యము.

ఇది ఆలూరి వీశామ్రదైవజ్ఞునిచే రచితమైన జైమిని గోపాలరత్నాకరమునకు తెలుగు పంచమభావము. ద్వితీయ పంచమ సప్తమాధిపతులలో నొకరైనను షష్టాష్టమ ద్వాదశస్థానములలోనుండి యుభయపార్శ్వముల యందు శత్రుగ్రహములుంటెను గొడ్డువాడవును.

పంచమాధిపతి షష్టాష్టమములలోగాని శత్రునీచరాసులలోనుండినను పుత్రహీనుడవును.

నవమందు క్రూరగ్రహములువున్నా పుత్రహీనము.

పంచమాధిపతి పాపయుక్తుడయితెను అండములు జారిపోవును.

పంచమనవమాధిపతులు పరస్పరదృష్టివంతులైతేను గొడ్డువాడవును.

పుత్రస్థానమందు శనివుండే సంతానము కరిగిపోవును.

అయిదింట రవియుంటె నొకకుమారుడు గలుగును.

కుజుడుంటె యిద్దరుకుమాళ్లు దుర్భాగ్యులై పుట్టుదురు.

గురుడుంటె సుగుణమయినవారు కలుగుదురు.

రాహువుంటె అన్యవీర్యసంతానము కలుగును. తనవీర్యము నష్టమవునని తాత్పర్యము.

కేతువుంటే స్త్రీసంతానవృద్ధి.

పంచమాధిపతి పురుషగ్రహమవుతె । ప్రథమమందు పుత్రజననము.

పంచమాధిపతి శుక్రచంద్ర శనిరాహువులలో నెవరితోగలశినా స్త్రీ సంతానము కలుగును. బుధయుక్తమయితె కొమారులు కొమార్తెలుకూడా గలుగుదురు. పంచమమందు బుధుడున్నాచూచినా బహుమంది కొమాళ్లు కొమార్తెలు గలుగుదురు. గురువు నవమందువున్నాచూచిన బహుమంది కొమాళ్లు గలుగుదురు. పంచమాధిపతి సప్తమమందున్నా నవమాధితో గలశినా కటకతులావృషభములలోవున్నా ప్రథమమందు ఆడశిశువుగలుగును.

పంచమాధిపతి పురుషక్షేత్ర పురుషగ్రహయుక్తమైనా లేక జూడబడినా పురుష సంతానము కలుగును. గురుడు లగ్నపంచమాలలో నెక్కడనున్నా పుత్ర జననము. పంచమాధిపతి లగ్నాధిపతిగలసి పంచమంలోవున్నా చంద్రుడు కలశినా చూచినా నొకకుమారుడు గలుగును. వారిద్దరిలో బుధుడుకలశినా యిద్దరుకొమాళ్లు గలుగుదురు. వారిద్దరిలో శుక్రుడు కలశినా చూచినా ఆడ శిశువు గలుగును. గురువుచూచినా కలిశినా కొమారులు కొమార్తెలు కలుగుదురు. కేతువులు కలిశినా చూశినా ఆడశిశువులు కలుగుదురు. పంచమాధిపతి కెంద్రోచ్చమిత్రక్షేత్రములలోనుండి శుభునిచే జూడబడినా కూడబడినా సంతానవృద్ధియవును. నవమందు శుభుడుంటె సంతానవృద్ధి అవును. నవమందు కుజుడుంటె స్ఫోటకభయము. రాహువుంటె దేశాంతరసంచారి. శనివుంటె వాతరోగి. రవిచంద్రులలో నొకరైనా పంచమములోనున్నా లాభస్థానంలో వున్నా బంధకమవును. లగ్నపంచమాధిపతులలో నొకరిని శత్రుగ్రహము చూస్తె బంధకుడవును. పంచమసప్తములలో క్రూరగ్రహములువున్నా పంచమ నవమాధిపతులలో నొకరైనను శత్రుగ్రహముతో జేరియుండినను క్రూరగ్రహ రాసులయందుండినను గుండెనొప్పి శూలనొప్పి కడుపునొప్పి గల్గును. యిట పంచమభావము సమాప్తము.

## (c) సిద్ధాంతము.

## భూభగోళదీపిక.

అచ్చుప్రతి 1843.

### పీఠిక.

శ్రీమదఖండబ్రహ్మాండనిర్మాణ చతురీధురీణుండగు భగవంతుడు నిఖిల జగదుపకారముగా నేర్పరచిన జ్యోతిశ్శాస్త్రము - ముందు బ్రహ్మ సూర్య వ్యాసాదులగు ఘనమండ్రుగురిచే గీర్వాణభాషయందు రచింపబడ్డదైయున్నది. అటుతర్వాత భాస్కరాచార్యులు మొదలయినవారలు తతద్దోషాపబృంహాక

ములుగానే సిద్ధాంతశిరోమణి మొదలయిన గ్రంథములను ఆగీర్వాణభాష
యందే రచియించిరి గాని దేశభాషలయందు సర్వజనవేద్యంబగునట్లు చేర్ప
ఱచకపోయిరి. అట్లు దేశభాషలయందు చేర్పఱచనందున సాంప్రదాయ
ముగా నభ్యసించెడు పండితజనులకుమాత్రము గ్రహించుటకు సాధ్యమైనదిగా
నున్నది గాని తక్కినవారికి కొంతమాత్రమున్ను సాధ్యముగా నుండలేదు. ఇట్లు
అస్మదీయనిఖిలజనులకు శాస్త్రమునందు ప్రవేశములేకపోవుటవల్లనే ఆ
శాస్త్రప్రమేయములు నానాటికి కృష్ణపక్షపు చందురుని చందమున క్షీణత
నొందుచున్నవి గాన మీఁద జెప్పిన జ్యోతిశ్శాస్త్రమునందు నత్యంతావశ్యకము
లయియుండెడే భూగోళ, ఖగోళవిషయములనున్ను (శ్రుతి-స్మృతీతిహాస-
పురాణాదులగు సప్రమాణగ్రంథములయందు జెప్పఁబడిన బ్రహ్మాండవిషయము
నున్ను) తెలుగున వచనరూపముగా చేర్పఱచి యనేక గ్రంథములుగా చేర్పడు
నట్లు అచ్చువేయించడము, సకలజనోపకారముగా నుండునని వివేకనిధులగు
ననేకులచేత పలుమారు ప్రార్థింపబడినవాడనై కాంచీనగరనివాసియైన (వెం
కటాచార్యతనూభవుండగు పుసులూరి వైద్యనాథసిద్ధాంతి యనేపేరట ప్రసిద్ధి
నొందియున్న నేను-నిఖిల తంత్ర స్వతంత్ర ప్రతిభాభాసురులగు-పురాణము-
హాయగ్రీవశాస్త్రులవారి సహాయంబువలన-బ్రహ్మాండపురాణము మొదలయిన
పురాణమునున్ను సూర్యసిద్ధాంతము మొదలయిన సిద్ధాంతగ్రంథములనున్ను
తెన్నుగా పర్యాలోచించి శ్రీవ్యాసభట్టారకాచార్యులవారి యభిప్రాయమున
కున్ను శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారి తాత్పర్యమునకున్ను పొరబాటురా
కుండానుండునట్లు భూఖగోళదీపిక అనే గ్రంథము చేర్పఱచి వివేకదర్పణము
ముద్రాక్షరశాలయందు అచ్చువేయించి ప్రకాశపరచడమైనది.

శాలివాహనశక॥సం॥ ౧౭౬౫ - అగునేటి శోభకృన్నామసం-జ్యేష్ఠ-
బ ౫ స్థిరవాసరంబున ముమ్మడిశెట్టి పార్థసారథిశెట్టిగారిచేత అచ్చు సంపూ
ర్ణముగా నెరవేర్చఁబడెను.

## భూగోళస్వరూపలక్షణాదివిషయము.

మీద జెప్పినతీరున బ్రహ్మాండాంతర్వర్తియగు జ్యోతిశ్చక్ర సమ
మధ్యప్రదేశమునందునుండే ఆకాశమున నీభూగోళము స్థిరముగా నుండే
లాగున భగవంతుని విచిత్రశక్తిచేత నేర్పరచబడియున్నది అట్టి భూగోళము -
పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనియెడు పంచభూతాత్మకమైనదిగా నుండి
నాపృథివీభూతాంశముతో మెండుగా జేరియుండడమువల్ల పృథివియని వ్యవ
హరింపబడియున్నది. ఇదేతీరున వాయువు వరుణ-అగ్నిలోకములయందున్న
ఆయా భూతాంశములు అధికముగా జేరియుండుటవల్ల వాయులోకము -
వరుణలోకము - అగ్నిలోకము - అని ఆయా శబ్దములచేతనే వ్యవహరింప
బడుచున్నవి. కాగా ఈభూగోళమునందు గల మృత్తరుశైలగుల్మలతాది
స్థావరములున్ను మనుష్యమృగపక్షిక్రిమికీటాది జంగమములున్ను పంచభూతా
త్మకములుగానే గ్రహింపతగ్గది. ఈభూగోళమునందు అబాది నాలుగుభూతము
లుండు తెరంగెట్లన్నను - సముద్రనదీనదతటాకాదులు జలాంశములు తరు
శైలపాషాణాది పరస్పరసంబంధాదులవల్ల కలిగే కార్చిచ్చు మొదలయినవి,
తేజోంశములు. సర్వవ్యాపియగు వాయువు - భూగోళాంతర్గత జంతువుల
కున్ను భూగోళోపరిపార్థివాంశములగు స్థావరజంగములకు న్నాధారముగా
నుండడనే వాయ్వంశములు, విభువగునాకాశము. భూగోళాంతరాళ పాతాళ
భూములయందున్న తక్కిన యావద్విషయములయందు న్నుండడమే ఆకా
శాంశములు. ఇట్లు - అబాది నాలుగుభూతములయొక్క అల్పాంశసంబం
ధము నానాస్థలములయందు నూహించుకోవలసినది. పృథివి అని చెప్ప
బడిన్ని యీభూగోళమునకు ప్రధానాంశముగా నుండే భూతముయొక్క
ముఖ్యగుణము గంధము - అనగా, వాసన-అట్టి పృథివియందు-తీపి-పులుసు-
వగరు - మొదలయిన షడ్రసములున్ను పృథివ్యంశమును చేరినవేగాని తక్కిన
వాటిని చేరినవికావు. అయితే జలమునకు - మధురరసముమాత్రము కలదు

యీపృథివియందు రూపరసగంధాది పదునాలుగు గుణములుమాత్రము గలవు. మీదజెప్పిన గంధరసములుగాక తక్కిన ౧౨ గుణములు తర్కశాస్త్రానుసారముగా తెలుసుకోతగ్గవి. ఇట్టి పంచభూతాత్మకమగు నీభూగోళము సమఘనవృత్తముగా నిమ్మపండువలె నుంటున్నది గాని పలకవలె సమముగా నుండుట లేదు అయితే - యీభూగోళమందుగల నదనదీసముద్రపర్వతాదులవల్ల నతివిస్తారముగా నుండే యీభూగోళముయొక్క సర్వతోవృత్తతను అత్యంతాల్పకాయులుగానుండే మనము మన సాధారణదృష్టిచేత జూడగా మిక్కిలినిమ్నోన్నతముగా కనబడుచున్నది గాని అఖండదృష్టితో నాలోచించగా దాని స్వరూపము సమఘనవృత్తముగానే యుంటున్నది. ఈయర్థము విశదబడునట్లు లోకమునకున్ను-శాస్త్రమునకున్ను-సమ్మతములుగా నాలుగుయుక్తులు ఈక్రింద వర్ణింపబడుచున్నవి.

౧ ది. ఆదర్శాదులయందు ప్రతిఫలించెడు బింబము ప్రతిబింబము తెరంగుననే యుంటున్నది గాని బింబమునకు వ్యతిరిక్తముగా నుండుటలేదు గాన - ఈభూగోళచ్ఛాయ చంద్రగ్రహణము తటస్థమగునప్పుడు చంద్రగోళమునందు (మహీచ్ఛాయేందు మండలం అనే శాస్త్రప్రమాణవచనము చొప్పున) ప్రతిఫలించుటవల్లనే చంద్రగ్రహణము తటస్థమౌచున్నది. అప్పుడు ఈభూచ్ఛాయ సర్వతోవృత్తముగానే కనబడుచున్నది. వక్రముగాగాని చతురస్రముగాగాని యింకా యేవిధముగానున్ను కనబడుటలేదు. యిది సర్వజనులకు ప్రత్యక్షముగానే యుంటున్నది గాన నీభూగోళము సర్వతోవృత్తముగానే యుంటున్నదని తెలియతగ్గది.

౨ ది. నిరక్షప్రదేశమునందు నిల్చిచూడగా దక్షిణోత్తరధృవులిం యిరువలున్ను యేనుగకు సమముగా వ్రేలాడునట్లు వేసియుండే ఘంటాద్వయమువలె యిరుపార్శ్వములయందు సమముగా కనబడుచున్నారు. జ్యోతిశ్చక్రము మనశిరమునకు నుపరిగా కనుబడుచున్నది. ఆనిరక్షప్రదేశమునుంచి మేరుమూలమునకు బోయెడువానికి తాను బోయెడు దిశనున్న ధృవుడు క్రమ

క్రమముగా పోవుచున్నాడు. అదేతీరున జ్యోతిశ్చక్రము క్రమముగా కిందికి వ్రాలుచున్నది గనుక యీభూగోళము సర్వతోవృత్తముగా నుండక సమముగా నుండిన పక్షమందు మీాద జెప్పినతీరున ధృవునికిన్ని జ్యోతిశ్చక్రమునకున్ను వున్నతనతులు కలగనేరవు. అయినందున ఈభూగోళమునకు సర్వతోవృత్తతయున్ను అట్టి వృత్తరూపముగా నుండె ఈభూగోళమునకున్ను జ్యోతిశ్చక్రమునకున్ను పరస్పరసంబంధము అవినాభావముగా నున్నదనిన్ని నిశ్చయించబడియున్నది. యీఅర్థము సూర్యసిద్ధాంతమునందుగల గోళాధ్యాయమున దెలియజేయబడియున్నది.

3 ది. ఈ భూగోళమున నొక ప్రదేశమునందు వసించియుండెడు జనులకు సూర్యోదయము - అందుకు పశ్చిమదిశయందున్న వారికంటె త్వరగా నౌచున్నది అదేతీరున క్రమముగా సూర్యోదయము కాలవ్యవధానముగానే అంతకంతకు పశ్చిమదిగ్వాసులకు కాలవ్యవధానముగా నౌచున్నది. ఈ భూగోళము సర్వతోవృత్తముగాక పలకవలెనే సమముగానున్న పక్షమందు సమభూమియందు నుంచిన దివిటీదీపము మొదలయినవాటిప్రకాశము ఆస్థలమునందంతా ఏకకాలమునందు కలిగెతీరున భూగోళమంతా కాలవ్యవధానములేక సూర్యప్రకాశము కలుగును. అటులేక కాలవ్యవధానముగా సూర్యోదయము కావడము సర్వజనవేద్యముగా నుండడమువల్ల భూమి సర్వతోవృత్తముగానే యుంటున్నదని నమ్మతగ్గది.

౪ ది. సర్వజనసాధారణముగా దూరమునందుగల పర్వత గృహారామాదులను జూచేయడల వాటి అగ్రభాగమును కనుచున్నాము గాని ఆదిభాగమును కనుటలేదు. పిమ్మట వాటిసమీాపమునకు పోవుచెడల క్రమముగా ఆదిభాగమును కంటున్నాము. ఈ హేతువవలన భూమి సర్వతోవృత్తముగా నుండక పలకవలె సమముగానుండిన పక్షమునందు మీాదజెప్పిన దూరస్థములగు పర్వతాదుల యాద్యంతభాగములు ఏకకాలమునందు కనిపించును గాని అగ్రభాగముమాత్రము కనుబడదు ఇవి మొదలయిన శాస్త్రప్రతిపాదిత దృష్టాంత

ములచేత మీాద జెప్పినవిషయమును స్వానుభవమునకు వచ్చేలాగున యూహించుకోవలసినది. ఇదియునుంగాక ఈయర్థము సమస్తజనులకు నిస్సందేహముగా దెలుపుటకుగాను భాస్కరాచార్యులవారు సిద్ధాంతశిరోమణి యను గ్రంథమునందు శ్లోకద్వయముచేత నీభూగోళమునకు సర్వతోవృత్తతను కరతలామలకముగా సాధకబాధకనిరూపణ చేసియున్నారు. అట్టి విషయము మీాద వర్ణించబడిన యుక్తిచతుష్టయమునకు విశేషోపయోగమని తలచి యీాకింద వివరింపుచున్నాము. ప్రథమశ్లోకార్థము - ఇప్పుడు మనకు ప్రత్యక్షముగా కనబడుచునుండే ఈ భూగోళము అద్దమువలె సమానమై వృత్తముగా నున్న పక్షమునందు ఈ భూగోళమునకు నుపరిభాగమున కనుబడెడుసూర్యుడు మహాభూమియందు నుండు దేవతలకువలె మనకేల యెల్లప్పుడు న్నుదయాస్తమయములులేక నొకేతీరున కనుబడలేదు. అనగా సమముగా నుండక వర్తులముగా నీభూగోళ ముండుటవలన నుదయాస్తమయములు తటస్థమౌచున్నవని తాత్పర్యము.

## ద్వితీయ శ్లోకార్థము.

పలకవలె సమముగానున్న భూమికి మధ్యమునగల మేరువునకు సూర్యుడు ప్రతిదినమున్ను ఒకమారు ప్రదక్షిణము చేసుటవలన మేరువు చాటుకు సూర్యుడు పోతె అస్తమయమున్ను ఇవతలికి వస్తే నుదయమున్ను కలుగుచున్నది యని చెప్పితిరేని - ఉత్తరాయణమునందు ఆసూర్యుని మండలమును నడ్డగించుకొనియుండే మేరువు మనకేల కనుబడకబొయ్యేని - ఆ మేరువు విశేషదూరమున నుండుటవల్ల మనకు దృష్టిగోచరము కాలేదని చెప్పి పూర్వపక్షస్థాపనము చేయదలచితిరేని దక్షిణాయనమందు సూర్యుడు దక్షిణపుదిక్కున ఉదయమవుచున్నాడు గాన ఉత్తరపు దిక్కుననుండే మేరు సంబంధము సూర్యునకు బొత్తిగా కలుగనేరదే ఉదయాస్తమయములు యేలాగున తటస్థముకాగలదు. అనెడు ప్రత్యుక్తిచేత సూర్యుని ఉదయాస్తమయ

ములకు నీ భూగోళము సర్వతోవృత్తముగా నుండడమున్నూ - చక్రముతో కూడా నీ భూగోళముచుట్టున్ను సూర్యుడు తిరుగుతున్ను దృశ్యార్ధప్రదేశ మును పగలుగా చేయుచున్ను అదృశ్యార్ధప్రదేశమును రాత్రిగా చేయు చున్నాడనడమే ముఖ్యకారణమని తెలియతగ్గది అని భూగోళమునకు సర్వతోవృత్తత సాధించినారు. మీదజెప్పిన రెండువిషయములకు ప్రమాణ వచనములు.

## సిద్ధాంతశిరోమణౌ - భాస్కరః

౧. యదిసమా ముకురోదరసన్నిభా భగవతీ ధరణీ తరణిః క్షితేః ।
ఉపరిదూరతరోఽపి పరిభ్రమన్ కిమునరైరమరైరివనేక్ష్యతే॥

౨. యదినిశాజనకః కనకాచలః కిముత దంతరగస్సన దృశ్యతే ।
ఉదగయం నను మేరుధాంశుమాన్ కథముదేతి చ దక్షిణభాగకే॥

ఇదియుగాక ఈ భూగోళము సమఘనవృత్తముగా ఫిరంగిగుండు వలెనే యుండుటవల్ల రొట్టెవలె గాదని - అనియెడు సాధారణజనులు చెప్పెడు దృష్టాంతవచనము చొప్పుననే ఈ భూగోళమునకు నూర్ధ్వాధః ప్రదేశము లను కనుపెట్టుట శక్యము కాదసిన్నీ - లంకాదినిరక్షప్రదేశస్థ పత్తన చతుష్టయవాసులున్ను సుమేరు బడబా ముఖములయందు వసించెడు దేవాసురులున్ను తక్కిన ప్రదేశములయందు నుండే మనవంటివారున్నూ అందరున్ను తమంతటతాము ఈ భూగోళమునకు మీదుగా నుండేలాగుననే నమ్ముచున్నారు గాని వేరుగా దలచుటలేదు. మీద జెప్పిన దేవతలవిషయముగా జ్యోతిశ్చక్ర భ్రమణము ప్రదక్షిణముగానున్ను అసురుల విషయముగా అప్రదక్షిణముగా నున్ను మనకు నుపరిభాగమున పశ్చిమముఖముగానున్ను జ్యోతిశ్చక్రము సంచరింపుచున్నది. ఇట్లు ముత్తెరంగుల సంచారము సమ చతురశ్రముగా భూగోళముండెనేని తటస్థము కానేరదని బుద్ధిమంతులు ఊహించుకోవలసి నది. ఈవిషయము సూర్యసిద్ధాంతమునందు కంఠోక్తిగా జెప్పియున్నది. ఇది

మొదలయిన అనేకయుక్తులు వెవ్వేరు తెరంగులగా నభివర్ణింపబడియున్నవి. ఈమీద వర్ణింపబడిన యుక్తులసహాయముచేత బుద్ధిమంతులు భూగోళమునకు సమఘనవృత్తత స్థాపనము చేసుకోగలరని తలచినందువల్లనున్ను గ్రంథవిస్తర భీతివల్లనున్ను యిచ్చట విశేషించి ప్రకాశపరచలేదు.

## భూభగోళదీపిక, దిగ్వ్యవస్థోపయుక్త శంకుస్థాపనావిషయము.

జలసమానమయిన శిలాతలమునందుగాని లేక జలసమానముగా వజ్రగారచేసిన స్థలమునందుగాని పన్నెండు అంగుళాళనిడుపున్ను అంతపలమున్ను గల శుభదారునిర్మితమగు శంకువును స్థాపించి ఆది మధ్యంచేళి ఉదయాది మూడుగడియలకాలమునకు శంకువుయొక్క ఛ్ఛాయ పడమరగా నెంతదూరము పోవుచున్నదో అంతమాత్రము ప్రమాణముగల వృత్తమును శంకుమూల మధ్యమును ఆదివేసి విసిరేది - ఉదయాది మూడుఘడియలప్పుడు శంకు చ్ఛాయ ఆవృత్తమునందు నెక్కడ పడుతున్నదో అక్కడ బిందువు నిలిపేది. అదేప్రకారము సాయంకాలము మూడుగడియల ప్రొద్దువుండగా శంకువుయొక్కచ్ఛాయ పూర్వభాగపువృత్తమునందు నెక్కడ పడుతున్నదో అక్కడ నొకబిందువు నుంచేది. అటుతర్వాత తూర్పుబిందువుమీద లేఖనిమూలమున్ను పడమటి బిందువుమీద లేఖన్యగ్రమున్ను వుంచి యొకవృత్తము విసరగా యీరెండు వృత్తములున్ను కలిసి దక్షిణోత్తర ముఖపుచ్ఛములుగల మత్స్యమువలె నేర్పడును. దాని ముఖపుచ్ఛంబులు దూనేలాగున అడ్డముగా నొకరేఖ తీస్తె ఆది దక్షిణోత్తరరేఖ అనబడును. ఆముఖపుచ్ఛములలో ముఖమందు కైవారమూలమున్ను పుచ్ఛమునందు కైవారాగ్రమున్ను వుంచి వొక వృత్తము విసిరేది దాని పుచ్ఛమునందు కైవారమూలమున్ను ముఖమునందు కైవారగ్రమున్ను వుంచి వొకవృత్తము విసిరేది. ఈరెండు వృత్తములున్ను వొకదానిమీద నొకటి కలిసి పూర్వ పశ్చిమయితమగు మత్స్యాకారమగును. దాని ముఖపుచ్ఛములు దూనేలాగున నొకరేఖ వేస్తే పూర్వ పశ్చిమరేఖ కలుం

గును. ఆ ముఖపుచ్ఛాగ్రములగు నాలుగు స్థలములలోనున్న నాలుగు బిందువులు నిలిపితే పూర్వాది చతుర్దిక్కులగును అందు పూర్వబిందువుమీద కైవారమూలమున్ను దక్షిణ బిందువుమీద తదగ్రమున్ను మోపి వొక వృత్తము విసిరేది. దక్షిణ బిందువుమీద కైవారమూలమున్ను పశ్చిమ బిందుమీద తదగ్రమున్ను మోపి వేరొకవృత్తము విసిరేది. పశ్చిమబిందువుమీద కైవారమూలమున్ను యుత్తరబిందువుమీద తదగ్రమున్ను మోపి మరియొక వృత్తము విసిరేది. ఉత్తరబిందువుమీద కైవారమూలమున్ను పూర్వబిందువుమీద కైవారాగ్రమున్ను మోపి వొకవృత్తము విసిరేది. ఇట్లు నాలుగువృత్తములు విసిరితే అన్యోన్యసంలగ్నములగు నాలుగు మత్స్యాకారరేఖలు పుట్టును. అందు ఆగ్నేయ వాయవ్య మత్స్యములు దూసేటట్లు వొక రేఖయున్ను ఈశాన నైఋత దిశలయందుగల మత్స్యముల దూసేటట్లు వొక రేఖ తీస్తే ఆగ్నేయాది విదిక్కులు నాలుగున్ను కలుగును. ముందు నిర్ణయించిన చతుర్దిక్కులనున్న బిందువులను విదిక్కులనున్న రేఖలతో కలిసేలాగున కూరిస్తే చతురశ్రమండలమౌను. యీదిక్సూత్రలగ్నమగు మధ్యప్రదేశమునందు వొకబిందువుంచి ఆబిందువులో కైవారమూలము నుంచి శంకువ్యాసార్ధప్రమాణమగు వొకవృత్తము విసిరేది ......ఈమీద చెప్పినతీరున నేర్పరచబడిన మండలము దిక్సాధన మండలమని వ్యవహరింపబడతగ్గది. ఇట్టి మండలము నేర్పరచుకొని పూర్వోక్తవిషువద్దినముల నాటి మధ్యాహ్నకాలమున శంకు స్థాపనముచేసి ఛాయానిర్ణయము చేసుకోవలసినది. మరిన్ని ఈ దిఙ్నిర్ణయము గ్రహారామక్షేత్ర దేవాలయాదుల నిర్మాణమునందు విశేషముగా నుపయోగించును !

## శ్రీ ఆర్యభటసిద్ధాంత వ్యాఖ్యానము,

R. No. 567-N/5-1-19 1920-21

శ్రీ కొటికెలపూడి కోదండరామసూర్యవిరచిత ఆర్య భటసిద్ధాంత సుధాతరంగాహ్వయవ్యాఖ్య.

బహుధాన్యసం॥ భాద్రపద ౧౧ ౭ బుధవారం ... ముంగిపూడి సాంబన్న (చిత్తూరుజిల్లా) రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారికివ్రాసి యిచ్చెను.

PP 6, 7, (1) అథపంచమసూత్రం.

శశిరాశయోష్ట (౧౨) చక్రం తేం శకలాయోజనానియ (30) వ (౬౦) ఇ (౧౦) గుణాః । ప్రాణేనైతికలాభం ఖయుగాం శే గ్రహాజవోభవాం (౬౦) శేర్కాః ॥

టీ. అన్నికక్ష్యలకంటేనున్ను అథో భాగమందు చంద్రకక్ష్యపుండబట్టి చంద్రకక్ష్యనుపుచ్చుకుని శేషించినవారియొక్క కక్ష్యాయోజనములు తేవలెనన్న తాత్పర్యంచాతను 'శశిరాశయః' అనిసూత్రమందు చెప్పినారు గనుక భగణం ౧ కి ౧౨ రాసులు అగుటచాత చంద్రభగణం ౧౨ ట గుణించి రాసులు చేసి ఆరాసులు 30 ట గుణించి భాగలుజేసి భాగలు ౬౦ ట గుణించి లిప్తలుచేసి లిప్త ౧ కి పదియోజనాలుగనుక యీలిప్తలు ౧౦ ట గుణించగాను చంద్రకక్ష్యాప్రమాణమైన ౨౧౬౦౦౦-యీ యోజనములున్ను అయెను. యీచంద్రకక్ష్యాయోజనములచాత చంద్రభగణములయిన ౫౭౭౫౩౩౬ వీటిని గుణించంగాను ఆకాశకక్ష్యఅగును, ఆకాశకక్ష్య అనగా బ్రహ్మాండకటాహాంతరమందు సూర్యరశ్ములు వ్యాపిస్తూవున్న ఆకాశమనబడును. పంచభూతాత్మకములైన గ్రహనక్షత్రాదిగోళములు యీ ఆకాశకక్ష్యలోగావున్నవి మాత్రమే సూర్యకిరణప్రసారంకలవై తేజోమయములై గ్రహతారారూపంగా కనిపిస్తూవుంటవిగాని ఆకాశకక్ష్యకు పైనివున్న గోళములు గాఢాంధకారమయములౌటవల్ల కనిపించకుండావుంటవి. ఆకాశకక్ష్యాంతర్వర్తియైన యీ

జ్యోతిశ్చక్రం ఏకప్రాణకాలమనగా దశగుర్వక్షరోచ్చారణకాలానకువొక్కొక్క లిప్తచొప్పున దినం ౧ టిక్కె ౨౧౬౦౦ లిప్తలున్ను నడుస్తూవుంటుంది. యీఆకాశకక్షా యోజనములు యేగ్రహంయొక్క భగణములచాత పాలు గొంటాడో ఆగ్రహంయొక్క కక్ష్యాయోజనములు త్రైరాసికన్యాయాన అవును. సూర్యకక్ష్యాయోజనములుపెట్టుకుని ౬౦ ట గుణించగాను అశ్విన్యాది ౨౭ నక్షత్రములయొక్క కక్ష్యాయోజనములు అవును. ఇతిపంచగతిసూత్రం.

P 27, 28

(2) త్రికోణాకారమయిన త్రిభుజక్షేత్రంయొక్క ఫలానయిన ప్రకారమున్ను షట్కోణాకారమనగా దీనియొక్క ఘనమనిపించుకున్న షడ్భుజాక్షేత్ర ఘనాయన ప్రకారమున్ను ఆరోసూత్రంచాత చెప్పుచున్నారు.

ఆర్య. త్రిభుజన్యఫలశరీరం సమదళకోటీభుజార్ధసంవర్గః ఊర్ధ్వభుజా తత్సంవర్గార్ధం సఘనోఘనషడశ్రీతి.

టీ. కోణత్రయంతోకూడుకున్న యీత్రిభుజాక్షేత్రం త్రిసమభుజాక్షేత్రమనిన్ని ద్విసమభుజాక్షేత్రమనిన్ని విషమభుజాక్షేత్రమనిన్ని మూడు ప్రకారములై వుండును. అందులో త్రిసమభుజాక్షేత్రం ఫలం ముందుగా వ్రాసేను. యిష్టాంగుళములచాత కాయబడ్డ సమచతురశ్ర భూమియొక్క పృధివి అనుపించుగున్ను ఉభయాంతములయందున్ను భుజాప్రమాణశలాకలు నిలిపి క్షేత్రంయొక్క మధ్యరేఖను వుభయాగ్రములున్ను తగి లీలాగు వంచగాను సమత్రిభుజాక్షేత్రమగును. యీసమత్రిభుజాక్షేత్రంయొక్క యిష్టాంగుళములు ౧౬.



క్షేత్ర ప్రకారం యీ క్షేత్రమందు కనిపిస్తూవున్న సమత్రిభుజాక్షేత్రం యొక్క ఫలం తేవలసి మధ్యరేఖయొక్క మొదటినుంచి వుభయశలాకాగ్రములున్ను స్పృశించిన స్థలానకు యెన్ని అంగుళములు అయినవో ఆసంగతం వకటి ముందుగా తెలియవలెను గనుక అజ్ఞాయత దీర్ఘచతురశ్ర కర్ణమనిపించుకున్న యీ ౧౬ టి యొక్క వర్గమయిన ౨౫౬ న్ను యిది పృథివ్యర్ధవర్గమున్ను అవ(ద)లంబవర్గమున్ను కూడగాసైన ప్రతిగనుక యిందులో పృథివ్యర్ధ వర్గమయిన ౬౪ గున్ను పుచ్చగా నిలిచిన అవలంబమనిపించుకున్న మధ్యరేఖ యొక్క వర్గము ౧౯౨ యిది వర్గమూలంగొనంగానయిన అవలంబాంగుళ ములు ౧౩।౫౧।౧ యీ అవలంబప్రమాణమయిన భుజలురెండున్ను పృథివీ ప్రమాణమయిన ౧౬ చాత గుణించి అర్ధించంగానయిన క్షేత్రఫలం ౧౧౦।౪౮ మరివకవుదాహరణ - ౧౨౦ అంగుళముల సమభుజలుకల క్షేత్రంయొక్క ఫలం తేవలశి భుజావర్గం ౧౪౪౦౦-యిందులో భూమ్యర్ధాంగుళములైన ౬౦ టి యొక్క వర్గం పుచ్చగా నిలిచినశేషం ౧౦౮౦౦ యిది వర్గమూలం గొనంగానయిన అవలంబం । ౧౦౩ । ౫౫ యీ అవలంబము భూప్రమాణము చాత గుణించి అర్ధించంగానయిన సమత్రిభుజాక్షేత్రం ఫలం-౬౨౩౫।౦ ద్విసమ భుజాక్షేత్రఫలమున్ను యీ ప్రకారంగానే వచ్చును.

P P 52, 53.

(3) ఇంకా స్థానవ్యయస్థిత శంకుఛాయనుపట్టి అజ్ఞాతకోటి భుజా సాధనం షోడశసూత్రంచాత చెప్పుచున్నాము.

ఆర్య. ఛాయా గుణితం ఛాయాగ్ర వివరమానేన భాజితాకోటిః
శంకుగుణా కోటిః స్వచ్ఛాయయా భక్తా భుజా భవతి.

టీ. ఉన్నతస్థలమందు దీపం వుంచి ఆదీపసమీపమందు తనయిష్టం వచ్చినంతదూరాన వక శంకు వుంచి ఆ శంకుఛాయ యటువైపు ప్రసరిం చునో ఆప్రసరించినవైపు ఛాయకు సూటిగా తన యిష్టంవచ్చినంత దూరాన మరి వక శంకు వుంచి యీ వుభయఛాయలున్ను కొలుచుకొని ఆఛాయాగ్రం

గుళములున్ను ప్రథమ శంకు ఛాయాగ్రం నుంచి ద్వితీయ్య శంకు ఛాయాగ్రం పర్యంతమున్ను కొలుచుకుని అగ్రాంతరమయిన అంగుళములు వ్రాసుకునేది. యిందువల్ల అజ్ఞాత భుజకోట్లు సాధించేక్రమం. యీ రెండుఛాయలలో యిష్టమయిన ఛాయచాతను అగ్రాంతరం గుణించి వుభయఛాయా విశ్లేషం చాత పాలుగొనంగాను కోటి అనగా శంకుఛాయాగ్ర భుజాంతరాళభూమి వచ్చును. యీ కోటి శంకుచాత గుణించి ఛాయచాత పాలుగొనంగాను దీప స్తంభప్రమాణం వచ్చును.

P 54, 55

(4) పర్వతమందు వప్రాకారగోపురాద్యున్నత స్థానాలయొక్క భుజలు కోట్లు తెలియవలెనన్న భావం కలిగినప్పుడు దర్పణాదులవల్లనున్ను దృగ్రేఖలవల్లనున్ను వాటివాటియొక్క స్థానద్వయస్థిత శంకుఛాయలు సాధించి అగ్రాంతరం తెలిసి యీ చెప్పబడ్డప్రకారంగాను భుజకోట్లు సాధించుకునేది. ప్రభాసూన్యములయిన పర్వతమంటప ప్రాకార గోపురాద్యున్నత స్థానముల సంబంధమయిన శంకుఛాయలు వారలేకుండా తెలియగలందులకు యంత్రములు చెప్పుచున్నాము॥ నిర్మలమైన దర్పణందయొక్క మధ్యభాగ మందు శంకువుంచి శంక్వగ్రం మీదినుంచి దర్పణమందైన వున్నతప్రతిబింబం యొక్క అగ్రానను గురికగిలీలాగు రుజువైన శలాకదర్పణాన్ని మెయ్యనిలిపి ఆశలాక మోాశిన స్థలమందు చిహ్నావుంచి ఆచిహ్నాదగ్గిరవుంచి శంకువ్యాసార్థ మధ్యబిందువును అంటేలాగు చిహ్నాకుయెదురుగా దీర్ఘమైనసూత్రంవిడచి శంకుమూలంనుంచి చిహ్నాదాకావున్నసూత్రం మునుపటిసూత్రంమీదికివిడిచి ఆ అగ్రమందు బిందువవుంచగాను పర్వతగోపురాదులయొక్క ఛాయవచ్చును. యిదిగాకమరివకప్రకారం చెప్పుచున్నాము. నాలుగుఅంగుళముల వెడలుపున్ను నాలుగు అయిదుహాస్తములు పొడుగున్నుగల బల్లవకటి భూమికి మూరెడు రెండుమూళ్లయెత్తరవుగావుంచి అందుమీద శంకువుంచి సూక్ష్మమైన వివరంగల రుజువైననాళం అనగా గొట్టియొక్కఅగ్రం శంక్వగ్రంమీదవుంచి ఆవివరం

లోనుంచి వున్న శస్థలాగ్రంమాత్రంచూచి అప్పుడు నాళంబల్లను మోశినస్థలం ఛాయాగ్రంగా గ్రహించేది శేషపక్షమందు వున్న శస్థలాగ్రమందు మణివిపా దులువుంచి ఆయనా ఛాయకోల్సుకుని భుజకోట్లు సాధించుకోనేది॥ ఇతి షోడశంసూత్రం॥ శర్ణం తెచ్చేప్రకారమున్ను శరపరిజ్ఞానం కలిగినప్పుడు జ్యాతెచ్చేప్రకారమున్ను పదిహేడోసూత్రంచాత చెప్పుచున్నాను॥

The pooranic, Siddhautic and Copernican system of the world compared; to which is added a discussion between a Sehore and a Benares Pundit, illustrative of the facts that a person going round the world to the East and another to the west, will experince the former one sunrise more and the latter one sunrise less than a third person remaining stationary, at the point whence the two individuls start.—L. W.

by Soobajee Bapoo of Sehore near Bhopal in Malwa. Madras. Printed by P. Batchelor, at the Church Mission Press, Popham's Broadway,

1837.

శ్రీసీతారామాయనమః. స్వస్తిశ్రీమత్సమస్తస్థానసంస్థితసద్విద్వత్ బృందంబునకు రామచంద్ర సుబ్బాజీభావు హస్తద్వయముముకుళించి పుస్తకంబునజేర్చి స్వానుభవవృత్తాంతంబు విన్నపించుచున్నాడు, గనుక కృపచాత మనివి వినవలయును. అదియట్లంటే - నేను ప్రథమం కించిత్ శాస్త్రము కావ్యకోశధర్మశాస్త్రములను జ్యోతిషఫలాదికము అధ్యయనంచేసి అంతటితో జ్ఞసమానోత్తమత్వం పొందినట్టుంపలేకుండగా కృతకృత్యుడైతినని యుంటిని॥ అంతలో లాన్సిన్ వుల్కిన్సన్ ఇనకోయరుసాహెబుబహాదరు చంద్రపురం కల్కటరు సూపరింటెండెంటు అయివచ్చి తాను విద్వాంసుడుగనుక చంద్రపురం

లోనున్ను విద్వజ్జనపరిశీలనచాయగా ఆదరు పోతూవస్తూవుండిరి. నేనున్ను
పోతూఉంట్టిని. అంతలో అన్నోదకఋణానుబంధంచాతను నన్ను తనవద్దనిలిపి
యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యావిజ్ఞానేశ్వరకృతమితాక్షరీ వ్యవహారకాండ వ్యవ
హార మయూఖం ఆదిజేసిచూస్తూవుండగా నాకుయేమని తోచెనంటే - వీరు
ప్రత్యంతవాసులు వీరియందు విద్యలేక యుండవలెనుగన్కునే మనవద్దనుంచి
సంగ్రహించుతున్నారు. ॥ అటుతరువాత చంద్రాపురమునుంచి బదిలీఅయి
నాగపురంవచ్చి అక్కడనుంచి తర్లీ ప్రయాగనుఆవల లాటుసాహెబువారి
దర్శనంచేసి అక్కడనుంచి భూపాలముకు యేజంటుఅయివచ్చి సాంప్రతం
భూపాలానుకుసమీపాన శిహూరుఅనేనగరం ఛావణిలోఉండెను. నన్నున్ను
వెంబడి తీసుకోవచ్చెను. యితనివద్ద ౧౦ సంవత్సరములుగావుంట్టిని. చంద్ర
పురంలోవుండగా భూగోళఖగోళవిషయం ప్రశ్నచేస్తే భాగవతములోవ్రాశి
నట్టు ఆమతంపట్టి బహువాదవివాదం చేస్తూఉంట్టినిగాని పృథివ్యాకారవిస్తార
విషయమై శేషుడుధరించిన విషయమై చంద్రుడుమీద సూర్యుడుకింద అనే
విషయమై అక్కడక్కడ ఉత్తరంచేరక సమాధానం కాకపోవును. అయినా
గాని వారిమతము మనకు యాలనని దానియందు శ్రద్ధఉంచ్చలేదు. యిట్టి
అయిదు ఆరుయేండ్లుపర్యంతం వాదంచేస్తూవుండగా శిహూరికివచ్చిన తరు
వాత ఆతడు మనస్సులో విచారించెగదా మనశాస్త్రమునుంచి వీరికి నమ్మిక
తోచదు. వీరియందున్న గ్రహణగణితంచేస్తారని అందురు. యేచొప్పున
చేస్తురో వీరిశాస్త్రం తెలుసుకోవలెనని యత్నంచాయగా ఉజ్జయినీలో సూర్య
సిద్ధాంతపుస్తకమున్ను దొరికెనది । అదిచదివిన రామకృష్ణసిద్ధాంతి ఉన్నాడని
తెలిశి ఆతణ్ణిపిలిపించినాడు అంతలో సాహెబుకు కోటవంకపోవలశి ఆసిద్ధాం
తిని వెంబడితీసుకుని అక్కడికిపోయినాడు । అక్కడికి ఉదయపురం జయ
పురం ఆదినగరములు దగ్గిరగనుక అక్కడనవాయిజయశింగు పూర్వము సిద్ధాం
తులచేత జెశినశిలాయంత్రాదులు చేయించి ఉండెను । ఆసంబంధపు సిద్ధాంతి
వొకడు కోటలో మహారావుసాహెబువద్దికివచ్చి యిత్తడిభూగోళంతురీయ్య

యంత్రాదికంచేసియిచ్చి వుండ్డెను। అవిచూసుటవల్ల సాహెబుకుతో చేగదా వీరియందున్ను జ్యోతిషవిద్యవున్నదిగాని సర్వత్ర ప్రసరించలేదు యీశాస్త్రము సంపాదించి తెలిసినంతల్లో వీరునమ్మేరని బహుదూరంనుంచి ఉద్యోగపురస్సరంగా ద్రవ్యవ్యయంచేశి బ్రంహ్మసిద్ధాంత-రోమకసిద్ధాంత-ఆర్యభటసిద్ధాంత - లీలావతి - బీజగణిత - సిద్ధాంతశిరోమణి - గ్రహలాఘవవ్యాఖ్యా మల్లారీ యీగ్రంధాలు తెప్పించినంతలో అవిచూచేవరకు యీసిద్ధాంతములనుసం సాహెబు లోకులమతం వొక్కప్రకారం గణితంచాత ప్రత్యక్షమైనట్టు తోచెను.

## అష్టకవర్గు.

వజ్జలనరసింహాసిద్ధాంతిగారు వ్రాసుకొన్న అష్టకవర్గుమండి. 150 సంవత్సరముల క్రిందటివాడు.

198, 199 వ తాళపత్రము.

త్రికోణశోధనకు। కర్కాటక శింహ్వాలకు శోధనపనిలేదు। మేష వృశ్చికాలకు వృషభతులకు మిధునకన్యలకు ధనుమీనాలకు మకరకుంభాలకు రెండేసిరాసులకు వొఖడు, వొఖడు అధిపతిగనక వాడివాడిస్థానాల బిందువులు, ఏకాధిపత్యశోధన చెయ్యవలెను. రెండురాసులను గ్రహాలువుంటె శోధన పనిలేదు. రెండురాసులను గ్రహంలేకవుండినా వొఖరాసిలో తక్కువబిందువులు వొఖరాసిలో యెక్కువబిందువులువుంటే, తక్కువ రాసితో సమం శేశెది। వొప్పురాసిలో బిందువులులేకపోతే శోధనపనిలేదు। రాసులను, బిందువులు సమంగ్గావుంట్టే రాసులబిందువులు యెత్తివేశేది। వొఖరాశికి గ్రహంవుండ్డి వొక గ్రహంలేకవున్నప్పుడు, రెండురాసులను, బిందువులుసమంగావుంటే, గ్రహంలేనిరాశిబిందువులు యెత్తివేశేది। గ్రహంవున్నరాశిని యెక్కువబిందువులు గ్రహంలేనిరాశిని తక్కువ బిందువులువుండెనా గ్రహంలేనిరాశిని బింద్దువులు యెత్తివేశేది। గ్రహంవున్నరాశిని తక్కువ బిందు

పులు గ్రహంలేనిరాశిని, యెక్కువబిందువులు వుండేనా తక్కువరాశితో సమంచేశేది । వొఖరాశిని శూన్యమైతే శోధనపనిలేదు । త్రికోణశోధన, ఏకాధిపత్యశోధన చెయ్యగా మిగిలిన స్ఫుటబిందువులు యేరాశివిఅయి ఆరాసుల బిందువులువ్రాసి రాసిగుణకారాలు గ్రహగుణకాలు చెయ్యవలెను । అగుణకాలుచెప్పేను । (శ్లోకం) । మేషబిందువులు ౭ హెచ్చుగుణించేది । వృషభబిం ౧౦ హె । మిథునబిం ౮ హె । కర్కాటకబిం ౪ । సింహబిం ౧౦ । కన్యాబిం ౫ । తులబిం ౭ । వృశ్చికబిం ౮ । ధనుస్సుబిం ౯ । మకరబిం ౫ గు । కుంభానికి ౧౧ ట గుణించేది । మీనబిం ౧౨ ట్ల గుణించేది । యీ ౧౨ రాసులు గుణించినబిందువులు రాసులుచేశేది । గ్రహగుణకారం గ్రహం వున్నరాశి కేకాని గ్రహంలేనిరాశికిలేదు । ఆగ్రహం యేరాశినివుంటే ఆరాశి త్రికోణశోధన ఏకాధిపత్యశోధన చెయ్యగా మిగిలినబిందువులను ఆరాశి యెుండ్ల యెన్నిగ్రహాలువున్నా వారివారికిచెప్పిన గుణకారాలచాత ప్రత్యేకం ప్రత్యేకంగుణించేది । సూరీడికి ౫ ట గుణించేది । చంద్రునకు ౫ ట గుణించేది । కుజానికి యెనిమిదింట గుణించ్చేది । బుధునికి ౫ ట గుణించేది । గురునకు ౧౦ టగు । శుక్రునకు ౭ గు । శనికి ౫ ట గుణించేది । వీంటిచాత గ్రహగుణకాలుగుణించి, రాశిచేసి, రాశిగుణకాలు గ్రహగుణకారాలు రాశిచేశేది । (దీనికిశ్లోకం) । యీప్రకారంచాత పూర్వమందు గుణించినరాశి ౭ ట్ల గుణించ్చి ౨౭ ట పాలు గొన్నవచ్చినలబ్ధాలువర్షాలు । ఆశేషం ౧౨ ట గుణించి ౨౭ ట పాలుగొనంగా వచ్చినలబ్దం మాసాలు । ఆశేషం ౩౦ ట గుణించి ౨౭ పాలుగొనంగా వచ్చినలబ్దం దినాలు । ఆశేషం ౬౦ ట గు ౨౭ పా లబ్దం ఘడియలు । ఆశేషం ౬౦ ట గు ౨౭ పా లబ్దం విఘడియలు । వచ్చిన వర్షాలలో ౨౭ పాలుగొనంగా మిగిలినశేషం వర్షాలు । మిగిలినవి పాలు గొనపనిలేదు । యిందుకు షడ్విధహరణాలుచెప్పేను । (శ్లోకం) । టీక । రెండుగ్రహాలతోకూడివున్నాను, నీచయందువున్నాను, అస్తమించినగ్రహానకున్ను సఖంతీసివేశేది । శత్రుక్షేత్రాలయందువున్న గ్రహానకు మూడోపాలు

తీసివేశేది । క్రూరగ్రహాలయేంళ్లలోని ౧ దో పాలుతీశేది । గ్రహయుద్ధమందు వోడిపోయినగ్రహానకు 3 వ పాలు తీసివేశేది । షడ్విధహారణాలు శయ్యాం గాను శుద్ధివహాణాలు అవును । అన్నిగ్రహాలు ; వొక్కదిక్కునేవుండిశా బల వంతగ్రహానకు హారణంచేశేది । కడమహారణాలు కాయబనిలేదు ॥ ఆవెనుక షడ్విధహారణాలుచేసిన యేంళ్లు 3౬౮ గుణించ్చి 3౬౫ పాలుగొంటను శుద్ధ వహాకాలు అవును । ఆశేషం ౧౨ గుణించి 3౬౫ పాల్లబ్దం మాసాలు శేషం 30 గుణించ్చి 3౬౫ పాల్లబ్దం దినములశేషం ౬౦ గుణించి 3౬౫ పాల్ల బ్ధం ఘడియలు శేషం ౬౦ ట గుణించి 3౬౫ పాల్లబ్దం విఘడియలు ॥

యీప్రకారానే సప్తగ్రహాలకు తెచ్చి, తర్వాత ప్రత్యేకం పూర్వాన చెప్పినట్టుగానే హారణాలుచేశేది॥ దశానిన్నకాయః । గణితాగతం చాతను యేయేగ్రహానకు యెన్నిసంవత్సరాలో మాసాలు, దినాలు, ఘడి యలు, విఘడియలు వస్తావో ఆవే వాడివాడి దశానిన్నకాయం । దశలకట్టే ప్రకారం । లగ్నాధిపతి, రవిచంద్రులు, వీరి ముగ్గురులోను బలవంతుడైన వాని దశ ప్రవేశపెట్టేది । బలవంతుడనగా యీశాస్త్రమందు కేంద్రస్థానాలలో వున్నవాడు । యీ ముగ్గిరిలోను కేంద్రాలలో వున్నవాడిదశ ప్రవేశపెట్టేది । కేంద్రాలలో ముగ్గురువున్నా, ముగ్గురు లేకపోయినా, చాలా సంవత్సరాలు యిచ్చినవానిదశ ప్రవేశపెట్టేది । తరువాత కేంద్రాలయెంద్దు వున్నవానిదశ ప్రవేశపెట్టేది । కేంద్రాలను బహుగ్రహాలువుంటే వాంళ్లలో బలవంతుని ముందరగుండా ప్రవేశపెట్టేది । ఆతర్వాతను ఆ పోక్లీబాలయందున్న గ్రహా లను ప్రవేశపెట్టేది । తరువాత కేంద్రాలయందు వున్నవానిదశ ప్రవేశపెట్టి (నిమ) కళాగ్రహాలను ప్రవేశపెట్టేది । ఆతర్వాతను (పణబరాలు) యెంద్దువున్న గ్రహాలను ప్రవేశపెట్టేది । ఆతర్వాత ఆపోక్లీబాలయందున్న గ్రహాలను ప్రవేశపెట్టేది । కేంద్రాలనగా లగ్నచతుర్థ సప్తమ దశమాలు । పణబరా లనంగా ద్వితీయ్య పంచమాష్టమ లాభస్థానములు । ఆపోక్లీబాలనగా తృతియ్య షష్ఠమ నవమద్వదశాలు॥

201 వ పత్రం॥

త్రికోణశోధన ఏకాధిపత్యశోధన శోధించగా మిగిలిన బిందువుల మొందర రవివర్గంలో రవికి తొంమ్మిదోరాశి బిందువులతోటి హెచ్చగుణించ్చి ౨౭ భాగారించ్చి మిగిలినలబ్ధం శుక్లపక్షమైతే, అశ్విని మొదలుకొని శుక్ల పక్షమైతే ధనిష్ట మొదలుకొని మిగిలిన నక్షత్రాలులో కడనక్షత్రం దానికి తొంమ్మిదోనక్షత్రంతొంమ్మిదోదానికి తొంమ్మిదోనక్షత్రం యీత్రికోణరాసిలో వచ్చేటప్పుడు (పితృ)గండం। శుక్రవర్గం వేళ రెండుశోధనలు శోధించి మిగిలినలబ్ధంముంద్దర శుక్రునికి యేడోరాశి బిందువులతోటి హెచ్చ గుణించ్చి ౨౭ ట భాగారించి పక్షమెరింగ్గి మిగిలిన నక్షత్రంలో కడనక్షత్రందానికి తొమ్మిదో నక్షత్రానికి తొమ్మిదో నక్షత్రంల్లో త్రికోణరాశిలో శనివచ్చినప్పుడు కళత్రపీడా। శనివర్గం వేళ రెండుశోధనలుచేశి మిగిలిన బంధువులముందర శని వుండి రాశికి ౭ యెనిమిదోరాశి బంధువులతోటి హెచ్చ గుణించ్చి శుక్ల, కృష్ణ పక్షా లెరింగి నక్షత్రం మొదలుకొని కడనక్షత్రం, దానికి తొమ్మిదో దానికి తొమ్మిదో నక్షత్రంలో త్రికోణరాశిలో శనివచ్చినప్పుడు ప్రాణగండం॥ యీగండాలుపడ్డ రాశిలో పాపగ్రహం వున్న శత్రు నీచగ్రహం వున్నా షష్టాష్టమవ్యయమైనా ఆగ్రహాలువున్నా, చూశినా సమూహాబిందువులు తరిగిపోయినా ఆరాశిలో వచ్చిగండం తప్పదు॥ లాభకేంద్రత్రికోణమైనా బిందువులు ౨౮ కి హెచ్చుఐనా, శుభగ్రహం వున్నా, చూశినా గండాలు తప్పును. సంకటంగాని ప్రాణభయంలేదు। అష్టకవర్గులో ౪ బింద్దువులకు హెచ్చైనా రాశిలో గ్రహం వచ్చినా శుభఫలం చేసును॥

## తిథిచక్రం.

(ఇది తాటాకులపుస్తకం - విశాఖపట్నంలో పరవస్తువారి లైబ్రరీలో ఉన్నది.)

కరణమనగా గణితాన్నకు పేరు. అదియెట్లన్నను। యీ గణితం పుట్టేటప్పుడు। 333 న్ని శకవర్షాలు గతమైనావి గన్క వర్తమాన శక

వహాలలోను యీ చెప్పిన గణితోత్పత్తికాలమునాటి శకవహాలు తీచి వేచేది। తీచివెయ్యగా కరణగతాబ్దాలు అవునూ। ఆ కరణగతాబ్దాలు పెట్టుగుని ధ్యస్తోకైః అని అవి పండ్రెండు గుణియించినవి మాసాలు అందులో గతమాసాలు కలయగూడేది। గతమాసాలు లేకపోయినా అట్టే వుంచేదీ। పృథక్ అని వేరే వక ప్రతిబెట్టి ఆప్రతి లిఘ్న అని మూడు గుణించి స్వా అని ఆప్రతి మరివక ప్రతిపెట్టి ఆప్రతి అష్టాబ్ధినేత్రాంశాయుక్తా అని 248 కు పాలుగొనంగా వచ్చిన లబ్ధము 30 గుణించినవి మీదిప్రతితో గలయగూడి ఆప్రతిలో శరశశాంకయుక్ అని ఆప్రతిలో మరిన్ని 15 కలయగూడి ఆ ప్రతి నాగనందాష్టసంయుక్తా అని 93 టిచాత పాలుగొనగా వచ్చినలబ్ధము అధికమాసాలు.

౧౬౧౭ శకవహాలు అవుచు నుండగా యువసంవత్సరమందు జ్యేష్ఠ బ ౧౪ శుక్రవారంనాను సూర్యోదయాదిఘడియలు ౧౦ మీద కర్కాటక లగ్నమందు ఆన్నృసింహాగణితం అనేటి తిథిచక్రం చరపాతతో కూడా లోకోపకారార్థమై తెనుగు నెయ్యం బూనినవాడ అయిల సోమయాజుల కుల సంభవుడైన రామచంద్రభట్లుగారికిన్ని అచ్చమ్మకున్ను వరసుతుండ బాలయ నామధేయుండ యేను యీ గ్రంథము తెనుగుచేస్తున్ను యీ గ్రంథకర్తలైన శింగనాచార్యులకున్ను మనకు గణితప్రారంభ గురువయిన కురుమేటి అనంత భట్లుగారికిన్ని నమస్కారాలుచేశి చాయంబూనిన గ్రంథలక్షణం బెట్టిదనిన॥

## (d) వైద్యము.

### శారీరం.

### No. 302

P. 10. వాతాపిత్తశ్లేష్మనాడిభేదాలు పాముపలె నడిచేది వాతనాడి। కప్పవలె నడిచేది పైత్యనాడి। హంసవలె నడిచేది శ్లేష్మనాడి। పాముపలెను కప్పవలెను నడిచేది ద్వంద్వజము। ఇతి వాతపిత్తనాడి। వాతశ్లేష్మనాడి పాము

వలెను హంసవలెను నడుచును । పిత్తశ్లేష్మనాడి కప్పవలెను హంసవలెను నడుచును । మూడుకూడా ఒక్కసారి నడిచేది సన్నిపాతం.

P. 12. జ్వరనాడి చూచేటప్పుడు తనప్రేళ్లతుదలు అంకుశరూపముగా వంచుకొని చూచేది । ఆనాడి । వేగంగా నడిస్తే జ్వరము వున్నదని యెరింగేది.

P. 13. కాలం యెరింగేదిన్ని । దోషాలెరింగేదిన్ని । దోషకాలాలెరింగేదిన్ని । రోగం యెరింగేదిన్ని । వయస్సు నెరింగేదిన్ని । భోజనకాలమెరింగేదిన్ని । మనుష్యుని కాలంరెపాడి । పదిఘడి శ్లేష్మకాలం ఆమీద పదిఘడియలు పైత్యకాలం ఆమీద పదిగడియలు వాతకాలం ప్రొద్దుగుంకిన వెనుకనున్ను శ్లేష్మకాలం మొదలుగాను మూడుదోషాలున్ను యీలాగుననే నడుచును అందులో సూక్ష్మంగాను మూడు పాతికెలవును । వుదయం మొదలుగాను శ్లేష్మ పైత్యవాతాలు దినమున్ను నడుచును । ఆ మూడు పాతికెల లోపలనున్ను సూక్ష్మంగాను వుదయం మొదలుగాను ఘడియఘడియకు శ్లేష్మపైత్యవాతాలు నడుచును అరఘడియయుం దవును । ఆ అరఘడియయందులోనున్న శ్లేష్మం క్షణం । పైత్యం క్షణం । వాతం లక్షణంగా నడుచును । అందులో ఉత్పత్తిస్థితిలయాలు యెరింగేది. దేహమందు శ్లేష్మపిత్తవాతాలు తెలిసేవిధము । వాతదేహము ఒకవేళ ఉష్ణం । ఒకవేళ శైత్యమునైన్ని యుండును । పైత్యదేహము ఒకవేళ అత్యుష్ణమును ఒకవేళ అతి శీతలమునై యుండును । శ్లేష్మదేహం ఒకవేళ అంతమాత్రం చల్లనైయుండును । ద్వంద్వమైతే । ఉష్ణశైత్యాలై యుండును । శ్లేష్మవాతాలు కేవలం శైత్యమై వుండును । మానేటి వాతశ్లేష్మాలు ఉష్ణమై యుండును మానని అతి శైత్యము బొంది శ్లేష్మవాతాలై నడుచును । మానిన్ని మానని శ్లేష్మపైత్యాలై నడుచును । మానని వాతపైత్యం కష్టసాధ్యమైతోచును । సాధ్యం అసాధ్య । కృచ్ఛ్రసాధ్యంలు । సాధ్యంలోపల । పైత్యశ్లేష్మవాతాలు సాధ్యాలు । ద్వంద్వజాలైనవి మాననివి । సన్నిపాతాలని యెరింగేది॥

## పద్రసనిఘంటు.

### వెంకటేశ్వరరావుగారి తాళపత్రగ్రంథంనుండి

సువర్ణశుద్ధి । తాంమ్రభస్మం జిల్లేడుపాలు । వాంసపాదిరసం మర్రి పాలు మేకపాలు దూలగొంటిఆకురసం । రావిచక్కరసం చేదేసిమాలుగా మదనాచేశేది । యెన్నిరసాలో అన్నిమాలుగా యేదేసిపుటాలువేశేది । బాల సూర్యోదయ క్రమానవుండును ॥ భస్మప్రకారం ॥ శుద్ధిచేసిన బంగారం రేకులు చేయించి మూతుడుమీద యర్రమన్నుపాత్రవకటిచేసి వుంచీది । ఆపచ్చి పాత్రలోను నిమ్మపళ్లపులుసుపోసి బంగారంరేకులుకాచి యేడుమాలుగామంచీది । అంతటే శుద్ధిఅవును । ఆరేకులు చిన్నరవలుచేసి జంబీరరసాన హేమామాక్షికం నూరి ఆబంగారపురేకులనుబూసి యెండబెట్టేది । పెంకు కింద్దామీదా పెట్టి నడుమబంగారంబెట్టి సందులను వస్త్రమృత్తికచుట్టూ మూసి.మాలుగా పట్టించి యెండబెటి గజపుటంవేస్తే భస్మంఅవును ॥

పగడాలు జిల్లేడుపాలలోవేసి మూడుదినాలు యెండబెట్టేది । మూకుడుకింద్దామీదాబెట్టేది । లోపలను ఆపగడాలుపెట్టి వక్కగజపుటంవేస్తే తక్షణం భస్మంఅవును ॥ సంతానానకు । గొడ్డుపురుగు నివారణం । స్త్రీయోనిలో పురుగువుండును । అదియింద్రియాదులక్కు నోరుతెరుచుకొనివుండును । అందుచాత గర్భంనిలువదూ । అందుకు అవుషధం ॥ అరటిపండు గుజరు తేనెతో కలిపి యోనిలోవుంచీది । వంకాయవకటి తొణికతీసివేసి అందులో అవునెయ్యిపోసి యోనిలోవుంచేది । దూదిపాలతో తడిపి తరువాతవుంచీది । మరిన్ని కర్పూరం నూనెకలిపి ౩౪ మాలుగా రంగరించి అదిదూదినితడిపి యోనిలోవుంచీది । యోనిశుద్ధిఅవును । గర్భంనిలుచును ॥

### మరిఒకవైద్యగ్రంథమునుండి.

గురుత్వద్రవ్యాలవల్లను । మిక్కిలి వుష్ణద్రవ్యాలవల్లను । క్షారద్రవ్యాలవల్లను । శైత్యద్రవ్యాలవల్లను । దుఃఖంచేతనున్ను అతిసారంపుట్టును॥

వాతాతిసారలక్షణం ॥ వాతాతిసారాన్కు మలము నురుగువలెపడును। శ్యామల వర్ణమైవుండును । పొత్తికడుపునొచ్చును । సర్వఅవయవాలు నొప్పిగలిగి యుండును । ఆవలింతలు గలిగియుండును । మలబద్ధమయివుండును । యీ గురుతులుగలిగియుండెనా వాతాతిసారమని తెలిసేది ।

సాధ్యాసాధ్యాలు ॥ కన్నులు కల్వరేకులవలెనుండును । ముఖం చెంద్రునివలెనుండును । నాడి సమధాతువయివుండును । తుంమ్మువచ్చును । ఆకలి అవును । తల దురదగలిగివుండును । అంన్నంమీద యిచ్ఛగలిగియుండును। శరీరం లఘువుగావుండును । దంతాలు మల్లెమొగ్గలవలెవుండును । నాలుక మంచ్చిద్రవంకలిగివుండును । గంజితాగితే చెమటపెట్టును । చెవులు సమంగా వినవచ్చును ॥ నాసికము మంచ్చిపరిమళము గ్రహించ్చును । కాళ్లుచేతులు కొంచ్చంవుష్ణంగలిగియుండును । అరిచేతుల రేఖలయుందుంన్ను గోళ్లయం దుంన్ను రక్తంకలిగియుండును । యీగుణాలుగలరోగం సాధ్యమని చికిత్స చేశేది ॥ జ్వరం తీవ్రంగాకాసును । లేదా మిక్కిలి చల్లగానయినావుండును । కుటిలమై జ్వరం కొంచ్చెంగానయినా కాసును । కంన్నులయెంద్దురక్తంలేక యుంండ్డును । మాటలుంన్ను వుశ్వాసనిశ్వాసాలుంన్ను సముద్రధ్వనిగావుండును। చమటలేకయుండును । లేదా మిక్కిలి చమటఆయినాకద్దు । ముఖమంద్దు కాంతిలేకవుండును । కన్నులు వుబ్బుకునివుండును। ...గుణంకలిగియుంండ్డును। బొడ్డువద్దనుంన్ను రొంమ్ముంన్ను ముక్కున్ను చమటబెట్టును కాళ్లుచేతులు మిక్కిలిచల్లగావుండును । వూర్ధ్వశ్వాసకలిగియుండును । ధనుర్వాయువు గన పించ్చును । వెక్కిళ్లుగలిగియుండును । గళమందు శ్లేష్మందట్టియుండును । పరిమెళద్రవ్యములు అఘ్రాణించితే వాసనలు తెలియకుండావుండును । మలం కపిలవర్ణమైవిడుచును । నాడిశిథిలమయి చపలమై సూక్ష్మమయి నడుచును । మొదట పైత్యగతి నడుచును । ఆతర్వాత వాతగతినడుచును । ఆతర్వాత శ్లేష్మగతి నడుచును । మాటిమాటికింన్ని చంద్రాకారంగా ధాతువు నడుచును । యెవరికయినా మందనాడిపుటితే నిశ్చయముగా అసాధ్యమని తెలిసేది ॥

జ్యోతిషం చెప్పేవారున్ను । ధర్మాధర్మం చెప్పేవారున్ను । వైద్యమున్ను షోడశకర్మలున్ను చేయించ్చేవారు శాస్త్రం తెలియక చేయించిరట్టాయనా వారు బ్రంహ్మఘాతకులని చెప్పుదురు । అవి కారణంవల్ల యించ్చి సకలయత్నాలచాతనున్ను శాస్త్రం విచారం చేసి మరీచూడవలెను । సూర్యకాంతమున్ను పంచదారా భక్షింపను రక్తప్రమేహంమానును । మరిన్ని । నేలతాడివేరున్ను పంచదారా భక్షింపను రక్తప్రమేహంమానును । తెల్లదింటెనవేరు పాలతో తాగను పెట్టుమందు పడిపోవును ।

కణపకాయ సోలెడుచల్లలో కలిపియిస్తే శూలలు మానును ॥ కణపకాయానున్ను వేపాకూనూరియిస్తే దురదలు మానును ॥

కణపకాయానున్ను వావిలాకున్ను సరిగాపొడి చేసి నేబు యొత్తుచొప్పున నలభైరోజులు శేవిస్తే పెద్దరోగాలు మానును ।

రాజవశ్యానకు॥ కణపకాయా వావిలచెక్కాను నిమ్మపంటిపులుసును గంధంతీసి తిలకంవుంచుకు వెళితే రాజవశ్యం ॥

## వై ద్య శా స్త్ర ము.

మండలీక వెంకటేశ్వరరావు వారివద్దవున్న వైద్యశాస్త్రంనుండి·

గుల్మరోగాలకు చికిత్స । తిప్పతీగె ముదరవేరు తెచ్చి రొంపుచక్కలు చేసి, నరాలు తీసి తులం యింగువచక్కల నందున పెట్టి దగ్గిరగా కట్టి, జిల్లుడుఆకులు చుట్టి, యర్రమన్ను మెత్తి పుటం పెట్టేది. ధరిణవేళ్లరసంతోటి మదనా చేసేది । వెంపలివేళ్లరసం అనుపానం చేసేది ।

మేహపైత్యానకు చికిత్సా । యాలకులు అరతులం, దాక్షిణీచక్క అరతులం రససిందూరం తులం యీమూడున్ను చూర్ణం చేసి అందులో అరతులం అభ్రకం కలిపేది. పావుతులం పచ్చకపూరం కలికి యిరవైనాలక్కపొట్లాలు కట్టించేది । రెండుపూటలుకూడా తురంజీదబ్బపళ్లరసంలో అర

తులం చీనాపంచదార కలిపి, యీ పొట్లాము కలిపి రెండుపూటలూ యీలాగే యిప్పించీది । యిచ్చాపత్యం చేయించీది॥

నశ్యంచేసే క్రమం॥

జాభరాపువ్వు తులం, లవంగాలు అరతులం, మిరియాలు అరతులం, యివి చూర్ణాంచేసి అవుసెయ్యి తవ్వెడు, గుంటకలగరఆకురసం సోలడుకూడా కలిపి తైలపాకాన వండి వడపోసి, యీచూర్ణాం కలిపి కొద్దిగా మరిగించి శిరస్సున మర్దనాచెయ్యడం. నాశికయందు నస్యం చేయింత్సడం॥

అథ సన్నిపాతనిదానాని॥ (శ్లోకం) అర్థః । మొదటినుంచిన్ని । శూలరూపాన బాధచేసును । శరీరం తెల్లనై పొంగుదాకియుండును । నొప్పి పుట్టును । లావుగాను అయాసంతో గూడియుండును। శ్లేష్మం గలిగియుండును । వొళ్లుమంట గలిగియుండును । సత్తువులేకయుండును । నిద్రలేకుండును । యీలక్షణాలు గలది సంన్నిపాతము.

చిత్తవిభ్రమ సన్నిపాతనిదానాం ! శ్లోకం । టీ॥ మిక్కిలి మోహ మున్ను । తాపంచేతను పీడించును । తిరుగుతూ వుండును । వేదనగలిగి యుండును ।

తాంత్రిక సన్నిపాతనిదానం । నాలుక నల్లనైయుండును । ఘట్టిగా వుండును । ముల్లు నాలుకనడుమను, చుట్టూవుండును । చెవులలోపను మ్రోత మ్రోసును॥ మెడా కడుపూ నొచ్చును ।

రత్నకామేశ్వరం॥ శ్లోకం॥ టీ॥ మాణిక్యాలున్నూ, ముత్యాలున్నూ, లోహమున్నూ । స్వర్ణామున్నూ । తామ్రం । వంగం । అభ్రకం । రంజితం । పగడమున్నూ । యివి భస్మాలుచేసి । వొక్కొక్క భస్మం వొక్కొక్కపాలున్ను । పారదం ౧ పా । గంధకం ౧ పా । యివిఅన్నీ కలిపి పాదరసం గంధకంతో కూడా మర్దనచేసి తరువాత తీసి గాజుకుప్పెలో వుంచి వఖరోజు క్రమంగా పచనంచేసీది । సాంగశీతలం కానిచ్చి తీసి చూర్ణాం చేశీది । కలమందరసంతో మర్దన । పచ్చకర్పూరం । కస్తూరి । తక్కువపుట్లు ।

జాజికాయ । జాపత్రి । యాలకులు । లవంగాలు । అగరు । చందనం । నాగేశ్వరపుపువ్వులు పుష్పాడి । పూర్వపు చూర్ణం యెంతవున్నదో ఆయెత్తున యీ అన్నివస్తువులు కలిపి చూర్ణం చేశేది । తామలపాకులలో యెనిమిది గురివిందగింజల యెత్తుచొ॥ నిత్యం పుచ్చుకునేది । పూట ౧కి నాల్గు గురివింద గింజల యెత్తుచొ॥ తమలపాకులతో నమిలి పుచ్చుకునేది । యీశ్లోకమందు చెప్పినఫలం చేసును.

"పురిపుష్టానిక్కి పురుగుడువేరు । నల్లులు ౭ న్ను చాతకట్టితే మానును। గుంటకలగరఆకు నలకశమిందపువ్వులు తింట్టే తలనొప్పులు మానును । యీ పిల్లలు ఉత్తరాశిగింజలు తింట్టే కాంతివచ్చును॥

పత్సశగకు ।–క్రియ । శేవటిములగఆకు మెత్తగా నూరి అందులో వొడపోసినరాసున్నం ఋండువగింజంత పొడిగి మింగించేది ।

230) దొంగనుపట్టే క్రియ । పుట్టమీదవున్న తెల్ల యీశ్వరివేరు ఆదివారంనాడు తవ్వితెచ్చి పారేనీళ్లను కడిగి పనివచ్చినప్పుడు యీవేరు పారేనీళ్లతో అరగదీసి తన కుడిచేతికి పట్టించుకుని వెనలపల, లోపల పూసు కునేది । వకగిన్నె బోర్లించి అగిన్నెమీద యీ చెయ్యివేసి తన యిష్టదేవత లను మనస్సులో తలుచుకొని చెయ్యితీశేది । దొంగ యెక్కడవున్నాడో చెప్పుమనేది । చూపించుమనేది । అంత ఆగిన్నె నడచి యెవరిదగ్గరకు వెళ్లు తుందో వారే దొంగలని గ్రహించేది॥ రెండో ప్రకారం॥ శేలపుసిరిగవేరు ఆదివారంనాడు తవ్వితెచ్చి చిట్టిఆముదంలో అరగతీసి వంటెపూరక్రవానికి కాటుక వుంచి దొంగవున్నతావు చెప్పుమనేది । వాడివూరు వున్నచోటు వాడి పేరున్ను, వస్తువుకూడా చెప్పును॥

పసువులకు మలకామందు॥ మల్లెచిగురు । తుంమెకచిగురు । చిత్రగొట్టి ముక్కులో వశ్యం చేశేది । రెండోపక్షం నల్లవుమ్మెత్తఆకు దూడకేణం వశ్యం చేశేది.

చలివూష్టాలకు॥ తెల్లజిల్లేడు చక్కపచ్చిది తాళకం యీరెండూ తాంబూలంతో యిచ్చేది। వేడిఅన్నంల్లో తరువాణి పోశి అప్పుడే పెట్టేది। యీచొప్పున ముసుపువూష్టం వచ్చేవేళను యిచ్చేది। నిమ్మకాయ దబ్బకాయ పూరగాయ పెట్టేది।

హేమాత్షికం మూడుదుర్ఘామములు నిమ్మపళ్ల పులుసున వుస్తే శుద్ధి। హేమాత్షిక భస్మం॥ గొప్ప మూకుడు తెచ్చి పొయిమీదవుంచి హేమాత్షికం నిమ్మపంటిపులుసున నూరి కుడక చేసి మూకుడులో వుంచి దానిమీద ప్రమిత మూతవేసి ఆ ప్రమిత సఖం మునిగేటట్టు నూనెపోసి మంట్టపెట్టేది। ప్రమిత లోపల చమురు మండును। మండి చల్లారితే భస్మం అవును॥ లోహాభస్మం॥ లోహానికి సమం గంధకం। నాలుగోపాలు నవాసారం। యివి సున్నపు నీళ్లలో పదిరోజులు మదనానచేసి బిళ్లలుచేసి యెండించి పుటంబెట్టితే భస్మం అవును॥

వెలగబంకతో వత్తిచేసి వెలిగిస్తే నీళ్లలో వెలుగును -

చచ్చినపిండానకు। ములగవేరు పులగలితో నూరి తాగితే పిండం పడిపోవును॥

ఆదొండవేరు కడియంగా కట్టితే ఆయంధాలు నాటవు।

## వైద్యశాస్త్రం పార్నండివారివద్దనుంచి.

(శ్వాసఉబ్బసానకు) ఆరిటిపండువొలిచి మూడుముక్కలుచేసి అందులో చింతగింజంతసున్నం పెట్టి మూడుముక్కలు మూడుదినాలు తింటె శ్వాస ఉబ్బసం పొంతదగ్గుసహితంగామానును. వేడికొర్రగంజిలో జిల్లేడు ఆకులువేసి ఆకులుతీసి నులివేడిగంజితాగితె దగ్గుమానును.

(పొడిదగ్గుకు) కసిమిందసమూలం॥ వరిబియ్యం పిండిగాగొట్టి॥ నిప్పుట్లు కాల్చి నూనె అద్దుకొనితింటేను పొడిదగ్గుమానును.

(పొడిదగ్గుకు) దుష్టపాకు వరిబియ్యం పిండిగొట్టి నిప్పట్లుకాల్చి నూనెను తడుపుకొనితింటె పొడిదగ్గుమానును.

(రక్తపైత్యానుక్కు) తేనె జీలకర్ర ఇంగువ ॥ త్రికటుకం । యీనినూరి। చింతపంట్టిని పొదిగి మింగిస్తె । రక్తపత్యం మానును.

(నెత్తురుపారి కక్కినందుకూ ॥ గారవేరుతోక్క యెఱుపవెరుగుతో ॥ నూరితాగితె ॥ నెత్తురు కక్కేది, పారేది, మానును.

(కాకిచుమ్మలకు) మురుదొండాకురసం ముమ్మాటునశ్యంచేస్తె॥ కాకిచుమ్మ మానును.

(కామెలకు) తూర్పుకు పారిన తెల్లనింట్టినవేరు తెచ్చి ఆవుపాలుతో తాగితె కామెలుమానును.

(జ్వరకామెలకు) శొంతిపొడి వుష్టోదకంతో తాగితె జ్వరకామెలు మానును.

చింతగింజంతసున్నం బెల్లానపొదుకొని తినవలసినది. యీలాగు మూడుపూటలుతింట్టె కడుపులోనిగుల్మ సమస్తశూలాలు మానును.

యవాక్షారం॥ నేతితోగాని । నీళ్లతోగాని । తాగితె । యేశూలాల అయినా మానును.

బెల్లం । మదనబుడతరసం । గలిబురిరసం । దూసరరసం। జెన్నెళ్లతో । నూరితాగితె యేశూలాలఅయినా మానును.

యలకకాటుకు నందివర్ధనపుఆకు నిమ్మకాయంతకునూరి చల్లనీళ్లను కలిపి । తాగితె యలకకాటువిషంమానును.

వుడికెఆకు । వెరుపజ్జాకు । వేపఆకు యివి నూరి తాగితె । పద్ధెనిమిది విధాల యలకకరిచినా మానును.

మలమూత్రాదులు బంధించినందుకు॥ వెలుతురుసారా । వెలమవెక్క । మిరియాలు । కూడా నూరి । కడుపున రాస్తె మలమూత్రాదులు విసుచును.

ముక్కున నోటను నెత్తురుకారినందుకు – వుత్తరేణి పసరున్ను । అడ్డసరపు పసరున్ను । సరిగాజేసి తాగేది.

తలను వడలును యిడె అంటేది । ముక్కు నోట నెత్తురు కారేది మానును. మేడిపండు । బెల్లం తింటె నెత్తురుకక్కడం మానును.

కరకవేళ్లరసం । దాలిమ్మపువ్వురసం । బెల్లం కలుపుకొని తాగితె నెత్తురు కక్కడం మానును.

## వైద్యగ్రంథమునుండి.

### రజితరసాయనం:—

"రూపాయివకటి కరిగి నీరులాగు కరుగుతూ వుండగా వకపావుతులం శుద్ధిచేసిన పాదరసంలో పోసి కలిపి ఖడ్డీ పోసుకునేది. యీఖడ్డీ వేణ్నీళ్ళ అరగదీసి వెంన్నలో కలుపుకుని పుచ్చుకునేది. యీలాగు అర్ధమండలం పుచ్చుకుంటే శుఖసంబంధమైన మేహరోగాలు పోతాయి. నూనె, ఆవ, పులుసు వర్జం."

### విషహరణముకు:—

"తామరదుంప, తంగేడువిత్తులు, పత్తిగింజల గుదురు ఇవి సమభాగములుచేసి నూరి త్రాగిస్తే విషాలు అన్నీ మారును."

"భూతాలు రాకుండా వుండుటకు &c. సిద్ధయోగాన ఉశిరికవేరు తూర్పుది తెచ్చి చిట్టి ఆముదాన గంధంతీసి అదిచాతబెట్టి చూస్తే దొంగలు కానవత్తురు. భూతాలు తనయింటికి రాకుండా వావిలవేరు పువ్యమీ అదివారాన తనయింట వుస్తే భూతాలు చేరవు."

## భరతశాస్త్రము.

## e భరతశాస్త్రము by కోహళాచార్యులు

## No. 452.

మొదటిశ్లోకమునకు టీక. యీలోకమందు సకలమయిన విద్వత్సమూహామునకున్ను శ్రేష్ఠమైనషువంటిన్ని సకలమైన భరతప్రవర్తకులకున్ను

శిరోభూషణమైనషువంటిన్ని అత్యంతముంన్ను దయాశాలి అయినషువంటి కోహలాచార్యుడైన విద్వాంసుడ్డు సకల లోకోపకారంకొరకు నృత్తగీతవాద్యాలుంన్ను ప్రకాశింపజేసినషువంటింన్ని వాంటికి ఆశ్రమమైనషువంటింన్ని దశప్రాణాలతోకూడిన తాళస్వరూపముంన్ను లెస్సగా ప్రతిపాదించేటంద్దుకు యిచ్ఛయించినవాండౌకుంచున్ను యీగ్రంథం నిర్విఘ్నంగా ముగిశేటికొరకు సర్వేశనమస్కారరూపమయిన మంగ్గళమును శేయుంచుంన్ను తాళస్వరూపమును లెస్సగా ప్రతిపాదించెనేని ప్రతిజ్ఞ శేయుంచుంన్నాడు.

6 ఇప్పుడు భరతరశికులకు సంతోషార్థమైనతాళము నిత్యమా అనిత్యమా అని విచారింప్పబడుచున్నది.

శ్లో॥ తాళః కాలోననిత్యోన । ఖండ్డకాలోస్వరూపతః । చలనాత్ప్రాణసంబంధాత్ త్రిన్మితేజన్మాదితోపిచ॥ టీ॥ అసౌ । యీ । తాళః కాలః। కాలస్వరూపమైనతాళము । ననిత్యః । నిత్యంకాదు । అందుకుయుంక్తాలం । ఖండ్డకాలస్వరూపతః । ఖండకాలాలు లఘుగురుప్లుతకాలాలు । యీఖండకాలస్వరూపమైనతాళము ఖండకాలము నష్టమైతేను తాళమునంన్ను నష్టమౌగన్కు నిత్యంకాదు । చలనాత్ । తాళము నడుస్తూఉన్నది అనెడి వ్యవహారం వున్నదిగన్కు గమనంగలవస్తువల్లను అనిత్యమైకావలెను । ప్రాణసంబ్బంధాత్ । కాలాది ప్రాణసంబంధంవల్లనుంన్ను దేహంవల్లనె అనిత్యమైకావలెను. మితిః । యింతపర్యంతముంన్ను ధ్రువతాళమువున్నది । యిటమీదట లేదని మితమేర్పడినది గనుకనుంన్ను అనిత్యమేకావలెను । జన్మాదితోపిచ । యీశ్వరుని పంచముఖాలవల్లను మార్గతాళాలుపుట్టెను. అందుకు వొకతాళంకింద్ద ప్రస్తారతాళాలం అనేకతాళాలుపుట్టెను. అందుకు ఏఖతాళంకింద యిప్పుడువున్నవి । నష్టమైపోయెను । అనేటి వుత్పత్తిస్థితిలయాలం తోస్తువున్నవిగన్కు యీ అయిదుహేతువులవల్లనుంన్ను తాళము అనిత్యముకాని నిత్యంకాదు । యికను అనిత్యముసేటిమాట శొంక్కింప్పుచున్నాడు.

## అభినయదర్పణము.

1. అంగుష్ఠతర్జనీమధ్యా...ఈ 14 న్ను అంగుష్ఠాదివ్రేళ్ల పేళ్లు. పతాకః ...ఈ 28 న్ని అసంయుతహస్తాలు. పతాకహస్తానకు లక్షణం. ప్రసారిణాం చాంగుళీనాం ..తర్జని మొదటను అంగుష్టము కొంచముగావంచి కడమ వ్రేళ్లనుచాచినది పతాకహస్తము. దీనికి స్వక్షేత్రము పృథయపార్శ్వముల యొందు హస్తము కదుల్చుటవల్లను వినియోగము - నాట్యారంభేవివాహే... నాట్యారంభే-నాట్యారంభమందున్ను, వారివాహే-మేఘమందున్ను, వనే - వనమందున్ను, వస్తునిషేధకే - వద్దనేటియందున్ను, కుచస్థలే - కుచస్థలమందున్ను, నిశాయాంశ-రాత్రియందున్ను,...(1 టి అధ్యాయము- 1టి పుట)

2 సంయుతహస్తాలు...పుష్పపుటం...ఈపదహారున్ను సంయుత హస్తాలు. పుష్పపుటహస్తానకు లక్షణం. సర్పశీర్ష...సర్పశీర్షహస్తాలు రెండున్ను కూర్చిపట్టినది. వినియోగం. సంధ్యావార్చేయొందున్ను, అర్ఘ్యశ్రప్రదానేచ- అర్ఘ్యంయిచ్చేయొందున్ను...(2 వ అధ్యాయము- మొదటిపుట.)

[కేశవపట్నం శాంతయ్యది. పర్లాకిమిడీలో బోశలవారింటనున్నది.]

## సవ్యాఖ్య అభినయదర్పణం.

నాట్యారంభే, నాట్యారంభమందున్ను వారివాహేవారి, వుదకంతో కూడుకున్నటువంటి వాహే మేఘమందున్ను వనే వనమందున్ను వస్తునిషేధకే వద్దనడమందున్ను కుచస్థలే రొమ్ముయందున్ను నిశాయాంచ రాత్రియందున్ను నద్యాం నదిచెప్పేయందున్ను అమరమండలే దేవతామండలమందున్ను తురగే గుఱ్ఱమందున్ను ఖండనే నరుకుయందున్ను గమనోదితే నడకచెప్పేయందున్ను ప్రతాపే చ ప్రతాపం చెప్పేయందున్ను ప్రసాదేచ అను గ్రహంచెప్పేయందున్ను చెంద్రికాయాం వెన్నెలచెప్పేయందున్ను ఘనాతపే ఘనమైనయండచెప్పేయందున్ను కవాటబంధనే తలుపుమూసెయం

దున్ను సప్తవిభక్త్యర్థే సప్తవిభక్తులుచెప్పేయందున్ను తరంగకే తరంగాలు చెప్పేయందున్ను నాభిస్పర్శేచ నాభిస్పర్శంచెప్పేయందున్ను శీతలత్వే చలి యందున్ను మెరపు అనేటి యందున్ను

## తాళలక్షణసంగ్రహము.

ముఖంయెదుటబట్టితేను గోరోచనమందు ఉద్వేష్టితంగా నిలిపితేను విభూతి అనేటి చెవులనడుమ నిలిపితె కర్ణామృత మనేటి భుజంమీద నిలిపి తేను యత్నమనేటి ముందర నిలిపితేను సెత్తురనేటి వ్యావర్తకమైతేను నరుకుట రెండు చెల్లును.

## మృదంగలక్షణం.

టీక—పూర్వమందు మురాసుర డనేటి రాక్షసుడు గంగాతీరమందు మునీశ్వరులు సత్రయాగం చేస్తూవుండగాను దేవపతిమొదలైన బ్రహ్మావిష్ణు మహేశ్వరులున్ను పురోడాశ నిమిత్తమైవస్తేను ఆదేవతలకు రాక్షసులకు యుద్ధమైతేను ఆ కాలమందు విష్ణువు మురాసురుని పట్టుకుని కాళ్లుచేతులు శిరస్సు మూడున్ను ఛేదించి వాని శిరస్సు రెండు కప్పలు చేసి రెండుపారి శాలతీసి కట్టెను. వాని పాదాల చర్మము తీసి వాళ్లు చేసి రెండురంధ్రాలు చేశి కొట్టి మూశెను వాని కడుపులో వున్న అన్నం తీశి బోనంగా చేశి ఆరు అంగుళాల ప్రమాణంగా యెడమపార్శ్వంచేశి కుడిపార్శ్వమందు చిట్టెమున్ను విభూతిన్ని అన్నమున్ను యీమూడున్ను గూర్చి మర్దనం చేశి ముఖమందు తొమ్మిది అంగుళప్రమాణం కరిణచేశి వాయించగా యెడమ పార్శ్వమందు ధిమధిమా అనే శబ్దం పుట్టెను కుడిపార్శ్వమందు ధ్వని పుట్టెను. అటువంటి మృదంగం తీసుకుని సంతోషంగలవాడై నందికేశ్వరునికి యిచ్చెను ఆనందికేశ్వరుడు ఆ మృదంగం తీసుకుని దీని స్వరూపము యేమని అడిగెను.

## కళాశాస్త్రము

### అల్లూరి పురుషోత్తమకవి, No 460.

పద్మిని కుందనపు బంగారువన్నెగాని నల్లకలవలవన్నెగాని కాంతిగలిగి తామరపద్మమువంటి సువాసనగలశరీరము సెవలిపించమువంటి నల్లనిజుత్తు చంద్రునివంటిముఖము కలువలవంటికళ్లు శంఖమునంటి మూడురేఖలుంగలగళము 32 పళ్లు పలుచనినాలుక అతిమృదువగు శరీరము...సంపెంగరేకువంటి ముక్కున్ను...నఖాగ్రములయందు పాదాగ్రములయందు యరుపున్నూ స్వల్పాహారమున్నూ – మదపుటేనుగవంటి నడకయున్నూ...

## మృగయాత్ర

అథాతస్సంప్రవక్ష్యామి మృగయాత్రస్యలక్షణం
ధనుర్ధరాస్తథా కేచిత్కేచిత్ఖడ్గధరాస్తథా
కేచిదశ్వసమారూఢాః కేచిద్యుద్ధముఖాభటాః
ఏవం విధైర్భటైర్యుక్తో గీతవాద్యసమన్వితః
చాపసాయకచక్రాసి గదాకుంతాదిసాధనైః
భటాంగేచాశ్వపంవ్యావ్రతస్థే చంద్రశేఖరః
తెలుగు (పైశ్లోకములకే)

మృగయాత్రలక్షణం యెటువంట్టిదంట్టెను వింట్లుధరించ్చిన వాల్లున్నా కొంద్దరుంన్ను కత్తులు ధరించినవాల్లున్నా కొంద్దరుంన్ను గుర్రపు వాహనాల వాల్లున్నాంన్ను యుంద్ధముఖ్యులైన వీరభటులు కొంద్దరుంన్ను యీప్రకారమైనటు వంటి మహాపరిజనంకలవాడై యుంచ్చుంన్నూ మరింన్ని గీతవాద్యములతో కూడు కుంచ్చుంన్ను వాడై యుంచ్చుంన్ను మరింన్ని విల్లుబాణచక్ర అసిగదాకుంత్త యిభి మొదలుగాగలటువంట్టి ఆయుంధాలచాతనున్ను క్షత్రియధర్మంచాతనుంన్ను

ఉత్తమాశ్వములను యెక్కినషువంటి వీరభటులతోటిన్ని వ్యాటనిమిత్తం అరంణ్యానకు పరమేశ్వరుడు తర్లీనవారైరి. ఆఅరణ్యాం యెుషువంటిదంట్టేను.

శ్లో. మందారచూత పనసావకుళాశోకచంపకైః

## వాస్తుశాస్త్రం

టీక. సోమవారం నాడు యిల్లుకట్టితేను కలహా మౌను ఆదివారం నాడు యిల్లుకట్టితేను కాలును

యీ తిథులలోను రోహిణీనక్షత్రం కూడిన నాడు యిండ్లకు కలప నరికితేను మంచిది. తుమ్మకొయ్యనరికినా నుసుకి బట్టదు పడమటి చూస్తూ వుండును.

టీక. వాస్తుపురుషుని ద్రిష్టి యెదురు వాకిలిగాను యిల్లుగట్టితేను మంచిది నోలు॥ తక్కినచోట్లను ద్రిష్టికి విపరీతం గాను కట్టితేను ఆయింట శోకరోగభయాదులు కలిగివుండును అటుగనుక (గ్రంథకర్త పేరులేదు)



# అనుబంధములు.



## లక్షణగ్రంథాలు.

### 1. అప్పకవీయము

### లోని వచనములు.

[ఆశ్వాసాంతగద్యలను, కావ్యములలోని గద్యలను లక్ష్యములుగా రచించిన ఏవో రెండుమూడు వచనములుతప్ప తక్కిన తెలివిడి, వివరణము, టీక, అవతారిక మొదలయిన పేళ్లతో ఉన్న వచనములన్నీ అప్పకవి వ్యావహారికభాషలోనే రచించినాడు. వ్రాతప్రతు లన్నిటిలోను ఈ వచనములు వ్యావహారికభాషలోనే కనబడుతున్నవి. అయితే, ఈ గ్రంథము 1859 లో ముద్రించినప్పుడు గ్రంథమును పరిష్కరించి అచ్చువేయించిన శ్రీ శేకము రామానుజసూరిగారు ఈ వచనములన్నీ కావ్యభాషలోనికి మార్చి అచ్చువేయించినారు. తర్వాతి ముద్రణములలోకూడా ఈ వచనములు వారు సవరించినవిధముగానే కావ్యభాషలో కనబడుతున్నవి. అయితే, వారు దిద్ద మరచిన శబ్దములు కొన్ని—'ఇందుకు', 'పదిహేనవయచ్చు', 'కాదంటేను', 'రెండోసారి', 'బజాతివాండ్లు' మొదలయినవి నిలిచిపోయినవి. అప్పకవి వ్యావహారికభాషలో ఈ వచనములు ఉద్దేశపూర్వకముగా రచించి ఉంచెననుటకు ఇవి నిదర్శనములుగా ఉన్నవి. ఈ వచనములు ఒకొక్కటి చదివి పూర్వోత్తరసందర్భములు పరిశీలించి చూస్తే గ్రంథకర్తకాక మరెయొకరు ఆ వచనములు వ్రాసిఉండరని తెలియకపోదు. (చూ. I. 85 తర్వాతి వచనము; VI. 118 - దానికి పూర్వమందున్న వచనములు; IV. 133-దాని తర్వాతి టీకలు).

ఈ గ్రంథము సం. 1924 లో బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు ముద్రించినపుడు ఈ వచనములన్నీ వ్రాతప్రతులనుబట్టి అప్పకవి ఉద్దేశించి వ్రాసినట్లే వ్యావహారికభాషలోనే ఉన్నవి ఉన్నట్లుగా అచ్చు వేయించడము జరిగినది.]

[తే. ప్రత్యయము లాఱు నీ చెప్పు పద్యములను ।
దెలిసికొన నెంతవారికి నలవిగామి ।
వరుస నన్నింటికిం డీక వ్రాయవలసెఁ ।
దెనుఁగుమాటలఁ గడు దేట తెల్లగాఁగ ॥]

## IV. 133

టీక. మేరు చక్రమనగాను ఇన్నవఛందమునందు ఎన్నెనీ లఘువుల వృత్తములు ఎన్నియని యడిగితేను సరిచెప్పేటివిధము. మొదల అడ్డవీథిగా రెండిండ్లు వ్రాసి యాక్రిందను వెంబడిగాను రెండు పార్శ్వములయందున్న ఒక్కొక్కయిల్లు మించియుండేటట్టుగాను మొదటివీథితోగూడాను ఇరువైయారు అడ్డవీథులుగాను గీటులు తివిచి ఉభయపార్శ్వములయందున్న ఒంచియున్న కడపటి యిండ్లను మీదియిండ్లు మొదలుకొని అన్నియిండ్లాను తప్పకుండాను ఒక్కట్లు పెట్టి మీది వీథినున్న లెక్కలక్రిందను దిగువవీథియందు నిడుపుగాను ఒక్కొక్కయింటను ఆ లెక్కలకు క్రింద ఉండేటట్టుగాను వ్రాసేది. ఇటువలెనే వ్రాస్తేను మీదివీథికంటె క్రిందివీథిని ఒక్కొక్కయిల్లు ఎక్కువ అవుచును వచ్చును. ఈ క్రమము వ్రాసితేను ఈ మేరుచక్రమునందు పైవీథి మొదలుగాను అడ్డవీథులనిన్నీ ఉక్త మొదలైన యిరువైయారు ఛందములున్ను క్రమముననే అవును. ఆ వీథులయందు మొదలిండ్లనున్న ఒక్కటొక్కటిన్ని సర్వగురువృత్తములు. తుదియిండ్లనున్న ఒక్కొక్కటిన్ని సర్వలఘువృత్తములు; రెండవయిండ్ల ఎన్ని ఉంటేను అన్నిన్ని ఒంటి లఘువృత్తములు; మూడవ యిండ్లవి రెండేసి లఘువులవి; నాలవయిండ్లవి మూడేసి లఘు

వులవి; ఈప్రకారమననే ముందరనున్న అన్నియిండ్లకున్న అని తెలుసు కొనేది. ఆ వీథిని ఉన్న లెక్కలనిన్ని గలియగూడితేను ఆ ఛందమున బుట్టిన సమవృత్తసంఖ్య యవును. వారెన్నవఛందమున కడిగితేను అన్నవ యడ్డవీథి చూచి యిప్పుడు చెప్పినచొప్పున సరిచెప్పేది. ఏఛందముదను కాను ప్రాయమంటే ఆఛందముదను కాను ప్రాయనున్న వచ్చును. IV. 151

## సంస్కృతగ్రంథములకు

## 2. వ్యాఖ్యానాలు.

### శుద్ధాత్మ చైతన్య ప్రకారానుభూతి ప్రకరణ వ్యాఖ్యానము.

౧.౨॥ శ్లో॥ ఉపాధా యథా భేదతా సన్మణీనాం
తథా భేదతా బుద్ధి భేదేషు తేషు
యథా చంద్రికాణాం జలే చంచలత్వం
తథా చంచలత్వం తవాపీహ విష్ణోః ॥

టీక. సన్మణీనాం । సత్-మంచివైనటువంటి । మణీనాం - స్ఫటికాది మణులకు । ఉపాధా - నీలపీతరక్తాద్యుపాధులయందు । సంబంధంవల్లను । యథా-యెటువలెను । భేదతా-భిన్నత్వమో । తథా - ఆటువలెనే । తేషు - నానారూపాలైనటువంటి । బుద్ధిభేదేషు - బుద్ధ్యుపాధులయందు సంబంధం వల్లను । హే విష్ణోః-కూటస్థాత్మతో అభిన్నమైన వ్యాపకస్వరూపుడా । తవ-నీకు । భేదతా - భిన్నత్వముగాని । స్వభావంచేతనైతే శుద్ధాత్మ ద్వితీయ స్వరూపుండవు । చంద్రికాణాం-వెన్నెలలకు । జలే-వుదకమునందు । యథా - యెటువలెను । చంచలత్వం - చలించడమో । తథా - ఆటువలెనే । తవాపి - కూటస్థాత్మవైన నీకున్ను । ఇహ - బుద్ధ్యాదులసంబంధవల్లను । చంచలత్వం - చంచలించినవలె నుండుగాని । స్వభావంచేతనైతే అచంచలుడవున్ను నిర్వికారుడవున్ను పరిపూర్ణుడవున్ను ॥

## దక్షిణామూర్తిస్తోత్ర వ్యాఖ్యానము.

శా. శ్లో॥ సర్వాత్మత్వ మితి స్ఫుటీ కృతమిదం యస్మాదముష్మిం స్తవే
తేనాస్య శ్రవణాత్త దర్థమననాత్ ధ్యానాచ్చ సంకీర్తనాత్
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వతః
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

టీక. యస్మాత్ - యేది కారణంవల్లను । అముష్మిం స్తవే - యీదక్షిణామూర్తిస్తోత్రమందు । యిదం-యీచెప్పినదువంటి । సర్వాత్మత్వం - సర్వాత్వ మున్ను । ఇతి-యీ చెప్పిన ప్రకారం చేత । స్ఫుటీకృతం - స్పష్టమై కాయ బడెనో । తేన - అది కారణంచేతను । అస్య - యీస్తోత్రంయొక్క, శ్రవణాత్ - అర్థం వినడంవల్లనున్ను । తదర్థమననాత్ - ఆ విచారించినదువంటి అర్థంయొక్క చింతించడంవల్లనున్ను । ధ్యానాత్ - చింతించబడిన అర్థం యొక్క చింతించడంవల్లనున్ను । సంకీర్తనాత్ - వాక్కున పఠించినవల్ల నున్ను । సర్వాత్మత్వ మహావిభూతిసహితం - అంతా తాను అవుట అనే సామ్రాజ్యంతో కూడుకో వున్నదువంటి । యీశ్వరత్వం - ఈశ్వరత్వము । స్వతః-తనకుతానే । స్యాత్-అయ్యీని । అష్టధా - అణిమాద్యష్టవిధంగాను । పరిణతం-పరిణమించినదువంటి । తత్ - ప్రసిద్ధమైనదువంటి । అవ్యాహతం - చ్యుతిలేనదువంటి । ఐశ్వర్యంచ-ఐశ్వర్యమున్ను । సిద్ధేత్-లభించీని॥

### నిఘంటువులు - కోశములు.

### 3. సర్వశబ్దసంబోధినీ.

[ఇది రమారమీ నూరుసంవత్సరములకిందట శ్రీ పరవస్తు శ్రీనివాసాచార్యులవారు వ్రాసిన నిఘంటువు. వారు సంస్కృతపదములకు తెలుగున అర్థము వ్రాసినప్పుడు సంభాషణలో ఉన్నమాటలే తరుచుగా వాడినారు. వారి తదనంతరము మరి 50 సంవత్సరములకు 1875 సం॥లో ఈ నిఘంటువు

ఆచ్చొత్తించినప్పుడు కొన్ని మాటలరూపములు సవరించి వివరిను శుద్ధపత్రికలో చూపించినారు. అయితే, అవిఅన్నీ విలేఖకప్రమాదజనితదోషములు కావు. "పొయ్యేవాఁడు", "పొఁయుస్తూ" అనడానికి బదులుగా "పోవువాఁడు", "పోఁడుచుచు" అని దిద్దినప్పుడు, గ్రంథకర్త వాడిన వ్యావహారిక భాష కావ్యభాషగా మార్చడమే సంభవించినది గాని లేఖకప్రమాదజనిత దోషములను సవరించడము కాలేదు. 'వాచ్యాయన', 'యొముడు' అనే రూపములు వాస్తవముగా లేఖకప్రమాదమువల్ల కలిగిన తప్పులు. అవి 'వాత్స్యాయన' 'యముఁడు' అని దిద్దినప్పుడు, అది భాష మార్చడము కాదు. శుద్ధపత్రికలో సవరించిన వాడుకమాటలు వేయింట పదిన్ని సవరించక విడిచినవి తొమ్మిదివందల తొంభై ఉన్నట్టుగా గ్రంథములో అనేకముగా వ్యావహారిక భాషాపదములు కనబడుతున్నవి.

ఈ నిఘంటువులోని భాషాస్వరూపము తెలియడానికి కొన్నిమాటలు మాత్రము ఉదాహరిస్తున్నాను. మాటపక్కనే అది యేపుటలో ఉన్నదో ఆ పుటసంఖ్య సూచిస్తున్నాను.]

కూతురు కొడుకు 457
కూతురు కొమార్తె 458
వాండ్లు 272, 310, 351, 383
కండ్లు 302, 304, 293
ఆలుమొగల్లు 317
మూడేళ్లదాకా 205
వల్ల 161
కొద్ది 20
వద్ద 45, 85
వాఁటి 32, 33, 44, 46, 61, 62, 270, 308, 347
చేసేటందుకు 167
దగ్గిర 16
తగలకుండా 263
లేకుండా 141
తెలియకుండా 270
కాకుండా 479
అన్నిటికిన్ని 279
ఉబికిన్ని 590
దాకా 134, 144
అందాకాను 361
అంతాను 361, 545

అంతటా 521
కూడా 15, 20, 22, 99
చాలా 432, 281, 301, 528

దూదిబొంతా
చొక్కా కవచమున్ను 126
ఎప్పుడైనా 126
తిరిగీ 274
ముప్పదోది 60, 381
నాలుగోది 234, 371
మూడో 211
ఎనిమిదో 211
ఇటువైపు 289
దూరనునుంచి 368
పోవడము 93
తిరగడము 93
ఎత్తడము 93
పొందడము 93

చంపడము 94
కొట్టడము 94
('ఈడము' రూపాలు వేలకొలదిగా ఉన్నవి)
పాడుస్తూ 61
ఔతూవుండగా 188
కదలించుకుంటూ 342
కలుసుకోవడము 370
వేసుకొన్న 483
పోసుకొనే 90
ఇచ్చే 83
పోషించే 177
అనే 243
కాకపోతే 16
అయితే 306
ఊగించ 351
అగుపడు 354

దీనినిగురించి మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రుల వారు, "సర్వశబ్దసంబోధినీ నిఘంటువు నే నెరిగిన దే. శ్రీమాన్ పరవస్తు శ్రీనివాసాచార్యులవారు రమారమి నూరుసంవత్సరముల క్రిందట నీగ్రంథమును రచించినారు. సంస్కృతశబ్దములకు తెనుగర్థము చెప్పినప్పుడు తరుచుగా వ్యావహారిక భాషారూపములు ఈగ్రంథములో వాడిఉన్నారు."

తాతాసుబ్బరాయశాస్త్రివ్రాలు, 6-3-1915.

## పండితుల జాబులు.

### అముద్రిత గ్రంథచింతామణి పత్త్రికలో

పత్త్రికాధిపతులయిన పూండ్లరామకృష్ణయ్యగారున్ను వేదము వేంకట రాయశాస్త్రులుగారు మొదలయిన పండితులున్ను విద్యావిషయములను గురించి వ్రాసినవ్రాతలలో వాడిన వ్యావహారిక భాషా రూపములు:—

1. పత్త్రికాధిపతుల వాక్యములు:—

"'ధరణిదేవులవల్ల' యను శబ్దములయందు వల్లయను పదమునకు మహాకవిప్రయోగము లేదని మాయభిప్రాయముగాని ధరణిదేవశబ్దమునకుఁ గాదు. ఇందులకై రెండుజాబులవలన మీకు ప్రయాసము దీసుకొనుటయయినవి."

"(పోషకభృతి) బంపనివారి నామములు పైపత్త్రికనుంచి ప్రకటించ వలసివచ్చును"

"మాకయిష్టంబగుటచే మేమాపద్ధతి మొదటినుంచి విడిచితిమి."

"మావద్దనుండు గ్రంథము"; "[illegible]"; "అనుభవను" "విశ్వసించ వలెను"; "యోచించుఁడు"; "తెలియును"; "తెలిసేయున్నది"; "వ్రాసు కొనియున్నారు"; "ఇతఁడొక కృష్ణరాజల్లుఁడు; "గవ్వల చెన్నడి పద్యపంచ కము"; "ఇంతటి దురభిమానమేలనో"; "అచ్చువేయించుదురట."

2. వేదము వేంకటరాయశాస్త్రిగారు:—

"అగుపడుచున్నవి" (10-2-1894); "అంటరు"; "వ్రాసినాను"

3. కొండముది నరసింహముగారు:—

"ఇప్పద్యమే అప్పకవిగారు లక్ష్యముగా దీసుకొనిరి"

"దీపాంకురమహమును గాని లతనుగాని భేదిస్తున్నట్టు చెప్పలేదు. నంద కము పాపలతావళిని భేదిస్తున్నట్టు చెప్పియున్నది...అఘలతను భేదించదనే సంశయము తగలనేరదు. లతను భేదించుటకు కొడవలిచాలు గనుకనే కొడవలి చేతనయినపనికి నుత్కుంఠదైత్యకంఠలుంఠనమైన నందకము భేదించదని చెప్పుట మాయందమున నుచితముగాదనే సంశయమునకు సమాధానము చేయు చుఁగాఁ బద్యములో నఘలతాశ్రేణినని చెప్పక 'నఘలత' యని చెప్పియున్నట్టు

లయితే యాక్షేపణ తగులును. లతాసమూహంబనికూడా యనకుండా లతా శ్రేణియని చెప్పినందువల్ల శ్రేణియనఁగా దగ్గిరగల పొడుగాటి బారు..."

"తమకు వ్రాసుకొనిన యుత్తరము..."

"నామలింగానుశాసనమంద్దైనా లేవు"

"ముద్రించఁగోరినాను."

"అట్టివాటియందు"; "బోధించడము"; "కూడా" "ఇంకా"; "కావడము."

4. నల్లాన్‌చక్రవర్తి సంపత్కుమార లక్ష్మీనృసింహాచార్యులవారు:—

"విష్ణునదీపాంసురాకృతిగల నందకంబభు లతాశ్రేణిచ్ఛిదం జేయుంగాక" యనుటచే, లతాచ్ఛేదనముకు లవిత్రము ప్రధానముగాని దీపాంకురము ప్రధానముగాదనిన్ని ఖడ్గమునే గ్రహించేయెడ, సమరోత్కంఠ్దైలేయకంఠలుంఠనాకుంఠంబగుదానికి లతాచ్ఛేదన ముత్కర్షావహముగానున్నదనిన్ని ప్రకటింపఁబడియున్నది."

5. దబ్బీరు కృష్ణమూర్తిసూరిగారు:—

"గంభఫలికి నాయికాధ్వనిన్ని, సారంగమునకు నాయకధ్వనిన్ని పోల్చడము ప్రసక్తమైయున్నది...గంభఫలి యొకస్త్రీయైయుండి తనకిరుప్రక్కల నిరువురసారంగుల నాశ్రయింపజేసికొనడము సాధ్వీధర్మమునకు విరుద్ధము."

6. వడ్డాది సుబ్బారాయఁడుగారు:—

"అందుకు"; "అబ్బురపడినాను"; "చిత్తగించవలెను"

7. అ. పుండరీకాక్షయ్యగారు:—

"ఇందుకు"; "కనపరచడము"; "తోఁచక"; "పూనినాను" "కూడా", "ఉంటే"

8. నడకుదుటి వీరరాజుగారు:—

"తొలగించుదురుగాక"; "అందుకు"; "రచింపఁగల"; "విమర్శకు" "వ్రాసుకొను".

9. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

"మూసుకోలేదు;" పంపించలేదా".

## 5 దినచర్యలు

### యాత్రావిశేషములు.

1. రాజమహేంద్రవరం జిల్లా-కోరు మిల్లిగ్రామం కాపురస్థులైన చేబ్రోలు సీతారామశాస్త్రులుగారు వ్రాసుకొన్నదినచర్యచూచి మండపాక పార్వతీశ్వరశాస్త్రులుగారు వ్రాసుకొన్నది.

... ... ... ...

౯. బదరీనారాయణమునుండి యీశాన్యముగా ౧ రోజులకు బ్రహ్మకపాలము చేరవచ్చును. యీనడుమను రఘునాథపూర్ అనేషహరున్నది. షహరులో బసచేసేయెడల అక్కడిరాజు (బ్రాహ్మణుడు) తనపండితులను రాజువద్దికిపంపును. ఆపండితులకు ఆలింగనాదిసత్కారములు వీరు జరిగించవలెను - వీరిపండితులను ఆరాజువద్దికిన్ని పంపవలెను. ఆరాజున్ను అట్లనే జరిగించును. యీ చొ॥ జరిగించనియెడల దోచుకుని అపాయము జరిగింతురు. పట్టణములో బసచేయక పైగా బసచేసేయెడల అట్టి ప్రతిబంధకాను లుండవు. పట్టణములో దిగి పైని వ్రాసినసత్కారము లన్యోన్యము జరిగిన పైని కోరితే యాత్రలనుగురించి మజూరీలను సప్లీచేయును.

... ... ... ...

2. గోకుల విశ్వనాథుడుగారు వ్రాసిన యాత్రావిశేషములను చూచి మండపాక - పార్వతీశ్వరశాస్త్రులవారు వ్రాసుకొన్నది.

... ... ... ...

పంజాబుదేశములో జ్వాలాముఖి అనే పర్వతమున్నది. దానిపైన నచ్చుటచ్చట తొర్రలలోనుండి అగ్నిజ్వాలలు వచ్చుచుండును. ఆ జ్వాలలకు యాత్రవారు సమర్పించే ఫేడా, అరిటిపళ్లు, టెంకాయలు, రవికలగుడ్డలు, వగైరాలకు అందినమట్టుకు ఆ జ్వాలలు భక్షించి ప్రసాదముగా కొంత విడచును - రవికలగుడ్డలు కాలకుండా యిచ్చివేసును-చేతులు కాలవు.

అకాలేశ్వరమను మహాక్షేత్ర మొకటి గలదు - అక్కడ శీతోష్ణ గుండములు రెండున్నవి. బియ్యపుమూట ముంచినయెడల అగ్నిగుండములో అన్నముడుకును.

అమరనాథం అను క్షేత్రమున్నది - అక్కడ శ్రావణ శుద్ధ పౌర్ణమికి మాత్రం మంచు లింగాకారముగా పానుపట్టుసహితముగా అందరికీ కనబడును.

ఆ మహాక్షేత్రములు వైశాఖం లగాయతు కార్తికమాసమువరకూ నవక్షేత్రాలకూ ఆరు నెలలూ దేవపూజ జరుగును.

... ... ... ...

3. అనంద సం॥ ఆషాఢ శు॥ 6 వాను "శ్రీరంగవైష్ణవు"లాకరు వ్రాసుకొన్నది చూచి వృష సం॥ ఆషాఢ శు॥ 6 వాడు మండపాక శామ శాస్త్రులుగారు వ్రాసుకొన్నది.

... ... ... ...

బదరీ నారాయణం

వృశ్చికమాసం ప్రవేశించడంతోనే రెండుమూడుదినములు పూజచేసి తలుపులువేసే సమయంలో శ్రీస్వామివారికీ నరనారాయణులకూ నారదుల వారికిన్నీ ఆసమీపమందు వంటశాలలో వేంచేసియున్న అమ్మవారిని తీసుకొని వచ్చి యీపీఠమందు వుంచి అమ్మవారికిన్నీ నఖశిఖపర్యంతం పిండి సమర్పించి కంబళీ పైనిసమర్పించి ఆపైని పేరుకున్న నెయ్యి సమర్పిస్తారు. శ్రీస్వామివారికి మాత్రం యిత్తడిచాటలు కసువుమీదను వీపుమీదనూ సమర్పిస్తారు. ఉద్ధవులను ఆసమీపమందు ఆరుక్రోసులమార్గంలో వున్న పండికేశ్వరంలో వుస్తారు|తరువాత తలుపులువేసుకొని అర్చకులు మొదలైనవారు ఆ పండికేశ్వరానకు ఆరుక్రోసులలోయున్న జ్యోసీమఠంలో ప్రవేశించి మేషమాసపర్యంతం వుంటారు.

... ... ... ...

వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి చట్టపుస్తకమునుండి తునకలు.

"హిందూభాషాసంజీవినీ ముద్రాక్షరశాలాధికారులు తమ ముద్రాక్షరశాలయొక్క కార్యములు నిరంతరాయముగా జరుగుటకై యేర్పరచుకొన్న చట్టపుస్తకము. ఇది. శ్రీ సరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. చెన్నపురి తండియార్పేట. ౧౮౭౯ సం॥ జూలై ౧ తేది."

ఈ "హిందూభాషాసంజీవినీ ముద్రాక్షరశాలయొక్క కార్యములను విచారించుటకై భాగస్థులందఱు చేరి యేర్పరచిన కార్యనిర్వాహకసభికులు:— అగ్రాసనాధిపతులు: వావిళ్ల॥ రామస్వామిశాస్త్రులు; సరస్వతి॥ తిరువేంగడాచార్యులు. కార్యదర్శి: ఒగ్గులూరు వేణుగోపాలనాయఁడు. ఉపకార్యదర్శి: శంకర॥ వెంకట్రావు. అధ్యక్షులు: పంగీపురం॥ రామకృష్ణమాచార్యులు; వస్త్రాల॥ తిరువేంగడస్వామినాయఁడు"

1. హిందూభాషాసంజీవినీ ముద్రాక్షరశాలాధికారులు ౧౮౭౯ సం॥ జూలై నెల ౧ తేదియందు ఏర్పరచుకొన్న చట్టము. మొదటిభాగము. పీఠిక— ఉపయుక్తములైన యీదేశగ్రంథము లనేకము లచ్చువేయఁబడకయుండుట చేత నాలాటిగ్రంథముల నచ్చువేయించి ప్రచురముచేయుటకును - ఇట్టి లోకోపకారమైన కార్యమునకు సహాయులై వలయుద్రవ్యము నిచ్చి భాగస్థులుగా నేర్పడిన సమాజమువారిద్రవ్య మభివృద్ధియగుటకును - ఈ ముద్రాక్షరశాల యుంచఁబడుచున్నది. కాబట్టి యీయుద్దేశ్యమున కంతరాయము గలుగకుండుటకై భాగస్థులంద ఱేకీభవించి యేర్పరచుకొన్న నిబంధనలు.

2. మన ఉమ్మడిలో సదరు తేదియందు నూతనముగా నేర్పరుపబడిన హిందూభాషాసంజీవినియను ముద్రాక్షరశాలను నేఁడు మొదలు పదియేనుసంవత్సరములవరకు సముదాయముగా నుంచి విడనాడక నానాటి కభివృద్ధియగునట్లు చేయుచుండవలసినది.

... ... ... ...

౩. సదరచ్చుకూటమునకుగాను పెట్టుబడినిమిత్తము భాగము ౧ కి రూ॥ ౨౫౦ చొప్పున భాగములు ౧౮ కి రూ॥ ౪౫౦౦ ఈదిగువ నుదహరింపబడు పద్ధతుల ప్రకారము కట్టవలసినది.

... ... ... ...

౪. ౫వ కలములో చెప్పియున్న ప్రకారము రూ॥ ౨౫౦ ఆర్కాటు చేయబడిరూపాయలు పెట్టుబడి పెట్టి ౧౮౭౧ సం॥ ఫిబ్రవరి నెల ౨౮ తేదివరకు పనులు జరిగించినపిమ్మట నది మొదలు లోకసంవత్సరము వరకు అనగా ౧౮౭౨ సం॥ ఫిబ్రవరి నెల ౨౮ తేదివరకు అచ్చుకూటమున నుత్పత్తియయ్యెడు ద్రవ్యమువల్ల పనులు నడిపింపవలసినదిగాని భాగస్థులు పెట్టుబడి పెట్టవలసిన నిమిత్తము లేదు.

... ... ... ...

5. రెండవభాగము: ఈ ముద్రాక్షరశాలయొక్క కార్యముల నిర్వహించుటకై సదరు ముద్రాక్షరశాలకు భాగస్థులుగా నేర్పడియున్నవారిలో ఆరుగురు కార్యనిర్వాహక సభికులనియు తక్కినవారు ఉపసభికులనియు - పైని చెప్పఁబడిన రెండువిధములవారును జేరినపుడు మహాసభవారనియు నెంచఁబడవలసినది.

... ... ... ...

6. ఈ కార్యనిర్వాహకసభికులలో అగ్రాసనాధిపతులు - కార్యదర్శి - ఈముగ్గురును ప్రతిదినము జరిగెడు జమాఖర్చు లెక్కలయందున్ను బ్యాంకిలో రూపాయలు కట్టుచు మరల తెప్పించుకొనుచు నుండుటకుగా నేర్పరచఁబొయ్యెడు బ్యాంకి లెక్కపుస్తకములయందున్ను రసీదులు మొదలైనవాటియందున్ను చేవ్రాలు చేయుచుండవలసినది.

... ... ... ...

7...లిఖితమూలకముగా తెలియజేయక సభకురానివారు ఒకరూపాయను మించక కార్యనిర్వాహకసభికులు నిర్ణయించుకట్టము నియ్యవలసినది.

... ... ... ...

8...నిబంధనల చేర్పరచునపుడు సభవారి అభిప్రాయములు భేదించిన పక్షమందు ౧౫ దో కలములో చెప్పియున్నప్రకారము అధికసంఖ్యగలవారి అభిప్రాయప్రకారముగా నిబంధనలను స్థిరపరచవలసినది.

... ... ... ...

9...భాగస్థులందరును సహోదరన్యాయముగా నేకీభవించి ౧౯ సంవత్సరములవరకు వ్యాపారము జరిపించి శ్రీ వేంకటేశ్వరస్వామివారి యనుగ్రహమువల్ల నభివృద్ధిజెందినద్రవ్యము ననుభవించుచు క్షేమముగ నుండుటకై నిర్ణయించుకొన్నచట్టములు ఎల్లవారలకు ఇష్టములై మంగళకరములై యుండవలసినది.

వావిళ్ల రామస్వామిశాస్త్రి.

(ఇదిగాక మరి ౨౧ చేవ్రాళ్లున్ను ఉన్నవి).

శ్రీ బొబ్బిలి మహారాజావారు యాత్రకు వెళ్లినప్పుడు జరిగిన సంగతులు దినచర్యగా శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రులుగారు రచించిన దినచర్యగ్రంథమునుండి:—(139 వ పుట)

## బెంగుళూరుసంగతి

1886 సం॥ ఆగష్టు 12 తేదీకి సరియైన వ్యయసం॥ శ్రావణ బ-౧౩-గు॥ ఉదయకాలమునకు బెంగుళూరు కంటన్మెంటులో నొక బంగళాలో ప్రవేశించితిమి. రేణుగుంటనుండి బెంగుళూరువరకు రయల్ చార్జీ జన ౧ కి రూ ౨-౮-౮ చొ॥ తగులును.

ఈబెంగుళూరు మహిసూరు రాజ్యములోనే చేరినది. యిక్కడ పటాలము లున్నవి. దొరలు చాలామందియున్నారు. శ్రీమహిసూరుమహారాజావారి లోగిలి విశాలరమణీయమైన దొకటికలదు.......

నీలగిరిపాటి చలిలేదుగాని, యిల్లుదాటితే బహువస్త్రాచ్ఛాదితులై

సముద్ర తీరము. తరుచుగా వానలు కురియుచుండును. సూర్యదర్శనము అపురూపముగా నుండును. గాని జాస్తిగానుండును......

ఎటుచూచినా ౪ మైళ్ల వైశాల్యముగలిగి యున్నది. ఫరంగీలు, అరవమాలలు, తురకలు, సొల్జర్లు వగైరాలు క్రిక్కిరిసియున్నారు. గనుక నే మాంసపు దుకాణములు శతాధికముగానున్నవి.

## ౬ శాసనములు

### రాజరాజదేవుని నందమపూండి శాసనములోనిది.

### క్రీ. శ. 10౫౩ ఎపిగ్రాఫియాఇండిక IV. పుట. ౩౦౮

పూర్వతః—ఇయ్యూరియుం బిల్లెను పెద్దపూణ్డియుం బోలగరుసున పల్లమున పూణ్డియగంటన పును సీమా. ఆగ్నేయతః—ఇయ్యూరియుం బిల్లెను పెద్దపూణ్డియుం సెరపులయుం బోలగరుసున ముయ్యలికుట్ర సీమా. దక్షిణతః—ఇయ్యూరియుం సెరపులయుం బోలగరుసున తాడ్డజేవ సీమా. నైరృత్యతః—ఇయ్యూరియుం సెరపులయుం మందర ముతయుంబోలగరుసున ముయ్యలికుట్ర సీమా. పశ్చిమతః—ఇయ్యూరియుం మందరమునయుం మడకుటతియుం బోలగరుసున ముయ్యలికుట్ర సీమా. వాయవ్యతః—ఇయ్యూరియుం మడకుటతియుం బిల్లెను పెద్దపూణ్డియుం బోలగరుసున ముయ్యలికుట్రున గొల్లజేవ సీమా. ఉత్తరతః—ఇయ్యూరియుం బిల్లెను పెద్దపూణ్డియుం బోలగరుసున యేఱువగడ్డయు సీమా. ఐశాన్యతః—ఇయ్యూరియుం బిల్లెను పెద్దపూణ్డియుం బోలగరుసున మఱ్ఱితోడి తాటియొద్ద చింతయసీమా.

### పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనము. A. D. 1185.

శకవర్షంబులు ౧౧౦౭ గు నేంటి మేష సంక్రాంతి నిమిత్తమున శ్రీ పిఠాపురమున శ్రీకుంతీమాధవదేవరకు బ్రోలునాంటిలోని నవఖండవాడ అని యొప్పియూరు గృహక్షేత్రారామసహితముగా నఖండమున్న శ్రీమన్మహామండలేశ్వర వేలనాంటి కులోత్తుంగరాజేంద్ర చోడయరాజులకొడుకులు శ్రీమన్మ

హామండలేశ్వర కులోత్తుంగ మన్మగోంకరాజుల మహాదేవులు జాయమదేవు ము
హావిబ్బాల్యచ్ఛనార్థము న్నిత్యనైమిత్తిక మాసోత్సవ సంవత్సరోత్స
వార్థమున్ను గీతనృత్తవాద్యాది వివిధభోగార్థముంగా నాచంద్రార్కక
ముగా నిచ్చిరి.

మల్లిదేవుని పిఠాపురము శాసనము (A. D. 1195)

ఎపిగ్రాఫియా ఇండికా IV. 92.

అస్యగ్రామస్యసీమానః పూర్వతః వెలెంగ్గ బల్లిగుంట్టయసీమా. ఆగ్నే
యతః వెలెంగ్గున ఏసిక ఆలమున భోడతాతకాలియసీమా. దక్షిణతః శ్రీపాద
ములపల్లి సీరిపురమున మయ్యానికట్ట. వేముగుణ్డయసీమా. కొణ్డురుకుఱును నల్లం
చెఱువు కొమ్మున గుణ్డయకట్టవచ్చి నైఋృతితః ఏనుంగుదల క్రొప్పల్లిపొలమున
మయ్యానికట్టున పుల్లిగుంటయసీమా. పశ్చిమతః క్రొప్పల్లి తూప్పునన కవల
గుంటలసీమా। వాయవ్యతః చసపకత్య బయలికేశవచంట్టుచెఱువు తూప్పునన
గట్టయవులు గట్టయసీమా. ఉత్తరతః సంప్పరపొలమున భీమరాజు చెఱువు
దక్షిణము గట్టయసీమా. ఉప్పుటేఱును నక్కలకాలియంగలసిన మయ్యానకట్టు
మేరగానువచ్చి, ఈశాన్యతః ఉప్పుటేటి దక్షిణమున గట్టువట్టివచ్చి వెలెంగ్గున
ప్రేముల వంకక్రయసీమా॥

హైదరాబాదు రాజ్యములోని వరంగల్లు పరగణాలో
ఉన్న అనమకొండ రాజధానిగా పూర్వము పరిపాలించిన
కాకతిగణపతిదేవనికాలమందు కరీమ్ నగరములోని ఉపర
పల్లెలో రాతిమీద చెక్కించిఉన్న శాసనములోని కడపటి
భాగము.

క్రీ. శ. 1235.

శకవర్షంబులు 1157 మన్మథసంవత్సర మాఘశుద్ధ 15 గురువారము
నందు పంచలింగాలకూను పించకుపల్లిని దేవబ్రాహ్మణవృత్తులుగాక పవ్వాశానవు

స్యముగానిచ్చి పెంజెఱ్ఱున మీఁదికాల్వను కొంతపుగాల్వదక్షిణమూను ఆవాంకఅద్దానుచింతన మిట్టలూను రవ్వసాని అనకిందూను యింతవట్టుగూడ నుర్ ౧౩ ప్రోలకమ్మకాల్వనుర్ ౧ చొల్లుబాపెకాల్వనుర్ ౧ కాట్నాబ్బయని చెఱ్ఱున బ్రాహ్మణవృత్తులుగాక సర్వమూంను రవ్వసాని చెఱువ్వున రవ్వసాని మామిడితోంట పసుమటిఅనాను రాజేనాయంకుని చెఱ్ఱునర్ ౭ వెలివోలను యేరువాక గుబ్బిలి ఒగదేవుత్రోవ దక్షిణమున ర్ 20 దీనిదక్షిణమున పెద్ద రేగడిగొన ర్ ౪౦ బొమ్మకంటిచెర్వు పడుమటనుండి పూరివెనెతిగవెనెనడ్మ ర్ ౬౦ యేటిమడమామిడి వనమూను వెనెకడ మామిడివనమూను ఆవనములోని చింతలూను ఊరిరొద్ద మామిడివనమూను ఆచింతవనమూను ఊరిదక్షిణము తాడివనమూను అంగడి సుంకమూను ఇంతవట్టు కాట్నాబ్బయుందు దేవద్లకు అంగభోగరంగ భోగధూపదీపనైవేద్య తాంబూలాలకు సూర్యచంద్రుల కలంతగాలముఇచ్చిన ఈవికాదన్నవారు గంగకర్తంగ ౧ంబొడిచిన దోషానం బోదురు ॥ గిందికాల్వను ర్ 10 ఇచ్చితిమి యింతపట్టు గణపతిదేవమహా రాజు విడిచినదత్తి

## గణపతిదేవుని మోటుపల్లిశాసనము. A. D. 1244

తత్-శుల్కపరిమాణం. ఎక్కుమడి దిగుమడిని ముప్పయింటనుఒక్కటి. శ్రీగంధము తులాము ఒకటికి । గ ౧ - రూ కప్పూరమునకూ చీనికర్పూరానకూ ముత్యాలకూ వెల । గ ౧ కి - రూ ।।। ।।।; పంనీరు ।; దంతము జవాది కర్పూరతైలము రాగితగరము సీసమ సీసము పట్టునూలు పవడమూ గంధ్య ద్రవ్యాలకూను వెల । గ ౧ కి రూ ౧।-; మిరియాలవెల । గ ౧ కి - రూ ।.।-; పట్టు ఎల్లవానికిన్ని స్వరూపము ఒకటికిని - రూ ౫ ।।; పోంకలు లక్ష ఒక్కటికిని । గ ౧ కి - రూ ౩। షత్రోషష్ట్యధికైకాదశ శతసంఖ్యే శ్రోధినామ్ని శకవర్షే మోటుపల్ల్యభిధానే దేశ్యాయకొండ పట్టనే మహతి గణపతిదేవః కీర్తిస్థాపితవాంశ్శాసన స్తంభం.

దోనెపూండిశాసనము. 30—8—1323 A. D.

ఈఅగ్రహారానకు చతుస్సీమలుంనైని పొలమేరలు తూపున సీమల వల్లిపకొంమనవిఋ. అతఋవాతను దీరసంపుంత. ఆకరువాకలు ఎంపిసల్లి బూరుగసవాయవిఋ. దక్షిణానకు లంకవిఋ. అకరువాతరు ముం సారా నము దేవర ( ) వృత్తులపుంత పడుమటిసీమ. కొంచెవురపుంబొలం అప్పరాజుదొడ్డి పుంత. అకఋవాత దూసనేఋ. ఆఉత్తరానకు సీమ కుక్కుటేశ్వర దేవరచించని పొలంపుంత. ఈఅగ్రహారానకు గ్రామగ్రాసముగాను దూసనేటిపడ్మటను పితాపురపుపొలములోను బొడ్డలదొడ్డి లంకంజెట్టింది పదిపుట్ల చేను.

పిఠాపురము కుంతీమాధవస్వామి ఆలయమునలోని

స్తంభముమీద కొటయవెమనది 25-12-1391. A. D.

స్వస్తిశ్రీశకవర్షంబులు అగునేంటి ప్రజాపతి సంవత్సర పుష్య శు ౨ గు । నాంటి మకరసంక్రాంతి పుణ్యకాలమందు కొటమరెడ్డి వెమగజ్జిం గారు తమతండ్రి కొటమరెడ్డింగారికిన్ని తమతల్లి బొడ్డసానమ్మంగారికిని అక్షయ సుకృతముగాను పిఠాపురమంను శ్రీకుంతీమాధవదేవరకు శిలాప్రాకారము ఆచంద్రార్కముగాను వెయించిరి.

తొత్తరమూడిశాసనము. కొటయవెమనని

శక 1333 A. D. 1411.

ఈవూరిపొలమేరసీమలు. తూర్పున తొత్తడిమూండి పొలమెరపుంత బత్తుల ముప్పడితోంట మామిండ్లు మొదలుగాంబోయి మల్లాయమ్మంగారి గామని గిరి పురపుపొలమేరపుంత మోచెను. దక్షిణాన ఆగొమకగరపుపు పొలమేర పుండే వృద్ధగౌతమి మోచెను. పడుమటను వృద్ధగౌతమి. ఉత్తరానను విద్యా రణ్యతీర్థమని వృద్ధగౌతమిలోనిగుమి మొదలుగావచ్చిన తొత్తడిమూండి పొల మేరపుంత బత్తుల ముప్పడితోంట మామిండ్లు మోచెను.

## ప్రా. - రామునులో నిశాసనము. 28-10-1414 A. D.

యిటువంటి కాటమరెడ్డి వేమారెడ్డింగారికి నిజభృత్యుండైన కడియాము మా. వేరుంగారు తనకుస్వామి అయిన కాటమరెడ్డి వేమాయరెడ్డింగారికిన్ని వారి దేవులకున్ను కాటమరెడ్డి వేమారెడ్డింగారి కుమారుండు కొమరగిరిరెడ్డింగారికిన్ని వారి దేవులకుంను అక్షయసుకృత మవునట్టుగాను దాక్షారామ శ్రీభీమేశ్వర శ్రీమహాదేవరికి ఆస్థానశిలామండపముకట్టించి శకవర్షంబులు ౧౩౩౭ అగు నేంటి జయసంవత్సర కార్తిక శు ౧౫ భా। వాండు సమర్పణచేసెను.

## రెండవదేవరాయలనాటిశాసనము 14-6-1428 A. D.

అస్యగ్రామస్యసీమా చివష్టనిలిఖ్యంతే దేశభాషాయా. తక్కెళ్లపాటి అష్టదిక్కులసీమా నిర్ణయము. తూర్పునకు కప్పెరావిపాటిసంధుకు నక్కలవాగు. ఆగ్నేయభాగం సేనురావినూతుల కప్పెరావిపాటిసంధుకు బిల్లమనేవిపుట్ట. దక్షిణం రావినూతులసంధుకు పశ్చిమం నరారిశెట్టికుంటకట్ట. నైరుతిభాగం రావినూతుల అలువలపాటి సంధుకు నక్కలవాంగు తలాంపినల్లగుండ్లు. పశ్చిమంటసీను. అలువలపాటిసంధుకు లింగందిబ్బ. వాయవ్యానకు అలువలపాటి జనకవరంసంధుకు జంగమకుంటసీను. పూరివుత్తరానకు సీమ: పుంగులూరి సంధుకు తెల్లగుండ్లు, యీశాన్యానకు సీమ పంగులూరి కొప్పెరావిపాటి సంధుకును నిలువురాయి. ఇంతవట్టి సీమానిర్ణయ ప్రకారం

## అల్లాడ వేమారెడ్డి దానశాసనములోనిది 7-6-1434

ఓం అల్లాడరెడ్డి వేమవరానకున్ను వేమసానక్కదొడ్డవరానకున్ను పొలమేరసీమాసంధులు. తుల్యభాగదక్షిణపుధారి మోపుకొని రెండూళ్లపొలాల నడుమ పూర్వమందుల ప్రాంతపుత్త దక్షిణపుముఖమైవచ్చింది. ఆపుంతతూర్పుగా వేమసానక్క దొడ్డవరపుంబొలము అపుంతపడుమట అల్లాడరెడ్డి వేమవరపుంబొలము ఆపుంతదక్షిణపుముఖమై రాంగాను అంత్తటను చింత్తవుంనది.

ఆచింతనుండ్డి తూర్పుణాముఖమైవచ్చినపుంత ఆపుంత్తసరుసపుంత్తవుత్తరం వేమ
సానక్క దొడ్డివరపుం బుంత్తదక్షిణం. ఆపుంత్త తూర్పుణాముఖమైవచ్చి వేమ
సానక్క దొడ్డవరపుంబొలంలోపలను చన్నుపాడె అనంగాను ఒకచెఱువుంనవి.
ఆచెఱువుపరసనుండ్డి ఆపుంత్త తూర్పు వేమసానక్క దొడ్డవరపుంబొలం
పుంత్తపడుమట అల్లాడరెడ్డి వేమవరపుంబొలము యీపుంత్త తొల్లింటిప్రాంత్త
పుంత్తదక్షిణపుముఖమైవచ్చి ఆపుంత్త అల్లాడరెడ్డి వేమవరపుం బొలములోప
లను యఃఱువవారిపాడె అనంగా నొకపాడె; ఆపాడె మోపెను యిది అల్లా
డ్రెడ్డి వేమవరపు వుత్తరపుంబొలమేరసీమా. ఆయఃఱువవారిపాడె దక్షిణపు
పార్శ్వనసుండి ఆతీరాననే ఒకగట్టుపొడలున్ను ఆగట్టు తూర్పుముఖమై
వచ్చెను. ఆసరుసను గట్టు వుత్తరం వేమసానక్క దొడ్డవరపుంబొలం దక్షిణం.
ఆగట్టులకైతూర్పుణాముఖమైరాంగాను వేమసానక్క దొడ్డవరపుంబొలము
లోపలను నిమ్మగుంట్టపాడె (అ) నంగా నొక పల్లమున్నది. ఆపల్లంపసరుసనుండ్డి
ఆగట్టు విశనకఱ్ఱవంపై అయిదుబారలు మేరంత్తవుత్తరపుముఖమై వచ్చెను.
అంత్తట నాగట్టువేంవ్వరపుంబొలము యీశాన్యభాగమందు పొడపట్టిన
ప్రొంందుగున్నది. అంతటనుండ్డి ఆగట్టు దక్షిణముఖమైరాంగాను అంత్తటను
నైరెండ్డుబారలు నిసుపునను తూర్పుణాముఖమైవచ్చెను. అంతట దొడ్డవరపు
పొలములోను పాములపాడె (అ) నంగా నొకపాడెదగ్గఱున్నది.

## కృష్ణదేవరాయల సింహాచలశాసనము ని-శ-1516.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౪౧ అగు
నేంటి ప్రమాదిసంగిర శ్రావణ శు ౧౩ సోమవారాన శ్రీమన్మహారాజాధిరాజ
రాజపరమేశ్వర మూరురాయరగండ అరిరాయరవిభాడభాషగితప్రవరాయర
గండ యవనరాజ్యస్థాపనాచార్య శ్రీవీరప్రతాప కృష్ణదేవమహారాయలు
విజయనగరాన సింహాసనారూఢులై సింహాద్రినాథునికి సమర్పించు భోగం
నడిచేటందుకు ప్రతాపరుద్రమహారాయలు చేతను పుచ్చుకొన్న గ్రామాలు కళింగ

దండపాటు[illegible]చు గ్రామాలు పెదగాణిగ్రామం అగ్గనపూడిగ్రామం అందుకు వెల్లె పల్లెలు గంగవరంపల్లె ౧ చిన్న అగ్గనపూడిపల్లె ౧ ఉభయంగ్రామాలు సింహగిరి అప్పన్నకు నడిచేభోగం బలిహారణం కట్టెడదినం ౧ కి శ్రీఅంగరంగభోగానకు గంధం పలం అగరు మ ౨ ను, కర్పూరంచిన్నం. కస్తూరి చిన్నం, పన్నీరు చి ౪, కుంకుమపువ్వు చి ౧, పువులదండలు ౪, మాలలు ౪, నైవేద్యానకు బియ్యం పు ౧, పకాళం తూ ౨, పాయసం తూములు ౬, కూరలు ౪, పితా[illegible] నాడీలు ౮, సారసత్తులు ౮, అరిశలు ౮, సాదుమనోహరాలు ౮, చిన్నమనోహరాలు ౪, నందనాపితాలు ౮, అప్పాలు ౮, హంసకణీలు ౮, కర్పూరకాంతులు ౮, బడాలు ౮, కక్కురాలు ౪, వెరసి ౮౦, పానకాలు ౨, గుటుకాకుంచాలు ౧, నైవేద్యానకున్ను పితాలకున్ను కూడా నెయ్యి ౨ తూములు, పెరుగు యిద్దుము, కుంచెడుపిల్లి, ౪ పోకలు, ౫౦ తమల పాకులు ౧౦౦ మిరియాలుఉక్షసంభారాలు ౫ కరాంబుయత్తు మాడలు, జాజికాయలు ౧౦, యిందుకువెచ్చం. సత్రం వేయించిరి. బ్రాహ్మణ భోజనము. ఈధర్మానకు యెవరుతప్పినా వారుగంగలోను గోహత్య బ్రహ్మహత్య మాతృపితృహత్యచేసిన పాపాన పోవువారు.

## హంపి సమీపమందున్న శిలాశాసనము.

## South Indian Inscriptions Vol IV No 280.

### (1556 A. D.)

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౭౮ అగునేటి నళసంవత్సర ఆషాఢ శు ౧౨ గు శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగరమందు రత్నసింహాసనారూఢులై పృథివిసామ్రాజ్యంచేయుచుండ్డగాను ఆత్రేయగోత్రం సోమవంశోద్భవులైన శ్రీమన్మహామండ్డలేశ్వర రామరాజు కోనేటయ్య దేవమహారాజులంగారిపుత్రులు అవుభళరాజులంగారు తిరుమంగ్గయాళ్వార్లకు

శేయించ్చిన కయింకర్యవివరం । విఠలంలోను శ్రీవిఠలేశ్వరులకోవిల ప్రాకారం
వెలుపల వాయవ్యభాగాన వేంచ్చేశివున్న తిరుమంగ్గయాళ్వార్లకును గర్భ
గృహం శుకనాశి అంతరాళికం రంగ్గమంటపం మొదలైనవి నేముకట్టించి
నిత్యతిరుమంజనకాలం తిరుతోంపు తిరునందవనం తిరుతోమాలె తిరువిళక్కు
తిరుమేనికావలి తిరుకట్టి యివి అన్నిన్ని తిరుమంజనకాలం రామానుజయ్యం
గారి వశంచేసి కోవిలస్థానికంశిష్యపారంపర్యంగాను నడపుకవచ్చేయట్టుగానున్ను
దధ్యోదనం మధ్యాహ్నఅవసరం సాయంకాల అవసరం నిత్యోత్సవం మాసో
త్సవం నిత్యతిరువారాధన చందనకాపు అడికముడు గొంతెముడు పరిమళ
ద్రవ్యాలు యివి మొదలైన సర్వ్వకయింకర్యాలున్ను తిరుమంగ్గయాళ్వా
ర్లకు అవధరించి కోవిల తిరుమల పెరుమాంగోవిల మొదలైన దివ్యతిరుపతుల
నుండ్డి కయింకర్యార్థులమై వేంచేశి స్వయంపాకనియముమైన చాతిన [illegible]
శ్రీవైష్ణవులకు శ్రీరామానుజకూటంగాను అరగింప్పం చేశేటట్టుగానున్ను శ్రీ
విఠలేశ్వరులు తిరువీథులు వేంచ్చేశేటప్పుడల్లాను దోశపడిన్ని అడికముడు [illegible]
ముడున్ను శ్రీవిఠలేశ్వర్లకు తిరుతేరుతిరునాళ్లు తిరువధ్యాయనం సహాచరవుల
నాలుగున్ను నమాళువాళ్లకు తిరుతేరుతిరునాళ్లు తిరునక్షత్రాల తిరువీథుల
వేంచ్చేశినప్పుడల్లాను దోశపడిన్ని తిరుమంగ్గయాళ్వార్లకు తిరునక్షత్రాలు
తిరువధ్యాయనాలకు దోశపడిన్ని నమ్మాళువార్లకున్ను శ్రీవిఠలేశ్వర్లకున్ను తము
తమ తిరుతేరు తిరునాళ్లనాండు వాహ్యాళికి పాడి తిరుమంగ్గయాళ్వార్లకు
కోవిలకు వేంచ్చేశిన చరవులకున్ను యింతపట్టు కయింకర్యాలకున్ను నేము
సమర్పించిన గ్రామాలు కొప్పళెంశీమలోని అప్పాగెరెగ్రామమున్ను యింమకు
గ్రామగ్రాసమయిన యిలికంట్టిశీమ [illegible] కొట్టూరు [illegible]గ్రామమున్ను యీ
రెండుగ్రామాలున్ను అప్పాగెరె తిరుమలభట్లు మొదలైన మహాజనాలు
అందరి చేతనున్ను క్రయంగొని ఆర్ద్వుల తామ్రశాసనాలు మొదలైన సాధ
నాలు అన్నిన్ని తీసుకొని సమర్పించిన అప్పాగెరె కొట్టూరు [illegible]గ్రామాలకు
ప్రతినామమైన పరకాలపురం శ్రీరామానుజపురంగ్రామాలు యీ రెంటిన్ని

సేను రామరాజయ్యవారి చేతను సదాశివరాయలకు విన్నపం చేయించి కంప్లి మాగాణి స్వామ్యానకు చెల్లినచ్చే విఠలాపురం శ్రోత్రియంమడి స్థావరంమడి స॥ ధారవోయించ్చి తామ్రశాసనం తీశియిచ్చిన విఠలాపురం గ్రామం ౧ వొకటిన్ని కూడాను యీ మూడుగ్రామాలున్ను సమర్పించి యీగ్రామాల పాలుకున్నం చేశి స్వయంపాకులకు తిరువారాధకులను పరిచారకులను బొక్కస భండారాలు వగైరాను మొదలయినవరులకు అనుకూలమైన మనుష్యులం పెట్టికొని యీ కైంకర్యాలు అంశేనట్టున్ను శిష్యపారంపర్యంగాను నడపుక వచ్చేయెడ్డును తిరుమలనంబి శ్రీరామయ్యంగారి వశంచేశిన్ని యీశాసనల స్థలకరణీకం నయనారు తిరువెంగళయ్యంగారికి పుత్రపౌత్ర పారంపర్యం శిల్పాప్రాయం కట్టడిచేశిన్ని యిందుల సంకీర్తనాశాస తమ పుత్రపౌత్ర పారంపర్యాగాను చేస్తున్న వుండేటట్టుగాను శ్రీరామానుజపురం నారాయణయ్యంగారు జన యిద్దరున్ను యీమర్యాదను మా యాచార్యులు తిరుమల అప్పను తిరువెంగళాచార్యులయ్యవారికి పుణ్యముగాను కట్టడచేస్తిమి॥ గనక యీశాసనాను ఆచంద్రార్కస్థాయిగా నడపంగలవారు । యీధర్మానకు యెవ్వరుగనక తప్పినారు గోహత్య బ్రహ్మహత్య స్త్రీహత్య మొదలైన పాపాలు చేశిన దోషానం బోయినవారు । తమ తల్లిదండ్రాదులను వధించినదోషానం బోయినవారు॥

## గోల్కొండకోటలోని శాసనము (1666 A. D.)

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషాలు 1587 మన్మథ నామసంవత్సర మాఘ శు ౭ బుధవారంనాడు సుల్తాను అవరంగజేబు ఖసరు శహాజి సంగీను లస్కరుతో వచ్చి కిలెముబారకు మహామదానగారు బెడావేసి వుండంగాను వారిపాదుషాహీవజీర్లలో పెద్దవజీరును మీరు మీరా అని అతని అవరంగజేబుతో ఉట్టి యీమర్గం మూడుదినాలుక్కు పుచ్చుకొంటున్నానని

మోచా...రాత్రిపగలు చాలానేటి...కందగ్గి రాలేదు...జుకజహామతాహ
జరత్ సుల్తాను అబ్దుల్లా కుతుశాహాగారు తన వేగులుదొడ్డ వజీరుసు మొక
ర్రబుహాజిరతు అముస్సాఖానునిగారికి హుకుంయిచ్చి నీవు ఆ బురుజువద్ద
వుండి పరదంపుకొట్టి అందుకు చాలా జాగ్రత్త కలిగివుండవలెనని ఖాగే
ఖాను మశాన్నలహోగారు రాత్రిపగలు జాగ్రతతో గనిములు ఏఫే ఈసే
పనిలో ముఖ్యులై వుండంగాను ఖోదారజాత్తా ఫిరంగిగుండు అమీరుమీరాను
తగిలితేను ఆ మోచాలోనే మయతు అయిపోయెను. అట్టి మృతమయిన
మూడుదినాలకు ప...,న ఆయను మోచా++ంపనహాగారి హుకుంతాయితే
అలాగే యేలినవారి హుకుంచొప్పున ఖానుమశాన్నలహోగారు కొంచెము
దివసాలలో వుప్పర ధర్మాచార్యులచాత తమానుముస్తాయిదు చేయించెను. అవ
రంగు జేబు వచ్చినసాలు సు॥స్నసెత్తుఖమ సెను. అలప్రతిమామముస్తాయిషు ఆయి
నది సు॥స్నసమానుసెత్తైసు అలపు ౧౦౭౮ శాలివాహనశకవర్షాలు ౧౫౮౭

## నెల్లూరిజిల్లా శిలాతామ్రశాసనములలోనిది (1791 A. D)

స్వస్తిశ్రీ శా. వా. వ ౧౭౧౩ విరోధికృతునామసంవత్సర జేష్ట శు
౧౫ లు కలిగిరి వెంకటాచలంగారు ముత్యాలపాటిపాలం... కాశీరామేశ్వ
రపుభాటలో కోనేరు తొవ్వించి పూరితో సత్రం కట్టించి ధర్మం నడిపిస్తూ
వచ్చినారు. తదనంతరం వారి రెండో సహోదరుడయిన కలిగిరి శేషయ్య
గారును ఆధర్మం పరిపాలనచేస్తూవచ్చి ఆయున దినములలోనున్న సదరహి
వెంకటాచలయ్యగారి మనమడైన కలిగిరి సుందరయ్య కొన్ని దినములు సదరు
ప్రకారం ధర్మం నడిపిస్తూవచ్చి దుర్ముఖసంవత్సర మాఘ శు ౫ లు ధర్మసత్రం
పెంకుటిల్లు కట్టించి శార్వరిసం॥ ఆషాఢ బ ౨ గురువారం శ్రీం॥ మం॥ గృహ
ప్రవేశం అయ్యినది.

# ధర్మశాస్త్రం

## కోర్టు – సాక్ష్యము.

జె-ఆర్-కిండర్స్లిగారిచే ఇంగ్లీషుభాషలో రచించబడిన

సాక్ష్యశాస్త్రసంగ్రహము.

ఇది హైకోర్టులో నొక ట్రాన్స్లేటరుగానుండు

చుండూరు పార్థసారధిసెట్టిచే తెలుగుభాష చేయబడి చన్నపట్టణములో

అచ్చువేయించబడియె. ౧౮౭౭ సం॥

పుట 116-11౮. సన్నిహితమరణసమయోక్తులను యెంతమట్టుకు నమ్మ వచ్చుననే సంగతినిగురించి ఆలోచించడమందు ఈ వెంబడివచ్చు అంశములను యోచించడము ఉచితముగా వుండును. అవియునగా, ౧-ఆ వచనములు సాక్షులచే సరిగా తెలియచేయబడినవాటివలె అగుపడుచున్నవా? ౨-చనిపోయినవాడు జరిగినదాన్నిగురించి స్పష్టమయిన యభిప్రాయము కలిగియుండినట్లగుపడెనా-లేక ఆ కలహమందలి కలవరమువలనను ఉద్రేకమువలనను పొరబడి వుండవచ్చునా? 3-వాడు నేరము మోపబడినవానిమీద యేదయినా చలము గాని కార్పణ్యముగాని పెట్టియుండెనా? ౪-నేరము మోపబడినవాడు ఆ మాటను చెప్పినవానిని ప్రత్యాఖ్యానప్రశ్నలు అడుగుటకు యేదయినా సమయముండెనా? అనునవి.—రా-3౪.

## ౯ కొన్ని విషయములలోని వైద్యుల శ్రుతసాక్ష్యము.

౨౩౯. క్రిమినల్ వ్యవహారవిషయమైన నూతనశాసనము ఈ వెంబడి వ్రాయబడినరీతిన విధించుచున్నది. "౩౯౦-వ ప్రకరణము-

"కోర్టువారు సివిల్ సర్జనుగావుండే - లేక ఇతరవైద్యుడుగావుండే మనిషివద్ద పుచ్చుకోబడి, మేజస్ట్రేటుగారివల్ల యదార్థపరచడమునుగురించి సంతకము చెయ్యబడ్డ విమర్శను నిదర్శనమయిన సాక్ష్యముగా పుచ్చుకోవలసి

న్నది. అయితే ఆ కోర్టువారు చాలినంత కారణమున్నయెడల అట్టి సివిల్ సర్జనుగావుండే లేక ఇతరవైద్యుడుగావుండే సాక్షికి సమ్మన్ చెయ్యడము యుక్తముగా వుండవలసినది.”

౨౩౭. ౩౭౦-వ ప్రకరణము.—పరీక్షకొరకు, లేక పరిశీలనకొరకున్ను రిపోర్టుకొరకున్ను క్రమముగా తనవద్దికి పంపించబడ్డ యేదయినా సంగతిలేక వస్తువు వీటినిగురించి గవర్నమెంటుతాలూకు రసశాస్త్రసంబంధమైన వస్తువుల పరీక్షచేసే ఉద్యోగస్థుని రిపోర్టుగా వున్నట్టు అర్థమయ్యే యేదయినా దస్తావేజు, యేదయినా క్రిమినల్ విచారణ, లేక అంతతో ఇలాకాగల యేమి యినా ప్రథమవిచారణ జరుగుతూవుండగా అట్టి పరీక్షచేసే మనిషియొక్క దస్కతు దానిమీద చెయ్యబడివున్నపక్షమునకు సెషన్సుకోర్టువారివల్ల విమర్శలో సాక్ష్యముగా పుచ్చుకొనబడవలసినది. మరిన్ని అట్టి దస్కతునుగురించి గాని దస్కతుచేసేమనిషి అట్టి ఉద్యోగమును కలిగివుండడమును గురించి గాని రుజువు. ఆ దస్తావేజు వాస్తవమయినది అవునో కాదో ఆ కోర్టువారికి సంశయించడమునకు కలిగియుంటేనేతప్ప జరూరు వుండనేరదు.”

౨౩౮ అట్టి విషయములలో శ్రుతసాక్ష్యమును అంగీకరించుటకు కేవలము లోకసౌకర్యమును గురించిన యోచనలనుపట్టి మెప్పించగలదై యున్నది. అది ఇండియాదేశములోని ప్రజలు ఉండునట్టి తత్కాలపు విశేషమయిన స్థితికి ఒప్పియుండవచ్చునుగాని, ఆ ప్రజలు నాగరికతయం దభివృద్ధిపొంది వైద్యులు మెండయ్యెడుకొలది చట్టము మార్చబడునని మనము నిరీక్షించవచ్చును. ఇండియాదేశములో రసశాస్త్రసంబంధమైన వస్తువుల పరీక్షచేసే వుద్యోగస్థుడు నిరంతరముగాను శాస్త్రశిక్షితమయిన వైద్యులు బాహుళకముగా యెల్లప్పుడును, దొరతనపువారి కొలువులో వుంటున్నారు. వారికి బహువైన పనులు వున్నవి గనుక వారిని పలుమారు రప్పించుటచేత లోకులకు నష్టమును కలుగును. ఇదిగాక దొరతనపువారి కొలువులోవుండెడు వైద్యశాస్త్రజ్ఞుల వుత్తరవాదత్వము సత్యమువలన స్థాపితమైనదానికంటె హీనమైనదిగా వుండినను,

...నిబట్టి వారు తమ యెదటవుండెనుసంగతిని సాధారణముగా జాగ్రతగా పరీక్షించి యదార్థమైన వృత్తాంతమును చెప్పుదురని యోచించబడవలయును. ...శేషించి మేజస్ట్రేటుయెదట వైద్యుడు సాక్షిగా విచారించబడినవిషయములో అట్టిసాక్ష్యము సత్యముమీదగాని ప్రమాణపూర్వకముగాగాని చెప్పబడిన దనియు, నేరము మోపబడినవాడు ప్రత్యాఖ్యానప్రశ్నలను అడుగుటకు ...కాశము కగిగి...యుండెననియు అనుమానించబడవచ్చును.

## సాక్షులను సమ్మనుచేయుట.

౨౩౯. కక్షివాండ్లనున్ను, సాక్షులనున్ను న్యాయస్థలమునకు రప్పించు విధమును పరిష్కారముగా వివరించిచెప్పుట ఈ స్వల్పగ్రంథముయొక్క ఉద్దేశము లోచేరిన విషయముకాదు. సాక్షులను సమ్మనుచేయుటను గురించిన నిబంధనలు సివిల్ విషయములలోను క్రిమినల్ విషయములలోను తరుచుగా వొకటిగానే యున్నది. ఆ పద్ధతి సివిల్ క్రిమినల్ ప్రొసీడ్యూరు శాసనములలో కనుపడును. సాక్షి యేకాలమందు యేచోటికి వచ్చియుండవలెనో ఆ సంగతుల ...న్ను వాడు ఒక దస్తవేజును తెచ్చి చూపించవలసినదో లేక ఆ వ్యాజ్యములో సాక్ష్యముమాత్రము చెప్పవలసినదో ఆసంగతినిన్ని మరియు ఆ వ్యాజ్యపు కక్షివాండ్ల పేళ్లనున్ను సమ్మనులో వుదహరించవలయును. దస్తావేజును తెచ్చి చూపించవలసినయెడల అట్టి దస్తావేజుయొక్కవివరము ఆ సమ్మనులో వ్రాయబడవలయును.—౧౮౭౨ సం॥ ౧౦-శా-౧౬౨-ప్ర. ౧౮౭౧ సం॥ ౧౬-శా-౧౮౭-ప్ర.